# శ్రీమద్భాగవతము-దివ్యజీవనమార్గము



రచన

డాక్టర్. మోపిదేవి కృష్ణస్వామి
M.A., Ph.D.



దాదాపు రెండు సంవత్సరాలపాటు ఆంధ్ర పత్రిక దిన పత్రికలో వారం
ారం ప్రవచన రూపంలో ప్రచురింపబడిన పవిత్ర గ్రంథమిది.

ప్రచురణ
ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్
విశాఖపట్టణము.

ప్రథమ ముద్రణ : ఆగస్టు 92

ప్రతులు 3,000



ప్రతులకు :

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు.

| | |
|---|---|
| 23-10-7 | 1-99 |
| పురుషోత్తం వీధి | ముంజులూరు |
| సత్యనారాయణపురం | 521366 |
| విజయవాడ -11. | బంటుమిల్లి మండలం. |
| | కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్. |

పత్రికలో నిర్వహణ : శ్రీ కందర్ప.

శుద్ధప్రతి తయారీ : మంత్రి.

సహకారం : ఈశ్వరి, శర్మ.

ముద్రణా నిర్వహణ : శ్రీమతి మోపిదేవి కళ్యాణి

సహకారం : మధు, ప్రసాద్.

ముఖచిత్ర కల్పన : కె. నాగభూషణం

కంప్యూటర్ టైప్ : అక్షరమాల, విజయవాడ.

ఫిలిం మేకింగ్ : ఎ.పి. ప్రోసెస్, విజయవాడ.

ఆఫ్ సెట్ ప్రింటింగ్ : పాండురంగ, విజయవాడ.

బైండింగ్ : ధనుంజయ, విజయవాడ.

Acc no 306.

# ఇందులో

# అక్షరధార - అమృతధార

'మానవ ధర్మశిక్షణ సంస్థ' సారథులు శ్రీ మోపిదేవి కృష్ణస్వామి (ఎమ్.కె.) భాగవత ప్రవచనములుగా తాము రచించిన 'శ్రీమద్భాగవతము-దివ్యజీవన మార్గము' అను గ్రంథానికి నన్ను ముందుమాట వ్రాయమని కోరారు.

భారత రామాయణ ప్రవచనాలను ఆకాశవాణిలో ఉషశ్రీచేత వ్రాయించి ప్రసారం చేయించిన నా పూర్వ పుణ్యకాంతి వలయాన్ని పురస్కరించుకొని కావచ్చు, అంతే గాక నాకులాగే ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఎమ్.ఎ. పట్టం పొందిన ఎమ్.కె. ఆనాటి తన సాహిత్య గురువులైన కీ.శే. డాక్టర్ కాకర్ల వెంకట రామనరసింహం గారు అక్కడే ఏభైఏళ్ల క్రింతం నేను ఎమ్.ఏ. చదివినపుడు నాకు సహాధ్యాయులూ, జ్యేష్ఠ సోదర తుల్యులూ అయిఉండి, వారి పెద్దతనంలో నేను పాలుపంచుకొని ఉండటాన కావచ్చు, నన్ను ముందుమాట వ్రాయమని అడిగి నాకు పెద్దపీట వేసి గౌరవించారు. అందుకు వారికి నా కృతజ్ఞత!

అప్రయత్నంగా, ఆప్యాయతాపూర్ణమైన అమృతధారా ప్రవాహంలా సాగిపోయే ఎమ్.కె. గారి ప్రవచన వాహినిలో నేను తొలిసారి మునకలిడి అమేయమైన ఆనందాన్నీ, సంతృప్తినీ పొందినది కొన్ని మాసాల క్రితం విజయవాడలో వారు గురుపూజా కార్యక్రమాలు నిర్వహించినప్పుడు! నాచేత మాట్లాడించి, ఆప్యాయంగా కోరి కోరి శ్రీ కృష్ణగాథలో నా గేయాలను కొన్నిటిని నా చేత పాడించి సత్కరించారు. "సమానాంతఃకరణ ప్రవృత్తులు" దైవికంగా సన్నిహితులయ్యేది యీ విధంగానేనేమో!

శ్రీ ఎమ్.కె. గారి ధర్మబోధకాలైన గ్రంథాలలో మకుటాయమైనది - "భారతం-ధర్మాద్వైతం" - ఒక మహోత్కృష్టమైన పరిశోధన గ్రంథం. "భారతంలోని నిబిడ నిగూఢ ధర్మాద్వైతాన్ని ఈ గ్రంథంలో సామాన్య పాఠక శ్రద్ధాళువులకు పరిచయం చేసిన జిజ్ఞాసువు ఎమ్.కె."

ఆయన ప్రవచనాలు, సంభాషణాత్మకాలైన పలుకులూ, జిజ్ఞాసా ప్రబోధకాలైన వ్రాతలూ నిత్యస్నేహ మాధురీ భరితాలు; కౌటుంబికమై, సామాజికమై, సర్వమానవాత్మకమై, సర్వజీవాత్మకమై అమృత ప్రవాహంగా జాలువారే విశ్వప్రేమ భరితాలు! ఏక కేంద్రక సంవృతాలై నిత్య పరివ్యాపకాలైన వివిధ వృత్త సంభరితాలు-అమృత వాహినీ రస తరంగాలు!

పాండిత్య స్ఫోరకాలుగా నేను వ్రాసిన యీ మాటలే ఎమ్.కె. తన ప్రవచనాల భాషలో మాటాడబోయినా, వ్రాయపూనుకొన్నా, అమ్మలకూ, అవ్వలకూ, అత్తలకూ, అక్కలకూ సామాన్యజనం అనిపించుకునే వీధి మానిసులకూ కూడా హృదయంగమమైన తేలిక పలుకులలో సూటిగా సుతిమెత్తగా మనసుల్లో నాటుకొని పోయే ఊసుల రాసులు! అది అమృత వాగ్మిత్వం. అంటే నామాటలోని బరువు తీసేసి వర్ణిస్తే తియ్యని మంచి తనాన్నీ, స్నేహాన్నీ ప్రతి హృదయంలోనూ మేలుకొలిపే

నెయ్యపు మాటకారితనం!

వేద వ్యాస మహర్షి కృతమైన శ్రీమద్భాగవతం ప్రథమస్కంధంలోని శ్రీకృష్ణదేవుని ద్వారకాగమన (యుద్ధానంతర) వృత్తాంతంతో ప్రారంభించి శ్రీమోపిదేవి కృష్ణస్వామి 59 ప్రవచనాలుగా వ్రాసిన ఈ గ్రంథంలో పార్థసారథి భగవాన్ శ్రీ కృష్ణుడు కేంద్రబిందువుగా వ్రేపల్లె, బృందావనమూ, హస్తినాపురమూ, మధురా ద్వారకలలోని వివిధ పాత్రలను వారి నిత్య జీవితాలలోని ఆశానిరాశలలో, రాగద్వేషాలలో, కష్ట నిష్ఠూరాలలో ఆదుకొని వారికి తన దివ్యానురాగపూరితమైన స్నేహామృతాన్ని రక్షణకవచంగా ప్రసాదించి వారినందరినీ భాగవతామూర్తులుగా వెలయింపజేశాడు. మహర్షి వేదవ్యాసుడు, దేవర్షి నారదుడు, గాంధారీ ధృతరాష్ట్రులు, ధర్మరాజు, అర్జున, భీమ, నకుల, సహదేవులు, ఉత్తరా పరీక్షిత్తులు, గోపికలు, అష్టమహిషులు మున్నగు మహాభారత భాగవత పాత్రలెన్నో ఈ ప్రవచనాలలో భాగవతమూర్తులుగా ప్రపంచితులయినారు.

గో, వృషభ రూపాలను ధరించిన భూదేవీ, ధర్మదేవతలను కలి పురుషుడు హింసిస్తున్న దృశ్యం పాండవుల తర్వాత భరతవర్షం పాలించిన పరీక్షిత్తు కంటబడింది. శ్రీ కృష్ణదత్తమయిన దైవీశక్తి తనలో నింపుకున్న పరీక్షిత్తు సాధికారంగా కలి పురుషుని దండించబోతాడు. కలి పురుషుడు అతని శరణుజొచ్చి అతని రాజ్యంలో తనకు తలదాచుకొనడానికి తావు చూపమని వేడుకొంటాడు. నాటినుంచీ నేటివరకూ కలి ఆక్రమించిన స్థలాలవే! ద్యూతం, వ్యసనాలు, అవినీతి వంటి దుర్లక్షణాలు చెలరేగే స్థలాలన్నీ కలి పురుషునివే!

మహాభారత ఇతివృత్తం జయేతిహాసంగా రచించిన వేద వ్యాసమహర్షి ఎందుకో అసంతృప్తితో దిగులుగా ఉంటాడు. ఆ సందర్భంలో ఆ మహర్షిని దేవర్షి నారదుడు కలుసుకొని, ఆయన మనసులోని దిగులు పోవడానికి మహనీయుల ద్వారా ప్రకటితమైన భగవంతుని సద్గుణసంకీర్తనం లోకంలో ప్రసారం కావడానికి శ్రీ మద్భాగవతం రచించమని ప్రబోధిస్తాడు.

'మనిషి జీవితం (క్లేశాలలో) నలగడానికి కాదు ఉన్నది. మనిషి దేవుడై ఈ భూమి మీద వెలగడానికి అది ఉన్నది. జీవితాన్ని చిన్నచూపు చూడకూడదు.' 'బంధుత్వాలు బంధాలుగా కాక అనుబంధాలుగా రూపొందాలి'. ఎఫెక్షన్స్ బదులు ఎవర్షన్స్ అనుబంధాలకు బదులు అసహ్యతలను పెంచుకుంటూ మానసిక విపరీతత్వాలను పెంచే కాని వైరాగ్యాలు వద్దు. స్వార్థమెరుగని ప్రేమను ప్రవహింప చెయ్యండి - అది విశ్వప్రేమ వైపు నడిపిస్తుంది.

"ధర్మానికి విరుద్ధంకాని కామం నా స్వరూపం" అన్నాడు గీతాచార్యుడు.

ఇలాటి అమూల్యోపదేశాలను అందించే ఈ ఎమ్.కె. గారి గ్రంథం 'శ్రీమద్భాగవతము-దివ్య జీవన మార్గము' - సాధుజనులందరికీ శిరోధార్యం!

బాలాంత్రపు రజనీకాంతరావు

# వెన్నముద్ద - వెలుగుముద్ద

భాగవతాన్ని తరచి తీసిన వెన్నముద్ద ఈ గ్రంథం
నవతరానికి దారిచూపగల వెలుగుముద్ద ఈ గ్రంథం

రామాయణ, భారత, భాగవతాలు సనాతన ధర్మాన్ని సామాన్యులకు బోధ పరచే మహాకావ్యాలు, సార్వ జనీనములు. సార్వ కాలికములు. ఆ మహాగ్రంథాలను ఏ తరానికాతరం తిరుగ వ్రాసుకుంటే, సమకాలీన జీవనానికి అన్వయించుకుంటే - యుగధర్మం ఆవిష్కృతం అవుతుంది. ధర్మాచరణకు మార్గం సుగమం అవుతుంది. ఈ నిత్యసత్యాన్ని గుర్తించి డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారు భాగవత నవనీతాన్ని ఆధునికులకు రుచి చూపించాలన్న ఉదాత్త ఆశయంతో ప్రస్తుత గ్రంథాన్ని తీర్చిదిద్దారు.

భాగవత మార్గంలో పయనించే కౌశలాన్ని పుష్కలంగా పండించుకున్న మనస్వి ఆయన. ఆ పయనంలోని మెలుకువలనూ ఒడుపులనూ వారు ఇలా భాగవత మకరందంగా మనకు పంచుతున్నారు. తద్వారా ఆ పయనానికి ప్రేరణ ఇస్తున్నారు. లలిత లలితంగా, మృదు మధురంగా, రస బంధురంగా.

ప్రవచన ధోరణిలో సాగుతున్న రచనలో ఒక విలక్షణమైన టెక్నిక్ అంతర్నిహితమై ఉంది. ఆయా భాగవత మూర్తులను మనకు సన్నిహితం చేసే టెక్నిక్ అది. ఆయా భాగవత మూర్తులు మనతో సూటిగా మనసిచ్చి మాట్లాడుతున్నట్లు ఆయా సంభాషణలు మన ఎదుటే జరుగుతున్నట్లు, శ్రోతలుగా మనం ఆయా సన్నివేశాలలో స్వయంగా పాల్గొంటున్నట్లు ఒక అపురూపమైన అనుభూతి కలుగుతున్నది మనకు గ్రంథాన్ని చదువుతున్నప్పుడు. ఆయా సన్నివేశాలు బహువర్ణ చిత్రాలుగా, మల్టీ డైమెన్షనల్ చిత్రాలుగా మన మనోనేత్రాల ఎదుట సాక్షాత్కరిస్తున్నాయి. ఆయా భాగవతమూర్తుల వ్యక్తిత్వాలలోని విశిష్టతలు ఆ సంభాషణలలో వెలికి వస్తున్నాయి అలవోకగా, సహజసుందరంగా. వారు సజీవమూర్తులుగా ఆయనకు దర్శనమిచ్చారు. ఆ దర్శనాన్ని ఆయన తన లేఖిని ద్వారా మనకు కరతలామలకం చేస్తున్నారు. హృదయంగమం చేస్తున్నారు. ఇలా నాటకీయంగా కథను నడిపించడంలో రచయిత ప్రతిభా సమున్మేషం మనల్ని పరవశింపజేస్తున్నది. మూల భాగవతంలో సూత్రప్రాయంగా ఉన్న ఎన్నెన్నో ధర్మ సూక్ష్మాలూ, జీవన సత్యాలూ సదాచార సంపత్తి వెనుక ఉన్న సూక్ష్మాంశాలూ ఆ పరవశించిన స్థితిలో మన అంతరంగాల లోతులకు హత్తుకుపోతున్నాయి. గహనమైన ఆధ్యాత్మిక సూత్రాలను గోరుముద్దల్లా అందించే ప్రజ్ఞ అడుగడుగునా మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తున్నది.

మచ్చుకు - కుంతీదేవి శ్రీ కృష్ణునితో అంటున్న ఈ మాటలు చూడండి.

"ఈ జీవిత నిర్వహణమే ఒక తపస్సు. దేహంతో తపస్సు చేయడం చాలదు. జీవితమే తపస్సుగా సాగాలి. మనస్సునూ, ఇంద్రియాలనూ నిలుపగలగడం చాలదు.

వాటిని నీవెంట నడుపగలగాలి. పత్ర పుష్పాలతో నిన్ను అర్చించడం చాలదు. జీవిత సన్నివేశాలతో నిన్ను అర్చించగలగాలి. విగ్రహాల రూపంలో నిన్ను ఆరాధించడం చాలదు. సృష్టిలోని సకల జీవరాసులను నీ సజీవ విగ్రహాలుగా ఆరాధించగలగాలి."

రామాయణం, భారతం టీవీ సీరియల్స్ మనలో పలువురం చూచి ఉన్నాం. వాటి ద్వారా ఆయా పాత్రలు మనకు మరింత సన్నిహితం అయినాయి. ఇప్పుడీ గ్రంథంలో అంతకు మించిన ఆర్ద్రతతో, చిత్రీకరణ శిల్ప నైపుణితో, భాగవత మూర్తులను మనకు సన్నిహితం చేస్తున్నారు రచయిత. ప్రవాహకమైన శైలితో, ప్రసన్నతా గుణం కలిగిన పదాల పొందికతో. ఆ ఆర్ద్రతనూ ఆ అనుభూతినీ నేను స్వయంగా పొందాను. మళ్లీ మళ్లీ పొందాను. ఆంధ్రపత్రిక పాఠకలోకం పొంది పరవశించింది. తన పారవశ్యాన్ని సంపాదకులకు తెలిపింది. కనుకనే వారు దీన్ని అన్ని వారాలపాటు ధారావాహికంగా ప్రచురించగలిగారు. అవే అనుభూతి లోకాలలోనికి మీరూ పయనిస్తారనీ, తద్వారా భాగవత మార్గానికి మరింతగా ఉన్ముఖం అవుతారనీ ఈ గ్రంథ ప్రచురణ ప్రక్రియలో అంతో ఇంతో పాలు పంచుకున్న వ్యక్తిగా నేను మనసారా ఆశిస్తున్నాను. ఆశించడమే కాదు-నిండుగా నమ్ముతున్నాను.

కందర్ప రామచంద్రరావు

## భాణి - వాణి

భారతదేశంలో 5వేల సంవత్సరాల క్రిందట మానవాకృతితో నడయాడిన ఒకానొక వెలుగుముద్దను, దాని చుట్టూ తిరుగాడిన కొన్ని జిలుగులను తన అమేయ ప్రజ్ఞతో అవగాహన చేసికొని సృష్టివ్యూహంతో సమన్వయపరిచి వ్యాస మహర్షి ఆవిష్కరించిన 'జ్ఞానప్రదీపమే' 'భాగవతము'.

మానవజాతి ఎదగడానికి ఏర్పడిన ప్రస్థాన చతుష్టయములో పురాణప్రస్థానమొకటి. దాని ప్రతినిధి భాగవతము. 'భాగవతము ప్రత్యక్షముగా ఉన్న శ్రీ కృష్ణ స్వామియే'. భాగవతమునకు ఉన్నన్ని వ్యాఖ్యానములు మరి ఏ ఉద్గ్రంథమునకును లేవు. భాగవతమునకు జరిగినన్ని సప్తాహములు మరి దేనికీ కాలేదు.

పోతనగారు భాగవతాన్ని దాని వ్యాఖ్యానముతోబాటు ఆంధ్రీకరించినారని పెద్దల తీర్పు. భాగవతాన్ని హృద్యంగా తెలుగులో వివరించుటకు గాను వ్యాసులవారే పోతనకవిగా దిగివచ్చినారని రాజర్షి కొత్త రామకోటయ్య గారి 'వాక్కు'. పోతనగారి భాగవతం ఊతగా ఎన్నో రహస్యాలను ప్రకాశంలోనికి తెచ్చారు మాష్టర్ ఇ.కె.

మాష్టర్ సి.వి.వి గారి రాజయోగమార్గం, పరమగురువుల దివ్యజ్ఞాన మార్గం, మాష్టర్ ఇ.కె గారి భాగవత మార్గం, ఈ మూడింటి కూడలి మాష్టర్ ఎమ్.కె

గారి జీవన మార్గం.

భాగవతం చదివితే అందరం బాగవుతామని గ్రహించి అందరి జీవన రహస్యాలను అలవోకగా మధురమైన శైలిలో సాధకులకు అందించారు మాష్టర్ ఎమ్.కె. భాగవత పాత్రలు దివ్యజీవన మార్గంలో ఎలా పయనించాయో పరమగురువుల అనుగ్రహం వలన కృష్ణస్వామిగారికి బాగా ఆకళింపు అయింది. ఆకళించుకున్న విషయాలను కనులముందు రూపుగట్టించే నేర్పు, సరికొత్తగా వానిని వినిపించగలిగిన మంత్రజాలం శ్రీ కృష్ణస్వామిగారికి వెన్నతో బెట్టిన విద్యలు.

నారికేళాన్ని కూడా లౌజుగా చేసి సుతిమెత్తగా అందించే పాకశాసనుడు మాష్టర్ ఎమ్.కె. గహనములు, గంభీరములు అయిన సిద్ధాంతములు కూడ వీరి బాణీలో వాణిలో కరిగిపోయి కలకండ పలుకులుగా మారిపోతాయి. పుడకలు లేని పానకముగా సాగిపోతుంది వీరి రచన.

"మనిషి జీవితం నలగడానికి కాదు ఉన్నది. మనిషి దేవుడై ఈ భూమి మీద వెలగడానికి అది ఉన్నది." కనుక జీవితాన్ని చిన్నచూపు చూడగూడదు. బంధుమిత్రులను బంధాలుగా భ్రమించగూడదు... అప్పుడు అది మిమ్మల్ని విశ్వప్రేమ వైపు నడిపిస్తుంది. భాగవతమంటే ఇది, ఇలా ఉంటుంది. ఇలా చూడవలసి ఉంటుంది. (1వ ప్ర)

"ఈ నారాయణుడే ఉపదేశింపగోరి దిగివచ్చినప్పుడెల్లా గురువు అనబడుతున్నాడు. ఈ నరుడే ఉపదేశాన్ని పొందే స్థితిని పొందినప్పుడల్లా శిష్యుడు అనబడుతున్నాడు". (23వ ప్ర)

దేవుడి భాష చిత్రమైనది. అతడు పెద్దల నోటితో చెప్పిచూస్తాడు. విననప్పుడు కర్మఫలితాల రూపంలో పుటంపెట్టి వినిపిస్తాడు. (2వ ప్ర)

"ఈ సృష్టి విచిత్రమైనది. ఎప్పటికప్పుడు అయిపోయినట్లే ఉంటుంది. కాని అయిపోదు. ఎప్పటికప్పుడు సాగడానికి ఇంకేమున్నది అనిపిస్తుంది. కాని సాగుతూనే ఉంటుంది. ఎప్పటికప్పుడు ఇక బండి నడవదు కష్టం అనిపిస్తుంది. కాని నడుస్తూనే ఉంటుంది. ఇలా అనిపిస్తూ, అనిపించేటట్లు చేస్తూ, అంతలోనే సేద తీరుస్తూ, మళ్ళీ నడిపిస్తూ, ఈ సృష్టి కథను కొనసాగించటం జగన్నాటక సూత్రధారి. ఈనాటక నిర్వహణలో రూపొందించుకొన్న ఒక ప్రధానసూత్రమేమో". (5వ ప్ర)

ఇలా ఎన్నో మరెన్నో కిటుకులు విప్పి చెప్పడం జరిగింది. ఎన్నో ధర్మ సూక్ష్మాలు సరళంగా వివరించడం జరిగింది. భాగవత మార్గంలోని రహస్యాలెన్నో హృదయానికి హత్తుకునేటట్లు సాగింది ఎమ్.కె గారి రచన. ఈ కాలం వారికి, ఇప్పటి పరిస్థితులకు - నచ్చే విధంగా యోగసమన్వయం చేసి సరళ సుందరంగా భాగవతాన్ని అందించడం జరిగింది.

ద్వాదశాక్షరీ మంత్రమునకు సంకేతముగా ద్వాదశ స్కంధములుగా భాగవతం

రచింపబడింది. వాటిలో ప్రథమ స్కంధ కథా భాగం మాత్రం ఇందులో వచ్చింది. ఇట్లే సమాజానికి ఉపయోగకరంగా తక్కిన స్కంధాలు కూడ వీరి రచనగా ఒదిగి - ఎదిగి రావాలని ఆకాంక్షించుదాము.

ఒకప్పుడు ఆంధ్రపత్రికలో వరుసగా అక్షర రూపంలో వచ్చిన ఎమ్.కె గారి ప్రవచనాలు ఇప్పుడు మనకు ఇలా పుస్తకరూపంలో అందుబాటులోనికి వస్తున్నాయి. వీటిని మరలా మరలా చదివి భాగవత జీవనంలోని యోగ సాధనలో పై మెట్టుకు చేరుకోగలమని కాంక్షించుదాము.

16-7-92

గుంటూరు. పరాశరం గోపాలకృష్ణమూర్తి

## అనుభూతి - అభినందన

"సాగుతున్న భాగవత ప్రవచనాలలో నడుస్తున్న పరీక్షిత్తు గాథను చదువుతూ ఉంటే మా అందరికీ కూడ గుండె జలదరిస్తూ ఉంది.

భాగవత ప్రవచనాలు గ్రంథంగా వెలువడుతున్నాయీ అంటే ఇక మనం బాగవుతాం అన్నమాటే! బాగవడం కంటే మానవ జీవితానికి కావలసింది ఇంకేముంటుంది?

శ్రీమద్భాగవతము - దివ్యజీవన మార్గము రేపటి యుగానికి బాటను తీర్చే గ్రంథం. ప్రతి మనిషి గుండె గూటిలో మణిదివ్వెగా ఈ గ్రంథం వెలుగొందాలని అనుక్షణం కోరుకుంటున్నాను. ఈ వెలుగును వ్యాపింపజేయడానికై ఆర్తితో ఎదురుచూస్తుంటాను."

-ఇవి హైద్రాబాదు నుండి శ్రీమతి జి. సత్యవాణి అప్పుడప్పుడు సంస్థకు వ్రాస్తూవచ్చిన అనుభూతి ప్రదమైన లేఖలలోని వాక్యాలు.

"భాగవత ప్రవచనాలను చదువుతూ ఉంటే ఒకానొక దివ్యానుభూతి కలుగుతూ ఉన్నది. భాగవతాన్ని మనకు అందించడంలోని మన పెద్దల కృషినీ, వారి ఉద్దేశాలనూ అనుభూతిప్రదంగా తెలుసుకొనడానికి వీలు కలుగుతూ ఉన్నది. అంతేకాదు. నేటికీ, ఏనాటికీ కూడ ఈ భాగవత దివ్యగ్రంథం మానవజాతికి ఎంతగా అవసరమో బోధపడుతూ ఉన్నది. భాగవత ప్రవచనాలు చదువుతూ ఉన్నప్పుడు ఆ ప్రవచనాలలోని రచనా, శైలీ, ఆ పోకడ ఒకానొక అనిర్వచనీయమైన ఉద్విగ్నతకు లోనుచేస్తున్నవి."

-ఇవి ఏలూరు నుండి శ్రీ టి. మోహన్‌రావు ఆంధ్రపత్రిక కార్యాలయానికి వ్రాసిన లేఖలోని కొన్ని వాక్యాలు.

"భాగవత ప్రవచనాలను ఆంధ్రపత్రికలో చదువుతూ వస్తున్న అశేష పాఠక లోకము అనంత చైతన్యరాసిలో లీనమవుతున్నారు. మీరు అమృత హృదయులు. ఆ అమృతాన్నే ఇలా అందరికీ పంచిపెడుతున్నారు. ఆ ప్రవచనాలను చదువుతూ

మాటిమాటికీ, మాటమాటకూ మేమెంతగా మురిసిపోతున్నామో, మేమెంతగా మెరిసిపోతున్నామో మాటలలో చెప్పజాలను.

ఆ ప్రవచనాలను చదువుతున్న కొద్దీ ఆత్మీయతా, ఆపేక్షలు కట్టలు త్రెంచుకొని పొంగుకొని వస్తున్నాయి. పొంగుకు వస్తున్న ఆ ప్రవాహంలో అనిర్వచనీయమైన అనుభూతిని అందుకుంటూ ఎక్కడికి, ఎంతదూరం, ఎలా కొట్టుకొని పోతున్నామో! అలా కొట్టుకొనిపోతున్నప్పుడు అనుభవానికొచ్చే ఆ మాధుర్యమున్నదే, దానిని మరువగలమా!"

-ఇవి పెద్దాపురం నుండి శ్రీ మూర్తి శ్రీ సంస్థకు వ్రాసిన లేఖలోని వాక్యాలు.

"అభివ్యక్తి సాధనకు ప్రాణమువంటిది రచనాశైలి. హృదయంగమమైన మీ శైలి ఎంతగానో ఆకట్టుకుంటుంది మీ రచనను దేనిని చదివినా!

మీ గ్రంథాలు చదువుతున్నప్పుడు ఒక పారవశ్యస్థితి అనుభవంలోకి వస్తుంది. గహనమైన ఆధ్యాత్మిక విషయాలను సున్నితమైన భావనాస్పర్శతో దర్శించి, నిత్యజీవితంలో అడుగడుగునా ఆదుకునే అమృత గుళికలుగా అందించారు మీరు. శ్రీమద్రామాయణంలోని మానవతా ధర్మాలను గురించి చెప్పినా, మహాభారతంలోని ధర్మాద్వైత తత్త్వాన్ని గురించి విశ్లేషణ చేసినా, ఇప్పుడు శ్రీమద్భాగవతంలోని దివ్యజీవన మార్గాన్ని అనుభూతిప్రదంగా అందిస్తున్నా మీకు మాత్రమే సాధ్యమైన సురుచిరమైన బాణీ ఒకటి ఉన్నది. అక్షరాక్షరంలోనూ మీ ధర్మానురక్తి ప్రదర్శితమవుతున్నది.

ఒక్కొక్కసారి అంతులేని నిర్వేదం కలుగుతూ ఉంటుంది. వేదోపనిషత్తులు ఉద్భవించిన ఈ దేశమూ, ఇక్కడి మనుషులూ-ఎటుపోతున్నారా అని! చాలా అరుదుగా కనిపించే మీ వంటి ధర్మ ప్రవృత్తి పరాయణులను చూచినప్పుడూ, మీవంటి వారి రచనలు చదివినప్పుడూ-మళ్ళీకొండంత ఆశ కలుగుతూ ఉంటుంది."

-ఇది హైద్రాబాదునుండి శ్రీమతి సి. వేదవతి సంస్థకు వ్రాసిన లేఖలలోని వాక్యాలు.

ఇలా ఇటు సంస్థకుగాని, అటు పత్రికా కార్యాలయానికిగాని ఎన్నెన్నో లేఖలు. ఆ లేఖలనిండా అనుభూతిప్రదమైన వాక్యాలు. 'శ్రీమద్భాగవతము-దివ్యజీవనమార్గాన్ని' గూర్చిన అభినందన పరంపరలు.

దివ్యమైన ఆ ప్రవచనాలు ఇలా గ్రంథరూపాన్ని సంతరించుకొని మీ చేతులకు అందుతున్న ఈ శుభవేళలో, ఆత్మీయులయిన వారు ఈ గ్రంథాన్ని గూర్చి వ్రాస్తూ వచ్చిన వాక్యాలన్నీ మనస్సులో మెదులుతూ ఉన్నాయి. మచ్చుకోసం అచ్చుకు కొన్ని వాక్యాలు అందిస్తున్నానుగాని, అచ్చమైన అనుభూతినుండి వ్యక్తమైన ఆ వాక్యాలన్నీ నిజంగా అందరికీ వినిపించవలసినవే!

విజయవాడ — భాగవతసేవలో
14-7-92 — మంత్రి
గురుపూర్ణిమ. — ప్రచురణ విభాగం

# వెదురు - వేణువు

ఈ గ్రంథం శ్రీమద్భాగవతానికి ఉపబృంహణం. ఉపబృంహణం అంటే ఏమిటి? విత్తనం నుండి వృక్షం వస్తున్నది కదా! అలాంటి దివ్యక్రతువు. వృక్షంలో విత్తనం కానిది ఏదీ లేదు. విత్తనంలో లేనిది ఏదీ లేదు. చూడగలిగిన కన్నులకు వృక్షం విత్తనం యొక్క వైభవం. విత్తనం యొక్క వ్యక్తీకరణం. శ్రీమద్భాగవతంలోని ప్రథమస్కంధానికి ఈ గ్రంథం అలాంటి వైభవోపేతమైన వ్యక్తీకరణం.

సృష్టి ఆరంభం నుండి వ్యక్తమవుతూ వస్తున్న మహనీయుల జీవిత వైభవాలను గానం చేసేదే భాగవతం. ఆ భాగవతమూర్తుల దివ్యజీవన మార్గంతో మనను స్పృశించి మనను కూడ వారిలో నొకరిగా నిలబెట్టుటకుగాను నిరంతరం ప్రయత్నం చేస్తున్నదే భాగవతం.

వెదురు వేణువై అమృతప్రదమైన గానాన్ని అలవోకగా అందిస్తున్నట్లుగా, ఈ దేహాన్నే ఒక వేణువుగా రూపొందించుకొని దివ్యజీవన గానాన్ని దానినుండి నిండుగా వ్యక్తం చేయగలిగేటందుకు గాను కావలసిన ప్రేరణను మనకు మంద్ర మంద్రంగా, మధుర మధురంగా అందించేదే భాగవతం.

భాగవతంలో ఉన్నవి జీవించడం తెలిసిన వారి కథలు. జీవించడం చేతనయిన వారి కథలు. జీవించడాన్ని నేర్చుకుంటున్న వారి కథలు, జీవించడ మెలాగో గ్రహించు కుంటున్న వారి కథలు. ఈ కథలు అయస్కాంతాల వంటివి. ఇనుపముక్కల వంటి చదువరుల జీవితాలను అయస్కాంత స్థితికి మేల్కొల్పగలిగినటువంటివి. వ్యాసుడు ఎంత తపనపడి దర్శించాడు వీటిని! ఎంత మథనపడి అందించాడు వీటిని! తలచు కుంటే గుండె ఆర్ద్రమవుతుంది.

భాగవతమే లేకపోతే కృష్ణుని కథ మన కన్నులకు ఇంతగా కట్టేదా! భాగవతమే రాకపోతే వ్యాసుని కృషి ఇంతగా ఫలించేదా! భాగవతమే లేకపోతే పోతన కవిత ఇంత సహజంగా సాగేదా! భాగవతమే రాకపోతే కృష్ణమాచార్యుని ప్రజ్ఞావైభవం లోకానికి ఇంతగా సువ్యక్తమయ్యేదా!

కృష్ణమాచార్యుని 'భాగవత రహస్య ప్రకాశం' అది ఒక దివ్య వైభవం! ఒక్క భాగవత మహాపురాణానికే కాదు-మన పురాణేతిహాసాలన్నింటిలోనికి ప్రవేశించడానికీ, వాటితో కలసి పయనించడానికీ కావలసినంత ప్రకాశాన్ని అందించే గ్రంథమది! ఒక్క మాటలో చెప్పాలీ అంటే మొత్తం మన వేద వాఙ్మయానికి సింహద్వారాన్ని తెరిచి, లోనికి ఆహ్వానిస్తున్న దివ్యరచన అది! అలాంటి భాగవత రహస్య ప్రకాశమే ఈ 'శ్రీమద్భాగవతము దివ్య జీవనమార్గము'నకు ప్రేరణ.

'భాగవత రహస్య ప్రకాశము'నకు పరిపోషకమైన గ్రంథంగా 'శ్రీమద్భాగవతము - దివ్య జీవన మార్గము' ను వెలువరించాలన్నది ఆ గురుదేవుల ఆజ్ఞ. 'నా నుండి

వెలువడిన రహస్య ప్రకాశమునకు పరమార్థము నీ నుండి వెలువడుతున్న ఈ దివ్య జీవన మార్గము.' అన్నది వారి ఆశీస్సు. 'ప్రకాశము నా నుండి వెలువడుచుండగా, మార్గము నీ నుండి పొడగట్టుచున్నది.' అన్నది వారి ఆత్మీయమైన వచనము. మహిమాన్వితమైన గురుశిష్యుల అనుబంధమునకు సంబంధించిన మహోవైభవాలలో ఇది ఒకటి. గురుశిష్య సంప్రదాయం ఈ గడ్డపై ఇటులనే వర్ధిల్లుగాక!

1988 గురుపూజా వేదికపైన భాగవత రహస్యప్రకాశం ఆధారంగా భాగవత పరమార్థమును వివరిస్తున్న వేళ ఈ 'శ్రీమద్భాగవతము - దివ్యజీవన మార్గము' వ్యక్తం కావడం ప్రారంభమైనది.. ఆత్మీయులు శ్రీ కందర్ప రామచంద్రరావుగారు ఆ ప్రవచనాలను సంగ్రహించి ఆంధ్రప్రభ దినపత్రికలో వెలువరించడంతో పత్రికల ద్వారా సందేశ పరివ్యాప్తి అన్నది ప్రారంభమయింది. తరువాత ఆ ప్రవచనాలు అలాగే వెలువడిన మరికొన్ని ప్రవచనాలతో కలసి 'ఇదీ మన సంస్కృతి - ఇదీ మన సంప్రదాయం' అన్న గ్రంథరూపాన్ని సంతరించుకున్నాయి.

ఒకానొక ఉత్సవంలో ఒక పెద్దాయన నన్ను కలిసి తన కనులనుండి ఆనంద బాష్పాలు రాలుతూ ఉండగా ఇలా అన్నారు: 'ఇదీ మన సంస్కృతి - ఇదీ మన సంప్రదాయం' మా ఇంట నిత్యమూ అధ్యయనం చేయబడుతున్నది. పనులన్నింటినీ పూర్తి చేసికొని రాత్రి పది గంటల తరువాత నేనూ, మా శ్రీమతీ కూర్చుంటాం. ఆ గ్రంథాన్ని తీస్తాం. నేను వినిపిస్తూ ఉంటాను. ఆమె వింటూ ఉంటుంది. ఇద్దరం పరవశిస్తూ ఉంటాం. ఆ పారవశ్యంలో అలా పొందే అనుభూతి ముందు నిద్రలో లభించే ఆ కాస్త విశ్రాంతి ఏ పాటిది అనిపిస్తుంది. ఎంతసేపటి పాటు అలా ఉండిపోతామో మాకే తెలియదు. ముఖ్యంగా ఆ గ్రంథంలోని భాగవత ఘట్టాలను చదువుతున్నప్పుడు మేము పొందుతున్న అనుభూతి మాటలకు అందేదికాదు. మాటలకు అందని అనుభూతిలోనికి మీ మాటలు మమ్ములను తీసికొనిపోతున్నాయి. ఆ గ్రంథం మా చేతికి రావడం మా అదృష్ట విశేషమనుకుంటున్నాం.

ఆ అనుభూతిని గూర్చి చెబుతూ ఆయన ఇంకా అనుభూతిలోనికి వెళ్లిపోతున్నారు. ఆ ఘట్టం నాకు సంతోషాన్ని కలిగించింది. సంగ్రహంగా ఈయబడిన ఈ ఘట్టాలే వీరికి ఇంతటి అనుభూతిని అందిస్తున్నాయి. మరి ఈ ఘట్టాలే మరింతగా ఉపబృంహణం చెంది కావలసినంతగా కనిపిస్తే వీరు ఇంకా ఎంతటి ఆనందాన్ని అనుభవిస్తారోనని నాకు అనిపించింది. ఒకరకంగా శ్రీమద్భాగవతము - దివ్యజీవన మార్గము గ్రంథరచనకు కావలసిన సంకల్పం ఈ సంఘటనలోనే, ఈ సంఘటనతోనే జరిగిందని చెప్పవచ్చు.

1989 గురుపూజా వేదికపైన కథ మరికొంత ముందుకు నడిచింది. పరీక్షిత్తు ఘట్టంలోనికి ప్రవేశించింది. ప్రవచనం సాగుతున్నది. పరీక్షిత్తు సభ మొత్తానికి సాక్షాత్కరిస్తున్నాడు. అతని పలుకులు, అతని నడకలు గమనిస్తున్న సోదర బృందానికి ఆశ్చర్యానందాలను కలిగిస్తున్నాయి. పరీక్షిత్తు కలిని దమిస్తున్న వేళ సభ మొత్తం

అతనితో తాదాత్మ్యం చెంది నిలబడింది. వింటున్న ప్రతివ్యక్తి పరీక్షిత్తును కంటు న్నాడు. తానూ ఒక పరీక్షిత్తును అంటున్నాడు. విశేషమైన ఘట్టమది. ఉద్యమ చరిత్రను ఒక మలుపు త్రిప్పిన ఘట్టమది!

ప్రవచనం ముగిసింది. అనుభూతి కొనసాగుతూనే ఉంది. ఆ అనుభూతి లోనే సుమాంజలి నిర్వహింపబడుతోంది. సుమాంజలి ఘటింపబడుతూ ఉండగా నాకు ఇలా అనిపించింది. 'ఏమిటి పరీక్షిత్తు ఇలా, ఇంతగా వ్యక్తమవుతున్నాడు. తానే లోకము, లోకమే తానుగా నిలబడుతున్నాడు!' అని, కొద్ది క్షణాలలో ఇలా భాసించింది. 'ఊపిరిపోసుకుంటున్న జాతి పునర్నిర్మాణ ఉద్యమానికి ఈ పరీక్షిత్తు గాథ ఎంతైనా అవసరం. ఇతడు యుగ పురుషుడు. ఈ యుగపు మానవ జాతికి నాయకుడు. కలిని దమించినవాడు. కలి సంతరణ మార్గంగా భాగవతామృతాన్ని తన మీదుగా అందించినవాడు. పరీక్షిత్తు జీవితం మనకు ఆదర్శం కావాలి! నేడు ప్రతి వ్యక్తీ ఒక పరీక్షిత్తు కావాలి! ఇతడి జీవితంలోని ముడులన్నీ ముచ్చటగా విప్పబడాలి! ఇతడి మీదుగా భాగవత ధర్మాన్ని మనం అందుకోగలగాలి!'

నేనిక కర్తవ్యోన్ముఖుడనయ్యాను. భాగవత ప్రవచనాలు తీర్చిదిద్దబడసాగాయి. అప్పటికే ఆంధ్రపత్రిక వారు నాప్రవచనాలను జాతికి అందిస్తున్నారు. ఈ భాగవత ప్రవచనాలను వారు అమితానందంతో అందుకున్నారు. 'వస్తున్నంత వివరంగానూ వీటిని రానీయండి. ఎన్నాళ్లైనా సరే మనం వీటిని వేద్దాం.' అన్నారు పత్రికా సంపాదకులు శ్రీ శ్రీరామమూర్తి. వ్యక్తమవుతున్న ప్రవచనాలను వ్యక్తమవుతున్నట్లుగా యథాతథంగా ప్రచురించారు. సంప్రదాయం చొప్పున క్లుప్తీకరణ శ్రీ కందర్ప అని వేశారుగాని, శ్రీ కందర్ప నుండి జరిగినది సమర్పణ బుద్ధితో కూడిన నిర్వహణమే! పెద్ద మనసుతో పత్రికవారు ఇలా కలసి వచ్చారు. ఈ సందర్భంలో ఒక్కమాట - నిజానికి నేనూ, ఆ సంపాదకులూ ప్రత్యక్షంగా ఇంతవరకూ కలుసుకోలేదు. మా మధ్యన నడుస్తున్నది ప్రజ్ఞాపరమైన పరిచయమే! ఇదే నిజమయిన పరిచయమేమో!

ఈ గ్రంథరచన కూడ చిత్రంగా నడిచింది. 'భాగవతము తెలిసి పలుకుట చిత్రము' అన్నంత చిత్రంగా నడిచింది. ప్రేమలీలతో ప్రారంభమై శ్రీకృష్ణుని ప్రయాణ వైభవం వరకు సాగింది. అంటే ఏం జరిగిందీ - ప్రథమస్కంధం మధ్యనుండి రచన ప్రారంభమైంది. స్కంధాంతం వరకు సాగింది. మళ్లీ మొదటకు వచ్చింది. మధ్యవరకు కొనసాగింది. ప్రథమస్కంధం సరిక్రొత్త రూపాన్ని సంతరించుకొన్నది. ఇలా జరిగిన మార్పునూ, కూర్పునూ సరసహృదయులైన చదువరులు సహృదయంతో గమనించగలరు. ఇలా జరగడంలోని స్వారస్యాన్ని అనుభూతి ప్రదంగా ఆస్వాదించగలరు.

ఇక ఈ గ్రంథముద్రణ యజ్ఞం గురించి తగు మాత్రంగా చెబుతాను. ఆంధ్ర పత్రికలో ప్రవచనాల రూపంలో వస్తున్నప్పటి నుండీ రసహృదయులెందరో- ఈ ప్రవచనాలు గ్రంథరూపం ధరించి ఎప్పటికి వస్తాయి? అని అడగటం ప్రారంభించారు.

ఇంతలో ఆత్మీయులు చౌడప్పగారు కదలి వచ్చారు. ఏడుకొండల వేంకటేశ్వరుడు కలసివచ్చాడు. ఆత్మీయులెందరో కార్యకర్తలుగా రూపుచెంది ప్రచురణ పూర్వవిరాళ స్వీకరణ ప్రణాళికను దేశవ్యాప్తంగా చేపట్టారు. ఆవిష్కరణనాటికి 1,116 కాపీలకు మించి ఒక్కసారిగా దేశం నలువైపులకు వెళ్లేటట్లుగా బాటలు తీర్చారు. 'దేవుని పెళ్లికి అందరూ పెద్దలే!' అని అంటారు. 'స్వామి కార్యంలో అందరూ భాగస్వాములే!' అని వీరు నిరూపించారు. శ్రీమద్భాగవతము - దివ్యజీవనమార్గము గ్రంథ ముద్రణము కూడ భాగవత మార్గాన ఒక దివ్యయజ్ఞంగా కొనసాగడం ఎనలేని తృప్తిని కలిగిస్తున్నది. ఈ దివ్యయజ్ఞ నిర్వాహకులందరికీ ఇదే నా శుభాశంసనము.

వెలుగైన ఈ గ్రంథం వెలువడుచున్నవేళ పెద్దలూ, ఆత్మీయులు ఎందరెందరో శుభాకాంక్షలు తెలుపుతున్నారు.

'ఇది అమృతధార - ఇది అక్షరధార' అంటున్నారు అవధులెరుగని ప్రేమతో శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు.

'ఇది వెన్నముద్ద - ఇది వెలుగుముద్ద' అంటున్నారు అనిర్వచనీయమైన అనుభూతితో శ్రీ కందర్ప రామచంద్రరావుగారు.

'ఇది మహిమాన్వితులయిన గురుశిష్యుల వాగ్వైభవం' అంటూ పారవశ్యంతో పలుకుతున్నారు శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తిగారు.

'ఇది అనుభూతి - ఇది అభినందన' అంటూ ఎన్నోగొంతులను తమ గొంతు నుండి ఆర్ద్రంగా వినిపిస్తున్నారు సంస్థ ప్రచురణ విభాగం నుండి మంత్రి.

ఈ శుభ సందర్భాన యావత్ప్రజలకు ప్రతినిధులుగా దివ్యజీవన మార్గానికి ఇలా స్వాగతం పలుకుతున్న వీరందరికీ ఇవే నా హృదయపూర్వకమైన అభినందనలు.

వెదురువంటి నన్ను వేణువును చేసి శాశ్వతమైన దివ్యగానాన్ని ఇంతగా వినిపిస్తున్న కృష్ణమాచార్యుని పాదపద్మములకు ఇవే నా నమస్సుమాంజలులు!

భాగవత దివ్యగ్రంథంలో అంతటా అంతర్యామిగా నిండినవాడు నారాయణుడయిన కృష్ణదేవుడు.

భాగవత దివ్యగ్రంథానికి అక్షరరూపాన్నీ, అక్షరమైన రూపాన్నీ అందించినవాడు కృష్ణద్వైపాయనుడైన వ్యాసభగవానుడు.

భాగవత దివ్యగ్రంథాన్ని మానవుల మధ్యలో ఆవిష్కరించిన వాడు అవధూత వర్యుడయిన శుకయోగీంద్రుడు.

భాగవత దివ్యగ్రంథాన్ని తన మీదుగా కలిసంతరణమార్గంగా మానవజాతికి అందించినవాడు పరీక్షిన్నరేంద్రుడు.

భాగవత దివ్యగ్రంథాన్ని శౌనకాది మహామునులకు గూడ ముచ్చట గలిగేటట్లుగా, రసభరితంగా, లలితమధురంగా విడమరచి చెప్పినవాడు సూతమహాశయుడు.

భాగవత దివ్యగ్రంథాన్ని తెలుగువారికి తేనెల విందుగా చేసిన వాడు సహజకవి

బమ్మెర పోతనామాత్యుడు.

భాగవత దివ్యగ్రంథంలో భక్తిగా పర్యవసిస్తున్న జ్ఞానవిజ్ఞాన సర్వస్వాన్ని ప్రపంచ జనుల ముందు ప్రకాశింపజేసినవాడు ఎక్కిరాల కృష్ణమాచార్యుడు.

భాగవత గ్రంథాన్ని దివ్యజీవన మార్గంగా ఈనాడు మననుండి వెలువడజేస్తున్న వారు వీరందరూ!

ఇందరుగా కనబడుతున్నారుగాని, ఇందరిలో నుండి సాగివస్తున్నది ఆ ఒక్కడే!

ఇందరిలో నుండి సాగివస్తున్న ఆ 'ఒక్కడి' పదాలకు ప్రణమిల్లుతూ అతని అభయ హస్తానికి ఈ గ్రంథాన్ని అందిస్తున్నాను. అతడి వెలుగునకు ఈ గ్రంథాన్ని అర్పిస్తున్నాను. అతడి ఆదేశం మేరకు అతడి సముక్షాన ఈ గ్రంథాన్ని మానవజాతికి అతడిచ్చిన కానుకగా వినమ్రుడనై అందజేస్తున్నాను. మిగిలిన భాగవతానికి కూడ ఇటుపైన ఇలాగే ఉపబృంహణం జరిగి అది దివ్యజీవన మార్గంగా భాసించగలదని అతడిచ్చిన మాటను మీకు ఆనందంతో వినిపిస్తున్నాను.

14-7-92 మోపిదేవి కృష్ణస్వామి

గురుపూర్ణిమ.

# ప్రేమ లీల

కురుక్షేత్రం అయిపోయింది. కథ ఒక కొలిక్కి వచ్చింది. శ్రీకృష్ణుడు ఇక ద్వారకవైపు దృష్టి మళ్ళించాడు. ఎప్పటివలె చెరగని చిరునవ్వుతో ద్వారకను సమీపించి శంఖారావం చేశాడు. యాదవులు ఎలా ఉన్నవాళ్ళు అలా పరుగెత్తుకొని వచ్చి చేరారు. ఆయన అందరినుండి స్వాగత సత్కారాలను అందుకుంటూ, వారితో ముద్దు ముచ్చటలాడుతూ లోనికి సాగాడు.

తల్లులను సమీపించాడు. వారినుండి స్తన్యం స్రవించింది. వారి దృష్టికి అతడు బాలగోపాలుడుగానే భాసిస్తున్నాడు. ప్రపంచ సంగ్రామానికి అతడు సారథి కావచ్చు. గీతోపదేశము చేసిన జగద్గురువు కావచ్చు. తల్లులకు మాత్రం అతడు బిడ్డడే. బాలగోపాలుడే. ఆ భావనతో ఆయన వారిని సమీపించాడు. ఆ అనుభూతిలో వారు మునిగితేలారు.

మనలో చాలామందికి ఈ సూక్ష్మం తెలియదు. ఎదగటం చాల తేలిక. ఒదగటం చాల కష్టం. చదువుసంధ్యలు పూర్తి చేసుకుని, హోదాను పొందిన కొడుకు - ఆ దశలో తల్లిదండ్రులు తనను సమీపిస్తే, వారికి కావలసిన స్థితికి దిగలేకపోతున్నాడు. వారి అక్కున ఒదగలేక పోతున్నాడు. దానితో ఇరువురికీ అసంతృప్తి. అతడు బిడ్డకాలేకపోతున్నాడు. వారు తల్లిదండ్రులు కాలేక పోతున్నారు. అలాకాక హోదాలకు, అంతస్థులకు, వయస్సులకు అతీతంగా నిలబడ్డవాడు తాను ఎటువంటి స్థితిగతులలో ఉన్నా, తల్లిదండ్రులకు బిడ్డ కాగలడు. బంధుమిత్రాదులకు సన్నిహితుడు కాగలడు. సమాజానికి సేవకుడు కాగలడు. ఇలా ఇన్ని పాత్రలను ఏకకాలంలో మనం మనలో నుండి వ్యక్తం చేయగలగాలి. అలా వ్యక్తం చేయగలగడానికే ఆధ్యాత్మిక సాధన.

సమాధి అంటే అర్థం ఏమిటి? 'సైమల్ టేనియస్ కాన్షస్‌నెస్ ఇన్ ఆల్ ప్లేన్స్'. సమముగా అధిష్ఠించి ఉండగలిగినవాడు. దీనినే 'ఉచిత ప్రవర్తన' అంటారు. అంటే సన్నివేశానికి తగినట్లు రూపు ధరించటం.

కనుకనే, వ్యాసభగవానుడు ఇక్కడ ఈ ఘట్టాలను నొక్కి చెపుతున్నాడు. 'అతడు ఎలా నడిచాడో చూడండి. మీరు అలా నడిచేందుకు ప్రయత్నించండి.' - అంటూ భాగవత మార్గాన గల సూక్ష్మాంశాలను సన్నివేశాల రూపంలో

ఉపదేశిస్తున్నాడు.

ఈ విధంగా తల్లులను మురిపించి, అవధులు ఎరుగని వారి ప్రేమను అను భవించి, ఒడలు తెలియని పారవశ్యం వారికి అనుగ్రహించి, ముందుకు సాగాడు స్వామి.

స్వామికి ఎదురుగా పదహారువేల నూట ఎనిమిది గృహాలు. ఆయనకు అంతమంది భార్యలు కదా! అందరూ విరహార్తులై ఉన్నారు. ముందుగా ఎవరి ఇంటికి వెళ్ళినా, మిగతా వాళ్ళందరూ ఇబ్బంది పడతారు. కనుక ఆయన పదహారువేల నూట ఎనిమిది మూర్తులుగా రూపొంది, అన్ని తలుపులు ఒకే సారి తట్టాడు. తలుపులు తెరుచుకున్నాయి. స్వామి తమ ఇంటికే ముందు వచ్చాడని ఎవరికి వారు అనుకుంటున్నారు. అలా వాళ్ళు సంతోషించడం కన్నా ఆయనకు కావలసింది ఏముంది?

అలా బైఠాయించిన స్వామి ఎవరికి ఏ కబుర్లు ఇష్టమో వారికి ఆ కబుర్లు చెపుతున్నాడు.

"నేను వెళ్ళేటప్పుడు ఈ లేడికూన చాల చిన్నది కదూ! ఇప్పుడు ఎంత పెద్దదైపోయిందో." - అనేటప్పటికి ఆమె పరవశించి పోయింది. ఆమెకు లేళ్ళ పెంపకం ఇష్టం.

"ఈ పూల తీగలు కొత్తగా తెప్పించినట్లున్నావు. ఈ రెండూ చేరడంతో ఈ పెరటికి ఎంతో అందం వచ్చింది." ఇంకేమున్నది! ఆమె పరవశించి పోయింది. ఆమెకు పూల తీగలంటే ప్రాణం.

"ఈ హారాలు రెండూ ఈ మధ్య చేయించావా? వీటివల్ల నీ అందం ఇనుమడించింది సుమా!" ఆమెకు ఒడలు తెలియని ఆనందం.

ఇలా ఆ గృహ సముదాయంలో ఆనందం అర్ణవమైంది. తనను పట్టిం చుకున్నప్పుడు కన్నా, తాను ఇష్టపడే అంశాలను పట్టించుకున్నప్పుడు మనిషి కదిలిపోతాడు. కరిగి పోతాడు.

మనతో జీవితాన్ని ముడిపెట్టుకున్నవారి అభిరుచులకు తగిన దోహదాన్ని అందిస్తూ ఉండాలన్న భాగవత సూత్రాన్ని స్వామి సమ్మోహనంగా ఉపదేశిస్తు న్నాడు. మురళీగాన లోలుడు కదా ఆయన. ఆ గానం ఎలా సమ్మోహనమో ఆయన ఉపదేశమూ అలా సమ్మోహనమే. ఇది చెవులు కొరికే ఉపదేశం కాదు. హృదయాలను స్పృశించే మధురమైన ఉపదేశం.

ఇటీవలగా ఒక విచిత్రమైన భావన రూపుకట్టుకుని మనుష్యులను తికమకపెడుతున్నది. ఈ సంసారాలూ, బంధుత్వాలూ అన్నీ బంధాలనీ, ఇవన్నీ మోక్షానికి అడ్డాలనీ, వీటిని ఎంత త్వరగా త్రెంచుకుంటే అంతమంచిదనీ. పోనీ అలా అనుకున్నవాళ్ళు ఏమైనా త్రెంచుకుంటున్నారా? త్రెంచుకోలేరు. ఉంచుకుంటున్నారా? ఉంచుకోలేరు. ఊరికే మధ్యలో అనవసరంగా నలుగుతున్నారు.

మనిషి జీవితం నలగడానికి కాదు ఉన్నది. మనిషి దేవుడై ఈ భూమి మీద వెలగడానికి అది ఉన్నది. కనుక జీవితాన్ని చిన్నచూపు చూడకూడదు. బంధుమిత్రులను బంధాలుగా భ్రమించకూడదు. అయా రూపాలలో ఉన్నది భగవంతుడే. మనకు దగ్గర కావాలని బంధుత్వాలను ఏర్పరచుకున్నాడు అయన. కనుక బంధుత్వాలు బంధాలుగా కాక అనుబంధాలుగా రూపొందాలి. 'ఎఫెక్షన్స్' మనమధ్య ప్రవహించడానికి 'కనెక్షన్స్'గా పనిచేయాలి. 'ఎఫెక్షన్' పవిత్రమైనప్పుడు జీవితంలో 'పర్‌ఫెక్షన్' మనకు సిద్ధిస్తుంది. 'ఎఫెక్షన్‌కు' బదులు 'ఎవర్షన్'ను మనం పెంచుకున్నప్పుడు అది పర్వర్షన్‌కు దారితీస్తుంది. వేదాంతం పేరిట మీరు ఎవర్షన్‌కు లోనుకాకండి. ఎండిపోకండి. స్వార్థమెరుగని ఎఫెక్షన్‌ను ప్రవహింప జేయండి. అది మిమ్మల్ని విశ్వప్రేమ వైపు నడిపిస్తుంది.

శ్రీ కృష్ణుడు భార్యలతో నడిపిన సరస సల్లాపాల సార్థకత ఇప్పుడు మనకు బోధపడుతుంది.

ఇంకో చిత్రమైన సూక్ష్మం. అతేడు ఏమి చేశాడు? వారివారి అభిరుచులను పరామర్శించాడు. ప్రోత్సహించాడు.

మనలో చాలామందికి మన విషయమే గుర్తుంటుంది. మన అభిరుచులే గుర్తుంటాయి. మనకు తగ్గట్టుగా మన అభిరుచులను గమనించుకుంటూ మనతో ఉన్నవారు మనకు సహకరిస్తూ ఉండాలని మనకు అనిపిస్తూ ఉంటుంది.

మరి ఎదుటి వాళ్ళకు కూడా కొన్ని ఇష్టాలు ఉంటాయి కదా! కొన్ని అభిరుచులు ఉంటాయి కదా! ఎదుటివారి అభిరుచుల ఎడల మేల్కొంచి సహకరించ గలిగినవారు మనలో ఎందరున్నారు?

ఎదుటివారి అభిరుచులు మనకు బోధపడాలంటే, మనం మన పరిధిని దాటి ఎదుటివారిని సమీపించ గలగాలి. వారిని స్పృశించగలగాలి. వారిని బోధపరచుకో గలగాలి. ఒక్కమాటలో చెప్పాలంటే మనం వారి స్థానంలో నిలబడాలి. మనం వారైపోవాలి. అప్పుడే వారి అభిరుచులు ఏమిటో, అకాంక్షలు

ఏమిటో మనకు నిజంగా బోధపడేది.

మనకు తోటివారితో అద్వైత స్థితి సిద్ధించినప్పుడే అది సాధ్యం.

చూశారా! ఈ కథలో ఎంత కథ ఉన్నదో!

భాగవతమంటే ఇది. ఇలా ఉంటుంది. ఇలా చూడవలసి ఉంటుంది. అందుకే అది మనల్ని మురిపిస్తున్నది. మరిపిస్తున్నది. మరచిన మన నిజస్వరూపాన్ని మనకు అందిస్తున్నది.

బంధుత్వాలను ఇలా బోధపరచుకోవాలి. అంటే కృష్ణుడిలా సద్వినియోగం చేయాలి. అప్పుడు మనం కూడా ఆయనలా పరిపూర్ణ స్థితిని అనుభవించ గలుగుతాము.

కనుక తోటివారి ధర్మబద్ధమైన అభిరుచులకు దోహదం చేయటం ద్వారా వారితో తాదాత్మ్య స్థితిని అనుభవిద్దాం.

ఈ విషయాన్ని తెలియజేస్తూ గీతలో శ్రీ కృష్ణుడు - "ధర్మమునకు విరుద్ధము కాని కామం నా స్వరూపం." అని నొక్కి చెప్పాడు.

## అన్నా ఇంకెన్నాళ్లు

ఇక ఇక్కడ హస్తినాపురంలో - భీష్ముని బోధను అందుకున్న ధర్మరాజు తదనుగుణంగా పరిపాలన సాగిస్తున్నాడు. రోజూ ఉదయం లేవగానే చేసే పూజాదికాలలో ధృతరాష్ట్ర దంపతులను పూజించడం ఒక భాగంగా చేసుకున్నాడు. ధృతరాష్ట్రుడు పెదతండ్రి. పెద్దవాడు. కన్నబిడ్డలందరినీ కోల్పోయి ఉన్నవాడు. యుద్ధంలో పెద్దలందరూ వెళ్ళి పోగా - ఇక మిగిలిన పెద్ద ఆయన ఒక్కడే. ఆ అందరి తరపున ఆశీర్వదించ వలసిన పెద్ద కూడ ఆయనే - ఇదీ ధర్మజుని భావన.

ధృతరాష్ట్రుడు మాత్రం పుత్రులు పోయిన దుఃఖాన్ని మరువలేక పోతున్నాడు. కాని అతడు చాల గంభీరమైన వాడు కాబట్టి, పైకి మాత్రం దానిని కనబడనీయడం లేదు. గాంధారి మాత్రం తట్టుకోలేక పోతోంది. ఆమె దుఃఖం తరచు బహిర్గతం అవుతోంది. ఆ దృశ్యాలను చూచి బాధపడుతున్నాడు ధర్మరాజు. ఒక ప్రక్క బిడ్డలందరూ పోయారే అనే బాధ. మరొక ప్రక్క "ఇంతగా వేధించినా, అన్నింటినీ మరచి తమను పూజిస్తున్నాడే ధర్మరాజు.

ఇటువంటి వాడిని  గదా మనం లోకం కనీవినీ ఎరుగని ఇబ్బందుల పాలు చేశాం" - అన్న పశ్చాత్తాపం. ఈ రెండూ ఆ దంపతులను కలచివేస్తున్నాయి.

ఇది ఇలా ఉండగా, భీముడొకడు ఉన్నాడు కదా! ఇలా ధర్మజుడు పూజించి వెళ్లాడో లేదో, అలా భీముడు దరికి జేరి, తనివితీరా వాళ్లను దూషిస్తూ ఉండేవాడు. ధృతరాష్ట్ర దంపతులు వినేటట్లుగా గొంతుపెంచి - "ఈ గ్రుడ్డివాడు నిజంగా గ్రుడ్డివాడు. తన బిడ్డలు ఎలాంటివాళ్ళో గమనించలేనంత గ్రుడ్డివాడు. ఏది ధర్మమో ఏది అధర్మమో చూడలేనంత గ్రుడ్డివాడు. అలాంటి గ్రుడ్డివాడికి ఈ పిండం తినిపించండి" - అంటూ భోజనాల ఏర్పాటు సందర్భంగా అష్టోత్తరాలు చదివేవాడు భీముడు.

అటు ధర్మరాజు చేసే సాదర నమస్కారాలకు సంతోషించాలా? ఇటు భీముడు వర్ణించే అష్టోత్తరాలకు దుఃఖించాలా? ఆ దంపతులకు ఏమీ పాలుపోవటం లేదు పాపం.

ఏది ఏమయితేనేమి? అతడు ప్రేమతో నమస్కరించినా, ఇతడు ద్వేషంతో దూషించినా - వాళ్లకు మాత్రం కళ్లముందు గతమంతా కదలాడసాగింది. ఆ దంపతులలో ఆత్మపరిశీలన అదే పనిగా సాగుతోంది. వాళ్లు మథన పడుతున్నారు. బాధపడు తున్నారు. తమను తాము తేరిపార చూచుకుంటూ - గడచిన తమ జీవితాలలోని ధర్మాధర్మాలను బేరీజు వేసుకుంటున్నారు. ఎటువంటి దశనుండి ఎటువంటి స్థితికి జారిపడ్డామని చింతిస్తున్నారు. ఈ చింతనలో నిమగ్నమై ఉండగా - దైవం వారిని అనుగ్రహించాడా అన్నట్లు - విదురుడు వారిని సమీపించాడు.

ఎప్పుడో తీర్థయాత్రలకని వెళ్ళినవాడు ఆయన. ఇప్పుడు రావలసిన పని లేదు ఆయనకు. వీళ్ల కోసమే రప్పించ బడ్డాడా అన్నట్లుగా ఆయన అక్కడికి చేరుకున్నాడు.

అన్నా వదినలను చూస్తూనే, వాళ్ల పరిస్థితి అంతా అర్థం చేసుకున్నాడు విదురుడు.

"అన్నా! ఇంకా ఇక్కడే ఉన్నారా మీరు? ఎలా ఉండబుద్ధవుతోందన్నయ్యా నీకు? కాలం సమీపిస్తున్నా నీలో ఇంకా జ్ఞానం కలగడం లేదు! మన కోసం కాలం ఆగుతుందా అన్నయ్యా? మనిషి భోగభాగ్యాలను సమకూర్చుకునే యత్నంలో ఉంటాడు. బంధుత్వాలనూ, బలగాలనూ పెంచుకునే ప్రయత్నంలో ఉంటాడు. ఆ ప్రయత్నాల్లో ఉండగానే కాలవశుడై దేహాన్ని విడిచి వెళ్ళిపోతున్నాడు.

అన్నా! కాలం కనికరించదు. కనికరిస్తే ఈ సృష్టి నడవదు. మనం ఆలస్యం చేస్తున్నామని అది ఆలస్యం చేయదు. కనుక ఇప్పటికైనా మేలుకో.

' నీ పరిస్థితి తలచుకుంటే నీకెలా ఉందోగాని - నేను తట్టుకోలేక పోతున్నాను. అన్నయ్యా! పుట్టు గ్రుడ్డివి. పెద్దవాడవు అయిపోయావు. భోగాలకు అలవాటు పడ్డవాడవు. ఇప్పుడు వాటికి అవకాశం లేదు. ముసలి తనం ముంచుకు వచ్చేసింది. నీ వాళ్లు అందరూ ఒక్కరు కూడా మిగల కుండా పోయారు. ఇంకా నీ కంటూ ఏం మిగిలింది? ఏం మిగిలిందని మీ భార్యాభర్తలు ఈ పంచను పట్టుకుని వ్రేలాడుతున్నారు? బాగున్న రోజుల్లో పాండవులను నీ పంచన ఉంచుకోవటానికి నీకు ప్రాణం ఒప్పింది కాదు. కాలం చిత్రమైంది. నీకు ఇప్పుడు వాళ్ళ పంచన పడి ఉండవలసిన స్థితి ఏర్పడింది. నీకెలా ఉండ బుద్ధవుతోందన్నయ్యా?

"గతాన్ని ఒక్కసారి తలచుకో. పాండవులను ఎన్నెన్ని పాట్లు పెట్టావో గుర్తుందా? లక్క ఇంటిలో కాల్చాలని అనుకున్నావు. వారి భార్యను చెర బట్టాలని అనుకున్నారు నీ బిడ్డలు. అది వీలుపడలేదని వాళ్లను అడవులకు వెళ్లగొట్టారు. వాళ్లు తిరిగి వచ్చి నీ బలాన్ని, బలగాన్ని హరించివేసి, నిన్ను ఏకాకిని చేశారు. ఇంత జరిగిన తరువాత వాళ్ల పోషణలో నీకు ఎలా ఉండబుద్ధవుతున్నది? నీకు అన్నమెలా సయిస్తున్నది?

"ఆ భీముడు మాట్లాడే మాటలు నీకు వినబడుతూనే ఉన్నాయి కదా! రోజూ నీవు అన్నం తినబోతూ ఉండగా, అతడు తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టిపోస్తున్నాడు. అయినా నీకేమీ అనిపించడం లేదా?

"అన్నయ్యా! ఇంకేం చేద్దామని ఈ ఉండడం? బిడ్డలను కనాలా? మనుమలను చూడాలా? దానధర్మాలు చేయదలచుకుంటే - నీ దంటూ ఏమయినా మిగిలిందా?

"లే ! ఇప్పటికైనా నీ దేహాభిమానాన్ని విడిచిపెట్టు. జరిగిన దానికి పశ్చాత్తాపపడు. క్షమించమని ఆ దైవాన్ని నోరారా అడుగు. ఆయన సంతోషిస్తాడు. తనను కనగలిగే జ్ఞాన నేత్రాన్ని నీకు అనుగ్రహిస్తాడు. ఆ జ్ఞానాన్ని పొంది, ఆయన ఇచ్చిన ఈ దేహాన్ని ఆయనకు అప్పగించి, ధన్యతను పొందు.

"పద పోదాం. రాజైనవాడు యుద్ధంలో అయినా పోవాలి. అరణ్యంలో అయినా పోవాలి. ఇలా దిక్కులేని చావు మాత్రం చావకూడదు. పదపోదాం. అలా అరణ్యాలవెంట సాగిపోదాం."

"తమ్ముడా! ఎంత మంచి పని చేశావు! సమయానికివచ్చి నన్ను మేలుకొలి పావు. నా కర్తవ్యాన్ని నాకు తెలియజెప్పావు. నీ ఋణం ఎలా తీర్చుకోగలను?" - అనుకుంటూ తనలోనికి తాను ప్రవేశిస్తున్నాడు ధృతరాష్ట్రుడు. తన ఎడల తాను మేల్కొంటున్నాడు. తనను గూర్చి తాను సమీక్షించుకుంటున్నాడు.

"అవును. ఈ విదురుడు మొదటి నుండీ నా హితం కోరిన వాడే. మొదటి నుంచీ ప్రతి సన్నివేశంలోనూ - "అన్నా! ఇది మంచి, ఇది చెడు, ఇది చేయి, ఇది వద్దు అని చెపుతూ వస్తున్నవాడే. మరి అప్పుడెప్పుడూ నాకు ఇతని మాట వినాలని ఇంతగా అనిపించలేదే? పెద్దలూ, హితులూ నాకు అడుగడుగునా ధర్మాన్ని గురించి చెపుతూనే ఉన్నారు. వాళ్లు చెప్పిన ప్రకారం చేసి ఉంటే! ఇప్పుడు అనుకుని ఏం లాభం? ఆనాడు బుద్ధి పనిచేసింది కాదు. హితులమాట పెడచెవిని పెట్టి, తోచినట్లల్లా చేసుకుంటూ వచ్చాను. ప్రతి కర్మకూ ఒక ఫలితం ఉంటుంది కదా! నేను చేసిన కర్మకు ఫలితం ఇప్పుడు అనుభవానికి వస్తోంది. ఈ కర్మానుభవం చాల దొడ్డది. హితుల మాట విన్న వాడు అదృష్టవంతుడు. నాలాగా చేతులు కాలకుండానే బయటపడి పోతాడు. వినని నా లాంటి వారికి బుద్ధి చెప్పటానికే ఈ కర్మానుభవం ఉన్నది.

దేవుడి భాష చిత్రమైనది. అతడు మొదట పెద్దల నోటితో చెప్పిచూ స్తాడు. విననప్పుడు ఇలా కర్మల ఫలితాల రూపంలో పుటం పెట్టి వినిపిస్తాడు. అప్పుడు మనిషి వినక ఏం చేస్తాడు?

ఆహా! కర్మ స్వరూపం ఎలాంటిది! ఈ కర్మఫలితం నాలాంటి గ్రుడ్డివా డికి సైతం వెలుగు చూపుతోంది కదా!

ఈ విదురుడు ఎంత మంచివాడు! వినిపించుకోలేదని నన్ను విడిచి పెట్ట లేదు ఇతడు. తిరిగి వచ్చి - "అన్నా! ఇప్పటికైనా మేలుకో"! అంటున్నాడు. ఇతడి హృదయం ఎంత దొడ్డది! నాలాంటి దుష్టుడిని ప్రేమించ గలిగింది అది. కర్మఫలితం అనుభవానికి వస్తున్న ఈ దశలో విదురుడు రావడం ఎంత మంచిదయింది! ఈ దశలో వచ్చాడు కనుకనే అతనిమాటలు నాలో నాటు కున్నాయి.

వ్యవసాయదారుడు అదునుచూసి విత్తనాలు చల్లినట్లుగా వున్నది ఈ సన్ని వేశం. తమ్ముడూ! ఇదివరకు నీవు చాలాసార్లు చల్లావు. అవి మొలకెత్తలేదు. కాని, నీవు విసిగిపోకుండా అదును వచ్చేవరకు ఆగి, ఇప్పుడు మళ్లీ చల్లావు. నీ కృషి వృథాపోదు. ఇన్నినాళ్ల నీ సత్కర్మకు ఫలితంగా నీ అన్న ఇక

మేలుకొంటున్నాడు. చూశావా మన ఇద్దరి కథ! ఎవరికర్మను అనుసరించి వాళ్లము ఫలితం అందుకుంటున్నాము కదూ!" అనుకుంటూ ధృతరాష్ట్రుడు అరణ్యాలకు తరలి వెళ్లటానికి సిద్ధమయ్యాడు.

ఈ ఘట్టం మనకు ఏమి చెబుతున్నది?

"వీడు చెడిపోయాడు" అని ఎవరినీ విడిచిపెట్టకండి. మీ మాటలు వినలేదని వదలివేయకండి. మీ మాటలు విననందుకు వడ్డీతో సహా పుటం పెట్టడానికి అతని కర్మఫలితం ఉన్నది. అది పుటం పెడుతున్న వేళ మళ్లీ మీ మాటలు అతనికి అవసరం అవుతాయి. అప్పుడు అతడిని సేద దీర్చండి. అతడికి దారిచూపండి.

భాగవత మార్గాన పయనిస్తున్న వారికి ప్రధానమైన సూత్రాలలో ఇది ఒకటి. ఇలా మీరు ఈ సూత్రాలను గమనించుకుంటూ అలవరచుకున్నవేళ - మీ జన్మ కర్మలను దివ్యమైనవిగా మీరు తీర్చిదిద్దుకోగలుగుతారు. "అద్వేష్టా సర్వ భూతానాం" - అన్న భగవద్గీతా వాక్యం అనుభవంలోనికి తెచ్చుకున్నవాళ్లు అవుతారు.

తోటి జీవుల ఎడల మైత్రీ కరుణలు కలిగివున్నవారికి అద్వేష్ట స్థితి అనుభవానికి వస్తుందని గీతలో శ్రీకృష్ణుడు చెబుతున్నాడు. ఈ ఘట్టంలోని విదురుని పాత్ర ఆ ఉపదేశానికి ఒక ఉదాహరణ. మానవ జాతికి ఒక ఆదర్శం!!!

## మన సారథి

ధృతరాష్ట్ర దంపతులు వెళ్ళిపోయినందుకు బాధపడుతున్న ధర్మజుని దగ్గరకు నారదుడు వచ్చాడు. అతణ్ణి ఓదారుస్తూనే ఒకమాట చెప్పాడు: "ధృతరాష్ట్రునికేగాదు; మీకూ సమయం దగ్గరకువస్తోంది. శ్రీకృష్ణుడు ఎంతకాలం భూమిమీద వుంటే అంతకాలమే మీకు ఇక్కడవని. ఆయన శరీరం విడిచి పెట్టాడుఅంటే ఇక మీ కర్తవ్యాలుకూడా ఈ లోకంలో పూర్తయిపోయినట్లే. ధృతరాష్ట్ర దంపతులగూర్చి నీవు ఇక బాధపడవద్దు. అడవులకుచేరి, వాళ్లు విదేహస్థితిలో యోగమార్గాన్ని పొందబోతున్నారు. శరీర ధారుల కథలు ఇలా చిత్రంగా ఉంటాయి. శరీరాలన్నింటి ద్వారా కథను నడుపుతోంది ఒక్కడే కనుక వీటి అవసరం ఎంతకాలమో, అంతకాలమే ఆడనిస్తాడు. ఆపైన తనలోనికి తీసేసుకుంటాడతను. ధర్మరాజా! ఒక్కసారి ఈ సృష్టి యొక్క తరహాను

గమనించు. నీ కర్తవ్యం నీకు బోధపడుతుంది".

నారదుడు వెళ్లిపోయాడు. ధర్మరాజుకు అన్నీ దుశ్శకునాలే కనబడుతు న్నాయి. అతనికి బాధకలుగుతోంది. ఆ బాధ తాను వెళ్లిపోవలసి వస్తున్నందుకు కాదు. లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచి పెడుతున్నాడే మోనని, విడిచి పెట్టాడేమోనని! ఆయన లేని భూమిని అతడు ఊహించలేదు. ఆయన లేడన్న ఆ వార్తను చెవులతో వినలేదు. వినితట్టుకోలేడు. అందుకని ఆ వార్త వినవలసి వస్తుందేమోనని బాధపడి పోతున్నాడతను. కాని ఎటుచూసినా ప్రకృతి కీడునే సూచిస్తోంది. కృష్ణుడి నుండి కబురందుకొని వెళ్లిన అర్జునుడు ఇంతవరకు రాలేదు. వెళ్లి చాలా రోజులైంది. 'ఎప్పుడు వస్తాడో? ఏం చెబు తాడో?' అని మథన పడుతూ, ఆ మథనాన్ని తనలో ఇముడ్చుకోలేక భీమునికి వివరిస్తూ, కాలాన్ని బరువుగా గడుపుతున్నాడు ధర్మరాజు.

ఇంతలో దీనవదనుడై అర్జునుడు వచ్చాడు. అతణ్ణి చూడగానే ధర్మజునికి గుండె గుభేలుమన్నది. అతడేం చెప్పలేకపోతున్నాడో ధర్మజునికి తెలుస్తూనే ఉన్నది. అది తాను వినలేడుకూడా. అందుకని గుండె బిగపట్టుకొని, "తమ్ముడూ! అక్కడ మనవారందరూ ఎలావున్నారు? మన మామలు, మేన త్తలు, అక్రూర, కృతవర్మలు, ఉగ్రసేనుడు వాళ్ళందరూ ఎలా ఉన్నారు?" అలా ఒక్కొక్కరినీ గూర్చి పేరుపేరునా అడిగి చిట్టచివరికి, "మన ప్రాణానికి ప్రాణమైన శ్రీకృష్ణుడెలా ఉన్నాడు?" అని అడిగాడు. అడిగేటప్పటికి అర్జునుడు దుఃఖాన్ని ఆపుకోలేక వలవలా ఏడ్చేశాడు.

"తమ్ముడూ! ఎలాంటి పరిస్థితుల్లోను కంటతడి పెట్టనివాడివి. ఈనా డిలా వివశుడవై పోతున్నావేమిటి?" - అంటూ ధర్మరాజుకూడా వివశత్వాన్ని పొందాడు. అతని అంతరాత్మకు తెలుస్తూనే ఉంది, ఏమి జరిగి ఉంటుందో. కాని అతని మనస్సు వినలేదు. విని తట్టుకోలేదు. అతని అంతరాత్మకు అలవా టుపడిన అతని ఇంద్రియాలు అసలు తట్టుకోలేవు. అలా తాను వివశుడౌతూ "తమ్ముడూ! నీవిలా వివశుడవౌతున్నావేమిటి?" - అని అర్జునుణ్ణి అడుగు తున్నాడు ధర్మరాజు.

"అన్నా! జరిగింది ఊహించలేనంత అమాయకుడివా నీవు? అనిపించి నీవు తట్టుకోలేక పోతున్నావు. కని వచ్చి నేను తట్టుకోలేక పోతున్నాను". - అన్నట్లుగా ఆ కన్నీటి ధారలమధ్య నుండి చూస్తున్నాడు అర్జునుడు.

ఏకధారగా కారుతున్న కన్నీటిని తుడుచుకుంటూ చెప్పకతప్పని విషయాన్ని

చెప్పటం ప్రారంభించాడు అర్జునుడు. "అన్నా! మనకు సారథి, సచివుడు, వియ్యము, సఖుడు, బంధువు, ప్రభువు, గురువు, దైవము - అన్ని తానై మనలనింతగా కాచుకుంటూ వచ్చిన ఆ శ్రీకృష్ణుడు మనలను విడిచిపెట్టి వెళ్లిపోయాడు.

"అన్నయ్యా! గుర్తుందా? శ్రీకృష్ణుడు ప్రత్యక్షంగా మన జీవితాలలో ప్రవేశించిన ఘట్టం నీకు గుర్తుందా? అదే! ద్రౌపదిని మనం చేపట్టిన ఘట్టం. అనాడు ఆ మీనాన్ని అలా కొట్టగలగటం ఆయన కరుణ కాకపోతే మరేమిటి? ఉద్దండులైన రాజులెందరో అలా చూస్తూ ఉండిపోయారు చిత్తరువుల్లా.

"ఇక అక్కడి నుండి మన వెంట నడిచి లెక్కలేనన్ని విజయపరంపరలకు మనం పాత్రులమయ్యేటట్లు చేశాడాయన.

"ఖాండవ వన దహన ఘట్టంలో ఇంద్రుణ్ణే ఎదిరించగల సత్తా ఇచ్చాడు. ఆ ఘట్టంలోనేగా అన్నా! గాండీవం నాకు లభించింది.

"ఎక్కడెక్కడి రాజులనో జయించేటట్లు చేసాడు. మయుడు వచ్చి సభను నిర్మించిపెట్టేటట్లు చూశాడు. మనచేత రాజసూయం జరిపించాడు. అలా అర్ధ రాజ్యం పంచుకు వెళ్లిన మనం అంతలోనే చక్రవర్తుల మయ్యామంటే అదంతా అతని చలువేగా అన్నా!

"ఆ వైభవం చూసిన దుర్యోధనుడికి కన్ను కుట్టింది. మనని పిలిచారు. జూద మాడించారు. ద్రౌపదిని అవమాన పరచటానికై తీవ్రయత్నం చేశారు. మనం ఏమీ చేయలేని స్థితిలో ఉన్నామని గ్రహించిన ఆమె గొంతెత్తి కృష్ణుణ్ణి పిలిచింది. అంతే! అక్కడ నుండి ఆయన వస్త్రాలను అందించాడు. వస్త్రాపహరణం జరగకుండా చూశాడు. ప్రయత్నించి, ప్రయత్నించి, కౌరవులు అలసిపోయారు. ఆ ఘట్టంలో వాళ్ళు పూర్తిగా ముద్దాయిలై నిలచిపోయారు. అంతే! కృష్ణుడు వాళ్ళసంగతి ఏమిటో చూపి, ద్రౌపదికి చిత్తశాంతి అందించాడు.

"సరే! అజ్ఞాతవాసం అయిపోయింది. ఆయన, కరుణతో ఆ పైన మన కొరకు రాయబారి అయినాడు. ఆ రాయబారం ఫలించదని తెలిసికూడా తన కర్తవ్యాన్ని నిర్మలంగా నిర్వర్తించాడు. ఒకవేళ యుద్ధమే వస్తే ఆ యుద్ధంలో ఏం జరగబోయేదీ ముందుగానే కురు సభలో ప్రకటించి వచ్చాడు.

" ఇక యుద్ధరంగంలో - ధర్మపక్షాన నిలబడిన మన కొరకు ఆయన రథ సారథి అయ్యాడు. రథాన్నితోలాడు. గుఱ్ఱాలను సేవించాడు. ధర్మరక్షణకోసం ఏదిచేయటానికైనా నేను సిద్ధమే - అన్నట్లు నిలిచాడు. సారథిగా రథం మీద

కూర్చున్నట్లు కనిపించాడేకాని నిజానికి ఆయన ఏం చేశాడో తెలుసా అన్నా! తన చూపులతో శత్రువుల ప్రాణాలను ముందుగానే హరించాడు. ఆ ప్రాణాలు హరింపబడిన శరీరాలు పడిపోవటానికి మాత్రం నా బాణాలు పనికివచ్చాయి. అన్నా! ఇది నిజం.

"ఇంకో చిత్రం చెప్పనా? శత్రుపక్షంలో వీరులూ ఎక్కువే. సేనాబలగాలూ ఎక్కువే. వాళ్ళందరూ ఒక్కుమ్మడిగా నా మీద కొచ్చినా నన్నేమి చేయలేక పోతుండేవాళ్ళు. నాకు ప్రహ్లాదుని కథ అనుభవానికి కొచ్చిందన్నా! తండ్రి ప్రహ్లాదుడి మీదకు ఎన్నింటినో పంపించాడు హతమార్చాలని. కాని అవి హతమార్చలేక పోయాయి కదా! సరిగ్గా అలాగే వాళ్ళందరూ చేస్తున్న ప్రయత్నాలకు చెక్కుచెదరకుండా లీలగా, హేలగా, కాచుకున్నాడు నా స్వామి.

"ఇంకో విచిత్రాను భూతి. సైంధవుణ్ణి వధించే ఘట్టంలోనిదా అనుభూతి. అటు సూర్యుణ్ణి కనబడకుండా చేయడం, ఇటు సైంధవుడి తల క్రింద పడకుండా చూడడం. ఓహో! ఏమి ఆ స్వామి వైభవం!

"అన్నా! ఇవన్నీ మనకాయన సాధించి పెట్టిన జయాలు. మన పైన ప్రేమతో మనకనుగ్రహించిన వైభవాలు. ఇవన్నీ ఒక ఎత్తు. ఆయన మన ఎడల చూపిన స్నేహభావం ఒక ఎత్తు. ఒకప్పుడు 'మిత్రుడా ఇలా రమ్మ'నేవాడు. మరొకప్పుడు బావమరిదీ బాగున్నావా? అనేవాడు. ఇంకొకప్పుడు కావలసిన ధనాలన్నీ తానుగా నాపై గుమ్మరించేవాడు. ఒకోవేళలో మంత్రిగా రూపొంది, మంత్రాంగం చెప్పేవాడు. మరొక వేళలో గురువుగా రూపొంది బుద్ధి చెప్పేవాడు. వేరొక వేళలో తాను రథంలో కూర్చొని నన్ను రథం నడపమనేవాడు. ఇలా ఎన్నని చెప్పను? నాతో కలసి ఆడేవాడు, పాడేవాడు. నన్నాట పట్టించేవాడు. తాను కూర్చున్న మంచం మీదే నన్నూ కూర్చో పెట్టుకునేవాడు. అలా దగ్గరగా తీసుకునే వాడు. నేనేదన్నా తెలియక తప్పుచేస్తే కన్నతండ్రి లాగ కాపాడేవాడు. ఫలాహారాలు చేసేటప్పుడు అలా ప్రేమగా నా కన్నులలోనికి చూస్తూ, నాచేతులలోనిది తీసుకుని తినేవాడు. నాకు పెట్టేవాడు. అన్నా! మాధవుణ్ణి నేను మరువలేను. మాధవుని నేను మరువలేనన్నా!

"విజయా! ధనంజయా! నరా! ఫల్గుణా!" అంటూ తడవకో పేరుతో పిలుస్తూ ఉండేవాడు నన్ను. అదో ముచ్చట ఆయనకి. భార్యలలో ఎవరైనా ఆయనపైన అలిగినప్పుడు ఆ అలకలు తీర్చటానికి నన్ను పంపుతూ ఉండేవాడు. అంతేగాదు. పారవశ్యంలో ఆయా కాంతలు తనతో ఏకాంతంలో ఉన్నప్పుడు

ముచ్చటలుగా పలికిన పలుకులన్నీ నాతో చెబుతూ ఉండేవాడు. ఆయన ఇచ్చిన ఆ చనువు, చూపిన ఆ ఆత్మీయత మరువలేనివి. మరింకెక్కడా దొరకనివి." - అంటూ అర్జునుడు గతకాలపు స్మృతులతో అదోలా ఉండిపోయాడు కాసేపు.

ఈ సందర్భంలో అర్జునుడు ప్రధానంగా ప్రస్తావించినవి రెండు అంశాలు. గురుశిష్య సంబంధ మనేది ఎలా ఉండాలన్నది వ్యాస భగవానుడు ఈ ఘట్టం ద్వారా మనకు ఉపదేశిస్తున్నాడు. శిష్యుడు తన జీవితాన్ని గురువు యొక్క వైభవంగా దర్శించ గలగాలి. గురువు శిష్యుణ్ణి తన ప్రతి రూపంగా దర్శించి అక్కున చేర్చుకొన గలగాలి.

## శక్తి ప్రసారం

అర్జునుడు మొదట తన జీవిత సన్నివేశాలను ఆ జగద్గురువు యొక్క దివ్య వైభవంగా, అనుగ్రహ విశేషంగా నోరార కీర్తించాడు. గురుదేవుని యొక్క అనుగ్రహమే శిష్యుని జీవిత రూపమున వ్యక్తమవు తున్నది - అన్న దివ్య సత్యాన్ని మరొక్కసారి నొక్కి చెప్పాడతను. ఆ పైన ఆ గురుదేవుడు తనకు ఎలాంటి సన్నిహితత్వాన్ని అందించాడో గుర్తుచేసుకున్నాడు. "తన శయ్యపై కూర్చోపెట్టుకునేవాడు. నా చేతులలోనిది తాను తీసుకుని తినేవాడు. తన ఏకాంత శృంగార విలాసాలన్నింటినీ నాకు ముచ్చటలుగా చెప్పేవాడు" - అంటూ మురిసి పోవడంలో అర్జునుడు కృష్ణుడు చూపిన ఆత్మీయతకు ఆశ్చర్యానందాలను వ్యక్తం చేశాడు. తానే నేను, నేనే తాను అన్నట్లుగా కృష్ణుడు ప్రవర్తించాడు అని చెప్పడం కోసమే ఈ సన్నివేశాలను ఆయన ఇక్కడ స్మరించుకున్నాడు.

ఇదీ ఆదర్శ ప్రాయమైన గురు శిష్య అనుబంధం. ఇది ఆధ్యాత్మిక సాధనకు పరాకాష్ఠ. శిష్యుడు తన జీవితాన్ని తనదిగా గాక, గురుదేవుని యొక్క లీలావిలాసంగా భావించాలంటే ఎంతటి సాధన జరగాలి! గురువు శిష్యుణ్ణి తన అభిమానిగానో, అనుయాయిగానో గాక తనకు ప్రతిరూపంగా దర్శించి, అతనితో అద్వైత స్థితిని అనుభవించాలి అంటే, నిజంగా ఆ గురువు దేవుడై ఉండాలి. దైవము గురువుగా దిగివచ్చినట్లైతేనే ఇది సాధ్యం.

కాలకాలాల్లో అప్పుడప్పుడు లోకం యొక్క ఆవశ్యకత మేరకు ఇలాంటి గురుశిష్యులు దిగి వస్తుంటారు. ఆధునిక కాలంలో రామకృష్ణుడు, మహాత్ముడు, అరవిందుడు, మాస్టర్ సి.వి.వి., మాస్టర్ ఇ.కె. వంటి మహానుభావులు తమను

నిజంగా సమీపించిన శిష్యులతో ఇలాంటి దివ్యానుబంధాన్ని వ్యక్తం చేశారు. చేస్తున్నారు. భాగవత మార్గాన పయనించ దలచినవారు ఇలాంటి సార్థకమైన గురుశిష్య సంబంధాన్ని అనుభవించాలనీ, అనుభవించగలరనీ వ్యాస భగవానుడు ఈ సన్నివేశరూపంలో ప్రకటిస్తున్నాడు.

అటుపైన అర్జునుడిలా అంటున్నాడు. "అన్నా! ఆ తరువాత జరిగిన సన్నివేశానికి అర్థం ఎలా చెప్పుకోవాలి అన్నది నీవుకూడ ఆలోచించు. శ్రీకృష్ణుని అంతఃపురస్త్రీలను భద్రంగా ద్వారక నుండి ఇవతలికి చేర్చే ప్రయత్నంలో ఉన్నాను. అప్పటికి వారి కింకా శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచిపెట్టినట్లుగా తెలియదు. దారుణమైన ఆ వార్తను తెలిసిన వాడను నేనొక్కడినే. ముందు వారి నొక చోటకు చేర్చి, అపైన చెబుదామనే ఉద్దేశ్యంతో ఉన్నాను. అడవి దారిన సాగుతున్నాం. నా మనస్సునకు అటువైపు కృష్ణుడు, ఇటువైపు కర్తవ్యం. ఇంతలో ఎక్కడి నుండో వచ్చి పడ్డారు దారి దొంగలు. వాళ్ళు వస్తువులనే కాదు, వ్యక్తులనే దోచుకుపోతున్నారు. దారుణం. నేను వాళ్ళకి ఎదురు నిలిచాను. ఎదిరించాలని చూచాను. నా అస్త్రాలు, శస్త్రాలు ఇవేమీ పనిచేయలేదు. ఇదేమిటె ఇలా జరుగుతోందన్న ఆశ్చర్యం. ఇప్పుడా ఇలా జరగడం అన్న ఆవేదన. ఏం చేయాలో తోచలేదు. నిశ్చేష్టత ఆవరించబోయింది. ఇక లాభం లేదని బలమంతా కూడదీసుకుని వాళ్ళతో కలియబడ్డాను. చిత్రం. శరీరానికి కూడా ఇదివరకటి సత్తువ ఉన్నట్లు కనబడలేదు. అయినా సరే పెనుగులాడాను. అతికష్టం మీద ఆ అంతఃపుర స్త్రీలలో అక్కడికి దగ్గరలో ఉన్న కొద్ది మందిని మాత్రం రక్షించ గలిగాను. అలా జరిగి నందుకు, అలా నిలబడాల్సి వచ్చి నందుకు ఒక ప్రక్క సిగ్గు వేసింది. అదే సమయంలో మరో ప్రక్క నుంచి ఆయనతో పాటే ఈ శక్తి యుక్తులన్నీ నిష్క్రమించాయన్న సత్యం కూడా బోధపడింది." - అంటూ అర్జునుడు ఏదో లోకాలలోనికి చూస్తూ అలా ఉండి పోయాడు.

అతడు చెప్పింది ఎంత నిజం! ఈ నిజాన్ని ఎంతగా గ్రహిస్తే మన జీవితాలు అంతగా బాగుపడతాయి. సాధారణంగా మానవుడు చిత్రంగా మాట్లాడుతూ ఉంటాడు. తనకేదయినా పని చెప్పినప్పుడు, 'అలాగే నండీ! యథాశక్తి చేస్తాను' అంటాడు. యథాశక్తి అంటే తనకు సొంతంగా ఏదో శక్తి ఉన్నట్లు ఫీల్ అవుతున్నాడు, ఫ్లాస్క్‌లో కాఫీ పోసి ఉన్నట్లుగా. సత్యమేమిటంటే - శక్తియుక్తులు మనని బట్టికాక, మనం చేస్తున్న పనిని బట్టే వ్యక్తం అవుతాయి. ఆ పనికి ఏ మేరకు అవసరమో, ఆ మేరకు వ్యక్తమౌతూనే ఉంటాయి.

కనుక శక్తి యుక్తులు మనని బట్టికాదు, పనిని బట్టి అని మనకు తెలియాలి. మనకు శక్తియుక్తులున్నట్లు భావించుకోవడం భ్రమించడమే అవుతుంది. లోకాని కావశ్యకమైన పనిని చేపట్టినప్పుడు, దైవం మన ద్వారా కావలసిన శక్తియుక్తులను వ్యక్తం చేస్తాడు. మళ్లీ-అపని అయిపోగానే ఆ శక్తి యుక్తులు అక్కడి నుండి నిష్క్రమిస్తాయి. కనుక అవి మన ద్వారా వ్యక్తమవుతున్నప్పుడు ఆ లీలా విశేషాన్ని తెలుసుకుని మనం వాటిని ఆరాధించాలి. మనవి అనుకొని భ్రమపడిపోకూడదు. భ్రమ పడడమంటే ఇక పడటమే. మన నుండి వ్యక్తమవుతున్న శక్తి యుక్తులను ఆరాధించడం చేతనైనకొద్దీ జగద్ధితమైన కార్య క్రమాలకు మనం ఎంతవరకు అవసరమో అంతవరకు మనని వినియోగిస్తాడు. ఆ కార్య క్రమాలు ఒక దారికి వస్తాయి. అక్కడ ఇక మన కర్తవ్యం అయిపోతుంది. అప్పుడు ఇక అక్కడ ఆ శక్తి యుక్తులు ప్రసారం కావడం మానేస్తాయి.

ఇదీ అర్జునుడు అనుభవించిన స్థితి. ఇదే ఈ భూమిమీద ఎవరికైనా అనుభవానికి రావలసింది. అధునిక కాలంలో ఇలాంటి స్థితిని అనుభవించిన మహానుభావుడు గాంధీ మహాత్ముడు. ఆయన నుండి జరుగవలసిన కార్యక్రమం పూర్తికాగానే ఆయన కూడా ఇలా అర్జునుడిలా నిలబడి పోయాడనిపిస్తుంది. ఇక అప్పుడు దేవుడు చెప్పాడు గాడ్సే రూపంలో నీవు వచ్చేయమని. 'గాడ్ - సే' దేవుడు చెప్పెను. చూశారా! పేరు కూడ ఎలా కలిసి వచ్చిందో!

లోక హితార్థమైన కార్యక్రమాలకు మనం చిత్తశుద్ధితో దగ్గరవుతున్నకొద్దీ మన నుండి ప్రసారం అవుతున్న శక్తి పెరగడం ప్రారంభిస్తుంది. మనమా కార్యక్రమాలకు ఎంతగా అంకిత మౌతామో, అంతగా అది మన నుండి వ్యక్తమవుతుంది. ఆ కార్యక్రమాల అవసరం గాని, కార్యక్రమాల్లో మన అవసరం గాని అయిపోగానే ఇక శక్తి ప్రసారం ఆగిపోతుంది. రాత్రిపూట ఏ గదిలో పని అయిపోతే ఆ గదిల్లో లైటు మనం తీసేస్తున్నాం కదా! అదీ అంతే! దానికి మనం ఇన్సల్ట్ ఫీలవ వలసిన పనిలేదు. ఒకవేళ ఇన్సల్ట్ ఫీలయితే, అది ఒక అహంకారమే అవుతుంది. ఇంత కాలం నుండి, తన నుండి వ్యక్త మవుతున్న శక్తి యుక్తులన్నీ తనవి అనుకున్న వాడే ఇన్సల్ట్ ఫీలవుతాడు. అలాగాక, "ఆ శక్తియుక్తులు ఈ విశ్వంగా వ్యక్తమవుతున్న అంతర్యామివి" - అని గ్రహించినప్పుడు మానవులు అర్జునుని వలె అవగాహనకు వస్తారు. అని వ్యాసభగవానుడు భాగవత మార్గంలోని మరొక్క సూత్రాన్ని ఉపదేశిస్తున్నాడు. అటుపైన అర్జునుడు ఆ అవగాహనతో క్రమంగా ప్రశాంత చిత్తుడయ్యాడు. లోకం లోనికి తాను దిగివచ్చిన కార్యక్రమం ఇక పూర్తయిందని గ్రహించాడు.

అతని మనస్సు అంతర్ముఖమవుతోంది. అతని ప్రజ్ఞ ఊర్ధ్వముఖం పడుతోంది. ఈ స్థితిని గమనించాడు ధర్మరాజు. అర్జునుడికి కావలసిన విశ్రాంతి నిచ్చాడు. తన కింకా పూర్తి చేయవలసిన పని కొంచెం ఉన్నట్లు గమనించాడు. అది పూర్తి చేద్దామని కృష్ణుని స్మరణలో ఆ కర్తవ్యం వైపుకు దృష్టిని సారించాడు.

## కాంతిరేఖ

ఉత్తరాభిమన్యుల కుమారుడు పరీక్షిత్తు. అనిరుద్ధుని కుమారుడు వజ్రుడు. ఈ ఇద్దరినీ తన చెంతకు చేర్చుకున్నాడు ధర్మరాజు. కురు సామ్రాజ్యాన్ని పరీక్షిత్తునకు, యాదవ సామ్రాజ్యాన్ని వజ్రునికి అప్పగించాడు. పట్టాభిషేక కార్యక్రమాలు నిర్వహింపజేశాడు.

పరీక్షిత్తువైపు ఒకసారి చూశాడు ధర్మరాజు. "శ్రీ కృష్ణుడు శరీరాన్ని విడచిపెట్టాడు. ఇటు మనకూ సమయం దగ్గర కొచ్చింది. శరీరాలను విడిచి పెట్టడానికి సిద్ధమౌతున్నాం. అటు కలి ప్రవేశం జరిగిన సూచనలు స్పష్టంగా కనబడుతున్నాయి. ఇట్లాంటి పరిస్థితులలో ఈ కుర్రవాడు చక్రవర్తి అవుతు న్నాడు. బాధ్యత ఇతనిమీద పడుతున్నది." ధర్మరాజు అలా పరీక్షిత్తువైపు చూస్తూనే ఉన్నాడు.

ఈ పరీక్షిత్తును కేవలం కుర్రవాణ్ణిగా తీసివేయటానికి వీలులేదు. అపాండ వము అయిపోవాలని అశ్వత్థామ అస్త్రప్రయోగము చేసిన నాడు శ్రీ కృష్ణుని అనుగ్రహవశాన బ్రతికి బయటపడ్డవాడితను. ప్రయోగింపబడిన ఆ అస్త్రం ఉత్తర గర్భంలోనికి చొచ్చుకుపోయి రూపుకట్టుకుంటున్న శిశువును భరించలేనంతగా ఆరడి పెట్టినవేళ ఆ గర్భసంక్షోభానికి తట్టుకోలేక ఉత్తర కృష్ణుణ్ణే తలచు కుంటూ ఆక్రోశించింది. ఆయన చల్లగా చూశాడు. ఆ గర్భంలోనే శిశువుకు ప్రసన్నమై అతనిని రక్షించి సేద తీర్చాడు. ఆ గర్భసంక్షోభాన్ని ఉపశమింపజే శాడు. ఆపైన కొన్నాళ్ళకు ఉత్తర ప్రసవించింది. మగబిడ్డను కన్నది. పుట్టిన క్షణం నుండి ఆ బిడ్డ ఎవరికొరకో వెతుకుతున్నట్లనిపించింది. సమీపించిన ప్రతి ఒక్కరిని అతడు పరీక్షించి చూస్తున్నాడు. గర్భంలో తానుండగా, తనను దరిజేరి భరించలేని ఆ తాపం నుండి తన దివ్యతేజస్సుతో రక్షించి నిలబెట్టిన దివ్యపురుషుడు ఇందులో ఉన్నాడా? ఈ చేరవచ్చిన వారిలో ఎక్కడున్నాడు? అని పరీక్షగా చూస్తున్నాడతడు. ఇది గమనించిన పెద్దలు అతనికి "పరీక్షిత్తు"

అని పేరు పెట్టారు. ఈ విధంగా దేహ నిర్మాణ సమయంలోనే దేవదేవుని దర్శనాన్ని, స్పర్శనూ, కరుణనూ, దివ్యలీలా విలాసాన్నీ కొల్లగా అనుభవించిన చిన్నవాడితడు. శ్రీ కృష్ణుని కరుణచేత కురువంశానికి మిగిలిన అంకుర మితను.

"పాండవులమైన మాకు పెరిగి పెద్దై పెళ్ళి చేసుకునే వేళలో శ్రీ కృష్ణుని దర్శనం లభించింది. అప్పటినుండి ఆయనతో మాకు లభించిన సాంగత్యంతోనే మా జీవితాలు పరవశించి, పునీతమైపోయినాయి. అలాంటిది ఈ బిడ్డకు తల్లి గర్భంలో ఉన్నప్పటినుండే శ్రీ కృష్ణుని సాన్నిధ్యం అనుభవానికి వచ్చింది. చూడగా, ఆ శ్రీ కృష్ణుని కళ ఒకటి ఇతడిని ఆవరించి ఉన్నట్లుగా కనిపిస్తోంది. ఆవరించడమంటే ఆ వరించడమే. శ్రీ కృష్ణుడు ఈ భూమికి తగిన చక్రవర్తిగా ఈ బిడ్డను వరించాడు. కనుక ఇతడు ఈ భూమిని రక్షించగలడు. విష్ణువు యొక్క అంశ తననుండి వ్యక్తమవబట్టే కదా, ఏ రాజైనా ఈ పృథివిని ఏల గలుగుతూ ఉన్నది! ఆ అంశ వ్యక్తమైనంత వరకే, వ్యక్తమయ్యేందుకు వీలుగా వర్తించినంతవరకే లేదా వ్యక్తమయ్యేందుకు ఆ విష్ణుత్వం అంగీకరించినంత వరకే కదా ఎవరైనా రాజుగా నిలబడగలిగేది! అలాంటిది ఆ విష్ణువే ఇతడు తగినవాడని ఇతనినుండి ఇకపైన వ్యక్తం కావాలని సంకల్పించినట్లుగా స్పష్టమౌతున్నవేళ భవిష్యత్తును గురించి నేనింక బెంగపడవలసిన అవసరం లేదు. వ్యక్తిగా ఏ కృష్ణుడు చేయి కలిపి మమ్ము నడిపించినాడో, ఆ కృష్ణుడే వెలుగై ఇతడిని నడిపించగలడు. నిజమునకతడు వెలుగు యొక్క వ్యక్త రూపమే కదా! అట్టి వెలుగుల మూర్తి సాన్నిధ్యము ఇతడి సర్వస్వమై వెలుగొందుగాక!" అనుకుంటూ తన చూపులతో ఆశీస్సులను గుమ్మరిస్తున్నాడు ధర్మరాజు.

ఆ చరమదశలో, ఆ సాయం సంధ్యలో బెంబేలు కొలిపే వార్తలు వినవస్తున్న ఆ దారుణవేళలో పరీక్షిత్తును చూస్తుంటే, అతని కేమిటో తృప్తిగా ఉంది. ఈ పరిస్థితులన్నింటిలో అతనికి కాస్త ఉపశమనం కలుగుతున్నది, ఆ పరీక్షిత్తును చూస్తున్నప్పుడే.

శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచి పెట్టాడన్న వార్తను విని, నిశ్చేష్టుడై నిలిచిన ధర్మరాజుకి పరీక్షిత్తును చూస్తుంటే ఏమిటో కొంత ఊరట కలుగుతోంది. అతని కదలికలలో కృష్ణుడు కనిపిస్తున్నట్లవుతున్నది. ఆ కనుపాపలలో నుండి ఆ కృష్ణుడు తొంగి చూస్తున్నట్లుగా ఉంది. అలా మరి కాసేపు అతణ్ణే చూడాలనిపిస్తున్నది. "తేజస్వియైన ఆ శ్రీకృష్ణుడు, సర్వాంతర్యామియైన ఆ వాసుదేవుడు రాబోయే కాలం కోసం, ఆ కాలానికి సమాధానం చెప్పటం కోసం ఈ ఉపాధిని

ఎంచుకున్నట్లున్నది." అన్న అనుభూతిని చెందుతూ తృప్తిగా నిట్టూర్చాడు ధర్మరాజు. అలాగే చూస్తూ ఉండిపోయాడు అతడివైపు మరికొంత సేపు. అతడి దర్శనం మళ్ళీ కొనసాగుతోంది. 'ధర్మ సంస్థాపనార్థం ఏ దివ్యశక్తులు మానుండి ఇప్పటివరకు వ్యక్తమైనాయో ఆ దివ్యశక్తులన్నీ ఇప్పుడీ పరీక్షిత్తులో నికి ప్రవేశించినట్లుగా గోచరిస్తున్నది, ధర్మ రక్షణార్థమై ఇంతవరకు మా కప్పగించబడిన బాధ్యత ఇప్పటినుండి ఈ పరీక్షిత్తున కప్పగించబడినట్లున్నది. పాండవుల ప్రతాపమంతా ఇప్పుడితని ఉత్సాహరూపమై గోచరిస్తూ ఉన్నది. ఇంత వరకు నడచిన కథలోని కురువంశ ప్రముఖుల దివ్యములైన గుణగణాలన్నీ కలబోసి కొన్నట్లున్నాడితను.'

జీవితకాలం ధర్మపోరాటానికే సరిపోయింది మాకు. ధర్మం కోసం పోరా డాము. ధర్మం జయించింది. ధర్మమే జయిస్తుంది అన్న తృప్తి మాత్రమే మిగిలింది మాకు. ఇక మామూలు అంశాలకు వస్తే - ధర్మ పోరాటంలో మేము గెలిచేటప్పటికే మా వయస్సులు మళ్ళిపోయాయి. కడుపార కన్న సంతతి ఉన్నారు కదా! అని తృప్తి పడదాం అంటే దైవయోగం చేత ఒక్క రాత్రిలో వారందరూ మాకు కాకుండా పోయారు. ఇంత జరిగినా కష్టానికి, సుఖానికి అన్నీ తానై నిలిచినవాడు శ్రీకృష్ణుడు కదా! ఆయనే మనకు సర్వస్వం అనుకుంటున్న వేళలో ఆయన కాస్తా తనువు విడిచిపెట్టాడు. తను వులు విడిచి పెట్టవలసిన సమయం మనకు కూడా ఆసన్నమౌతోంది. ఇప్పుడు కర్తవ్యమేమిటి? పైగా ఇది కలి ప్రవేశించిన వేళ. ఆ ప్రవేశిస్తున్న వార్తలు విన టానికే దుస్సహంగా ఉన్నాయి. ఏమిటో అంతా అంధకార బంధురంగా ఉంది. అవునూ! శ్రీకృష్ణుడనే సూర్యుడు అస్తమించిన తరువాత ఇక అంధకారం కాక ఏముంటుంది? ఏమి మిగులుతుంది? అనుకుంటూ అతలాకుతల మౌతున్న వేళలో కారుచీకటిలో కాంతిరేఖవలె కనులముందు నిలిచనవాడు ఈ పరీక్షిత్తు. ఇప్పటి ఈ పరీక్షా సమయానికి జవాబు చెప్పగలిగిన సమర్థుడు ఈ పరీక్షిత్తే.

"ఈ సృష్టి విచిత్రమైనది. ఎప్పటికప్పుడు అయిపోయినట్లే ఉంటుంది. కాని అయిపోదు. ఎప్పటికప్పుడు సాగటానికింకేమున్నది అనిపిస్తుంది కాని సాగు తూనే ఉంటుంది. ఎప్పటికప్పుడు ఇక బండి నడువదు కష్టం - అనిపిస్తుంది. కాని నడుస్తూనే ఉంటుంది. అలా అనిపిస్తూ, అనిపించేటట్లు చేస్తూ, అంతలోనే సేదతీరుస్తూ, మళ్ళీ నడిపిస్తూ, ఈ సృష్టి కథను కొనసాగిం చటం జగన్నాటక సూత్రధారి ఈ నాటక నిర్వహణలో రూపొందించుకున్న ఒక

ప్రధాన సూత్రమేమో!" - అనుకుంటూ ధర్మజుడు అర్ధ నిమీలిత నేత్రాలతో అలా ఉండిపోయాడు మరి కాసేపు. భాగవత జనులకు సృష్టి కథలోని ఈ దివ్యసూత్రం ఒంటపట్టు గాక!

## చైత్రయాత్ర

పరీక్షిత్తును చూసి తృప్తిపడిన ధర్మరాజు ఇక తాను దేహంతో ఉండవలసిన పని పూర్తయినదని గమనించి, ఉత్తరదిశగా మహాప్రస్థానాన్ని ప్రారంభించాడు. అన్నదమ్ములతనిని అనుసరించారు. ద్రౌపది కూడా వారి మార్గాన్నే అనుసరించింది. కుంతీదేవి అంతకు మునుపే దేహాన్ని విడిచి వుచ్చింది.

ఇలా పెద్దలందరూ ఒక్కసారిగా నిష్క్రమించిన వేళ యువకుడైన పరీక్షిత్తు చక్రవర్తిగా తిరుగులేని పరిపాలనను చేయసాగాడు. సలహాలను చెప్పగలిగిన మంత్రులను ధర్మజుడే అతనికి సమకూర్చి వెళ్ళాడు. ఆపైన అతడు కృపాచార్యుని శిక్షణలో అస్త్రశస్త్ర విద్యల్లో ఆరితేరాడు. మరుత్తుని కుమార్తెయైన ఐరావతిని వివాహమాడాడు. జనమేజయుడు మొదలైన బిడ్డల్ని కన్నాడు. శ్రద్ధతో యజ్ఞయాగాదులను ఆచరించి, ఆ యజ్ఞభాగాలను స్వీకరించడానికై దిగివచ్చిన దేవతలను కనులార చూశాడు. ఇలా అన్నివిధాలా అవని పాలనకు తగిన అర్హతను పొందాడు.

కిరీటం లభించింది కదా అని అతడు గర్వించలేదు. తృప్తిపడలేదు. ఆ అధికారానికి మురిసిపోలేదు. దానినొక అవకాశంగా కూడా తీసుకోలేదు. పదవి అనేది ఒక బాధ్యత. ఆ బాధ్యతకు తగిన అర్హతను పొందడానికి గాను పదవిలో ఉన్నవాడు నిరంతరం శ్రమించాలి. ఎచ్చుపోకూడదు. రెచ్చిపోకూడదు. పదవిని నిర్వహించడమెలా? అన్నది నేర్చుకోవాలి. ఈ నేర్చుకోవటానికి అంతులేదు. అంతమూ లేదు.

ఆధునిక యుగంలో ఏదో ఒక పదవో, ఉద్యోగమో లభించగానే పదిమందిలో నిలబడేటందుకు తమకొక ఆసరా దొరికిందికదా అని, ఇక తామే సర్వజ్ఞుల మన్నట్లుగా భావించేవారు ఎందరో కనబడుతున్నారు. దానినొక అవకాశంగా తీసుకుని ప్రజలను దండుకోవడమో, దండనకు గురిచేయడమో, దండగమారి పనులు చేయటమో, దండలు వేయించుకుంటూ ఊరేగడమో చేస్తూ కాలక్షేపం చేసేస్తున్నారు. ఇలా సమాజం మీదపడి బ్రతుకుతున్నవారే

ఎక్కువమంది. మరి సమాజం కొరకు శ్రమపడేవారు ఎంతమంది? ఆ శ్రమ పడటానికిగాను ఒక అవకాశంగా తమ పదవులను, ఉద్యోగాలను స్వీకరించగల వారెంతమంది?

ఇంతలో తన రాజ్యంలోని పర్వత, అరణ్య భూములలో కలి ప్రవేశం జరిగిందన్న వార్త పరీక్షిత్తుకు చేరింది. ఒకసారి రాజ్యం మొత్తాన్ని కలియజూచి రావాలని పరీక్షిత్తుకనిపించింది ఎవరెవరు ఎక్కడెక్కడ ఎలా ఉన్నారో కనులార చూచినపుడు కర్తవ్యం ఇంకా స్పష్టమౌతుంది కదా! అని అతడిక జైత్రయాత్రకు బయలుదేరాడు. ఎక్కడికక్కడ సామంతు లందించిన కానుకలు స్వీకరిస్తూ, ముందుకు సాగుతున్నాడు. అలా సాగుతూ ఉండగా ప్రజలలోనుండి కావలసిన విషయాలెన్నో అతని చెవులలో పడసాగాయి. పాండవుల గురించీ, శ్రీకృష్ణుని గురించీ, శ్రీకృష్ణపాండవీయం గురించీ, కథలు కథలుగా వారినుండి విని పరీక్షిత్తు పులకించి పోయాడు. పాండవుల ప్రతాపం, శ్రీకృష్ణుని పరిపూర్ణ అవతార తత్త్వం అతనికి వెళుతున్న కొద్దీ మరింతగా బోధపడసాగాయి. ఇంకా కొన్నిచోట్ల అంతకుముందటి కథలు కూడా త్రవ్వి పోస్తున్నారు. ఆ త్రవ్వి పోస్తున్న గాథలనుండి ఈ దేశమంటే ఏమిటో, ఈ సంప్రదాయమంటే ఏమిటో, ఎలాంటి మహనీయులు ఈ దేశంలో ఉద్భవించారో, ఎలాంటి చక్రవర్తులు ఈ భూమిని పరిపాలించారో, ఈ దేశ చరిత్ర ఎన్ని మలుపులు తిరిగిందో, తిరిగి తిరిగి తనదాకా వచ్చిందో అతనికి కళ్ళకు కట్టసాగింది. అతడు పులకించి పోయాడు. అలాంటి దేశం యొక్క ప్రస్తుత పరిస్థితులు ప్రజల స్థితిగతులూ ఇప్పుడెలా ఉన్నాయన్నది ఆకళించుకుంటూ, తన కర్తవ్యమేమిటన్నది నిర్ధారించుకుంటూ ముందుకు సాగుతున్నాడతను.

ఈ సందర్భంలో గోఖలే గాంధీ మహాత్మునికి చెప్పిన మాటలు గుర్తుకొస్తాయి. దక్షిణాఫ్రికా నుండి భారతదేశం వచ్చిన తర్వాత కాంగ్రెస్ ఉద్యమంతో శృతికలిపి, ఇప్పుడు నా కర్తవ్యమేమిటన్నాడు గాంధీజీ. "ఒక్కసారి దేశమంతా తిరిగి కనులార చూసిరా! కర్తవ్యం నీకే బోధపడుతుంది. దేశానికి ఏమి కావలసి ఉందో దేశమే చెబుతుంది నీకు." - అన్నాడు గోఖలే. ఆయన చెప్పినట్లుగానే గాంధీజీ దేశమంతా పర్యటించి పరిస్థితులు ఆకళించుకొని ఆపైన ఉద్యమానికి తగినరూపం ఇచ్చారు. నేటి నాయకులలో ఎక్కువమంది సభలూ, సమావేశాలకు హాజరవుతున్నారు తప్ప సావధానంగా దేశ పరిస్థితులను పరిశీలించలేక పోతున్నారు. తమ దగ్గరకు వచ్చిన వారి పనులేవో చూసిపెట్టే ప్రయత్నం చేస్తున్నారు తప్ప నిజానికి తాము చేయవలసిన పనేమిటి అన్నది

గ్రహించుకోలేక పోతున్నారు. దేశాన్ని పట్టి ఉంచుకుందామనుకుంటున్నారు తప్ప పట్టించుకుందామని వారికి అనిపించటం లేదు.

కాగా - దేశయాత్రలో దేశానికి సంబంధించిన కథలనూ, గాథలనూ వింటూ పులకిస్తూ ముందుకు సాగాడు పరీక్షిత్తని చెప్పుకున్నాం. జీవితాన్ని సద్వినియోగం చేసుకుందాం అనుకుంటూ జీవనయాత్ర ప్రారంభించే ప్రతి యువకుడూ గమనించవలసిన అంశమిది. ముందు తన తల్లిదండ్రులూ, వారి తల్లిదండ్రులూ, తమ వంశంలోని పెద్దలూ తనకు తెలియాలి. వారిని గూర్చి, వారి జీవిత సన్నివేశాల గూర్చి, ఒక సమగ్రమైన అవగాహన ఆ యువకుని కేర్పడాలి. పరీక్షిత్తు సాగుతుండగా పాండవులను గూర్చి, కృష్ణుని గూర్చి కథలు కథలుగా విన్నాడు అని చెప్పటంలోని పరమార్థమిదే. ఆపైన మనదేశం, మన జాతి, మన సంప్రదాయం అనాదిగా ఈ జాతిలో దిగివచ్చిన మహనీయుల, మహావీరుల జీవిత సన్నివేశాలు యువకుల్లకి బోధపడాలి. జాతీయత కలిగి ఉండ టమంటే అర్థమిదే. ఈ జాతి ఇంతవరకు ఎలా బ్రతికింది? ఎలాంటి బ్రతుకు బ్రతికింది? ఇంతవరకు ఏమి సాధించింది? సాధించవలసిందింకా ఏమున్నది? - అన్న అంశాలు యువకుడికి తెలియాలి. జాతీయభావం కలిగి ఉండాలి - అన్న వాక్యానికి అర్థమిదే. తనకు పూర్వపు మహనీయుల గురించీ, మహా వీరుల గురించీ వింటూ పరీక్షిత్తు ముందుకు సాగాడు అని చెప్పడంలోని అంతరార్థమిదే. "నేను మనిషిగా జీవిస్తాను. దైవానుగ్రహాన్ని సాధించుకొని, నా జాతికి ప్రస్తుతం ఏది అవసరమై ఉన్నదో అది చేస్తాను" - అని పిడికిలి బిగించి నిలబడిన యువకులకు సంకేతమే పరీక్షిత్తు. అలా నిలబడిన యువకు నికి ఆదర్శమే పరీక్షిత్తు. తనను గూర్చి, తన దేశాన్ని గూర్చి, తన జాతిని గూర్చి సమగ్రమైన అవగాహన కలిగిన సమర్థులైన యువకులిప్పుడు కావాలి. ఏదో పొట్ట పోసుకోవడానికి ఏ డిగ్రీనో, డిప్లొమోనో చదువుకుంటూ, ఆపైన నిరు ద్యోగ పర్వంలో ప్రవేశించి, నీరసపడుతూ, నిరాశ చెందుతూ, తమ కాళ్ళపై తాము నిలబడలేక నిర్వీర్యులై నిట్టూర్పులు విడుస్తూ సోలిపోయే యువతరం కాదు ఇప్పుడు కావలసింది, వెన్నెముక కలిగిన యువతరం కావాలి. దేశానికే వెన్ను తట్టగలిగిన యువతరం కావాలి. ఈ పెద్దలు మాకే మిచ్చారు? అనే యువతథం కాదు. ఆ పెద్దల కన్నా మేము ఇంకా బాగా బ్రతకగలం, ఆ పెద్దలు సంతోషపడేలా బ్రతకగలం, ఆ పెద్దలు సాధించలేకపోయింది కూడా మేం సాధించగలం, వారిని మురిపించగలం, జాతిని మురిపించగలం, ప్రపంచ జాతులను వడిపించగలం - అని ఢంకా మీద దెబ్బ కొట్టి చెప్పగల యువతరం

ఇప్పుడు కావాలి. అందుకు యువత మొదట పరీక్షిత్తులా శిక్షణ పొందాలి. ఒడలు వంచి శిక్షణ పొందాలి. ఆపైన తమను గురించి, తమ జాతిని గురించి, ఈ ప్రపంచ పరిణామాలను గురించి, చక్కటి అవగాహన పొందాలి. తాము పొందిన శిక్షణకు ఈ అవగాహనను జోడించి, పరీక్షిత్తు యొక్క జైత్రయాత్ర వలె తమ జీవన యాత్రను నిర్వహించ గలగాలి. భారతమాతకు పరీక్షిత్తు మళ్ళీ గుర్తుకు రావాలి. "ఇందరు పరీక్షిత్తులున్నారు. ఇంక నాకేం కావాలి!" అని ఆ తల్లి మురిసిపోవాలి.

## అర్చన దృష్టి నుండి...

ఈ భూమిపైన ఇంతవరకు జరిగిన గాథలన్నింటినీ చెవులారా వింటూ, మనసారా కంటూ, ప్రస్తుత పరిస్థితులను బట్టి తన కర్తవ్యం ఏమిటన్నది స్పష్టం చేసుకుంటూ, జైత్రయాత్రలో ముందుకు సాగుతున్న పరీక్షిత్తుకు ఎదురుగా ఒక దృశ్యం గోచరించింది. ఒక అంబోతు, దానికెదురుగా ఒక ఆవు. ఆ అంబోతుకు మూడు కాళ్ళు విరిగి పోగా ఒకే ఒక కాలిపైన అది నిలబడలేక నిలబడుతున్నట్లున్నది. కారణమేమంటే ఆ మిగిలిన కాలు కూడ సరిగాలేదు. కుంటికాలైపోయింది. ఇక ఆవు సంగతికి వస్తే - అది లేగడి ఆవులా ఉంది. బాలింతరాలు, దాని దూడమాత్రం లేదు. దాని కనులనిండా కన్నీళ్ళు నిండి ఉన్నాయి. దాని ముఖం వాలిపోతున్నది. దాని దేహము సోలిపోతున్నది. ఆ దృశ్యం పరీక్షిత్తుకు బాధ కలిగించింది. అతను వాటిని సమీపించే ప్రయత్నంలో ఉన్నాడు.

దేశంలోని పాడికి ఆవు, పంటకు అంబోతు చిహ్నాలు. అవి రెండూ ఎలా ఉన్నాయి, ఎలా ఉంటున్నాయి - అన్నదాన్ని బట్టి ఆ దేశంలోని పాడిపంటల పరిస్థితి ఇట్టే చెప్పవచ్చు. పాడి పంటలపైన ప్రజలకు ఎలాంటి శ్రద్ధ ఉన్నదో కూడా ఇట్టే చెప్పవచ్చు. ఆ పాడి పంటలను పెంపొందించడమనేది ఒక ఆరాధనగా భావిస్తున్నారా? లేదా కేవలం ఒక ఆర్జనా మార్గంగా పరిగణిస్తున్నారా? అన్నది కూడా ఇట్టే చెప్పవచ్చు.

పంటను భూమాత ఇచ్చే ప్రసాదంగానూ తీసుకోవచ్చు లేదా ఆమెను కేవలం మట్టిగా భావించి అయినకాడికి పంటను పిండుకునే ప్రయత్నమూ చేయవచ్చు. పండించటమనే ప్రక్రియ ఒకటే. కాని దృష్టులలోనే తేడా ఉన్నది.

అయితే దృష్టిని బట్టి లభించే అనుభూతి ఉంటుంది. అభ్యుదయమూ దాని మీదే ఆధారపడుతుంది. తల్లిదండ్రులను దైవాలుగా భావించి, పరమార్థ దృష్టితో సేవించే వారుంటారు. కేవలం ఆ తల్లిదండ్రులిచ్చే అస్తిపాస్తుల కోసం, వారిని సేవించే రూపంలో కాకా పట్టేవారూ ఉంటారు. ఇద్దరూ సేవిస్తున్నట్లే కనిపిస్తుంది పైకి. కాని దృష్టిలో ఎంత తేడా ఉంది!

కలియుగం వచ్చేటప్పటికి పాడిపంటల విషయంలో కూడా ఇలాంటి తేడాయే వస్తున్నట్లు గమనించాడు పరీక్షిత్తు. అర్చన దృష్టినుండి, అర్జన దృష్టికి జారి మళ్ళుతున్నట్లుగా అతనికి గోచరించింది. స్వధర్మ నిర్వహణ మనేది సమాజ రూపంలో ఉన్న దైవాన్ని ఆరాధించే అర్చన మార్గంగా భావించే స్థితినుండి, స్వధర్మ నిర్వహణ మనేది సమాజాన్ని కొల్లగొట్టుకునే ఒక అర్జన మార్గంగా స్వీకరించే స్థితికి మానవుడు దిగజారిపోవడం కలి లక్షణం.

అంతవరకూ ఎందుకు? ఒక యాభై ఏళ్ళ క్రితం పాడిపంటలను మనం చూసిన తీరువేరు. ఇవాళ మనం చూస్తున్న తీరువేరు. కలి ప్రభావం నానాటికి ఎలా ముదిరిపోతోందో గమనించారా? కనుక అంటోతు యొక్క దైన్యస్థితి సమాజంలో పంటల యెడల ఏర్పడిన దృష్టి వైపరీత్యాన్ని సూచిస్తోంది. ఎక్కువ పంటలు పండించడం తప్పని కాదు దీని అర్థం. పండించవచ్చు. లబ్ధి పొందవచ్చు. అలా మనం లబ్ధి పొందటం ఆ పుడమి తల్లికి కూడా ఎంతో ఇష్టమే. అయితే మన చూపు చెడిపోకూడదు. మాతగా గాక కేవలం మట్టిగా చూసే స్థితికి మనం పడిపోకూడదు. అలాగే ఆ పండించటంలో మనకు సహకరించే ఎద్దులు మొదలైన వాటిని కేవలం పనిముట్లుగా మనం భావించకూడదు. మన పెద్దలు ఏం చెప్పారో తెలుసునా! ఖనిజాలు, వృక్షాలు, జంతువులు మానవుడి యొక్క సోదర వర్గంలోని వారు అన్నారు. ఆ సోదర భావంతోనే మానవులు వాటి యెడల మెలగాలి అన్నారు. ఆ సోదర భావంతోనే అవన్నీ మానవుడికి దినచర్యలో ఉపయోగపడుతున్నాయని అతడు గ్రహించాలి అని నొక్కి చెప్పారు. పనిచేయడమనేది ఒకరినుండి ఒకరు ప్రేమను పొందడానికే. ఆ ప్రేమను పంచుకోవడానికే. ఈ సూక్ష్మాన్ని మానవుడు నిరంతరం గమనికలో ఉంచుకోవాలి. ఈ దృష్టితో చూచినప్పుడు మనముపయోగించే పలుగులు, పారలు, నాగళ్ళు, ఆ నాగళ్ళకు కట్టిన ఎద్దులు, వాటన్నింటి సహకారంతో మనం పండించే పైరులు - అన్నీ మనకు సోదరులే. అలాంటి సోదరత్వాన్ని నిండుగా అనుభవించే మహత్తర అవకాశమే రైతుగా జీవించటం. కనుకనే ఈ భావమెరిగి జీవించే రైతు ముఖాన మనకు గోచరించే దివ్యకళ ఇంకెక్కడా గోచరించదు.

మన పెద్దలు ఇంకో మాట కూడా చెప్పారు. లోహముల నుండి జంతువుల వరకు అంతా మానవుని సోదర వర్గమే. కనుక ప్రకృతి ఒక చిత్రమైన ఏర్పాటు చేసింది. ఆ వర్గానికి అన్నయైన మానవుడు ఆ వర్గము యొక్క పరిణామానికి దోహదం చేసే అవకాశాన్ని కలిగి ఉన్నాడు. మానవుడు ఏదో ఒక రూపంలో లోహాలని స్పృశిస్తున్నాడు. వృక్షాలను, జంతువులను దగ్గరకు తీసుకుంటున్నాడు. అతడి స్పర్శలో క్రమంగా వాటికి మరింత మేలుకొలుపు లభిస్తుంది. పరిణామ క్రమంలో అవి ముందడుగువేసే అవకాశం లభిస్తుంది. క్రమంగా అవి కూడ అలా అలా ఎదిగి వచ్చి, పరిణామ దశలను దాటుకుంటూ వచ్చి మానవ రూపాన్ని పొందుతాయి.

ఇలా పరస్పరం ప్రయోజనం పొందే అవకాశం ఒకటి ప్రకృతిమాత సంకల్పించింది. మానవుడికి జీవనయాత్రలో మిగిలిన సోదరవర్గం సహకరిస్తుంది. ఆ సోదర వర్గ పరిణామానికి మానవుడు దోహదం చేసిన వాడవుతాడు. మనకు తెలిసినా, తెలియకపోయినా మన మీదుగా నడుస్తున్న కథ ఇది. కనుక సృష్టిలోని ప్రతి అంశాన్ని సోదర భావంతో చూసి ప్రేమించ గలగడం మనకు చేతకావాలి. మిగిలిన సృష్టినుండి అలాంటి ప్రేమను పొందగలగడం కూడా మనకు చేతకావాలి.

కృషి కర్మలో మనకు పనికివచ్చే పశుసంపదను కూడా మనమలాంటి దృష్టితో సాకగలగాలి. పని చేయించుకుని వదిలేయడం, పని చేయించుకునేందుకు మాత్రమే పెంచడం, పని చేయించుకునే దృష్టితో మాత్రమే పెంచడం - ఇవి కలి లక్షణాలు. అప్పుడా ఎద్దులకు కాళ్ళు విరిగిపోక ఏమౌతుంది? పని చేయించుకున్నంత కాలం చేయించుకుని, ఆపైన ఆ ముసలి ఎద్దులను కసాయి వాళ్ళకు అమ్మేసే ఘనులెంతమంది లేరు మనలో? మరి మనకు వృద్ధాప్యం వచ్చినప్పుడు? చేసుకోలేని స్థితి మనకు వచ్చినప్పుడు? ఇంతకాలం మనం మన పిల్లలకు చేసాం కాబట్టి ఇప్పుడు మనని వాళ్ళు అపురూపంగా చూసుకోవాలి అనిపిస్తోందా, లేదా? మరి అదేమాట ఆ ఎద్దులకూ అనిపిస్తే మనమిచ్చే జవాబు ఏమిటి? ఒక రెండు వందలు ఎక్కువ వస్తుందని దొడ్లో ఎడ్లను ఇట్టే అమ్మేస్తున్నాం మనం. పాపం అవిమాత్రం మనమీద ప్రేమను పోగొట్టుకోలేక కొన్నవాడికి కన్నుగప్పి మళ్ళీ మన దొడ్లోకే వచ్చి పడుకుంటాయి. కలి ప్రభావం మనమీద ఎంతగా పడుతోందో? ప్రేమాభిమానాల కన్న, మమతానురాగాల కన్న ధనానికి పెద్ద పీట వేయటం జరుగుతోంది. అంటే ఇక ఈ మానవ జన్మకు అర్థమేమిటి?

ఇక అక్కడ నిలబడిన గోవు బాలింతరాలు. కాని దూడలేదు. అంటే ఏం జరిగింది? దూడ త్రాగే పాలు కూడా మనకే మిగలాలన్న భావంతో మానవులా దూడల్ని బ్రతకనివ్వటం లేదు. ఆవులకూ, గేదెలకూ గడ్డి దూడలను చూపించి, వాటిని మభ్యపెట్టి పాలు పిండుకోవటం మనకు తెలుసు. పాలు పిండుకునేటప్పుడు మాత్రమే వాటికింత తౌడు వేయటం మనకు తెలుసు. అవి ఇచ్చే పాలకోసమే వాటిని మేపుకోవడం మనకు తెలుసు. మరి ఇంక అవి ఏడవక ఏం చేస్తాయి?

పాలన్నీ కేంద్రాలకు పోసేసి, హోటళ్ళలోన కుళ్ళు కాఫీలు త్రాగడం మనకు తెలుసు. కేంద్రానికి పది లీటర్లు పోస్తూ ప్రక్కవాడికి పాలచుక్క కూడా విదల్చక పోవడం మనకు తెలుసు. పల్లెటూళ్లలో పాలు, పెరుగు, వెన్న, నెయ్యి కంటికి కనిపించకుండా చేసేయడం మనకు తెలుసు. పాడి పంటలను పైకి తోలి నోట్ల కట్టలను చూసుకు మురియడం మనకు తెలుసు. పిల్లలకు చనుబాలిస్తే అందచందాలు ఎక్కడ హరించి పోతాయోనని పసిపిల్లల నోటిలో పాల పీకలను నొక్కి, పశువుల విషయంలో మాత్రం ఆ పాలు కూడా మనకే మిగలాలని వాటి దూడల పీకలు నొక్కేయడం మనకు తెలుసు. మరి ఆ పశువులు దుఃఖించక ఏం చేస్తాయి?

పాడి పంటల యెడల మన దృష్టి ఇలా వక్రించిననాడు పల్లెసీమలలో ఇక శాంతి సౌఖ్యాలకు చోటెక్కడ? అందుకే అవి రణరంగాలవుతున్నాయి. కుల విద్వేషాలతో, మత విద్వేషాలతో, ముఠా తగాదాలతో క్షోభించి పోతున్నాయి. ఇప్పుడు పల్లెసీమలలో ఉన్నవి అందచందాలు కావు. అరిషడ్వర్గాలు.

ఇదిగో ఇలాంటి స్థితిగతులు ఇక రాబోతున్నాయనే అక్కడ చేరి మాట్లాడుకుంటున్నాయి ఆ అంబోతు, ఆ గోమాత. పరీక్షిత్తుకు వాటి బాధ బోధపడుతోంది. అతడికి తెలుసు - శ్రీకృష్ణుడు ఈ భూమిమీదనుండి తన పాదం తీశాడో లేదో, పొంచి వున్న కలి ఇక ప్రవేశించాడని, కలిని నిగ్రహించవలసిన కర్తవ్యం తనపైన ఉన్నదని. అందుకే అతడు ముందుకు సాగుతున్నాడు. ఆ అంబోతును, ఆ గోమాతను సమీపిస్తున్నాడు.

# విధానం లేని దానం

గో వృషభాలను సమీపిస్తున్న పరీక్షిత్తుకు మరో దర్శనం కలిగింది. అవి కేవలం ఆవు, ఆంబోతులు మాత్రమే కావు. భూదేవి ఆ ఆవుగా రూపు కట్టుకుంది. ధర్మదేవత అలా ఆంబోతుగా నిలబడి ఉంది. పరీక్షిత్తుకు మనస్సు నొచ్చుకుంది. "ఎటువంటి దృశ్యాన్ని చూడవలసి వచ్చింది? సహించటం కష్టంగా ఉంది. భూమాత కన్నీరు కారుస్తోందా? ధర్మదేవత నిలబడలేని స్థితికి వచ్చాడా? ఎంతటి విపత్తు ఇది." - అనుకుంటూ ఆర్ద్రమైన హృదయంతో వారిని సమీపిస్తున్నాడు పరీక్షిత్తు.

శ్రీకృష్ణుడు దేహంతో ఉన్నంతకాలం పులకించి పోయింది భూమాత. వైకుంఠాన్ని మించిన స్థితిని అనుభవించింది. ఆనాడు దుష్టులు లేరని కాదు. భూమికి బరువెత్తించే పనులు వారు చేయలేదని కాదు. వాళ్ళు అలా చేస్తున్నారనే కదా, ఆమె తానుగా వెళ్ళి దిగిరమ్మని నారాయణుడిని వేడుకున్నది. ఆమె మొర విన్నాడు. ఆయన దిగి వచ్చాడు. పరిపూర్ణ అవతారమూర్తియై దిగి వచ్చాడు. ఆమెకిక ఒడలు తెలియలేదు. దుష్టులెంత మంది ఉన్నా ఆమెకిక వ్యథ కలుగులేదు. ఆయన ఉన్నాడు. ఆయన దిగి వచ్చాడు. నాపైన ఉన్నాడు. నాతోడ ఉన్నాడు. ఇంతకంటె కావలసిన దేమున్నదని ఆమె మురిసిపోయింది.

మనం కూడా మన జీవితాలలో చూస్తూనే ఉంటాం. కష్టాలు ఎంతగా ముంచుకు వస్తున్నా, బరువు బాధ్యతలెంతగా పెరుగుతున్నా సరసుడూ, సమర్థుడూ, ఆత్మీయుడూ, మనవాడూ అయిన వాడొకడు మనతో ఉన్నప్పుడు కష్టాలు మన మనస్సును తాకవు కదా! బరువు బాధ్యతలు మనను క్రుంగదీ యలేవు కదా! అదే స్థితిని అనుభవించింది గోమాత.

ఆయన దిగి వచ్చిన మరుక్షణం నుండి ఆ అనుభూతిలో తేలి ఆడింది తప్ప, ఆమెకు బరువు సంగతులు గుర్తులేవు. అన్నింటికీ ఆయన ఉన్నాడు కదా! ఇంక ఆవిడ కవన్నీ ఎందుకు గుర్తుకు వస్తాయి? అతని స్పర్శ తనను సోకుతున్నప్పుడల్లా పులకించి పోయిందామె. ఆ స్పర్శకు అలవాటు పడిపోయింది. నిత్య నూతనమైన ఆ స్పర్శ ఆమెకు కాలాన్ని తెలియనీయలేదు. కథలెన్నో నడిచాయి. దుష్టులెందరో తెగిపడ్డారు. తరాలెన్నో మారిపోయాయి. భూభార నిర్వాపణ అయిపోయింది. ఎలా దిగివచ్చాడో అలాగే లీలగా తప్పుకున్నాడాయిన రంగం మీద నుండి.

భూదేవి తెల్లబోయింది. ఆమె ముఖం పాలిపోయింది. ఆమె ఒడలు వడలిపోయింది. అంతకాలం అనుభవిస్తూ వచ్చిన ఆ స్పర్శకోసం ఆమె తపించి పోతోంది. మళ్లీ ఆమెకు తన బరువు తెలుస్తోంది. తన బాధ్యత తెలియ వస్తోంది. ఒక ప్రక్క యెడబాటు, మరొక ప్రక్క బరువు బాధ్యతలు. తనవని యజమాని లేని ఇల్లైంది. పైగా కలియుగ మొకటి ప్రారంభమైంది. దుష్టులు నిష్క్రమించారు సరే! మరి ఈ ప్రవేశిస్తున్న కలికి జవాబు చెప్పటమెలా? వాడు ఈ యుగం నాది అంటాడే. నా ప్రభావం పడి తీరాలంటాడే. అసలే స్వామి స్పర్శకు దూరమై విలవిల లాడుతున్న తాను వీడి ప్రభావానికి తట్టుకోగలదా? ఆమెకు దుఃఖం ముంచుకొచ్చేస్తోంది. కళ్ళనిండా కన్నీళ్లు. కన్నీళ్లు కారుతున్నాయా? లేక కళ్లే నీళ్లుగా కారిపోతున్నాయా? - అన్నట్లున్నది ఆమె స్థితి.

అలా కన్నీరు కారుస్తూ నిలబడిన ఆమెకు ఒకే కాలుతో కుంటుతూ సాగలేక సాగుతున్న బసవన్న రూపుడైన ధర్మదేవత గోచరించాడు. ఆమెకు కడుపు తరుక్కుపోయింది. కడుపులో చేయిపెట్టి దేవినట్లైంది. దానితో ఆమె తన స్థితిని మరచిపోయి ఆ ధర్మదేవుని దీన స్థితిని చూచి ఆక్రోశించసాగింది.

నాలుగు పాదాలతో నడవవలసిన ధర్మదేవతకు పట్టవలసిన స్థితేనా ఇది? సత్యం, శుచిత్వం, దయ దానం - అనేవి నాలుగూ ధర్మదేవుని నాలుగు పాదాలు. ఒక్కొక్క యుగంతో బాటు ఒక్కొక్క పాదం విరిగిపోతూ రాగా కలియుగం వచ్చేటప్పటికి నాలుగవ పాదమైన దానం మాత్రం మిగులుతుంది. అది కూడా కుంటిగా.

మిగిలిన ఒక్క కాలు కూడా కుంటి కాలై పోవడం ఎంత దారుణం! అందుకే భూదేవి దీనమైన ఆ స్థితిని చూడలేక పోతోంది. కలి ప్రభావం ముదురుతూ ఉన్నకొద్దీ ఈ కాలు యొక్క కుంటిదనం కూడా పెరుగుతూ ఉంటుంది. అంటే ఆ మిగిలిన దానం కూడా విధానంగా జరుగదు.

అర్థించి వచ్చిన వారి అవశ్యకతను గమనించి ప్రేమతో వారి హితాన్ని కోరి చేసేది దానమవుతుంది. సమాజంలోని అవశ్యకతలను గమనించి, త్యాగ బుద్ధితో ఆ అవశ్యకతలు నెరవేరేందుకు గాను చిత్తశుద్ధితో సమర్పణ చేసేది దానమవుతుంది. కాని కలి ప్రభావం ముదురుతున్న కొద్దీ ఈ సన్నివేశాలు అరుదవుతాయి.

ఇవాళ మన దేశంలో దానాలు రెండు రకాలుగా జరుగుతున్నాయి. విదే

శస్థులు చేస్తున్న దానాలు ఒక రకం. విదేశస్థులు చేస్తున్న దానాలలో ఎక్కువ శాతం మతం మార్పిడి కోసం జరుగుతున్నాయి. మన దేశస్థులకి విద్య, వైద్య రంగాలలో ఎనలేని సేవ చేస్తున్న విదేశీ బృందాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. ఈనాడు ఆ దానాల నుండి వారు కోరుతున్నదేమిటి? భారత దేశం బాగుపడాలనా? భారతీయులు అభివృద్ధి చెందాలనా? ఏ మాత్రం కాదు. భారతీయులు తమ మతస్థులు కావాలని. అందుకుగాను ఆ భారతీయుల అవసరాలను గమనించి, వాటిని తీర్చటం ద్వారా మతం మార్చడమనేది సాధిస్తున్నారు. చూశారా! కలి ప్రభావం! "భారతీయులూ మనలాంటి మనుష్యులే. వాళ్ళకు మన సహకార మవసరం. కొంచెం సహకార మందిస్తే, వాళ్ళూ మనలాగ నిలబడి పోతారు కదా!" - అన్న ప్రేమతో, విశాల హృదయంతో ఆ దానాలు జరిగితే ఎంత బాగుంటుంది! వాళ్ళ అవసరాలను మన దానాల ద్వారా తీర్చి, మన మతస్థులుగా వాళ్ళని మార్చేద్దామనుకునేటప్పటికి మరి ఆ దానం మైలపడి పోవటంలేదా? ఆ మతస్థులలో సేవా స్వరూపులుగా పేరు పొందిన వారు కూడా సేవకు, మతానికి మీరెందుకు ముడిపెడుతున్నారని అడిగినప్పుడు ఏమంటున్నారో తెలుసునా? మా మతంలోనికి చేరనప్పుడు మేమెందుకు సేవ చేయాలి? అంటున్నారు. మా గమ్యమదే కదా! అంటున్నారు. ఇక ఆ సేవా స్వరూపుల సేవ యొక్క స్వరూప మేమిటో మీరే గమనించండి.

మీకో చిత్రం చెబుతాను. 1977 లో దివిసీమలో ఉప్పెన వచ్చింది. కొన్నివేల మంది ప్రాణాలు కోల్పోయారు. పశునష్టానికి, ఆస్తి పాస్తుల నష్టానికి ఇక అంతులేదు. పోగా మిగిలిన జనం శవాల మధ్యలో నిలబడి ఆక్రందన చేస్తున్నారు. అంతలో ఒక బృందం వచ్చింది. ఆ శవాల గుట్టల మధ్యలో నుండి ఇంకా పోకుండా మిగిలిన వాళ్ళ దగ్గరకు. అది కాలవ గట్టు. కాలవ పరిస్థితి బీభత్సంగా ఉంది. ఆ బృందంలోని వారంటారు గదా! ఆ ఆక్రందిస్తున్న వాళ్ళతో "ఈ కాలువ లోనికి రండి. మేం చెప్పినట్లు చేయండి. మా మతస్థులై తరించండి. తలొక వందా స్వీకరించండి." బాగుంది కదూ పరిస్థితి. ధర్మదేవుని కుంటి కాలు స్థితి ఇది.

ఇక మన వాళ్ళ దానాల సంగతి. దేశంలోని స్థితి గతులతో వీళ్ళలో ఎక్కువమందికి నిమిత్తం లేదు. ఆ దానాన్ని అర్థించే వాళ్ల పాత్రతతోనూ వీళ్ళకంతగా నిమిత్తం లేదు. వీళ్ళకు కావలసిందల్లా పేరు, ప్రతిష్ఠ, పొగడ్త. వాటికోసం వీళ్ళు కోట్లు గుమ్మరిస్తున్నారు. ఇచ్చిన ప్రతి వస్తువు మీదా తమ

పేరు ఉండాలని ఉబలాటపడుతూ ఉంటారు. చివరకు ఒక నాపరాయి ఇచ్చినా 'దానిపైన నాపేరు రాయి' - అంటారు. ఆ పేరు కొంచెం పెద్దదయితే ప్రక్కవాడి నాపరాయి మీదకు కూడా వెళ్ళిపోతూ ఉంటుంది.

ఒకాయన ఒక గుడికి ఫ్యాన్ దానం చేశాడు. ఫ్యాన్ మాత్రం వేయవద్దన్నాడు. వేస్తే రెక్కల మీద ఉన్న అతనిపేరు కనపడకుండా పోతుందని అతని బాధ.

ఒకాయన ఒక దేవుని విగ్రహం ఇచ్చాడు. ఆ విగ్రహం క్రింద తన పేరు వ్రాయించాడు. తెలియని వారు కొందరు ఆపేరు చదివి, అది అతడి విగ్రహమే అనుకున్నారు.

ఇంకొకాయన ఎక్కడో కడుతున్న దేవాలయానికి కొంత దానం చేశాడు. ఆ గుడి ఎక్కడో తెలియదు. ఎలా ఉంటుందో తెలియదు. సంవత్సరానికి ఒకసారి పోస్టులో ప్రసాదం మాత్రం వస్తుంది.

ఒకసారి ఒక గుడికి వెళ్ళాను. గుడి గోడల నిండా దాతల పేర్లే. నాకనిపించింది - ఆ పేర్ల బదులు కనీసం వాళ్ళ కిష్టమైన శ్లోకాలు ఏ భగవద్గీతలోనివో వ్రాయించుకుంటే బాగుంటుంది కదా అని. కాని వాళ్ళకు ప్రాణం ఒప్పినట్లు లేదు.

విదేశస్థులకు మతం పిచ్చి. మనకు పేరు పిచ్చి. మన పూర్వులు ఎంతెంత దేవాలయాలు కట్టారు. ఎన్నెన్ని నిర్మాణాలు చేశారు! కాని ఎక్కడైనా వాళ్ళ పేర్లు ఇలా కనబడుతున్నాయా? మరిప్పుడు పేర్లు తప్ప ఇంకేమీ కనబడని స్థితి వస్తున్నది. పేర్ల కొరకు గుడిని మరింత పెంచి కట్టవలసి వస్తున్నది.

ఒక చిత్రం చెబుతాను. ఒకచోట ఇళ్ళు తగలబడి పోతున్నాయి. ఆర్పేటందుకు పాపం కొందరు ప్రయత్నిస్తున్నారు. తలొకరూ, తలొక బిందె అందిస్తున్నారు వాళ్ళకు. ఆ బిందెలతో నీళ్ళు తెచ్చిపోస్తున్నారు వాళ్ళు. ఇంతలో ఒకాయన అన్నాడు కదా! నీళ్ళు పోసేటప్పుడు ఆ బిందెను కొంచెం త్రిప్పి పట్టుకో. అప్పుడు దానిపైన ఉన్న నాపేరు కనబడేటందుకు వీలు కలుగుతుంది అని. పాపం అప్పటికి గాని వాడి ఆత్మ శాంతించదు. బాగుంది కదూ పరిస్థితి. ఇదీ ధర్మదేవుని కుంటికాలి స్థితి.

మనకు దేశం పట్టదు. దేశ ప్రజలు పట్టరు. వారి అవసరాలు పట్టవు. ఇప్పుడున్న ఈ పరిస్థితుల్లో ఈ ధనాన్ని ఎలా సద్వినియోగం చేస్తే బాగుంటుందన్న ఆలోచన రాదు. ఈ దానాల్లో శ్రద్ధలేదు. చిత్తశుద్ధి లేదు.

లక్ష్యసిద్ధి లేదు. కేవలం పేరు ప్రతిష్టలు, పొగడ్తలూ, సన్మానాలు. ఇవి చాలు మనకు. ఒకప్రక్క దేశం అట్టుడికి పోతుంటే కోట్లాది ప్రజలు అటు విద్యకూ, వైద్యానికి నోచుకోలేని స్థితిలో ఆర్తనాదాలు చేస్తూ ఉంటే - అటువైపు మన కనులు చూడలేక పోతున్నాయి.

మన మేమయినా తక్కువ ఖర్చు పెడుతున్నామా? తక్కువ దానాలు చేస్తున్నామా? మరి మన దేశస్థులు తమ కనీస అవసరాల కోసం విదేశీయులను ఆశ్రయించ వలసిన స్థితి ఎందుకు వస్తోంది? పేరు ప్రతిష్ఠల వ్యామోహంలో పడ్డాము మనం. ప్రజల కష్ట సుఖాలకు సహకరించే సాకుతో విదేశస్థులు మన వారిని మనకు కాకుండా చేస్తున్నారు.

ఈ విధంగా అటు వాళ్ళూ, ఇటు మనమూ కూడా దానాన్ని మైల పరుస్తున్నాం. దానానికి విధానాన్ని లేకుండా చేస్తున్నాం. మనం ఆశించిన స్వార్థ ప్రయోజనాల కోసం దానమనే ప్రక్రియను వాడుకుంటున్నాం. ధర్మదేవతయొక్క కాలును చితక కొడుతున్నాం. మనిషిని మనిషిగా చూడలేక పోతున్నాం. తోటి మనిషిగా ప్రేమ చూపలేక పోతున్నాం. చూశారా? కలి ప్రభావం వల్ల మానవుల మనస్సులు ఎలా మలినమై పోతున్నాయో! అందుకే ఇలాంటి స్థితి రానున్నదనే, వస్తున్నదనే భూమాత ధర్మదేవతను చూసి ఆక్రోశిస్తున్నది. "ఓ ధర్మదేవతా! ఇక నీ నడక సాగేదెలా? మళ్ళీ ఎప్పటికైనా నీవు నాలుగు పాదాలతో నడవటం జరుగుతుందా?" - అని ఆమె ఆర్ద్రంగా చూస్తూ ఉండగా పరీక్షిత్తు వారిని సమీపిస్తున్నాడు.

## ఓదార్పు

సరస్వతీ నది ఒడ్డున దైన్యంతో నిండి నిలచిన గో, వృషభాలను సమీపిస్తున్నాడు పరీక్షిత్తు. ఇంతలో ఆ గో రూపధారియైన భూమి, ఆ వృషభ రూపధారియైన ధర్మదేవత ఒకరితో ఒకరు సంభాషించుకుంటూ ఉన్నట్లుగా అతడికనిపించింది. అలా కనిపించింది. ఇంకా కొంచెం ముందుకు సాగాడు. ఆ సాగుతున్న సంభాషణ అతనికి వినిపించసాగింది. ఆర్ద్రమైన మనస్సుతో పరీక్షిత్తు ఆ సంభాషణను చెవులు పెద్దవి చేసుకుని ఆలకించసాగాడు.

ఆవుగా నిలబడి ఆక్రందిస్తున్న భూమాతను చూచి, ఆంబోతై, మూడు కాళ్ళు విరిగిపోయి కుంటిదై పోయిన ఒంటికాలితో నిలబడేందుకు ప్రయత్నం

చేస్తున్న ధర్మదేవత ఇలా అంటున్నాడు. అతడంటున్న ఒక్కొక్క వాక్యాన్ని చెబుతూ వివరిస్తాను.

"తల్లీ! ఈ కన్నీరేమిటి? నీ శరీరం అనారోగ్యమయమై చిక్కిపోయిన దేమిటి? ముఖం అలా అంతగా వాడి పోయిందేమిటి? నీవారి కెవరికైనా తీవ్రమైన పరిస్థితు లేర్పడ్డాయా? లేదా, నా యీ దుస్థితిని చూసి నీవు దుఃఖిస్తున్నావా?"

"ఓ భూమాతా! నీ పరిస్థితి నాకు బోధ పడుతోంది. నీ ఆర్తి నాకవగత మవుతోంది. ఇకపై భూమిపైన యజ్ఞయాగాదులు తగ్గిపోతాయి. యజ్ఞ భాగాలు లభించక దేవతలు దీనులవుతారు. ఏమి! అలా అవుతుందనే కదూ! నీ బాధ."

"కాలం గడుస్తున్న కొద్దీ భర్తలు భార్యలకు రక్షణ నివ్వడం తగ్గించేస్తారు. స్త్రీలు తమను తాము రక్షించుకోవలసిన పరిస్థితులు ఏర్పడతాయి. భార్యలకు రక్షణ నిచ్చే సత్తా భర్తలకుండదు. భర్తలకు పోషణ నిచ్చే తీరిక భార్యలకు మిగలదు. భార్యా భర్తల సంబంధాలు క్రమంగా నామ మాత్రమై పోతాయి. అంటే ఆ లక్షణాలు పోయి కేవలం భార్యా భర్త అనే పేర్లు మాత్రం మిగులుతాయి. ఆ భర్త భర్తా కాడు. ఆ భార్య భార్యా కాలేదు. ఇలా భార్యా భర్తల అనుబంధాలు కేవలం భార్యా భర్తలు అను బంధాలుగా అయిపోతాయి. అదేగా నీ బాధ. అలా జరుగుతుందనేనా?"

ధర్మదేవత నుండి వెలువడిన ఈ వాక్కు ఎంత సత్యమో ఇప్పటికే మనకు తెలిసి వస్తోంది కదా! తనకు భార్య కాబోతున్న స్త్రీకి అన్నివిధాలా రక్షణ నియ్యగలిగిన స్థితిలో ఉండవలసిన పురుషుడు ఆమె తనవెంట వీలై నంత కట్నం తీసుకు వస్తే బాగుండు ననుకుంటున్నాడు. చదువుకొని ఉద్యోగం. కూడా చేస్తే వేణ్ణీళ్ళకు చన్నీళ్ళుగా కలిసి వచ్చినట్లవుతుంది గదా! అనుకుంటు న్నాడు.

ఆ మధ్య ఒక పెళ్ళికొడుకు అన్నాడుట. నాది ప్రయివేట్ జాబ్ కదండి. సేఫ్టీ తక్కువ. కనుక గవర్నమెంట్ జాబ్ చేస్తున్న అమ్మాయి కోసం చూస్తున్నానండీ! అని. అంటే ఏమిటి? పురుషుడు స్త్రీ నుండి రక్షణ కోరుకుంటున్నాడు.

స్త్రీ పనిచేయడం తప్పని అర్థం కాదు. ఉద్యోగాలు, వ్యాపారాలు నిర్వహిం చడం దోషమని అర్థం కాదు. ఆమె అలా చేయకపోతే తనకు గడవదు అనే

స్థితిలో పురుషుడు ఉండటం దోషం. పురుషుడు స్త్రీ యొక్క అభిరుచులకు దోహదం చేయాలి. ఆమె చేయటానికి ఇష్టపడే పనుల విషయంలో ఆమెకు కావలసినంత స్వేచ్ఛ నియ్యాలి. ఆమెను ఆమెగా రూపు దిద్దుకోనివ్వాలి. అంతే గాని ఆమె సంపాదించి పొయ్యకపోతే ఇల్లు గడవదు అన్న దుస్థితిని అతడు సృష్టించకూడదు.

ఆమె తన సామర్థ్యాన్ని సద్వినియోగం చేయటం కోసం ఉద్యోగాలు చేయ వచ్చు. వ్యాపారాలు నిర్వహించవచ్చు. పదవులను అధిష్ఠించవచ్చు. అందుకు ఆమెకు అవకాశమిస్తే, దోహదం చేస్తే, అది ఆమెను ఆరాధించటం అవుతుంది. అలాకాక ఆమె సంపాదన మీద ఆధారపడదామని చూస్తే అది అవమానించడ మవుతుంది. పురుషులు కలి ప్రభావం చేత ఇలా దిగజారి పోతారు - అని గుర్తించిన ధర్మదేవత "తల్లీ భూమాతా! ఇలాంటి స్థితిలో భార్యా భర్తలను చూడాల్సి వస్తుందని బాధపడుతున్నావా?" - అని అడుగుతున్నాడు.

"తల్లిదండ్రులను పిల్లలు ఇకపైన పట్టించుకోరని బాధపడుతున్నావా! ఏమి? అందుకేనా నీ బాధ! ఓ భూమాతా!"

కలి ప్రభావం పెరిగిన కొద్దీ తల్లిదండ్రులను ఇంటి పెద్దలుగా, పూజ్యులుగా ఆరాధిస్తూ వారు చెప్పినట్లు నడచుకోవడమనే మంచి లక్షణం తగ్గిపోతుంది. ఈ లక్షణాన్ని ఇప్పటికే మనం గమనిస్తున్నాం. ఆపేక్షలకు విలువ తగ్గి, ఆస్తి పాస్తులకు విలువ పెరిగిన రోజులు వచ్చాయని మనకు తెలుసు. పిల్లలు చూస్తారో, చూడరోనని భాగాల పంపిణీలో తాము కూడా ఒక వాటా అట్టిపె ట్టుకుంటున్న తల్లిదండ్రుల సంగతి మనకు తెలుసు. అన్నదమ్ముల్లో తల్లినొకరు, తండ్రినొకరు పంచుకునే వారు కనబడుతున్నారు. అన్నదమ్ములెంత మందుంటే సంవత్సరాన్ని అన్ని భాగాలు చేసి, నెలల వారీగా, వంతుల వారీగా అతి కష్ట మ్మీద తల్లిదండ్రుల్ని చూస్తున్న అన్నదమ్ములు కూడా మనకు కనిపిస్తున్నారు. తాము భార్యా భర్తలము ఉద్యోగాలు చేసుకుంటున్నామని, తమ బిడ్డల్ని తల్లి దండ్రుల మీద పడవేసి పోయే నవదంపతులు కనబడుతున్నారు. వాళ్ళను పెంచింది చాలదట. ఇంకా వీళ్ళను కూడా పెంచాలట.

పిల్లల్ని పెంచి, పెద్దజేసి వయస్సు వచ్చిన కొద్దీ దేహాలకు పట్టుతప్పి, పిల్లలేమయినా కాస్త చూస్తారేమోనని ఆ తల్లిదండ్రులు ఆశపడుతుంటే, ఇంకా మా పిల్లల్ని కూడా పెంచండీ! అని వీళ్ళప్పగిస్తున్నారూ అంటే, దాని అర్థమేమిటి? అటు తమను కన్న తల్లిదండ్రులనూ, ఇటు తాము కంటున్న

బిడ్డలనూ చూసుకోవటానికి అవకాశమివ్వని ఆ సంపాదనలకు అర్థమేమిటి? ఆశల వెంటా, కాంక్షల వెంటా పరుగెత్తుతున్న మనస్సు బాధ్యతలను అసలు ఈషణ్మాత్రం కూడా పట్టించుకోవడం లేదేమిటి?

సంపాదించుకోవటం తప్పని అర్థం కాదు. బాధ్యతా నిర్వహణకూ, పాత్ర పోషణకూ స్వస్తి చెప్పిస్తున్న సంపాదనల వలన మనం సాధిస్తున్నదేమిటి? అన్నది ప్రశ్న. బిడ్డలై తల్లిదండ్రులను సంతోష పెట్టలేక పోతున్నాం. తల్లిదండ్రులమై బిడ్డలను మన చేతులతో పెంచుకోలేక పోతున్నాం. 'ఇలాంటి సన్నివేశాలను గురించి ఆలోచించే బాధ పడుతున్నావా? తల్లీ!' అని ప్రశ్నిస్తున్నాడు భూమాతను ధర్మదేవత.

'దుర్మార్గులైన వారు విద్యలను వక్రమార్గమున పొంది సమాజ శ్రేయస్సుకు కాక, తమ తమ ప్రయోజనాల కోసం వినియోగించుకుంటారనా! ఏమి తల్లీ! అందుకేనా బాధ పడుతున్నావ్?'

ధర్మదేవత అడిగిన ఈ వాక్యం ఎలా నిజమవుతున్నదో ఇప్పటి పరిస్థితులలో మనకు అనుభవానికి వస్తూనే ఉంది. పాత్రతను బట్టి విద్య నందించడమనే సూత్రాన్ని మనం మరచిపోయి చాలా కాలమయింది. విద్య విద్యగా గాక చదువుగా మారిపోతోంది. అంటే శీలాన్ని అందించలేని అక్షరాస్యతగా అది మిగిలిపోతోంది. తమ తమ దుష్ట సంకల్పాలకు రూపకల్పన చేసికొనేటందుకుగాను ఒక ఉపకరణంగా ఈ చదువు ప్రజలకు వినియోగపడుతోంది. క్రమంగా విద్యాలయాలే వ్యాపార కేంద్రాలయి పోతున్నాయి. వాటినుండి తయారైన విద్యావంతులు వ్యాపార సరళిలో ఎందుకు ప్రవర్తించరు? సమాజాన్ని సేవించవలసిన విద్యలతో ఇవాళ సమాజాన్ని నిలువుదోపిడీ చేసే ప్రయత్నం జరుగుతోంది అంటే ఆ ధర్మదేవత వాక్కు ఎలాంటిదో గ్రహించండి. ఇవాళ బడి చదువులు కేవలం రాబడి చదువులు.

'బ్రాహ్మణ ధర్మాన్ని అవలంభించవలసిన వారు రాజులకు సేవకులుగా మారి పోతారనేనా నీ బాధ. ఏమి భూమాతా! అంతేనా?'

బ్రాహ్మణ ధర్మం క్షత్రియ ధర్మానికి మార్గం చూపాలి. మార్గం చూపాలీ అంటే క్షత్రియుల నుండి ఏమీ ఆశించని స్థితిలో బ్రాహ్మణ ధర్మాన్ని అవలంబించేవారు ఉండాలి. ఆశించేవారు శాసించలేరు. బ్రాహ్మణ ధర్మాన్ని అవలంబించేవారు క్రమంగా పతనమై, శాసించే స్థితి నుండి ఆశించే స్థితికి దిగజారి పోతారు. మరి ఆశించకపోతే మేమెలా బ్రతుకుతాం? అని వారనవచ్చు.

తన బ్రతుకును గూర్చి తనకు గుర్తున్నవాడు బ్రాహ్మణుడు కాలేడు. తన బ్రతుకెట్లా సాగుతుందని ఆలోచన వచ్చినవాడు బ్రాహ్మణుడు కాలేడు. మన ధర్మాన్ని మనం నిర్వర్తిస్తే, మనకు కావలసింది మన దగ్గరకు నడిచి వస్తుంది అన్న విశ్వాసం ప్రగాఢంగా కలిగి, ధర్మాచరణకు అంకితమైన వాడే నిజమైన బ్రాహ్మణుడు. ఆ నిజమైన బ్రాహ్మణుడి కోసం దివిటీ పెట్టి వెతకవలసి వస్తున్నదీ వేళ. కలియుగంలో బ్రాహ్మణ ధర్మాన్ని అవలంబించేవారు అరుదౌతారని వ్యాసమహర్షే అన్నాడు మరొక చోట. పథ నిర్దేశం చేసి, నడిపించవలసిన వారు ఆశ్రయిస్తూ, ఆరగిస్తూ కూర్చుంటే ఇక ఆ రాజ్యంలో ధర్మానికి చోటెక్కడుంటుంది? ఆప్రభువుల పుర్రెలకు తోచిందల్లా ఈ పృథివిపైన ధర్మమై ప్రజలను బాధిస్తూ ఉంటుంది. 'తల్లీ! ఇలా జరుగుతుందనే కదా! నీబాధ.' అని అడుగుతున్నాడు ధర్మదేవుడు.

"ఇంద్రుడు సకాలంలో వర్షాలు కురిపించక పోవడంతో ప్రజలు నానావిధ ఈతి బాధలకు లోనవుతారనా? తల్లీ! బాధపడుతున్నావు."

కలి ప్రభావంచేత ప్రజలు గతులు తప్పుతారు. ప్రజల నడవడిని బట్టి ప్రకృతి సహకార ముంటుంది. ఎప్పుడు ఎలా ప్రవర్తించాలో అప్పుడలా ప్రవర్తించటం మానేసి తోచినట్లల్లా ప్రజలు ప్రవర్తిస్తున్నప్పుడు ప్రకృతి కూడా వారికి తగినట్లే ప్రవర్తించ వలసి వస్తుంది. ఋతుపవనాలు గతులు తప్పుతాయి. సకాల వర్షాలకు బదులు అకాల వర్షాలు పడతాయి. పంటలు వేసే కాలంలో ఎండల మంటలు, పంటలు కోసే కాలంలో వానలు, వరదలు - ఇలా జరిగి మనను ఆరడి పెట్టడం మన కనుభవమౌతున్న అంశమే కదా! ప్రకృతి ధర్మాల కనుగుణంగా నడుచుకున్నప్పుడే, ప్రకృతి యొక్క సహకారానికి మానవుడు నోచుకుంటాడు. కాని కలి ప్రభావం చేత మనిషికి, ప్రకృతికి అనుగుణంగా నడుచుకోవాలని అనిపించడం లేదు. "అందుకేనా భూమాతా! అలా జరుగుతుందనేనా నీవు బాధపడుతున్నావు." - అంటున్నాడు ధర్మదేవత.

"కాలం గడుస్తున్న కొద్దీ హీనులైన వారు రాజులౌతారనీ, రాజ్యపాలనలో నీతి నియమాలు తగ్గిపోతాయనీ, ప్రజలు అన్నపానాల కోసమో, శయన సుఖాల కోసమో బ్రతుకుతూ ఉంటారనీ, బ్రతుకుతూ ఉండే రోజులు వస్తున్నాయనీ బాధపడుతున్నావా భూమాతా నీవు?"

బ్రాహ్మణ ధర్మాన్ని అవలంబించడంలో నిష్ఠా గరిష్ఠులైన వారు నిలబడి, రాజ్య పాలన చేసేవారికి మార్గ దర్శనం చేస్తూ ఉండాలి. రాజ్య పాలన

చేసేవారు రాజ్య రక్షణ, ప్రజా రక్షణ తమ కర్తవ్యాలుగా గ్రహించి మెలగాలి. అప్పుడు ప్రజలు కూడా ఆ బ్రాహ్మణ, క్షత్రియ ధర్మాల నుండి ప్రేరణ పొంది, ఉదాత్తమైన జీవనాన్ని గడపటానికి ప్రయత్నం చేస్తారు. బ్రాహ్మణ ధర్మం అరుదై, క్షత్రియ ధర్మం కరువై, స్వార్థపరుల చేతులలోనికి భూమి వెళ్ళిపోయిన వేళ ప్రజలు కూడ స్వార్థ దృష్టితో సుఖ లాలసులు కావడంలో ఆశ్చర్యమేముంది. "అలాంటి స్థితి రాబోతున్నదనేనా! ఓ భూమాతా నీవు బాధ పడుతున్నది?" - అంటూ ధర్మదేవత భూమాత కన్నీళ్ళను తన ఓదార్పు వాక్యాలతో తుడిచే ప్రయత్నం చేస్తున్నాడు.

## అనుభూతి

"రాబోయే కాలాన్నీ, పరిస్థితుల్నీ తలచుకుని కన్నీరు పెడుతున్నావా?" అని ఓదారుస్తూ ఇంకా ఇలా అన్నాడు ధర్మదేవత.

"ఓ భూమాతా! భూభార నిర్వాపణ కోసం నీ పిలుపును అందుకుని దిగి వచ్చాడు దేవదేవుడు. అతడు మానవ రూపం ధరించి, నిన్ను కలిసి నడచిన కాలమంతా నీకు నిత్యానందమే. నీ కోర్కె తీర్చాడాయన. దుష్టులను సంహరించి, నీకు బరువు తగ్గించి, నీవు కోరిన పని పూర్తి అయిపోయిందన్న క్షణంలో ఆ లీలా మానుష రూపాన్ని విడిచి పుచ్చాడు. దానితో నీకు దిక్కు తోచని స్థితి ఏర్పడింది. ఆయనను విడిచి ఉండడం నీకు దుస్సహ మవుతున్నది. పైగా ఆయన పాదం అలా నీపై నుండి తీసాడో లేదో ఈ కలియుగ మొకటి ప్రారంభమయింది. కలి ప్రవేశం జరిగింది. ఇప్పుడిక విలువలు తారుమారు అవుతాయి. వర్ణాశ్రమ ధర్మాలు గతులు తప్పుతాయి. ఈ భూమిని రక్షించేవారు కాక, భక్షించేవారు రాజులవుతారిక. కనుక ఏ దుష్టుని చేతిలో పడవలసి వస్తుందోనని నీవు బాధ పడుతున్నట్లుగా నాకు కనిపిస్తూ ఉన్నది."

"కృష్ణుడు ఉన్నంత వరకు నీవు జేగీయ మానంగా వెలిగిపోయావు. నీ శోభ దేవతలకే ఆశ్చర్యం కలిగించింది. సకల లోకాలు నీ వైపుకే చూశాయి అప్పుడు. అలాంటి నీ శోభ శ్రీకృష్ణుడు తప్పుకోవడంతో తగ్గిపోయింది సుమా! నీ ముఖం కళ తప్పింది. ఈ దృశ్యాన్ని చూడడం నాకు చాల కష్టంగా ఉన్నది."

ధర్మదేవుని మాటలకు చలించిన భూదేవి ఇలా బదులు పలకసాగింది.

"ఓ ధర్మదేవుడా! వృషభరూపుడా! శ్రీ కృష్ణుడున్నంత వరకు నీవు నాలుగు పాదాలతో నిండుగా నడిచిన వాడివి. ఇలా ఆయన శరీరాన్ని విడిచిపెట్టాడో లేదో ఇప్పుడు ఒక్క కాలితో మిగిలి పోయావు. అది కూడా కుంటిది. శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచి పెట్టడంతో నాకేమిటి? నీకేమిటి? - ఈ సృష్టికే కళ తప్పినట్లు కనబడుతున్నది.

సకల సద్గుణాలు ఆయన శరీరాన్ని ఆధారంగా చేసుకుని ఈ భూమి మీద వ్యక్తమయ్యాయి. ప్రజలందరిలోనికి అవి ప్రసరించాయి. అలాంటిది కృష్ణ నిర్యాణం తరువాత ప్రజలు కృష్ణుడి వశంలో నుండి కలి వశంలోనికి వస్తున్నట్లు కనబడుతున్నారు. పాపాలనే గాయాలతో వారేమయి పోతున్నారో వారికే తెలియని స్థితిలోనికి వెళ్ళిపోతున్నారు. అందుకే నాకు బాధగా ఉంది."

ఇంతకు ముందు నీవన్నట్లుగా ఇక ముందు దేవతలకు యజ్ఞభాగాలు తగ్గిపోతాయి. పితృ దేవతలకు తర్పణాలు తగ్గిపోతాయి. ఋషులకు ఆదరణ తగ్గిపోతుంది. గోవుల యెడల ఇక పూజ్యభావం ఉండదు. సత్ప్రవర్తన గలవారు వదిలి పెట్టబడి ధనవంతులైన వారు గౌరవింప బడతారు. అలాంటి పరిస్థితులలో ధర్మమూర్తివైన నీకు, భూమినైన నాకు ఎలాంటి దుఃఖం కలగబోతున్నదో అని, ఎలాంటి స్థితిగతులను ఇంకా మనం చూడబోతున్నామో అని దుఃఖిస్తున్నాను.

నాకా దేవదేవుడు గుర్తుకు వస్తున్నాడు. ఆయన నాతో గడిపిన కాలమే గుర్తుకు వస్తున్నది. గుర్తుకు రావడమేమిటి? నేనా వైభవం మరచిపోతే కదా! ఆయన నాతో కలసి తిరిగిన కాలంలో బ్రహ్మాది దేవతలు ఆయన కడగంటి చూపుకోసం తపస్సు చేసి మరీ దిగి వచ్చేవారు. లక్ష్మీదేవి తన నివాసమైన కమలాన్ని విడిచిపెట్టి, ఆయన చరణ కమలాలకు సేవ చేసింది. యోగీంద్రులు తమ హృదయాలలో ఆయననే నిలుపుకుని, అలా ధ్యానంలో మునిగిపోయేవారు. వేదాలు ఆయన వైభవాన్ని వర్ణించలేక అలా వాక్కులుగా మిగిలిపోయాయి. అలాంటి కృష్ణుడు నాపైన పాదం పెడుతూ ఉంటే, ఆ పాదముద్రలలో ఆ పాదాలలోని శుభంకరమైన రేఖలన్నీ నాపైన ముద్రింపబడుతూ ఉంటే - ఆ ముచ్చట నేమి చెప్పను! ఆ పాదాలు సోకినప్పుడల్లా నేను పొందిన పులకింతలే ఇటు పచ్చికలై పశువులను, అటు పంటలై ప్రజలను పరవశింప జేసేవి. అతడిలా పాదాన్ని తొలగించాడో లేదో ఇక నా పరవశం మాయమైంది. నా గర్వమణగిపోయింది.

"నా కోరిక మన్నించి లీలా మానుష విగ్రహుడై దిగివచ్చి, దుష్టులను సంహరించి, శాశ్వతమైనయోగవిద్య నిచ్చి నిన్ను నాలుగు పాదములా నడిపించి, నన్ను మురిపించినాడు."

"ఆ పలుకులు, ఆ కులుకులు, ఆ నడకలు, ఆ కన్నులు, ఆ దృక్కులు, ఆ పోకడలు, ఆ దయ, ఆ ప్రేమ - అహా! వాటిని తలచుకోవడంలోనే పరవశత్వం కలుగుతోంది. మధురిమలను వెదజల్లే తన చూపులతో గోపికలను ఆకట్టుకున్నాడని అంటారుగాని, కర్మబంధం తెంచుకున్న యోగులు కూడా ఆయన దర్శనం కోసం వెంపరలాడి పోలేదా!"

గో, వృషభాల సంభాషణ ఇలా సాగుతూ ఉన్నది. పరీక్షిత్తు ఆ సంభాషణను శ్రద్ధతో ఆలకిస్తూ ఉన్నాడు. భూమి యొక్క ప్రస్తుత పరిస్థితి ఏమిటో సాక్షాత్తూ ఆమె గోరూప ధారిణియై ఇచట చెబుతున్నది. ధర్మము యొక్క స్థితిగతులు ఎలా ఉన్నాయో ఆ ధర్మమే అంబోతు రూపాన్ని ధరించి ఇచ్చట తెలియజేస్తున్నది. అంతకంటె పరీక్షిత్తుకేం కావాలి? రాజైన పరీక్షిత్తుకు కర్తవ్యాన్ని నిర్ణయించుకోవటానికి కావలసిన అవగాహన ఇక్కడ ఇలా అందుతూ ఉన్నది. అతడి కొక ప్రక్క ఆశ్చర్యం మరొక ప్రక్క ఆవేదన. ఆశ్చర్యము-ఆవేదనల నడుమ నుండి సన్నగా సాగివచ్చి, తిన్నగా అతనిని సోకుతూ ఉన్నది ఒకానొక అనుభూతి. ఆ అనుభూతిని చెందుతూ కావలసిన అవగాహనను పొందుతూ, ఆ దృశ్యాన్ని ఆకళించుకునే ప్రయత్నంలో ఉన్నాడతను.

ఆ గో, వృషభాలు అలసిపోయినట్లు కనిపిస్తున్నాయి. ఆవేదనకు గురై దీనావస్థలో వున్నాయి. అయినప్పటికి సహజమైన వాటి కళ ఎక్కడికి పోతుంది? వాటి గాంభీర్యం ఎక్కడికి పోతుంది? ఆ వృషభం ఒక మంచుకొండలా నిలబడి ఉంది. దాన్ని చూస్తూ ఉంటే కైలాస పర్వతం గుర్తుకు వస్తూ ఉంది. ఇక ఆ గోవు కామధేనువును గుర్తుకు తెస్తోంది. ఎంతటి దైన్యం ఆవరించినా, ఆ దీనావస్థల మాటునుండి కూడా మహనీయుల దివ్యతేజస్సు గోచరిస్తూనే ఉంటుంది కదా! ఉదాత్తులు, ఉన్నతులు అయినవారి విషయంలో కష్టనష్టాలెన్ని ముంచుకు వచ్చినా వారి సహజమైన గాంభీర్యం సడలిపోదు కదా!

నిజానికి వారిరువురు ఆలోచిస్తున్నది తమను గూర్చి కాదు. రాబోతున్న సృష్టి పరిణామాన్ని గురించి, పుట్టబోతున్న జీవరాసుల స్థితి గతుల గురించి వారు ఆవేదన చెందుతున్నారు. అదీ వారి ఆలోచన. ఆలోచన రూపమైన ఆవేదన. దైవానికి ఆవేదన రూపమైన ఒక నివేదన. తమ చేతులు

దాటిపోతున్న పిల్లల ప్రవర్తన, కుటుంబ స్థితిగతులను గురించి బాధ్యత కలిగిన తల్లిదండ్రులు తమ ఇష్టదైవము సన్నిధిలో కూర్చుని పరస్పరం సంభాషించు కోవటం ఎలాంటిదో ఈ ఘట్టం అలాంటిది.

ఇంతలో పొడుగైన వాడొకడు వేగంగా వచ్చి ఒక్క ఉదుటున పైకి ఎగిరి ఆ ఆంబోతును తటాలున ఒక్క తన్ను తన్నాడు. అనూహ్యమైన ఆ దెబ్బతో అంతటి ఆంబోతు నేల కొరిగి పోయింది. ఆ తన్నినవాడు క్రూరత్వం మూర్తీ భవించినట్లుగా ఉన్నాడు. కన్నుల నుండి క్రోధాన్ని వెళ్ళగక్కుతున్నాడు. అతని చేతిలో రాజదండం ఉంది. ఇలా తన్నడానికి నాకు అధికారం ఉన్నది అన్న ట్లుగా అతడు ఆ రాజదండాన్ని ఇటు అటు నిర్లక్ష్యంగా ఊపూతూ ఉన్నాడు. అలా దండాన్ని ఊపుతూనే ఇంకొక్కసారి పైకి ఎగిరాడు. ఈసారి అతడు ఆ గోమాతను తన్నాడు. గోమాత ఆ తాపునకు తట్టుకోలేక పోయింది. శరీరంలోని భాగాలన్నీ చెల్లాచెదురై పోతున్నట్లుగా అనిపించిందామెకు. కన్నీళ్ళు పొంగి పొరలుతూ ఉండగా 'అంబా' అని ఒక్క అరుపు అరిచింది. చాచిన ఆ నాలుకపైన లేత పచ్చిక పరకలు కనపడుతున్నాయి. ఆమె ఇక తట్టుకొనలేక పోతున్నది. నోటివెంట నురగలు క్రక్కుకుంటోంది.

పడిపోయిన గో, వృషభాల మధ్యలో ఇదంతా నా ప్రతాపం అన్నట్లుగా ఆ పొడగరి పొగరుగా ముఖం పెట్టి, వెక్కిరింపుగా చూస్తున్నాడు. ఇంతలో వాడికొక ధనుష్టంకారం వినబడింది. వాడి గుండెల్లో ఇక రాయి పడింది. 'ఎక్కడినుండి ఈ ధ్వానం?' అన్నట్లు చుట్టూ కలియజూశాడు వాడు. బంగారు తేరుపైన గంభీర వదనంతో తనవైపే చూస్తున్న పరీక్షిత్తు కనబడ్డాడతనికి. ఎందుకనో వాడికి కాళ్ళు వణికాయి. ఆ వణుకు బయట పడకుండా నిలబడే ప్రయత్నం చేస్తున్నాడు వాడు.

బెంబేలు పడుతున్న ఆ పొడగరిని ఉద్దేశించి ఉరుము ఉరిమినట్లుగా ఇలా అన్నాడు పరీక్షిత్తు "దుష్టుడా! ఈ పని ఎందుకు చేశావు? నీకేమి అపకారం చేశాయి ఈ గో, వృషభాలు? నిన్నేమయినా కొమ్ములతో పొడిచాయా? కనీసం నీ దగ్గరికైనా వచ్చాయా? లేదే! మరెందుకని నీవు పనిగట్టుకుని వచ్చి ఇలా వాటిని పడగొట్టావు? ఇది నా రక్షణలో ఉన్న భూమి అని నీకు తెలియదా? ఈ భూమియందు ఎలాంటి నేరము చేయరాదని నీకు తెలియదా? పైగా అధికారి వలె నిలబడుతున్నావేమి? ఆ పటాటోపమేమి? ఈ తుచ్ఛపు పనిని చెల్లుబాటు చేసుకోవడానికి మోసగాడివైన నువ్వు అధికారిగా వేషం

వేసుకుని మరీ వచ్చావా? అధికారం వెలగబెట్టటానికి నీవెవరివి? అసలు నీకా అధికారం ఎవరిచ్చారు? ఇదిగో! ఇప్పుడే నిన్ను తుదముట్టిస్తాను. నిన్నిక సహించను."

"గాండీవం ధరించిన అర్జునుడు, చక్రాన్ని ధరించిన శ్రీకృష్ణుడు ఈ భూమిని విడిచి వెళ్ళిపోయారు కదా! ఇక మనకు తిరుగేమున్నది? మనను అడ్డుపెట్టగల వారెవరూ? - అన్న మదంతో సాధు జంతువులైన ఈ గో, వృషభాలను ఒడలు తెలియని మైకంలో పడి తన్నుతావా? నిలబడు! నీ కిప్పుడే బుద్ధి చెపుతాను. నిన్ను దండించి తీరుతాను."

అంటూ తన చూపులతోనే ఆ దుష్టుని కట్టివేసి, ఒక కట్టుకొయ్యలా వాడు నిలబడేట్లు చేసి బాధతో కుమిలి పోతున్న గో, వృషభాల వైపు చూశాడు పరీక్షిత్తు. అతనిని దండించటానికి కన్న ముందుగా వీటిని అనునయించటం ముఖ్యమని అతని కనిపించింది.

## కలబోసుకున్న రూపమిది

దుష్టునిచే తన్నబడి నేలకూలి జాలిగొలిపే స్థితిలో ఉన్న గో, వృషభాలను ఆర్ద్రమైన తన చూపులతోనే పూర్తిగా స్పృశించి, తన సాన్నిధ్యంతో వాటిని సేదతీరుస్తూ ఇలా అన్నాడు పరీక్షిత్తు.

"ఓ వృషభరాజమా! కురువంశ రాజుల బాహువులే ఈ రాజ్యమునకు ప్రహరీగోడలు. వారి రక్షణలో ఉన్న ఈ భూమి జనులు ఎవ్వరూ కూడ మీకు కన్నీరు రప్పించే పనులు చేయరు. మిమ్ములను తన్ని పడగొట్టిన ఈ దుష్టుడు ఈ రాజ్యమునకు చెందిన వాడు కాదు. ఇతడెవ్వరయినను సరే! నా సామర్థ్యంతో చీల్చి చెండాడుతాను. మళ్ళీ నిన్ను నాలుగు పాదాలపైన నిలబెడతాను. నిండుగా నడిపిస్తాను."

"ఇతడు ఈ రాజ్యానికి చెందిన వాడు కాడు. ఇది నేను ఆత్మ విశ్వాసంతో చెబుతున్నమాట. ఎందువల్లనంటే నా మనస్సులో అధర్మానికి చోటులేదు. అలాంటప్పుడు నా ప్రజలలోనూ ఉండదు. యథా రాజా తథా ప్రజా - అని కదా ఆర్యోక్తి. ఈ నా బాహువుల నడుమ వర్థిల్లుతున్న ఈ భూమిపైన మీకు బాధ కలిగే సన్నివేశాలు జరుగవు. నీకు కన్నీళ్ళు పెట్టవలసిన స్థితిగతులు రావు. రానివ్వను. నీ ఆవేదన నేను గమనించాను. నీ పలుకులు నేను

విన్నాను. భవిష్యత్తును గూర్చిన నీ బాధ నాకు బోధపడింది. కలి ప్రవేశాన్ని గూర్చి మీరు కలత చెందవలదు. కలికి ప్రభావం ఉండవచ్చు. కాని, అది మనం పడనిచ్చినప్పుడే కదా మనమీద పడుతుంది. నేనీ భూమిమీద ఆ ప్రభావాన్ని పడనివ్వను. ఈ వచ్చినవాడు కలి పురుషుడే కావచ్చు. ఈ రాజ్యంలో ప్రవేశించాలన్నది అతని ప్రయత్నం కావచ్చు. కాని మీకు భయం లేదు. ఈ బాహువులు అతనిని చీల్చి చెండాడగలవు."

ఇలా భయాన్ని తొలగిస్తూ, ధైర్యాన్ని కలిగిస్తూ ఇంకా ఇలా అన్నాడు పరీక్షిత్తు "ఎవరికీ అపకారం చేయని స్వభావం మీది. ఏదో నోటికందిన పచ్చగడ్డిని తిని, కంటికి కనబడిన ఏటిలో కాసిని నీళ్ళు త్రాగి, స్వేచ్ఛగా చరించే స్వభావం మీది. అలాంటి మీ కాళ్ళు కుంటివై పోయేట్లుగా తన్నడానికి ఇతడెవడు? ఇతడెవడైనా సరే మీరు వెరపు చెందవలసిన పనిలేదు. భూమిమీదే కాకుండా ఆకాశంలో చరించే శక్తి ఇతని కుండవచ్చు. లేదా, భూమి లోపలికి చొరబడి దాక్కొనగలిగిన నైపుణ్యమితనికి ఉండవచ్చు. ఎలాంటి శక్తివంతుడైనా కావచ్చు. అతను చేసినది అధర్మం. అతడిని శిక్షించటం రాజుగా నా ధర్మం. బాహువుల నిండా నగలను అలంకరించుకొని మరీ వచ్చాడితను. ఆ నగలతో సహా ఆ బాహువుల్ని ఊడిపడేట్లుగా చేస్తాను. మిమ్మల్ని పడగొట్టేటప్పుడు మీరు పడిన బాధ ఎలాంటిదో, అవి ఊడి పడుతున్నప్పుడు అతడికి తెలుస్తుంది. అలంకరించుకొనిన బాహువులకు తోడు రాజదండమొకటి. అధికారం చెలాయించడానికి ఉబలాట పడుతున్నాడితను. ఇతనికి తెలియదు - ధర్మాన్ని రక్షించటం కోసం, అధర్మాన్ని శిక్షించటం కోసం మాత్రమే అధికారమున్నది. తానాచరించ దలచుకున్న అధర్మాన్ని ఈ రాజదండం మీదుగా చెలామణి చేద్దామనుకుంటున్నాడితను. మీరింత వరకు సంభాషించుకుంటున్న కలి స్వరూపం, కలి స్వభావం గుర్తుకొస్తున్నది.

"అధికారమంటే రక్షణ. అధికారమంటే శిక్షణ. అలాకాక అధికారమంటే పెత్తనం చేయడం అనుకొంటున్నాడితను. జులుం చెలాయించడ మనుకుంటున్నాడు. అణగద్రొక్కడ మనుకుంటున్నాడు. అరడి పెట్టడ మనుకుంటున్నాడు. చిన్నచూపు చూడడ మనుకుంటున్నాడు. చీదరించుకోవడ మనుకుంటున్నాడు. అధికార ముద్ర చూపి హింసించి ఆనందించాలనుకుంటున్నాడు. ఇలా ప్రవర్తించటం కలి స్వరూపం కావచ్చు. కలి ప్రభావం ఇదే కావచ్చు. ఓ వృషభరాజా! పరీక్షిత్తు వీటిని సహించడు. పరీక్షిత్తు వీటిని క్షమించడు. అసలు చిత్రమేమిటంటే అధికారమున్నట్లుగా నటించడం. నిజానికి వీడి కధికారమేది? బహుశ

ఇలా నటించడం కూడా కలి స్వరూపంలో భాగం కావచ్చు. కాని ఈ భూభాగంలో వీడికా అవకాశం లేదే?"

"వృషభ రాజా! చిత్రమనిపిస్తూ ఉంటుంది. ఈ భూమి ఎవరిది? ఈ పచ్చిక ఎవరిది? ఈ సెలయేళ్ళు ఎవరివి? వీటిని అనుభవిస్తూ తిరుగుతున్న మీరు ఎవరివారు? అలాంటి మీపైన అధికారం చెలాయించడానికి వీడెవడు? రాజు కూడ ఉన్నది రక్షణ కోసమే. జీవరాసులు ఎవరి మానాన వారు బ్రతికేటట్లుగా ఒకరి వలన మరొకరికి అపకారం కలగకుండా, అవి ప్రవర్తించేటట్లుగా కనిపెట్టుకొని చూచుకోవడానికే రాజు పాత్ర కల్పింపబడింది దైవం చేత. రాజు భూమిపైన అధికారి కాడు. భగవంతుని తరపున పనిచేయటానికి గాను, అతడి చేత రూపొందించబడిన రక్షకుడు మాత్రమే. ఓహో! రక్షణకు బదులుగా శిక్షణకు బదులుగా - పెత్తనం చేయటమే, పీడించుకు తినటమే రాజధర్మంగా, పరిపాలనగా, చెలామణి చేద్దామని చూస్తున్నాడీ దుష్టుడు. ఈ నటనలు సాగవు. ఈ ప్రయత్నాలు ఫలించవు. ఓ వృషభ రాజమా! ఈ నా మాటలు విశ్వసించు."

వృషభాన్ననునయించి, ఆ పైన గోమాత వైపు తిరిగాడు పరీక్షిత్తు.

"తల్లీ! నీ పలుకులు నా చెవుల బడ్డాయి. ఈ నీ దారుణ స్థితి నా కనుల బడింది. శ్రీకృష్ణుడు ఈ భూమిని విడిచిపెట్టి వెళ్లాడని నీవు దుఃఖించవద్దు. అలా కన్నులలోనికి నీరు తెచ్చుకోవద్దు. మనస్సులో లోలోపల కుమిలి పోవద్దు. ఈ నా ప్రాణముండగా, ఈ నా బాణముండగా నీకు బెంగ పడవలసిన పనిలేదు.

సాధువులైన జీవులకు దుష్టులైన మానవులు బాధలు కలిగించడం నీచమైన అంశం. అలాంటి నీచుల్ని శిక్షింపలేని రాజు ఉండి కూడా లేని వాడే అవుతున్నాడు. అలాంటి రాజుకు ఆయుర్దాయం తగ్గిపోతుంది. స్వర్గం అతణ్ణి దూరంగా ఉంచుతుంది. వస్తు సంపదలు అతడిలా వస్తుంటే అవి అలా తప్పుకుని పోతుంటాయి. ఇక అతడు జీవచ్ఛవంగా బ్రతకాలి. తల్లీ! దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేయటానికే కదా! ప్రభువు సృష్టింపబడింది. రాజైనవాడు దేవుడికి ప్రతినిధిగా ఉండాలి. దేవుని అంశమై నిలబడాలి. సృష్టి నిర్వహణలో దైవానికి తోడ్పడ గలగాలి. అలాంటివాడు మాత్రమే రాజు అనబడతాడు. మిగిలినవారు రాజు వేషాన్ని వేసుకున్నవారు అవుతారు. ఇలా ఇకపైన రాజు వేషము వేసుకొని వచ్చి, రాజ్యాన్ని రక్షించేందుకు బదులుగా భక్షించటం మొదలు పెడతారని, అందుకు గాను బాధ కలుగుతోందని ఇందాక మీరు అనుకోవడం నేను విన్నానమ్మా!

పాండవులు గాని, శ్రీకృష్ణుడు గాని నిన్ను దిక్కులేని దానినిగా చేసి వెళ్ళారనుకుంటున్నావా? లేదు. అలా వెళ్ళలేదు. ఉన్నంతకాలం బాధ్యతపడి నిన్ను చూచుకున్న వాళ్ళు కదా! వాళ్ళు అంతలోనే ఆ బాధ్యతను మరచి పోతారా? తల్లీ! కలి ప్రభావానికి నిన్ను విడిచి పెట్టి వాళ్ళు వెళ్ళిపోతారా? నన్ను చూడు. నాలో నీకేం కనబడుతోంది? పాండవుల వారసత్వం కనబడటం లేదూ? శ్రీకృష్ణుని దివ్యతేజం కనబడటం లేదూ? ఆయన రక్షించిన శరీరమమ్మా ఇది. మా తల్లి గర్భంలో అప్పుడే రూపుదిద్దుకుంటున్న నేను అశ్వత్థామ అస్త్రానికి ఆహుతి కాబోతున్నవేళ ఆయనే తేజోరూపుడై అడ్డుపడి నన్ను రక్షించాడు. నన్ను బ్రతికించాడు. నాకీ జీవితాన్ని ప్రసాదించాడు. ఎందుకో తెలుసా అమ్మా! తన అంశగా తన తరువాత మీ ఎడల బాధ్యత పడతానని. కనుక అటు పాండవుల పరాక్రమం, ఇటు భగవానుని దివ్యతేజం కలబోసుకుని, రూపొందిన దేహమిది. ఇది నిలచినది, మీకు వినియోగ పడటానికే. మీకు రక్షణ నందించటానికే. వారెందుకు నన్ను నిలబెట్టారో నాకు అర్థమవుతోంది. నా కర్తవ్యమేమిటో కూడా బోధపడుతోంది. భూభార నిర్వాపణకై నీ కోరికపై వచ్చి నిన్ను పరవశింప జేస్తూనే ఆ భారాన్ని తగ్గించివేసాడు శ్రీ కృష్ణుడు. అలాగే ఆయన అనుగ్రహ ఫలమైన నేను నీకే మాత్రము బాధ కలుగకుండా సుఖసంతోషాలలో నీవు తేలియాడేటట్లు చేస్తూనే ఈ కలి ప్రభావాన్ని కూడా దమించగలను.

నీవు కన్నీళ్ళు పెట్టవద్దు. నీవలా దీనంగా చూడవద్దు. నీవు నిండుగా వర్ధిల్లాలి. పాడి పంటలతో నీవు కళకళలాడాలి. ధర్మదేవత నాలుగు పాదాలతో నడుస్తూ ఉండగా, ఆ సాహచర్యంలో నీవు ఉప్పొంగి పోవాలి. అది నా కోరిక, అది నా ఆశయం. అలా నిన్ను వర్ధిల్లజేయడం నా కర్తవ్యం. అందుకు నేను సంసిద్ధం." - అంటూ పరీక్షిత్తు గోమాత శిరస్సును ప్రేమతో స్పృశించాడు.

ఇది గో, వృషభాలతో పరీక్షిత్తు జరిపిన సంభాషణలకు ఉపబృంహణం. ఆ క్షణాలలో పరీక్షిత్తులో నడిచిన భావ పరంపరలకు భాషారూపం. అతని వ్యక్తిత్వానికి పట్టిన దర్పణం.

# ప్రేమ స్పర్శ - ధర్మస్పర్శ

అభయం పట్టిన పరీక్షిత్తును చూసి, గో, వృషభాలకు ముచ్చట వేసింది. 'అటు పాండవులకు, ఇటు శ్రీకృష్ణునికీ కూడ తగిన వారసుడితడు.' - అన్న తృప్తి వారికి కలిగింది. ఈ విధంగా మనస్సునకు ముచ్చట, హృదయానికి తృప్తి కలిగిస్తున్న పరీక్షిత్తును చూసి, వృషభ రూపంలో ఉన్న ధర్మదేవత ఇలా అన్నాడు: "బిడ్డా! నీ పలుకులు మాకు తృప్తిని కలిగించాయి. అవి మీ వంశానికి తగినట్లుగా ఉన్నాయి. క్రూరులను చంపి, సాధువులను రక్షించడమనేది మీ వంశంలోని పెద్దలు అనాదిగా స్థాపించిన ఒరవడి. ఆ ఒరవడే నీలోనూ కనబడుతున్నది. ఆ సామర్థ్యమే నీలోనూ తొణికిస లాడుతున్నది. మీ పెద్దలు ధర్మానికి అంకితమై, జీవితాలను వెచ్చించిన వారు. ధర్మంగా బ్రతకాలనీ, ధర్మం కొరకు బ్రతకాలనీ, ధర్మం కొరకే బ్రతకాలనీ భావించిన వారు. వారి ధర్మదీక్షకు ముచ్చటపడి, సాక్షాత్తు దైవమే మానవరూపాన్ని ధరించి, వారికి సాక్షాత్కరించాడు. వారి తరఫున దూతయై రాయబారం నడిపాడు.

"ఎంత-చిత్రమైనది ఆఘట్టం! దైవం దిగివచ్చి దూతగా వర్తించాడు అంటే మాటలా? కాని చిత్రమేమిటంటే - దేనికీ కట్టుబడని దైవాన్ని భక్తిలతతో కట్టివేయ వచ్చు. అతడొక్క భక్తిలతకే బద్ధుడౌతాడు. అలా తమ భక్తిలతతో భగవంతుణ్ణి బద్ధుణ్ణి చేసినవారు మీ పెద్దలు. త్రాళ్ళతో కట్టేద్దామనుకున్న కౌరవులకు ఒక్క ఉదుటన విశ్వరూపాన్ని చూపి మూర్ఛిల్లజేసిన ఆ సర్వాంతర్యామి బావమరిదై మీ వారి బాగుకోరటం, చెలికాడై మీ పెద్దలతో చేయికలపడం, మీ పెద్దలాచరించిన పుణ్యఫలం కాదా! అలాంటి వారికి వారసుడవునీవు. అన్ని విధాలా వారసుడవు. నీ గాంభీర్యం, నీ సామర్థ్యం, నీ ఔన్నత్యం, నీ ఔదార్యం మాకు ముచ్చట గొలువుతున్నాయి.

"ఓ రాజా! మే మెవ్వరినీ దుఃఖపెట్టము, మావలన దుఃఖపడువారు ఈ భూమిపైన మీకు కనబడరు. సరిగా నీవు కూడ అలాగే అభిప్రాయ పడ్డావు. సంతోషం. అలాంటి మాకు ఈ దుష్టుని పీడ కలగడం ఆశ్చర్యమే, విచిత్రమే.

"ఈ సందర్భంలో ఒక సూక్ష్మాంశాన్ని నీకు వివరిస్తాను. జీవులు తమకు కలిగే కష్ట దుఃఖాలకు కారణమెవరా? అని వెతుకుతూ ఉంటారు. కొందరు ఆత్మ వాటికి కారణ మంటున్నారు. కొందరు గ్రహగతులు ఈ కష్ట దుఃఖాలను కలిగిస్తున్నా యంటున్నారు. ఇంకొందరు కర్మమే కష్ట దుఃఖాలకు కారణ

మంటున్నారు. మరి కొందరు ఈ సృష్టికొక స్వభావ మున్నది. ఆ స్వభావాన్ననుసరించి అన్నీ జరుగుతున్నాయి. కనుక, కష్ట దుఃఖాలకు కారణం ఆ స్వభావమే నంటున్నారు. ఇలా ఎవరికి తోచినట్లు వారు చెబుతున్నారు. ఎవరికి అందినట్లు వారు చెబుతున్నారు.

"కాని సూటిగా ఆలోచిస్తే కారణం రెండుచోట్ల ఉండటానికి అవకాశ ముంది. ఒకటి మనలో, మన ప్రవర్తనలో, రెండవది మన వాదోప వాదాలకు అందని సర్వాంతర్యామియైన దేవుని యొక్క లీలలో. కనుక కష్టదుఃఖాలు వచ్చినప్పుడు వీటికి కారణం మనమేనా? అని ముందు ప్రశ్నించుకోవాలి. మన ప్రవర్తన మనకి తృప్తి కలిగించినప్పుడు ఇక కారణం తర్కానికి అందని సర్వాంతర్యామి యొక్క లీల అని గ్రహించు కోవాలి. మనలో ఉంటే మనం దిద్దుకోవాలి. సర్వాంతర్యామి సంకల్పానికి చెంది ఉన్నది అని గమనిస్తే ఇక ఆ లీలకు ఒదిగి ఉండటమే మనం చేయవలసినది.

ఇప్పుడు ఈ జరిగిన సన్నివేశాన్ని గురించి మమ్ముల్ని మేము ప్రశ్నించు కున్నాము. మేము ఎవ్వరికీ బాధ కలిగించము. మావలన బాధింప బడుతున్న జీవులు మాకు కనబడలేదు. కానీ మాకీ పీడ కలిగింది. దీనికి ఆ సర్వాంత ర్యామి యొక్క లీలయే కారణం కావాలి. ఆ లీలే కారణమైనప్పుడు దానికి ఒదిగి ఉండడమే భావ్యం కదా! ఇతరులు మన కష్ట దుఃఖాలకు కారణ మవు తున్నారని మనం అనుకోనప్పుడు - ఇక వారిని దండించమనీ, దమించ మనీ అవన్నీ ఎందుకు? "

ధర్మదేవత అలా మాట్లాడేసరికి పరీక్షిత్తుకు ఆశ్చర్యానందాలు కలిగాయి. "ఓహో! ఏమి చూపు ఇది. కారణాన్ని చూపగలిగిన చూపుకదా!" - అను కుంటూ మనస్సులోనే ఆ దేవతకు జోహార్లు అర్పించాడు. అర్పించి ధర్మదేవ తతో ఇలా అన్నాడు. "వృషభ రూపంలో ఉన్న ఓ ధర్మదేవతా! ధర్మాన్ని కాక నీవు మరొకటి చెపుతావా? ఇప్పుడు నీవు చెప్పింది ధర్మమే కాదు. పరమ ధర్మ ముకూడా. ఇతరుల వలన మనకు కష్ట,దుఃఖాలు కలుగుతూ ఉన్నప్పుడు ఎలా అర్థం చేసుకోవాలి అన్నది నీవు చాలబాగా చెప్పావు. ముందు మనని మనం సమీక్షించుకోవాలి అన్నావు. మనలో దోషం కానరానప్పుడు దానిని దైవలీలగా స్వీకరించాలి అన్నావు. నిజమే నీవు పలికినది పరమ ధర్మం.

అలాకాక జీవులు తమ కష్టదుఃఖాలకు ఇతరులు కారణమని పొరబడితే ఏమవుతుంది? ఆ కష్ట దుఃఖాలు కలిగిస్తున్నట్లుగా కనబడుతున్న వారిని దుష్ట

లుగా, పాపులుగా చూడటం మొదలు పెడతారు. మనస్సులో అలాగే వారిని స్మరిస్తారు. ఆ స్మరణ రోజురోజుకూ ముదురుతూ ఉంటుంది. అప్పుడేం జరుగుతుంది? ఆ దుష్టత్వం ఆ పాపస్వభావం స్మరించిన వారి మనస్సునకు అంటుకుంటుంది. క్రమంగా వీళ్ళూ దుష్టులూ, పాపులూ అయిపోతారు. ఇప్పుడేమయింది? దుష్టత్వాన్ని, పాపస్వభావాన్ని వ్యతిరేకించబోయి, వ్యతిరేకిస్తున్నామనుకొని, వీళ్ళూ ఆ దుష్టపథాన్ని అనుసరించినట్లైంది. ఆ పాపస్వభావాన్ని అలవరచు కోవడం జరుగుతోంది.

"కనుక నీవు చెప్పింది నిజంగా పరమధర్మం. మన కష్టదుఃఖాలకు కారణాం ఇంకెక్కడో ఉన్నదని వెతికి నప్పుడు ఇంత ఇబ్బంది వస్తుంది. నీవు చాల ఉదాత్తంగా మాట్లాడావు. ధర్మ దేవతవైన నీవు ఉత్తమమైన ధర్మాన్ని ఉపదేశించావు. ఇప్పుడీ సన్నివేశంలో దారుణమైన ఈ కష్టదుఃఖాలు మీ రను భవించటానికి కారణం మీలో లేదు. అది నీవే తేల్చి చెప్పావు. ఇక ఎక్కడ ఉండాలి? సర్వాంతర్యామి యొక్క లీలలో ఇమిడి ఉండాలి.

"నా దొక్క మనవి. ఆ సర్వాంతర్యామి యొక్క లీలలో భాగంగానే, ఈ సన్నివేశం నడుస్తున్నప్పుడు నేనిక్కడ ఉంచబడ్డానని నీవు గ్రహించగలవు. నేనిప్పుడు ఈ తన్నిన వానిని కేవలం వ్యక్తిగా చూడటం లేదు. రాగద్వేషాలతో అతడిపైకి దుముక బోవటం లేదు. అతడి నుండి వ్యక్తమౌతున్న అధర్మాన్ని దమించ బోతున్నాను. ఇది ఆ సర్వాంతర్యామి నా కప్పగించిన బాధ్యతగా విశ్వసిస్తున్నాను. ఇక్కడ రాగద్వేషాల ప్రసక్తి లేదు. పాప మార్గాల స్మరణా లేదు. ఇక్కడ ఉన్నది బాధ్యతా నిర్వహణం మాత్రమే. సర్వాంతర్యామి నా కప్పగించిన ధర్మరక్షణ కార్యాన్ని మాత్రమే నేను నిర్వహిస్తున్నాను. అందుకు నీ ఆశీస్సులు కోరుతున్నాను.

యుగ ధర్మాలను నే నెరుగుదును. యుగములతో బాటుగ దెబ్బతింటున్న నీ పాదముల గూర్చి కూడ నే నెరుగుదును. కలి ప్రవేశిస్తున్న ఈ క్షణాలలో నీకు మిగిలినది ఒక పాదము. ఈ ఒక్క పాదముతోనే శ్రమ అనుకోకుండా సాగిసాగి మరల కృతయుగానికి నాంది పలుకగలవని కూడ నేనెరుగుదును.

యుగ ధర్మాలకు ఎదురీద వలెనన్నది నా ప్రయత్నము కాదు. తిరస్కరించ వలెనన్నది నా ప్రయత్నము కాదు. ఈ కలియుగ ధర్మానికి అతీతంగా ఈ బాహువుల మధ్యగల ఈ భుమిని నిలిపి ఉంచాలనీ, నడిపించాలనీ కోరుకుంటున్నాను. అది సాధ్యమని నమ్ముతున్నాను. ఎందువల్ల నంటే - మనకు

ఆరాధ్య పురుషుడైన శ్రీకృష్ణుడు భూమిమీద నడచినంత వరకూ, ధర్మదేవత వైన నీవు కూడ నాలుగు పాదములతో నడిచావు గదా! మరి అది ఇప్పుడు ఎందుకు కొనసాగ కూడదని నేనడుగుతున్నాను. ద్వాపరయుగ ధర్మానికి అతీతంగా ఆయన నిన్ను నాలుగు పాదాలతో నడిపించాడు గదా! అలాగే ఆయన నిలబెట్టిన ఈ దేహంతో ఈ కలియుగ ధర్మానికి అతీతంగా నిన్ను మళ్లీ నాలుగు పాదాలతో నడిపించాలని నిర్ణయించుకున్నాను.

" ఓ ధర్మదేవతా! ఈ భూదేవివైపు ఒకసారి చూడు! ఆమెను చూసి, ఆర్ద్రమై, ఆమెను ఓదార్చే ప్రయత్నం నీవు చేస్తూ ఉండగా కదా! ఇలా సన్నివేశం మలుపు తిరిగింది. శ్రీకృష్ణుడు తనను మురిపించాడనీ, మరిపించాడనీ, పరవశింప జేశాడనీ, కాలానికి అతీతమైన స్థితిలో తననుంచాడనీ ఎంత అనుభూతి ప్రదంగా చెప్పిందావిడ! అలాంటి ఆతల్లి స్వార్థపరుల చేతిలో చిక్కి, వారి స్వప్రయోజనాల కోసం తాను బలై పోవలసి వస్తుందేమో నని కన్నుల నిండా నీరు నింపుకుంటోంది. ఆ తల్లి కన్నీరు తుడవడం, కన్నీరు కార్చవలసిన దీనస్థితి నుండి ఆమెను బయట పడవేయటం నా కర్తవ్య మనుకుంటున్నాను. ఇటు నీ నడకను సరిగా సాగేటట్లు చూడాలనీ, అటు ఆమెను ఆ నలత నుండి కోలుకునేట్లు చేయాలనీ స్థిర సంకల్పంతో ఉన్నాను. అది ఆ దేవదేవుడైన శ్రీకృష్ణుని ఆజ్ఞగా భావిస్తున్నాను. కనుక ఈ దుష్టుని నిగ్రహించేటందుకు నాకు మీరు అనుమతి నీయగలరని అనుకుంటున్నాను."

అంటూ ఆ గో, వృషభాలను తన రెండు చేతులతో ఒక్కసారిగా స్పృశించాడు పరీక్షిత్తు. అది ప్రేమ స్పర్శ. అది ధర్మస్పర్శ. ఆ స్పర్శకు వారిరువురూ ముగ్ధులై పోయారు. అతని కౌగిలిలో ఇమిడి పోయినంతగా ఆనందించారు. తమ చూపులతోనే పరీక్షిత్తుకు హృదయపూర్వకమైన అంగీకారాన్ని సూచించారు. సూచిస్తూనే మరింత పరవశించారు.

"ఇతడిలో ధర్మజుని ధర్మమున్నది. భీముని బలమున్నది. అర్జునుని పరాక్రమ మున్నది. నకులుని సౌందర్య మున్నది. సహదేవుని సాహస మున్నది. శ్రీకృష్ణుని సమ్మోహనత్వ మున్నది. ఓహో! ఈ పరీక్షిత్తు ఒక అపురూపమైన మూర్తి. ఆ శ్రీకృష్ణ మూర్తి యొక్క ఒకానొక దివ్యసంకల్పానికి వ్యక్తరూపమితడు. అతడి మరో రూపమే ఇతడు. ఇతడిని చూడగలిగిన, ఇతడి రక్షణను పొంద గలిగిన మనం అదృష్ట వంతులం."

అంటూ, అనుకుంటూ పారవశ్యంలో మునిగిపోతున్న ఆ గో, వృషభాలను

ప్రేమతో నిమురుతూనే, కర్తవ్యోన్ముఖుడైన పరీక్షిత్తు అలా అవాక్కై నిలబడిపోయిన కలిపురుషుని వైపు చూశాడు.

## కర్మభూమి - ధర్మభూమి

గో, వృషభాల రూపంలో ఉన్న భూమాత, ధర్మ దేవతలను ఓదార్చి సమాధాన పరచినవాడై పరీక్షిత్తు ఇక కలిపురుషుని మీదికి తన దృష్టిని సారించాడు. గో, వృషభాలను నిమురుతున్న అతని చేతులు అప్రయత్నంగా ఖడ్గము వైపుకు మళ్ళాయి. మళ్ళడమేమిటి! ఖడ్గాన్ని స్వీకరించిన అతని బాహువులు ఆ ఖడ్గాన్ని ఝళిపిస్తూ, ఆ కలిపురుషుణ్ణి దడిపించ సాగాయి. వర్షఋతువు ప్రవేశించిన తరువాత క్రొత్తగా రూపుకట్టుకున్న మేఘం నుండి వ్యక్తమయ్యే మెరుపులా ఉన్నదా ఖడ్గం. అలాంటి ఖడ్గాన్ని చేతబూని కలిపురుషుని మీదకు సాగుతున్నాడు పరీక్షిత్తు. ఆ కత్తి యొక్క తళతళలకే బెంబేలెత్తి పోయిన కలిపురుషుడు, సమీపిస్తున్న పరీక్షిత్తును చూసి ఇక తట్టుకో లేక పోయాడు. తాను ధరించిన రాజరూపాన్ని విడిచిపుచ్చి, వడలిపోయిన ముఖంతో ఒక్క ఉదుటన వచ్చి పరీక్షిత్తు పాదాలపై పడ్డాడు. అతని ఒడలెల్ల భయాందోళనలే వ్యాపించి ఉన్నాయా! అన్నట్లుగా వణికి పోతున్నాడతను. రెండు చేతులతో పరీక్షిత్తు పాదాలను పట్టుకుని, శిరస్సు వంచి, పాదాలకు సాష్టాంగ పడ్డాడతను.

పాదాలపై నుంచి కొంచెంపైకి లేచి, కొద్దిగా తలను పైకెత్తి పరీక్షిత్తును పూర్తిగా తేరిపార చూడలేని స్థితిలో తగుమాత్రంగా కన్నులు తెరచి దీనంగా చూస్తూ ఆ కలిపురుషుడు పరీక్షిత్తుతో ఇలా అంటున్నాడు.

"ఓ రాజశ్రేష్ఠుడా! నా ఈ దేహము ఎంతగా కంపించి పోతోందో చూస్తున్నావు కదా! నీ రూపం, నీ తేజం, నీ వాక్కు, నీ దృక్కు - అవి అనన్య సామాన్యములు. వాటిని చూచిన నేను పొందుతున్న భయాందోళనలకి అంతులేదు. కాలము కలిసి వచ్చింది కదా! ఇక కాలు పెడదామని వచ్చాను. కాని ఈ నీ చూపులు నన్ను కాల్చి వేసేటట్లున్నాయి. నేను నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను రక్షించమని కోరు కుంటున్నాను. ప్రభూ! నాకు ప్రాణ భిక్ష పెట్టవా?"

కలిపురుషుని వాక్కులకు కనికరించిన పరీక్షిత్తు ఇలా అంటున్నాడు:

"ఓయీ! ఈ పరీక్షిత్తు అర్జునుని మనుమడు అర్జున కీర్తి సమేతుడు.

అంటే ఏమిటో తెలుసునా? తెల్లని స్వచ్ఛమైన కీర్తికలవాడు. అలాంటి ప్రభువును శరణు వేడిన నీవు ఇంక భయపడవలసిన పనిలేదు. శరణన్న వారిని, జయింప బడిన వారిని ఇతడిక చంపడు. అయితే ఒక్కమాట. నీవీ భూభాగం నుండి దూరంగా వెళ్ళిపో. నీ కిక్కడ చోటులేదు. ఇది నా నిర్ణయం.

"నేను నిన్ను చంపను. కాని నీకు ఇక్కడ చోటుపెట్టను. ఈ నా బాహువుల రక్షణలో గల భూమిపైన నిలబడే టందుకు నీ కవకాశము లేదు. నిన్ను చుట్టుకొని, నిన్నాశ్రయించుకొని ఉండే అవలక్షణాలకు ఈ భూమి స్వాగతం పలుకదు. మాట తప్పటం, సంపాదనలను దాచి పెట్టుకోవడం, ఇతరుల సంపదలను అన్యాయంగా దొంగిలించడం, బలహీనులపై దౌర్జన్యం చేయడం, ఆచారాన్ని వదులుకోవడం, మోసగించడం, అయిన దానికి కానిదానికి పోట్లాడుకోవటం, లోపల ఒకటి పెట్టుకొని పైకి మరొకలా కనబడటం, మనస్సును మలిన పరచు కోవడం, దారిద్ర్యాన్ని కొని తెచ్చుకోవడం - ఇవన్నీ ఈ భూమి ప్రజలకు గిట్టని విషయాలు. నచ్చని లక్షణాలు. ఇవన్నీ నిన్నాశ్రయించుకుని ఉండే అవలక్షణాలు. ఇలాంటి అవలక్షణాలతో కూడుకున్న ఓ కలిపురుషుడా! నీకీ భూమిపై చోటులేదు.

"ఓ కలిపురుషుడా! బ్రహ్మావర్తమనే ఈ పుణ్య భూమిని గూర్చి నీకు తెలియునా? ఈ భూమి యజ్ఞయాగాదులకు పెట్టింది పేరు. యజ్ఞార్థ కర్మలకు ఇది పుట్టి నిల్లు. యజ్ఞయాగాదుల ద్వారా ఈ సృష్టి అనబడే మహా యజ్ఞం ఎలా నడుస్తున్నదో అవగతం చేసుకుని జీవితాలను ఆ సృష్టి యజ్ఞం కొరకే, ఆ సృష్టి యజ్ఞానికి అనుగుణంగా మాత్రమే నిర్వహించు కోవాలనే దీక్ష కలిగిన జనులు నిండిన భూమి ఇది. జీవితాలు యజ్ఞార్థంగా నిర్వహింప బడుతున్నప్పుడు సర్వాంతర్యామి యైన వాసుదేవుడు నిరంతరం అనుభవానికి వస్తున్నప్పుడు ఆ లభించే తృప్తి ఎలాంటిదో, అప్పుడు అనుభవానికి వచ్చే ముక్తి ఎలాంటిదో విప్పి చెప్పగలిగిన పుణ్య భూమి ఇది. సకల జీవరాసులూ వాయువును అనుభవిస్తున్నట్లుగా ఈ భూమి ప్రజలు వాసుదేవుని అనుభవించ గలిగిన వారు. వాయువు కంటికి కనబడక పోయినప్పటికీ నిరంతరం జీవులను స్పృశిస్తూనే ఉంటుంది. దాని స్పర్శను జీవులు అనుభవిస్తూనే ఉంటారు. ఆ వాయువే శ్వాసగా జీవరాసుల చేత అనుభవింప బడుతూ ఉన్నది. ఆ విధంగా ఈ బ్రహ్మావర్త ప్రజలకు జీవిత సన్నివేశాల రూపంలో అనుభవానికి వచ్చేది ఆ వాసుదేవుని స్పర్శయే. ఆ అనుభూతి కోసమే వారు జీవిస్తున్నది. ఆ అనుభూతిలోనే వారు జీవిస్తున్నది. వాసుదేవుడు ఇచ్చటి ప్రజలకు ఊపిరి. తమకు వెలుపల,

తమకు లోపల నిరంతరం వ్యక్తమవుతున్న ఆ వాసుదేవుని లీలలోని భాగంగా తమ జీవితాలను నడుపుతూ సార్ధకతను పొందుతున్నారు, ఈ భుమి జనులు. కనుక ఓ కలిపురుషుడా! నీ కిచ్చట చోటు లేదు. నిన్నాశ్రయించుకొని ఉన్న అవలక్షణాలకు ఇచ్చట స్వాగతం పలుకువారు లేరు. అవలక్షణాలు బలపడి నప్పుడు కదా! నీవుండుట కవకాశం. ఆ అవలక్షణాలే కదా! నీ పరివారం. ఆ అవలక్షణాలే కదా నీ సేన. ఆ అవలక్షణాలే కదా! నీ స్వరూపం. అలాంటి అవ లక్షణాలకు ఈ భూమిపైన అవకాశం లేదు. ఇక నీ విక్కడ చేయ గలిగిందీ లేదు.

"పిచ్చివాడా! ప్రవేశించటానికే నీకు అవకాశం లేని ఈ భూమి మీదకు రాజవేషంతో రావాలని చూశావా? దర్పాన్ని చూపి భయపెట్టాలను కున్నావా? అధికారాన్ని చూపి అణచి వేయాలనుకున్నావా? అవకాశాన్ని తీసుకుని అహం కరిద్దామను కున్నావా? ఈ భూమి పుణ్య భూమి. ఈ భూమి ప్రజలు పుణ్యాత్ములు. పరమార్థ మెరిగి జీవిస్తున్న వారు. జీవితాలను యజ్ఞాలుగా వెలిగిస్తున్నవారు. ఆదాయాలను ఆహూతులుగా సమర్పించి, ఆయుర్దాయాలను యజ్ఞజ్వాలలుగా రగిలిస్తున్నవారు.

అలాంటి ప్రజలకు రాజైన వాడు వారికి రక్షకుడై రక్షించు కోవాలి తప్ప, వారికి సేవకుడై సేవించుకోవాలి తప్ప, వారి సేవలో తరించాలి తప్ప - అహంకరించ వచ్చునా? అధికారం ప్రకటించ వచ్చునా? ఈ అవకాశాన్ని దుర్వినియోగం చేయవచ్చునా? అధికారాన్ని సద్వినియోగం చేసిన వాడిని వెలుగుల లోకాలు వరిస్తాయి. అధికారాన్ని దుర్వినియోగం చేసిన వాడిని అంధకారం ఆవరిస్తుంది. కనులు కనబడ కుండా ప్రవర్తించినందుకు, కన్ను పొడుచుకున్నా ముందు కనబడని స్థితి ఏర్పడుతుంది. కనుకనే పెద్దలు రాజును రక్షకుడిగా నిలిపారు. కష్ట సుఖాలను కనిపెట్టి కాచుకొనే సేవకునిగా నిలబెట్టారు.

వేషాన్ని ధరించగానే సరిపోతుందా? దానికి తగిన భావం, దానికి తగిన జీవం, దానికి తగిన అర్హత, దానికి తగిన సమర్థత లేనప్పుడు ఈ భూమి క్షమిస్తుందా? సహిస్తుందా? విలువ నిస్తుందా? అసలు నిలువ నిస్తుందా?

పిచ్చివాడా! ఎంత వెర్రిగా ప్రవర్తించావు? ఎంత మోటుగా ప్రవర్తించావు? ఎంత కార్పణ్యాన్ని చూపించావు? కాని పనులు చేయటానికి కాలిని ఎంతగా ఉపయోగించావు? అధికారిగా వేషం వేసుకుని ఎంత అల్లకల్లోలాన్ని సృష్టిద్దామనుకున్నావ్? ఇది కర్మభూమి. ఇది ధర్మ భూమి. ఇచ్చట నీకు

చోటు లేదు.

"లే! లేచినిలబడు. వలయాకారంగా కనబడుతున్న ఈ భూ భాగంలో నీవిక కనబడటానికి వీలులేదు. వెళ్ళిపో!" - అంటూనే పరీక్షిత్తు ఎత్తిన తనచేతిలోని ఖడ్గాన్ని గిర్రున గుండ్రంగా త్రిప్పాడు. మండలా కారమైన ఆ చాలనానికి ఆ కలిపురుషుని గుండె గుభేలుమన్నది. అతడు చేతులు జోడించి పరీక్షిత్తునిలా వేడుకున్నాడు.

"ప్రభూ! మొదట నిన్ను చూచినప్పుడు తెలియక నిన్నొక రాజమాత్రు డిగా భావించాను. నీవుకూడ నాలాగా అధికారాన్ని చెలాయించే ప్రయత్నంలో ఉన్నావనుకున్నాను. కాని అంతలోనే నా కన్నులకు కప్పిన పొరతొలగింది. నీవొక రాజమాత్రుడివి కావని నాకు తెలిసింది. ప్రభూ! నీవు ప్రజల మన స్సులను శాసించటం లేదు. ప్రజల హృదయాలను పరిపాలిస్తున్నావు. నిజానికి నీవున్నది హస్తినాపురం సింహాసనం మీద కాదు. ఈ భూమి ప్రజల హృదయ సింహాసనం మీద. ప్రభూ! నీవు ప్రజల హృదయాలను చూరగొన్నవాడివి. వారి హృదయాలకు ఈశ్వరుడైన వాడివి. ప్రేమ స్వరూపుడవై వారి హృదయాలలో కొలువు తీర్చి, ధర్మ స్వరూపుడవై వారి మనస్సులను నడిపిస్తున్నవాడివి. వర మార్గము వైపుకు నడిపిస్తూ ప్రజలను పరవశింప జేస్తున్న ధర్మరక్షకుడవు నీవు. ధర్మరక్షకుడవే కాదు. ధర్మసంస్థాపకుడవు కూడా! అట్టి ధర్మసంస్థాపకుడ వైన నీకు పాదాక్రాంతుడనౌతున్నాను. నీ ఆజ్ఞకు లోబడి ప్రవర్తిస్తానని మనవి చేసుకుంటున్నాను.

"ప్రభూ! నన్ను వెళ్ళిపో! వెళ్ళిపో! అంటున్నారు మీరు. మీ ఆజ్ఞ కదా అని ఇందాకటినుంచి మానసికంగా వెళ్ళే ప్రయత్నం చేస్తున్నాను. ఎటు వెళదామా? అని చూస్తున్నాను. కాని ఎటువైపుకు చూసినా తళతళా మెరిసే కత్తిని ధరించి, దానిని మండలాకారంగా త్రిప్పుతూ హెచ్చరిస్తున్న ఈ మీరూపమే కన్నులకు కనబడుతోంది ప్రభూ! ఇంక ఎటు వెళ్ళాలి? ఎక్కడకు వెళ్ళాలి? నాకేమీ తోచటం లేదు ప్రభూ!

"మీరు శిక్షకులే కాదు. రక్షకులుకూడా! ఇంతవరకు నాపై మీరు మీ శిక్షణ స్వరూపాన్ని ప్రదర్శించారు. ఇప్పుడు మీకు శరణాగతి చెందిన నాపై మీ రక్షణ స్వరూపాన్ని కూడా ప్రసరింపచేయండి. ఈ దీనుణ్ణి వెళ్ళిపో మనకండి. వెళ్ళగలిగిన స్థితిలో లేదు వీడు. ఎటు చూసినా సర్వాంతర్యామియైన మీరే గోచరిస్తున్నవేళ ఇక మీరు కరుణిస్తే తప్ప వీడు నిలబడ గలిగిందెక్కడ?

కనుకప్రభూ! ఈ దీనుడు ఎటువెళ్ళాలో మీరే నిర్ణయించండి. ఎక్కడెక్కడ ఉండవచ్చునో కూడా మీరే నిర్ణయించండి. మీరు నిర్దేశించిన చోటులలో మీమాటకు కట్టుబడి ఒదిగి నడుచుకుంటానని మాట ఇస్తున్నాను. ఆదేశించండి. అనుగ్రహించండి". - అంటూ మళ్ళీ పరీక్షిత్తు పాదాలపై పడిపోయాడు కలిపురుషుడు. పరీక్షిత్తుకు జాలికలిగింది. 'పాపం! ఇతడుకూడా ఎక్కడో అక్కడుండాలి కదా! ఇతనికి ఏదో ఒకదారి చూపించాలి మనం." - అనుకుంటూ అతణ్ణి లేవనెత్తేందుకై అతడివైపుకు వంగాడు.

## అయిదు చోటులు

మనుగడ సాగించేటందుకు నాకింత చోటు పెట్టుమని పాదాక్రాంతుడై అడుగుతూ ఉన్న కలిని లేవనెత్తి ఇలా అన్నాడు పరీక్షిత్తు. "ఓ కలిపురుషుడా! శరణిచ్చితి నన్నాను కదా! ఇక నీవా దైన్యమును వదలి పెట్టు. ఎవ్వరైనను దీనముగా ఉండుట మాకు సమ్మతము కాదు. అదే సమయమున మా హెచ్చరిక ఏమిటో తెలియునా? నీవు నీ హద్దులను ఎన్నడూ మీర రాదు. ఎక్కడ ఉండటానికి నీకవకాశము ఈయబడుతుందో, అక్కడనే నీవు కాలక్షేపం చేయవలసి ఉంటుంది. ఆయా ప్రదేశముల నుండి మరల అతిక్రమించే ప్రయత్నం చేశావో, ఇదుగో ఇంతకు ముందు నీవు చెప్పావే ఎటుచూచినా ఈ రూపమే కనబడుతున్నదనీ, కనబడి భయపెడుతున్నదనీ, సరిగ్గా అదే జరుగుతుంది. గుర్తుంటుంది కదా! గుర్తు చేయ వలసిన అవసరము రానివ్వవు కదా! ఏయ్! ఏమంటావ్?"

పరీక్షిత్తు చేసిన హెచ్చరికకు మరల గడగడవణుకుతూ వినమ్రుడై శిరస్సు వంచి, జోడించిన చేతులు ఆ శిరస్సున కానించి ఇలా అన్నాడు కలిపురుషుడు: ప్రభూ! నీ వేమిటో తెలిసిన తరువాత కూడా, నీ నిజరూపమేమిటో దర్శనమిచ్చిన తరువాత కూడా ఇంకానేను నీ ఆజ్ఞను అతిక్రమింపగలనా? అందునా, నిన్ను శరణువేడి, నీ నుండి ప్రాణభిక్షను పొంది, మనుగడ సాగించటానికై ఇంత నీడను అడుగుతున్న వాడిని. ఆ నీడను ఇచ్చిన నీ పెద్ద మనస్సును మరచిపో గలనా? మరచి మన గలనా? మీ వంటి పెద్దలు నిగ్రహానుగ్రహ సమర్థులు కదా! మీ అనుగ్రహమును ఏ మాత్రము దుర్వినియోగము చేసినా, మీ ఆగ్రహమునకు లోనుగాక తప్పదు కదా! కనుక మీరు నన్ను శంకింప వలసిన పనిలేదు. నేనా మాత్రము కృతజ్ఞత లేని వాడను కాను ప్రభూ!

మీరిచ్చిన చోటులనే నా నివాసములుగా స్వీకరించి, కాలమును వెళ్ళబుచ్చుటకు సంసిద్ధుడనై ఉన్నాను ప్రభూ! అనుగ్రహించండి. అనతివ్వండి.

ఓ కలి పురుషుడా! నీ వేడికోలును మన్నించి, కొన్ని ప్రదేశాలను నీకు కేటాయించటం జరుగుతూ ఉన్నది. ఎచ్చట ప్రాణి వధ జరుగుతూ ఉన్నదో అచ్చట నీ వుండవచ్చును. ఎందువల్ల ననగా రెండు సందర్భములలో తప్ప జీవహింసను పెద్దలు అంగీకరించరు. ప్రాణమును నిలబెట్టు కొనుటకుకాని, లేదా ధర్మాన్ని రక్షించవలసి వచ్చినప్పుడు గాని హింస చేయ వచ్చును. ఈ రెండు అంశములను అతిక్రమించి జీవహింస జరుగుటకు పెద్దలు ఆమోదించరు. కనుక అలా ఎక్కడైనా జరుగుతుంటే, అది నీ ఉనికి పట్టుగా నీవు స్వీకరింప వచ్చును.

అట్లే పవిత్రమైన స్త్రీ పురుష సంబంధము ప్రాజాపత్యమనే యజ్ఞంగా పిలువబడుతున్నది. తరువాత తరాలు నిలబడేటందుకు గాను బ్రహ్మదేవునిచే రూపొందింప బడిన యజ్ఞమది. స్త్రీ పురుషులు తమకు తగిన వారసులను పొందేటందుకు, ఒకరి నొకరు అర్థం చేసుకుని, ఒకరు ఇంకొకరిలో అర్థం తెలిసికొని, అర్ధనారీశ్వరత్వమనే అద్వైత స్థితిని అనుభవించేటందుకు సర్వాం తర్యామి చేత సంకల్పింప బడింది ఈ స్త్రీ పురుష సంబంధం. అలాంటి పవిత్ర సంబంధాన్ని, పరమార్థాన్ని మరచి మలిన పరచుకునే అజ్ఞాను లెవరైనా ఉన్నచో అచ్చట నీ వుండ వచ్చును. యజ్ఞ సంబంధమైన స్త్రీ పురుష సంబం ధాన్ని, పరమార్థాన్ని విస్మరించి, వేడుక వంటి స్థితికి, వ్యసనము వంటి దుస్థితికీ అమ్ముడు పోయేటువంటి దారుణ స్థితికీ దిగజార్చే వాళ్ళుంటారు. అలా దిగజారి పోతున్న చోటులున్నాయే అక్కడ నీవుండవచ్చును.

ఇక జూదమాడే స్థలా లుంటాయి. విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి, ఇది పగలు ఇదిరేయి - అన్న భేదాన్ని మరచి పోతా రక్కడ. మన కున్నదీ, మన కులేదు అన్న స్థితిగతులు స్పృహలో ఉండ వక్కడ. దీనిని పందెం పెట్ట వచ్చును. దీనిని పెట్టరాదు - అన్న వివేకం పనిచేయ దక్కడ. జీవిత మంటే ఇదే కాదు. జీవితంలో మనం నెరవేర్చ వలసిన బాధ్యత లెన్నో ఉన్నాయి - అన్న ఆలోచన రాదక్కడ. మనతో ఆడుతున్న వీళ్ళే కాదు. మన కోసం ఇంట్లో ఎదురు చూస్తూ మాడుతున్న వాళ్ళున్నారు - అన్న సత్యం గుర్తుకు రాదక్కడ. ఓ కలిపురుషుడా! జూద మాడబడే చోటు అటువంటిది. మనిషిని అంతగా పతన మొందించగల స్థల మది. కనుక అలాంటి జూద స్థలాలలో నీవుండవచ్చు.

ఎక్కడ మద్యం సేవింప బడుతున్నదో అక్కడ నీవుండ వచ్చును. ఎందు వల్ల ననగా ఆ మద్యం మై మరపు కలిగిస్తుంది. మనిషిని అన్ని విధాలా తూలిపడి పోయేటట్లు చేస్తుంది. అతడు తాను తూలుతాడు. ఇతరులను తూల నాడు తాడు. తూలుతూ, తూలనాడుతూ, ఇది ఇల్లనీ, ఇది వీధనీ గ్రహించలేని స్థితిలో ఎక్కడ పడితే అక్కడే పడిపోతూ ఉంటాడు. ఓ కలిపురుషుడా! మానవ జన్మమెత్తిన తరువాత గ్రహించ వలసిన అంశా లెన్నో ఉన్నాయి. అందులో సుఖానికి సంబంధించినది ఒకటి. మనిషి తనను ఆనంద స్వరూపునిగా గుర్తె రిగి మనస్సునకూ, ఇంద్రియాలకూ తనదైన ఆనంద స్పర్శ నందించి సుఖపెట్ట గలగాలి. వివేకాన్ని కలిగియుండి, ఈ సృష్టిలోని వివిధాంశాలను స్వీకరించి ఆ మనస్సుకూ, ఇంద్రియాలకూ తగు మాత్రంగా తగిన సుఖాల నందించ గలిగి ఉండాలి. ఇలా మనస్సునూ, ఇంద్రియాలనూ తాను సుఖపెట్టవలసింది పోయి, మనస్సు ఇంద్రియాల ద్వారా తాను సుఖపడదామన్న భ్రాంతిలో పడి నప్పుడు మానవుడు వ్యసన పరుడౌతున్నాడు. మొదటికే మోసం తెచ్చుకొంటున్నాడు. మనస్సూ, ఇంద్రియాల ద్వారా సుఖపడదామని చూస్తున్న మానవుడు ఆ భ్రాంతిలో పడి పవిత్రమైన ఆ ఉప కరణాలను పాడుచేసుకుంటున్నాడు. కుళ్ళ బొడుచు కుంటున్నాడు. కుళ్ళ బెట్టుకుంటున్నాడు. ఏ సుఖానికి పర్యవసా నంగా దుఃఖం సిద్ధిస్తున్నదో అది సుఖమెలా అవుతుంది? కనుక మనిషి ఇలా కోరి పతనమైపోతున్నచోట, మద్యపానలోలుడై తూలి పడి పోతున్న వేళ, ఆ పతన స్థానమున నీ పనితనము చూప వచ్చును.

నీవు అవలక్షణములకు ఆటపట్టువు. కనుక ఆ అవలక్షణములకు ఎక్కడె క్కడ అవకాశము లభించ గలదో అలాంటి ప్రదేశాలను ఎంచి చూసి మరీ నీకు కేటాయించడం జరుగుతున్నది. ఆ నాలుగు స్థానాలలోను జీవులు ధర్మాన్ని అతిక్రమించి బ్రతుకుతున్నారు కనుక, ఆ స్థానాలను నీ నివాసాలుగా చేసుకుని నీవు మనుగడ సాగించవచ్చు. జీవితాలలో పతనమౌతున్న మానవులే గదా ఆ చోటులలోనే కాన వచ్చేది. వారిని నీవు ఆవహించి, నీ అవలక్షణాలను వారిలో విజృంభింప జేయవచ్చు. ఇలా జరగడం వలన, ఇలాంటి దృశ్యాలను చూడటం వలన మిగిలిన ప్రజలు అలాంటి ప్రవర్తనలకు లోను కాకుండా జాగ్రత్తపడ గలుగుతారు. ధర్మాన్ని అతిక్రమించిన వేళ మనం కూడా ఇలా అయిపోతాం సుమా! అన్న హెచ్చరికగా నీ స్వరూపం వారికి పనికి వస్తుంది. చూశావా! కలిపురుషుడా! నేను నిన్ను కూడ వినియోగించుకో దలుచుకున్నాను. ప్రజలను కర్మ నిష్ఠులను చేయటంలో నీ పాత్రను కూడా నేను వినియోగించదలిచాను.

పొలం గట్టుపై తిరుగుతున్న రైతన్నకు ముళ్ళ మండ ఒకటి కాళ్ళకు తగిలి గుచ్చుకో బోతుంది. అప్పుడతను నిపుణతతో దానిని పైకి తీసి గ్రుచ్చుకొన కుండా చేత పట్టుకొని అలా నడిచి వెళుతూ ఆ చేనుకు రక్షణగా వేయబడిన కోరడిలో దానిని పడవేస్తాడు. దాని పాత్రను దానికి అప్పజెపుతాడు. ఇప్పుడు నేను చేస్తున్నది కూడా సరిగ్గా అదే. ఈనా ధర్మరక్షణ కార్యక్రమంలో నేను పెట్టిన ఈ నియమాలలో ఒదిగి నీవు కూడ నీ పాత్రను పోషించు. ఏమి! తృప్తిగా ఉన్నదా? నీ కీయ బడిన ఈ అవకాశం."

ఆ అవకాశానికి స్పందిస్తూ కలిపురుషుడు "ప్రభూ! మరిన్ని చోటులు కేటాయించరా? యుగ ధర్మ స్వరూపమైన ఈ దేహం వ్యాపించటానికి మరి కొన్ని చోటులు కావాలనిపిస్తున్నది ప్రభూ! ఈ నా కోరిక మన్నించదగిన దని మీ కనిపిస్తే మరి కొన్ని చోటులు నాకు చూపించండి" - అన్నాడు.

కలి పురుషుని కోరికకు ఒక్క క్షణం ఆలోచించి ఇలా అన్నాడు పరీక్షిత్తు. "ఓ కలిపురుషుడా! నేను చెబుతున్న ఈ అంశాన్ని గమనించు. మనుష్యులలో బంగారంపైన, డబ్బుపైన వ్యామోహాన్ని పెంచుకునే వారుంటారు. ఒకసారి ఆ వ్యామోహం పెరగడం మొదలు పెడితే ఒక పట్టాన దానికి అంతు కన బడదు. మనిషికి అన్నింటి కన్న ముఖ్యం ఎవరు? తోటి మనిషి. కాని ధన వ్యామోహానికి లోనైన వారికి ఈ సత్యం యెడల కన్నులు మూసుకు పోతాయి. అంతే కాదు. ఆ బంగారాన్ని, ధనాన్ని మరింత పెంచుకోవ టానికి గాను, అబద్ధాలాడటం అలవాటు చేసుకుంటారు. మనకే కదా ధన మున్నదని తోటి వారిని లెక్కచేయకుండా మదించి మెలగుతారు. మనకే కదా డబ్బున్నదని భోగ లాలసులవుతారు. తమకు పనిచేసి పెట్టేవారి స్థితి గతు లను పట్టించుకోకుండా వారిని కూడా గృహోపకరణాలలో భాగంగా చూస్తూ, వారిని హింసిస్తూ, తాము వారి నుండి సేవ లందు కుంటూ ఉంటారు. భోగ భాగ్యాల విషయమై లేని పోని కలహాలను కొని తెచ్చుకొని, వాటిలో మునిగి తేలుతూ ఉంటారు. ఇలా ధన వ్యామోహం మానవుణ్ణి అయిదు విధా లుగా పడగొడుతూ ఉన్నది. ఆ అయిదు చోటులను నీవు స్వీకరింప వచ్చును. ఇంతకు మించి మరొక ప్రదేశాన్ని నీవు ఆశించేటందుకు వీలుపడదు. ఇది నా నిర్ణయం. ఇచ్చిన వాటితో తృప్తిపడు. వాటిని నీకెందు కిచ్చానో తెలిసి వర్తించు. నాకు శరణాగతుడవైన నీవు నా జీవిత కార్యమైన ధర్మరక్షణలో ఒక ఉపకరణానివి కావలసి యున్నది. ఈ సత్యాన్ని బోధపరచుకుని మెలగ గలవని విశ్వసిస్తూ నిన్ను విడిచి పెడుతున్నాను. ఇక నీవు వెళ్ళి రావచ్చు."

- అంటూ కలిపురుషుణ్ణి పంపివేశాడు పరీక్షిత్తు.

ఇక అతడి దృష్టి గో, వృషభాలపైన పడింది. వారిని సమీపించాడు. నమస్కరించాడు. నమస్కారముద్రను అలాగే ఉంచి ఇలా అన్నాడు పరీక్షిత్తు: ఓ ధర్మదేవతా! నీవిక నాలుగు పాదాలతో నడవవచ్చు. జరిగిన బాధాకర సన్నివేశాలను ఇక గుర్తుచేసుకోవద్దు. ఏమి జరగబోతూ ఉన్నదా అని ఆలోచించవద్దు. సర్వాంతర్యామికి ప్రతినిధిగా ఉన్న నన్ను ఆశీర్వదించి, నా చేత కర్తవ్యాన్ని నిర్వర్తింపజేయి. నీ సాక్షాత్కారం లభించడం సామాన్యమైన అంశం కాదు. దీనిని కేవలం దైవానుగ్రహంగా నేను స్వీకరిస్తున్నాను. అందునా సింహాసనాన్ని స్వీకరించి, పరిపాలనను ప్రారంభించిన క్షణాలలో నీ దర్శనం లభించటం, నీ సందేశాన్ని అందుకోవడం నా అదృష్టంగా భావిస్తున్నాను. కలిపురుషుడి విషయంలో నేను వర్తించిన తీరు నీకు తృప్తి కలిగించిందను కుంటున్నాను. ఇక నీవు నాలుగు పాదాలతో నడిచి, ఈ భూమిని పరవశింపజేయి.

ఓ భూమాతా! కన్నీటి కిక స్వస్తి చెప్పు తల్లీ! నీ కన్నులలోని తళుకు ఇక తగ్గదు. నీ పారవశ్యానికి ఇక విఘాతం కలుగదు. పాడి పంటలతో చిరకాలం వర్ధిల్లు. నీ నిండుదనానికి ఏ మాత్రం లోటు రాకుండా చూసుకునేందుకు నేనున్నాను. అంది వచ్చిన బిడ్డడుండగా అమ్మా! నీ పందుకొన లేనిది ఉండునా? నీ పూర్వవైభవం మళ్ళీ నీకందుతుంది. మళ్ళీ నీకు చెందుతుంది. సకల లోకాలు మళ్ళీ నీవైపుకు ఆశ్చర్యంతో చూస్తాయి. బ్రహ్మాది దేవతలు మళ్ళీ నిన్ను చూచి ముచ్చట పడతారు. వ్యాసాది మహర్షులు నిన్ను ఆలంబనగా చేసుకుని సకల లోకాల వారికీ సనాతన ధర్మాన్ని సరస మధురంగా అందిస్తారు. అమృత ప్రాయమైన స్థితి. అమ్మా! మళ్ళీ నీకు అనుభవానికి వస్తుంది.

"ఓ దేవతా మూర్తులారా! నన్ను ఆశీర్వదించి పంపండి. ఈనా జీవితాన్ని మీ సేవలో సార్థకం చేసుకోవటానికి అంకిత భావంతో ఉన్న నన్ను మీ వాడినిగా, కనిపెట్టుకుని కాచుకోండి. ఉంటాను ఇక మీ సేవలోనే ఉంటాను. అంటూ పరీక్షిత్తు వినమ్రుడై నమస్కరించి, ఆ భూమాతా, ధర్మ దేవతల నుండి సెలవు తీసికొని హస్తిన వైపుకు సాగాడు.

# కలి లక్షణం

కలిపురుషుడి స్వరూప స్వభావాలను గూర్చి మన పెద్దలు మరి కొన్ని అంశాలు కూడా చెబుతారు. ఇంత వరకు మనం చెప్పుకున్న అంశాలకు వీటిని కూడ కలుపుకోవడం ఎంతైనా అవసరం. అప్పుడు కలి ప్రభావాన్ని దమించడానికి గాను కావలసిన సూక్ష్మాలు మనకు మరికొన్ని అందుతాయి.

కలిపురుషుడు ఉక్కు కిరీటం పెట్టు కుంటాడట. అతని భుజకీర్తులు మొదలైనవి కూడ ఉక్కుతోనే తయారు చేయబడి ఉంటాయట. తుదకు అతని పాదరక్షలు కూడ ఉక్కువేనట. కనుక ఇనుము, ఉక్కు మొదలైన వాటిని వినియోగించుకునే విషయంలో మానవులు కొన్ని జాగ్రత్తలు తీసు కోవాలి. లేక పోయినట్లైతే ఆ లోహాల మీదుగా కలి మానవ జాతిని సోకే ప్రమాద మున్నది.

మనకు తెలుసును. ఇంకా మనం కలియుగం ప్రథమ పాదంలోనే ఉన్నా మని. ఇప్పటికే ఇనుము, ఉక్కు రకరకాల వేషాలు వేసుకొని మానవజాతిచేత ఆదరింప బడుతున్నాయి. మన పూర్వులు వ్యవసాయానికి, వృత్తులకు పనికి వచ్చే పనిముట్ల తయారీలలోనే ఇనుమును స్వీకరించేవారు. ఆ పరికరాలను కూడా పని పూర్తి కాగానే వాటి కొరకు ఏర్పాటు చేయబడిన ప్రత్యేక స్థానా లలో పడవేసేవారు. ఇళ్ళలోనికి రానిచ్చేవారుకారు. ఇప్పుడు మనం కుర్చీల రూపంలో, మంచాల రూపంలో, అలమరలు, బీరువాల రూపంలో ఇంటిని ఇను పమయం చేస్తున్నాం. కాలికీ, చేతికీ నిరంతరం ఏదో ఒక రూపంలో ఇనుమే మనకు తగులుతోంది. అది ఏమాత్రం గీసుకున్నా విషమిస్తుందని కూడా మనకు తెలుసు. ఆ గీసుకున్నప్పుడు అశ్రద్ధ చేసినా, సరిగా నివారణ చేసుకోక పోయినా ధనుర్వాతం మొదలైన దారుణ, మారణ వ్యాధులు ప్రాప్తిస్తాయని కూడా మనకు తెలుసు. అయినా ఎందుకనో ఇంటిని ఇనుపమయం చేస్తున్నాం.

చిత్రమైన విషయమేమిటంటే గృహోపకరణాలు గానేకాక, వంటింటిని కూడా ఇనుము ఆక్రమించగలగటం. ఇవాళ మనం వంటిళ్ళలోని పాత్రలలో ఎక్కువభాగం ఇనుముకు సంబంధించినవే కదా! గిన్నెలు, చెంబులు, కంచాలు, గ్లాసులు, చెంచాలు ఒకటేమిటి? కలి ధరించని రూపమంటూ లేదు. 'స్టెయి న్‌లెస్ స్టీల్' రూపంలో తళతళా మెరుస్తూ మరీ ఆక్ర మిస్తున్నాడు. పూర్వం

పాలు కాచుకునేందుకు, పెరుగూ, వెన్న మొదలైన వాటిని అట్టిపెట్టుకునే టందుకు కుండలను వాడేవారు. ఇప్పుడన్నీ స్టీలు గిన్నెలే. కుండలో పాలు పోసి, పిడకలపై కాచినప్పుడు ఆ వచ్చే రుచి ఎన్ని జన్మలెత్తితే ఈ స్టెయిన్ లెస్ స్టీలుకు లభిస్తుంది? రాదని తెలిసినా, లేదని తెలిసినా స్టీలు గిన్నెలతోనే మనం సరిపెట్టుకుంటున్నాం. పులుసూ మొదలైనవి పెట్టుకునేటందుకు రాచి ప్పలను వాడేవారు. అమోఘమైన రుచిని అనుభవించేవారు. ఇప్పుడు మనం దానికీ స్టీలు గిన్నెలనే వాడుతున్నాం. పాలు, కాఫీ మొదలైనవి త్రాగటానికి పింగాణీ కప్పులూ, సాసర్లూ వాడేవారు. ఇప్పుడు మనం స్టీలు గ్లాసులతో త్రాగు తున్నాం. స్టీలు గ్లాసులో వేడిపాలుగాని, వేడి కాఫీగాని పోస్తే త్రాగే వాడికి ఎంత అసౌకర్యంగా ఉంటుందో మనకు తెలుసు. అయినా మనం స్టీలును వదలలేక పోతున్నాం. స్టీలు గ్లాసులో కాఫీ పోస్తే త్రాగే వాడి చేతికిచ్చేటప్పు టికి గ్లాసు వేడెక్కిపోతుంది. వేడిగా ఉందని వాడు కాస్త తటపటాయిస్తే కాఫీ కాస్తా చల్లబడి చూరునీళ్లై కూర్చుంటుంది. ఏం జరుగుతోందక్కడ? మీ కాఫీలోని వేడి కాస్తా, ఆ స్టీలు గ్లాసు తీసేసుకుంటోంది. స్టీల్ అంటే ఏమిటి? 'దొంగిలించటం' అని కదా! అర్థం. కాఫీ వేడిని అది దొంగిలిస్తోంది. పులుసు రుచిని మాయం చేస్తోంది. పాలరుచిని హరించి వేస్తోంది. వంటలూ, వంటకాలు స్టీలు పుణ్యమా అని రుచీ పచీ లేకుండా తయారవుతున్నాయి. ఆ రుచీ పచీ లేని వంటకాలను ఆఫీసులకూ, వృత్తి వ్యాపారాలకు టైం అయి పోతోందని ఏదో ఇంత నోట కొట్టుకుని పోతున్నాం. పదార్థాలకు రుచిలేదు. అనుభవించేందుకు తీరిక లేదు. ఇలా మనిషిని హర్రీగా, వర్రీగా పరిగెత్తిస్తున్నాడు కలి పురుషుడు. నేనొక్క మాట అడుగుతాను చెప్పండి. మన పూర్వీల కన్నా ఇవాళ మనకు సౌకర్యాలు పెరిగాయి. సుఖపడే అవకాశాలు పెరిగాయి. సంపాదనలు పెరిగాయి. హోదాలు పెరిగాయి. కాని వారు బ్రతికినట్లు మనం బ్రతక గలుగుతున్నామా? భోజనంలోగాని, జీవితంలో గాని వారనుభవించినంత రుచిని మనం అనుభవించ గలుగుతున్నామా? ఆలోచించండి. మరి వారికన్న మనం సాధించిన అభ్యుదయ మేమిటి? అభివృద్ధి ఏమిటి? అసలు అంశం లోపించిన తరువాత ఎన్ని ఉంటే ఏమిటి! ఇంకొక సత్యం చెబుతాను. స్టీల్ అంటే దొంగిలించడ మన్న అర్థం చెప్పాను. మన జీవతంలోని రుచిని ఇది హరిస్తున్నదని చెప్పాను. మీరు కొంచెం పరిశీలనగా చూడండి. స్టీల్‌ను మనం వంటిళ్ళలోనికి ప్రవేశ పెట్టడం మొదలు పెట్టిన తరువాత క్రమంగా మనలోని ప్రేమలు, అభిమానాలూ, అనురాగాలూ, ఆపేక్షలూ తగ్గిపోతున్నాయి. ఇంకా

చెప్పాలంటే లేకుండా సొంతం వెళ్లిపోతున్నాయి. ఉమ్మడి కుటుంబాలు క్రమంగా విడి కుటుంబాలై పోయినాయి. ఒకప్పుడు అతిథి లేకుండా భారతీయుడు విస్తరి ముందుకూర్చునేవాడు కాదు. ఇవాళ అతిథులు రాకూడదని దణ్ణంపెట్టు కుంటున్నాం. ఒకాయన మా ఇంటికి ఇవాళ గెస్ట్‌వచ్చాడు. తొందరగా వెళ్ళక తప్పదూ! అన్నాడు. ఎవరిని ప్రశ్నిస్తే మా తమ్ముడండీ అన్నాడు. బాగున్నది. అన్నదమ్ములు మనకు అతిథులై పోతున్నారు. స్టీలు పాత్రలలో వంట చేసిన వారికి కుటుంబ సభ్యులకు తప్ప ఇంకొకరికి పెట్టాలని పించదు. పూర్వం మిగిలిన పదార్థాలను పనిమనుషులకు పెట్టేవారు. ఇప్పుడు పెట్టడం మానే శారు. మిగిలిన పదార్థాలను ఫ్రిజ్‌లలో దాచుకొని, శవ ప్రాయంగా రూపొందిన వాటిని రాత్రికి వేడి చేసుకుని మరీ తింటున్నారు. ఇది శవానికి చలిమంట వేయడం లాంటిది. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే - ఇంకొకరికి పెట్టాలన్న బుద్ధి మనలో తరిగి పోతున్నది. స్టీలు వస్తువులకు బదులుగా ఇత్తడి, కంచు, పింగాణీ, గాజు మొదలైన వాటితో తయారు చేయబడిన వాటిని వాడటం ఎంతైనా అవసరం. అలాచేస్తే కలిప్రవేశాన్ని మనం అరికట్టడానికి ప్రయత్నించిన వాళ్ళ మవుతాం. చేసి చూడండి. చేయటం ఎలా సాధ్యమని అనుకోకండి. కలిపురుషుడు మీ కలా అనిపించేట్లు చేస్తాడు. తన ప్రభావాన్ని మీ పైన నిలువు కోవాలని చూస్తున్నాడు కనుక. దృఢంగా సంకల్పించి, గృహపరిసరాలలో కలిపు రుషునికి చోటుపెట్టని స్థితిని రూపొందించండి.

మరొక అంశం. విభేదం కలి లక్షణం. విభేదం, వివాదం, విమర్శ - అంటే దుర్విమర్శ - ఇవి ఎక్కడ ఉంటాయో కలి అక్కడ ఉంటాడు. కలి ప్రభావం సోకిన క్షణాలలో మానవునకు విభేదించాలనిపిస్తుంది. విడిపోవాలని పిస్తుంది. వివాదాలకు, ఘర్షణలకు దిగి తీరాలనిపిస్తుంది. ఇతరులను గూర్చి తప్పు పట్టాలని పిస్తుంది. వాళ్ళను గూర్చి అందరకూ చెడుగా చెప్పాలని పిస్తుంది.

ఎదుటి మనిషితో మనమెలా ఒకటి కాగలం? మనం ఎలా ఒకటిగా ఉండ గలం? - అన్న ఆలోచనవస్తే అది మానవధర్మం. ఎదుటి మనిషితో మనమెలా విభేదించగలం? అతడి కన్నా మనం ఎలా ఎక్కువ? ఆ ఎక్కువను ఎలా నిరూపించుకోగలం? అన్న ఆలోచన వస్తే అది కలి లక్షణం. ఎదుటి వ్యక్తిని మనమెలా కలుపుకోగలం? అతడితో మనమెలా కలిసుండ గలం? అన్న ఆలోచన వస్తే అది మానవ ధర్మం. ఎదుటివాడిని మన కన్నా వేరుగా ఎలా చూడ గలం? అతడి నుండి మనం ఎలా విడిపోగలం? అన్న ఆలోచన వస్తే అది

కలి లక్షణం. మనకు తెలుసు. మనపైన కలిప్రభావం ఎలా పని చేస్తున్నదో! ఇవాళ ప్రపంచంలో మనిషికి మనిషి కనపడటంలేదు. జాతి కనబడుతోంది. కులం కనబడుతోంది. మతం కన బడుతోంది. మనిషికి మనిషి కనబడటం లేదు. పార్టీ కనబడుతోంది. వర్గం కనబడుతోంది. ముఠా కనబడుతోంది. మనిషికి మనిషి కనబడటం లేదు. ఉద్యోగం కనబడుతోంది. హోదా కనబడుతోంది. అంతస్తు కనబడుతోంది. ఇలా ఎన్నెన్నో కనబడుతున్నాయి. తోటి మనిషిలో మనిషి తప్ప అన్నీ కనబడుతున్నాయి. ఇవన్నీ కనబడుతూ ఏం చేస్తున్నాయి? మనిషినుండి మనిషిని వేరు చేస్తున్నాయి. మనిషిని మనిషికి శత్రువును చేస్తున్నాయి. మనిషిని చూసి మనిషి దడుసుకునేట్లు చేస్తున్నాయి. మనిషిని చూసి మనిషి పారిపోయేట్లు చేస్తున్నాయి. చూశారా! కలి ప్రభావం మనపై ఎలా పని చేస్తున్నదో!

మీ కొక ఉదాహరణ చెబుతాను. ఇటీవల కాలంలో కలిపురుషుడు నడిపించిన కొన్ని ఘట్టాలను చూపిస్తాను. ఆంగ్లేయుల రూపంలో కలిపురుషుడు పనిచేసి, మనను ఎలా ముక్కలు చేశాడో గమనించండి. విభజించి పాలించడమనేది ఆంగ్లేయుల సిద్ధాంతం. ఇది సాక్షాత్తు కలి స్వరూపం. వారి రూపంలో కలిమనమీద పని చేశాడు. మనని ముక్కలు చేశాడు. భారత దేశం ముక్కలుగా విడిపోవలసిన అవసరం ఏ మొచ్చింది? విడిపోయిన తరువాత వారు బావుకున్నది మాత్రం ఏమున్నది? ఒక పాకిస్తాన్‌లో గాని, ఒక బంగ్లాదేశ్‌లో గాని ప్రజలు ఎంత సుఖపడుతున్నారో మనకు తెలుసు. వాళ్ళకీ తెలుసు. రక్తపాతాలు సృష్టించుకుని విడిపోయి వాళ్ళు బావుకున్న దేమిటి? బావుకుంటున్న దేమిటి? కలి ప్రభావానికి అతీతంగా నిలచిన అరవిందుడు ఆనాడే, ఆ సంఘటనలు జరుగుతూ ఉండగానే గొంతెత్తి ఒక మాట చెప్పాడు. ఈ విడిపోవటం కూడని పని. జరుగకూడని పని. ఈ జరుగకూడని పని జరిగితే ఏమవుతుందో తెలుసునా? ఆ విడి పోతున్న పాకిస్తాన్ మళ్ళీ విశాల భారతంలో భాగమై కలసిపోతుంది. ఇది తప్పదు. అప్పుడే ఆ ప్రజలు నిజమైన సుఖ శాంతులనుభవించ గలుగుతారు. ఎప్పటికైనా ఈ ఖండ భారతం అఖండ భారతంగా రూపు దాల్చి తీరుతుంది. చూశారా! ఆ మహనీయుడెలా ఉద్ఘోషించాడో!

ఇంత జరిగి, ఇన్ని చూస్తూ కూడా మళ్ళీ పంజాబులో ఉగ్రవాదులేమంటున్నారు? మాకు ఖలిస్థాన్ కావాలి అంటున్నారు. వారు కోరుతున్నది ఖలిస్థాన్‌నా? కలి స్థానాన్నా? కలి ప్రభావం ఎంతగా పడిపోయింది! ఖలిస్థాన్,

ఖలిస్థాన్ అంటాడు తప్ప, కలుస్తాను నేను తోటివాడితో కలుస్తాను అని నేటి మానవుడు అనడేం? అనలేక పోతున్నాడేం? విడిపోయి బావుకునేది లేదని తెలిసికూడా, విడిపోవాలని ఎందుకు అనిపిస్తున్నది. కలి ప్రభావమంటే అదే. దానిని మనం దమించవలసి యున్నది. ఇది కలియుగం కనుక కలి ప్రభావం మనమీద పడటం సహజం. కాని, మనమేమాత్రం ఏమరుపాటు చెందకుండా ఆ కలి ప్రభావానికి అతీతంగా నిలబడటం కూడా అంతే అవసరం.

ఇది కలియుగ మంటున్నారు కదా! కలి ప్రభావం మనమీద పడటం సహజమంటున్నారు కదా! అలాంటప్పుడు మనం కలి ప్రభావానికి లోనుగాక ఏం చేస్తాం? మన ఖర్మమనుకొని, యుగధర్మమనుకొని అనుభవిద్దాం. అని అనుకోకండి. అని సరిపెట్టుకోకండి. అని ఆ కలి పురుషుడికి స్వాగతం పలుకకండి. అతనికి సలాములు కొట్టకండి.

చూడండి! వర్షం వస్తుంటే ఏం చేస్తున్నాం? ఋతుధర్మం కదా అని తడుస్తూ వెళుతున్నామా? లేదే. గొడుగు వేసుకుని వెళుతున్నాం. ఎండ మండుతుంటే ఏం చేస్తున్నాం? ఋతుధర్మం కదా అని మాడుతున్నామా? నెత్తికి గొడుగూ, కాలికి చెప్పులూ అందిస్తున్నాం. చలి పులిలా భయపెడుతుంటే ఏం చేస్తున్నాం? ఋతుధర్మం కదా! అని భయపడి వణుకుతూ కూర్చుంటు న్నామా? రగ్గు కప్పుకొని మఫ్లర్ చుట్టుకొని మరీ పడుకుంటున్నాం. అలాంటిదే కలి ధర్మం కూడా! యుగధర్మమని ఊరుకోకూడదు. దానిలో పడి పోకూడదు. దానిలో పడి కొట్టుకు పోకూడదు. పరీక్షిత్తులాగా దమించాలి. కలి మనకు పాదాక్రాంతం కావాలి.

సోదరులారా! ఇది మనం పరీక్షిత్తులై నిలువవలసిన సమయం. లేవండి. పరీక్షిత్తులై నిలబడండి. కలిని దమించండి. ధర్మాన్ని నాలుగు పాదాలా నడిపించండి. భూమాత కన్నీటిని తుడవండి. ధర్మబద్ధమైన మన జీవితాలతో ఆ తల్లి నిలువెల్ల పులకించి పోయేటట్లు చేయండి. అందుకు మనం పరీక్షిత్తులమై నిలబడాలి. వ్యాస భగవానుడు పరీక్షిత్తును మన కనులముందు నిలబెడుతున్నది అందుకే. అలా మనం నిలబడాలని ఉపదేశించేటందుకే. నేడు ప్రతి యువకుడు ఒక పరీక్షిత్తు కావాలి. అడుగడుగునా కలి దమనం జరగాలి. ధర్మతేజం విస్తరిల్లాలి. ఈ కర్మభూమి సకల లోక వాసులకూ కనులవిందు చేయాలి.

# పెరిగే సుళువు

కలిని దమించి, భూమాత, ధర్మ దేవతలకు అభయమిచ్చి హస్తినాపురం చేరుకున్న పరీక్షిత్తు వయస్సునకు మించిన పరిణతిని చెందినవాడై ఏరంగం లోనూ గజిబిజి అనేది లేకుండా నిండుగా పరిపాలన చేయసాగాడు. కలికాల ప్రారంభంలో ఇలా కలిని దమించి సర్వులకూ తృప్తికరమైన పరిపాలన నందించ గలగటం నిజంగా విశేషమే. పరీక్షిత్తు కారణజన్ముడు గనుక ఇది సాధ్యమైంది. అంటూ సూతుడు శౌనకాది మహామునులకు పరీక్షిత్తు కథను చెప్పకుంటూ వస్తున్నాడు.

అతడు కలిని దమించాడు. కలికి కూడ తన ప్రణాళికలో ఒక పాత్ర నను గ్రహించాడు. కలికాలానికి సంబంధించిన కొన్ని సుళువులు కూడ మనం గ్రహిం చుకోవలసి ఉంది. ఈ యుగంలో పాపాలు మాత్రం, చేస్తేనే అంటుతాయి. పుణ్యకార్యాలు మాత్రం, చేస్తే అంటటమే కాకుండా, చేద్దామని ఆలోచనలు ఉన్నా, మానసికమైన ప్రయత్నమున్నా, ఎంతో కొంత పుణ్య ఫలితాన్ని ఇస్తూనే ఉంటాయి. మంచి పనులు నిర్విఘ్నంగా కొనసాగించడంలో కావలసినంత దీక్షను ఎక్కువమంది చూపలేక పోవచ్చు. కొందరికే అది సాధ్యపడవచ్చు. కాని మంచి పనులు చేద్దామనీ, చేయాలనీ ఆలోచనలూ, ఊహలు, కోరికలూ, సంకల్పాలు కలవారు ఎక్కువమంది ఉండేందుకు అవకాశాలు లభిస్తాయి. ప్రోత్సాహం లభి స్తుంది. సన్మానాలూ, సత్కారాలూ చుట్టు ముడతాయి. అయితే మనుష్యులు మంచి భావనలకు ఈ ఆదరణ లభిస్తున్నదని తెలిసి, వాటికి కార్యరూపం ఇచ్చే టందుకు ముందుకు సాగాలి. మన పూర్వులుచేసిన మంచి పనులలో మనమొక సహస్రాంశంచేసినా లోకం గజారోహణం చేయించినంత పనిచేస్తుంది. అంటే మనమంత గొప్పవాళ్ళమై పోయామని అర్థంకాదు. మంచిపనులుచేయటం అరు దైపోయిన కాలంలో ఈమాత్రం మంచిపనైనా జరుగుతూ ఉన్నదని లోకం సంబరపడుతూ ఉన్నదని అర్థం. ఆ సంబరాన్ని గ్రహించుకొని మనం మరింతగా సత్కర్మాచరణకు అంకితం కావలసి ఉంది. ఇక పాపమనేది, పాపకార్యమాచ రిస్తే గాని అంటుకోదు. కనుక, కలి ఒక ప్రక్కన ఉన్నా నష్టమేమీలేదు. పైగా పరీక్షిత్తు చెప్పినట్లు ప్రయోజనం కూడా ఉంది. పాప కార్యాచరణలోని మారణ దృశ్యాలూ, దారుణ ఫలితాలు కళ్ళకు కట్టేట్టుచేస్తూ అతడు భయపెడుతూ ఉంటాడు గనుక.

ధీరులైన వారిని కలి ఏమీ చేయలేడు. వారిపై తన ప్రభావం చూపలేడు. ఇక మానసికంగా బలహీనులైన వారిమీదనే కలి తన ప్రభావాన్ని చూపించేది. బలహీన మనస్కులైన వారిని మాత్రం మందలోనుండి ప్రక్కకు తప్పకున్న జంతువును అకస్మాత్తుగా తోడేలు పట్టుకున్నట్లుగా పట్టుకుంటాడు కలి. సత్కార్మాచరణకు అవశ్యకమైన సంసిద్ధత లేని వారినీ, సంస్కారం పొందని వారినీ, ధైర్యం లేని వారినీ, ఆ సత్కార్మాచరణం ఎడల ఉన్ముఖతలేని వారినీ అతడు పొదివి పట్టుకుంటాడు. తన పట్టేమిటో చూపిస్తాడు. జీవితమంటే అవగాహన కలిగిన వారినీ, భవిష్యత్తు అంటే భయంలేని వారినీ, జీవితాన్ని సత్కార్మాచరణగా రూపుధరింపజేస్తూ అందులో ఆనందం అనుభవిస్తున్న వారినీ కలి ఏంచేయుడు. ఏం చేయలేడు. తన రాజ్యంలోని ప్రజలందరూ ధీరులై మెలిగేట్లుగా చూచుకోగలడు కనుక పరీక్షిత్తుకు కలి వలన వచ్చిన ఇబ్బందిలేదు.

ఇలా దివ్యమైన అతని పరిపాలన కొన్ని దశాబ్దాల పాటుసాగింది. జాతి స్వర్ణయుగాన్ని అనుభవించింది. 'ధర్మ సంస్థాపన పేరిట శ్రీకృష్ణుడు సాధించిందేమిటి? కురుక్షేత్రాన్నే కదా!' అనేవారున్నారు. దానికి సమాధానం ఏమంటే భూభార నిర్వాపణకై అతడు కురుక్షేత్రమనే రణయజ్ఞాన్ని నిర్వర్తింపజేశాడు. ఆపైన పరీక్షిత్తు పరిపాలనగా తన ధర్మవైభవాన్ని వ్యక్తంచేశాడు. ఈ కథలను మనం కన్నుకలిగి చూడవలసిఉంది. అలాగాక మనకు కళ్లు కలిగితే ప్రమాదం.

ఇలా పరీక్షిత్తు పరిపాలన భూమికి పరిపూర్ణ వైభవాన్ని అందిస్తూ ఉండగా, దైవయోగంచేత అతడికి మునిశాపం ప్రాప్తించింది. 'శాపకారణంగా ఇక నేను చనిపోతున్నానన్నమాట' — అని ఒక్క క్షణం బాధపడ్డాడు పరీక్షిత్తు. మరుక్షణం తననుతాను కూడదీసుకున్నాడు. మృత్యువును గూర్చి భయపడడం కాదిప్పుడు చేయవలసింది. మృత్యువు లోపలగల ఈ జీవితాన్ని సద్వినియోగం చేసుకోవాలి అని గట్టిగా అనుకున్నాడు. ఆ అనుకోవడాన్ని అందుకున్నాడు శుకయోగి. అతణ్ణి సమీపించాడు. గంగ ఒడ్డున దీక్షతో ఉన్న అతనికి భాగవతాన్ని ఉపదేశించాడు. నేను చనిపోతానేమో అని మొదట అనుకున్న పరీక్షిత్తు, చనిపోవడమన్నది లేదు. మృత్యువన్నది లేదు ఈ నేను శాశ్వతుడను. అన్న సత్యాన్ని అనుభవానికి తెచ్చుకుని దేహాన్ని విడిచిపుచ్చి అమృతత్వాన్ని పొందాడు. పళ్లతోనిండిన వృక్షాన్ని రాయిపెట్టి కొడితే, ఆ కొట్టినందుకు ఫలంగా పళ్ళనే ఇస్తుంది. భాగవత మూర్తియైన పరీక్షిత్తు భూమిమీద ఒకడు తనను శపించగా, ఆ శాపానికి ఫలంగా భూమి జనులందరకు చిరకాలము అమృతత్వాన్ని అందిం

చగల భాగవతాన్ని తన నిమిత్తంగా అందేట్లుగా చేశాడు. ఒక అనితర సాధ్యమైన కానుకగా భూమికి దానిని అందించాడు. ఆ చంద్రతారార్కము వెలుగుల లోకాల వెంట నరులను నడిపించగల, వారిని బంధములనుండి విడిపించి, జీవన్ముక్తస్థితిని అందించగల ఆ భాగవతాన్ని తన స్వరూపంగా, తనకు మారుగా భూమిపైన నిలిపి, తాను దేహాన్ని విడిచాడు. అలాంటి భాగవత మూర్తి, బాధ్యతాయుత మూర్తి అయన.

సూతుడిలా చెప్పేటప్పటికి శౌనకాది మహామునులకు ఎనలేని ఉత్సాహం కలిగింది. 'ఓ సూతుడా! సూక్ష్మంగా చెప్పావు బాగున్నది. వివరంగా వర్ణించిచెప్పు. ఇంకా బాగుంటుంది. విషయాలు తెలిసినవారు మాలో ఎంతోమంది ఉండవచ్చు. కాని విషయాలు తెలియడంకాదు ముఖ్యం అవి అనుభవానికి రావడం ముఖ్యం. ఆ అనుభవం నీవీ గాథలను వివరిస్తూ ఉండగా మాకు అందుతూ ఉన్నది. సూతుడా! ఆపవద్దు. నారాయణుని దివ్యగాథలు వింటూ ఉండగా, ఈ మన జీవితాలు అతడి కొరకుచేసే యాత్రగా సాగిపోవాలి. అతడి స్మరణ ఉంటే జీవితం ఒకయాత్ర. అతడి స్మరణ లేనినాడు జీవితం ఒక యాతన.

'సూతుడా ! వయస్సులో నీవు మా కన్న చిన్నవాడివే. కాని నీ అనుభవం దొడ్డది. గురువులకు నీవు చేసిన శుశ్రూష దొడ్డది. ఆ శుశ్రూషలో నీకు లభించిన దర్శనం ఓహో ! అది అనంతం. కనుక అనంతమైన ఈ సృష్టి గురించి, దీని వ్యూహాలను గురించి, ఈ సృష్టిరూపంలో వ్యక్తమవుతున్న సర్వాంతర్యామి లీలలను గురించి చెప్పగలిగిన వాడివి నీవు. అలాంటి పాత్రత ఉన్నది నీకు. నీవిలా చెబుతూఉంటే మాకిలా దర్శనం లభిస్తూ ఉంటుంది. నీవిలా చెబుతూ ఉంటే మాకిలా అనుభవంలోనికి వచ్చేస్తూ ఉంటాయి ఆ అంశాలన్నీ. మేము మహా మునులమే కావచ్చు. నీవు నారాయణ స్వరూపుడైన వ్యాస భగవానుడి దివ్యతేజస్సుకు వాహికగా రూపొందిన వాడివి. ఒక్కమాటలో చెప్పాలంటే నీవు ఇందుకొరకు పుట్టినవాడివి. కనుక సూతుడా! పరీక్షిత్తు కథను వివరంగా చెప్పవయ్యా! అలాంటి భాగవత మూర్తికి మునిశాపం ఎలావచ్చింది? ఆ శాపమెలా ప్రాణాంతకమైంది? లోకం ముఖం ఎన్నడూ చూడని శుకయోగి అతడికొరకు ఎలా నడచివచ్చాడు? ఆ శుకుని పలుకులుగా వ్యాసుని నుండి వ్యక్తమైన భాగవతం తగిన రూపంతో ఎలా దిగివచ్చింది! సూతుడా! చెప్పవయ్యా! ఆ ఘట్టాలన్నీ వివరంగా వర్ణించవయ్యా!

మహామునుల మెచ్చుకోలుకు ఆనందిస్తూ, వినమ్రుడై ఇలా అన్నాడు సూతుడు. పెద్దలారా! మీ వంటివారి మెచ్చుకోలును పొందిన నా జన్మ ధన్యం. పెద్దల మెచ్చుకోలునకు పాత్రమైన పిన్నలు ధన్యులని వేరే చెప్పవలెనా? మీవంటి పెద్దల ఆశీస్సులే నన్నీస్థితిలో ఉంచుతున్నవి. నాచేత ఇట్టి దివ్య కార్యాన్ని చేయిస్తున్నవి. దైవానుగ్రహ విశేషంచేత వ్యాస భగవానుని చరణ సన్నిధినాకు లభ్యమైంది. ఆ చరణ స్పర్శలో నాలోని అణువణువు పులకించి పోయింది. ఆ పులకింత ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. ఎప్పటికీ కొనసాగు తుంది. ఉన్న శరీరములు పడిపోవచ్చు. క్రొత్తశరీరములు రూపుకట్టుకోవచ్చు. పెద్దల సన్నధిలో లభించిన పులకింత జన్మల పరంపరను దాటుతూ అలా కొన సాగుతూనే ఉంటుంది. వారు నేర్పినవి, వారి సన్నిధిని నేను విన్నవీ, అవే ఇప్పుడు నేను మీకు చెబుతున్నవి. ఆ శుశ్రూషలో అప్పుడప్పుడు అక్కడక్కడ నేను వింటూ వచ్చిన వివిధాంశాలన్నీ ఇప్పుడు మీకు చెబుతున్న వేళ చక్కటి అనుసంధానాన్ని పొందినవై, చక్కగా సమన్వయింపబడి, నిత్యనూతన రూపంతో దిగివస్తున్నట్లున్నాయి. పెద్దలారా! వ్యాస భగవానుడిగూర్చి నేనేమి చెప్పను? మీ వంటి పెద్దలెందరో అతడు సాక్షాత్తు నారాయణ స్వరూపుడని గొంతెత్తి కీర్తిస్తున్నారు కదా! సాక్షాత్తు ఆకాశమే మానవరూపాన్ని ధరించి, ఇలాంటి అవ కాశం మనకందించింది అనిపిస్తుందినాకు. అలాంటి ఆకాశపురుషుడితో ఆకాసేపు గడపగలగటం అది ఎంతటి అదృష్టం! మీరే చెప్పండి. అలాంటి ఆకాశ పురుషు డినుండి ఎవరైతే మాత్రం వినగలిగింది ఎంత ఉంటుంది? తిరిగి చెప్పగలిగింది ఎంత ఉంటుంది? ఒక పక్షి భూమిమీదనుండి ఆకాశంలోనికి ఎగురుతుంది. అవకాశమున్నంతసేపు ఆ ఆకాశంలో విహరిస్తుంది. అంతమాత్రాన ఆ పక్షి ఆకాశము మొత్తాన్ని అవగాహన చేసుకున్నదని, అవలోకనం పొందగలిగిందనీ, అవలోడనం చేయగలిగిందనీ మనం అనుకోవచ్చునా? సరిగా నాకథా అంతే. వ్యాసుడనబడే అనంత ఆకాశంలో కొంతసేపు ఎగిరి, విహరించటానికి అనుమ తింపబడిన చిన్నపిట్టను నేను. కానీ మీకీ పిట్టకథలే నచ్చుతున్నాయి. అది మీ సహృదయానికి చిహ్నం. అది నా అదృష్టం. మహామునులారా! మీరడిగిన దివ్యగాథ వివరంగా చెబుతాను. ఆ గాథను మనం వివరంగా చెప్పకుందాం. ఆ వివరాలలో మనం మన వివరాలను మరచిపోయి కరిగిపోదాం. కరిగిపోయి వివరించడానికి వశంకాని, వర్ణించడానికి అలవికాని ఏ నారాయణస్థితి ఉన్నదో దానిని అనుభవిద్దాం. మన మనస్సులకూ, ఇంద్రియాలకూ, దేహాలకూ, ఆ అను భూతిని రుచి చూపిద్దాం. అప్పుడవి కూడ పులకించిపోతాయి. ఇదిగో ఇదిగో.

ఇందుకొరకే మిమ్మల్ని చుట్టుకొని కనిపెట్టుకొని ఉన్నది. అని మనతో అంటూ, మనలోనికి కరిగిపోతాయి. పెద్దలారా! ఇక మళ్ళీ వెళదామా పరీక్షిత్తు గాథలోనికి. మళ్ళీ ప్రస్తావించుకుందామా ఆ కారణజన్ముని జీవిత సన్నివేశాలను. మళ్ళీ ముచ్చటించుకుందామా! ఆ భాగవత మూర్తియొక్క దివ్య ఔన్నత్యాన్ని, మళ్ళీ ముచ్చటించు కుందామా?

## రగిలిన వేళ

కథ ఇలా సజావుగా నడుస్తూ ఉండగా పరీక్షిత్తు సపరివారంగా వేట కని బయలుదేరాడు. అడవిలో ప్రవేశించాడు. ఏనుగులతో మొదలుపెట్టి లేళ్ళు, దుప్పుల వరకు ఏ జంతువు కనబడినా, కనబడిన దానిని కనబడినట్లు వేటాడుతున్నాడు. పరివారం, పరివారంలోని మిగిలిన వేటగాళ్ళూ, పరీక్షిత్తు చూపిస్తున్న ఈ ఉత్సాహానికి ఓహో! ఆహా అంటూ కేరింతలు కొడుతున్నారు. ఆ కేరింతలతో మరింత ఊపునందుకుంటూ మరింతగా ఉగ్రూతలూగుతూ ముందుకు సాగుతున్నాడు పరీక్షిత్తు. అలసటను గమనింపనీయని ఉత్సాహమది. అన్నపానాలను గుర్తుకు రానీయని సంరంభం అది. వేటాడి, వేటాడి చుట్టూ కలియచూశాడు. ఎక్కడా మృగమన్నది కనబడటంలేదు. ఇక ఆ చంద్రమండలంలో ఇక్కడి నుండి చూడటానికి మచ్చగా కనబడే ఆ మృగం తప్ప మనం కొట్టడానికి ఇంకేమీ మిగిలినట్లు లేవు అనుకున్నాడు. అతడికి ఆ మృగాన్ని కూడా కొట్టేయాలని ఉంది. కొట్టేయాలి అంటే చంద్రుడు రావాలి. చంద్రుడు రావాలి అంటే రాత్రి కావాలి. అందుకని దాన్ని వదిలేయక తప్పడంలేదు. అనుకుంటున్న పరీక్షిత్తు కనులముందు ఒక మృగం కనిపించింది. దానిమీద అతడు బాణం వేయాలనుకున్నాడు. అది అందకుండా పరిగెత్తింది. అతడూ దానివెంట పరుగెత్తాడు. ఆ పరుగెత్తడంలో అతని పరివారాన్నిదాటి వెళ్లిపోయాడు. అటూ ఇటూ కూడా ఎవరూ లేకుండా ఒంటరిగా పరుగెత్తసాగాడు. పరుగెత్తి పరుగెత్తి ఎట్టకేలకు అమృగాన్ని కొట్టాడు. అది పడిపోయింది. అతడూ పడిపోయేట్లు ఉన్నాడు. అతడికి ఆకలి వేస్తోంది. విపరీతమైన ఆకలి అది. అతడికి దాహం వేస్తోంది. ఆ దాహంతో గొంతెండి పోతోంది. ఆ ఆకలి, దప్పికల మీద అలసట అన్నది అప్పుడు తెలియడం మొదలుపెట్టింది. తెలియటం మొదలు పెట్టిందో లేదో ఇక ఎనలేని అలసట. శరీరం విల

విల లాడి పోతోంది. ఆకలి, దప్పిక, అలసట, బడలిక అతని పరిస్థితి అతనికే అర్థంకావడంలేదు. అతడి శరీరకోశాలు ఏవీ కూడా అతని వశంలో లేవు.

ముందు మంచి నీళ్లుకావాలి. గొంతు తడారి పోతోంది. గొంతుతోపాటు శరీరం మొత్తం పిడచకట్టుకు పోతోంది. పిండేసినట్లవుతోంది. చుట్టూ కలియ జూస్తున్నాడు. ఏదైనా కొలను కనబడుతుందేమోనని కాని కనుచూపుమేరలో కొలనులాంటి దెక్కడా అతనికి కానరావడంలేదు. ఏమిచేయాలో తోచక ఎలాగో అలా తననితాను కూడదీసుకుంటూ ముందుకు అడుగులు వేస్తున్నాడు.

అంతలో ఎదురుగా ఒక తపోవనం కనబడింది. 'హమ్మయ్యా' ! ఏదో ఒక ఆశ్రయం లభించింది. పడిపోబోతున్న ఈ శరీరానికి' అని అలాగే అడు గులు వేసుకుంటూ, ఆ తపోవనంలోనికి ప్రవేశించాడు. చల్లని నీటిచుక్కకోసం తపించిపోతోంది గొంతు. ఈ పిపాసను తీర్చగల దయామయులిక్కడ ఎవరైనా ఉన్నారా? అని చూస్తూ సాగుతున్న అతనికి ధ్యానంలో మునిగి ఉన్న ఒక మహర్షి కనిపించాడు ఆ తపోవనంలో. ఆ మహర్షిని సమీపించాడు పరీక్షిత్తు.

ఆ మహర్షి కన్నులు బయటకు చూడటంలేదు. లోనికి చూస్తున్నాయి. ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఇవేవీ ప్రవర్తనలో ఉన్నట్లు కనబడటంలేదు. తమకు పైనున్న వెలుగును చూస్తూ నిశ్చలతను పొందినట్లున్నాయి. నిద్ర, మెలకువ, స్వప్నం అనే మూడు స్థితులను దాటి తురీయమైన స్థితిలో నిలచి ఉన్నట్లున్నాడతను. అతని దేహం జడలు కప్పుకొని ఉన్నది. అతడు మాత్రం పరమాత్మ స్థితిలో నిలచి ఉన్నాడు.

పరీక్షిత్తునకు ఇవేమీ పట్టడం లేదు. పట్టించుకోగలిగిన స్థితిలో అతడులేడు. తననెవరైనా పట్టించుకుంటే బాగుండునని చూస్తున్నాడు. ఎంత తొందరగా పట్టించుకుంటే అంతబాగుంటుందని తపనచెంది పోతున్నాడు. దేహం వివశమై పోతోంది. గొంతు విలవిలలాడి పోతోంది. ప్రాణాలు కడబట్టుతున్నట్లున్నాయి. తపోవనంలో ఈ పట్టించుకోని ఈ ఋషి తప్ప ఇంకెవరూ కనబడటంలేదు.

అతడా ఋషి ముందు సాగిలపడ్డాడు. సాగిలపడి లేవలేక లేచి, మూగ బోయిన గొంతును పెకలించుకునే ప్రయత్నం చేస్తున్నాడు. గొంతులేవడం లేదు. మాట పెగలడంలేదు. శక్తియుక్తులన్నీ ఉడిగిపోయినట్లున్నాయి. కాని అడక్కతప్పదు. అడిగితేగాని పట్టించుకునేవారు లేరక్కడ. అడిగితే కూడ పట్టిం చుకుంటారో లేదో ! ఒకవేళ పట్టించుకుంటే అంతవరకు నేనీ ప్రాణాలను పట్టి

ఉంచుకుంటే, బ్రతికి బయట పడగలుగుతాను". – అనుకుంటూ మనస్సు సోలిపోతూ ఉండగా, శరీరం నేలవైపుకు వాలిపోతూ ఉండగా, అతికష్టంమీద మాటను అందిపుచ్చుకొని, నీరసించిపోయిన గొంతుతో ఇలా అన్నాడు పరీక్షిత్తు. "కాసిని మంచినీళ్లు ఇవ్వండి. బాబూ! కాసిని మంచినీళ్లు. ఈ ప్రాంతంలో ఎక్కడా ఒకచిన్న నీటిగుంటకూడా కనబడలేదు. ఎంత ప్రయత్నించానో, దప్పిక నిక సహించలేక పోతున్నాను. నీటికోసం వేటాడలేక, మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నాను నేను కదల గలిగిన స్థితిలోలేను. తోటి వాళ్లెవ్వరూ ఇప్పుడు నాతో లేరు. ఒంటరి వాణ్ణయిపోయాను. ఈ దప్పిక నన్ను పీడించేస్తోంది. బాబూ! లేచి కాసిని మంచి నీళ్లవ్వండి".

కాసేపు అలా చూస్తూ ఉండి పోయాడు పరీక్షిత్తు. కాని మహర్షిలో కదలికలేదు. ఆయన ఈ లోకస్పృహలోలేడు. అది పరీక్షిత్తుకు తెలియడంలేదు.

వేచి చూచి చూచి దప్పికతో వేగలేక పోతున్న అతనికి, ఆకటితో దహించుకుపోతున్న అతనికి, వేటాడి వేటాడి అలసి వడిలిపోయిన అతనికి ఇక కోపం వచ్చేస్తోంది. ఎవరిమీద? కదలకుండా కూర్చున్న మహర్షిమీద. ఎందుకని? ఇలాంటి స్థితిలో తానుండగా అతడెలా కదలకుండా కూర్చుండ గలిగాడని. దప్పికతోబాటు కోపం పెరుగుతోంది. కోపం, ఝంఝా మారుతమై మనస్సనే కోనేటినుండి ఆలోచనలనే అలలను రేగగొడుతోంది. ఆ అలలు లేస్తున్నాయి. ఆ అలలు చిట్లుతున్నాయి. ఆ అలలు గట్లను కోస్తున్నాయి. ఆ అలలు, ఆ ఆలోచనలు ఇలా ఇలా రేగుతున్నాయి. 'ఏమీ! ఈ బ్రాహ్మణోత్తముడు మూసిన కన్నులు తెరువడేమి? కనులు మూతబడినవా? లేక గర్వముచేత మూసుకుని పోయినవా? లేవ వచ్చుగదా! నన్ను చూడవచ్చుకదా! పూర్తిగా లేవకపోయినా, కనులు తెరచి, చేతితో ఒక సైగచేసి తన చెంతకు రమ్మన వచ్చు కదా! అలసిన నన్ను తన అక్కున చేర్చుకొని, కాసిని చల్లని మంచినీళ్లు ఇవ్వవచ్చుగదా! ఏమి? ఆ పనిచేయడేమి? దాహము తీర్చడేమి! దాహము తీర్చి ఏ కందమూలములో, ఏ ఫలహారములో అందించడేమి? దప్పిక అంటే ఏమిటో, ఆకలి అంటే ఏమిటో ఆ మాత్రం ఇతనికి తెలియదా? ఈ మహర్షులు మహిమాన్వితులంటారే? ఇలాంటి స్థితిలో మామూలు మానవులు కూడా చలించి సహకరిస్తారే? ఏదీ? ఇదేనా వీరి మహర్షిత్వం? ఇదేనా వీరి తపస్సు? ఇదేనా వీరి మహిమ? ఇదేనా వీరి సిద్ధి? ఇదేనా వీరి బుద్ధి? తపస్సు చేసి, సిద్ధించిన మహిమలతో మరింత సాధకులై, సేవకులై మెలగ వలసిన

వీరు ఆర్జించిన సంపదలను చూసి గర్వించే సంపన్నులవలె ప్రవర్తిస్తున్నారేమి? మరి అలాంటప్పుడు మదాంధులైన ఆ మోతుబరులకూ, మహిమాన్వితులైన ఈ మహర్షులకూ భేదమేమి? ఓహో! మహిమలూ, సిద్ధులూ, మనస్సును పెంచవలసినదిపోయి, మమతను హరిస్తున్నాయా? మానవత్వాన్నే మంటగలుపుతున్నాయా?

దప్పికతో విలవిలలాడి పోతున్నవారికి కాసిని మంచినీరు పోయటం ఎలాంటి వారికైనా, ఎటువంటి స్థితిలో ఉన్నవారికైనా పాటించవలసిన కనీస ధర్మమే! మరి పాటించి తీరవలసిన ఆ ధర్మాన్ని ఈ మహర్షి ఏల గమనించడు? గొంతెండి పోతున్న మానవుడికి కాసిని మంచినీళ్లు పోయలేని ఈ తపస్సులెందుకు? 'చస్తుంటే సంధ్యావందనమ'ని అంటారు ఇదే కాబోలు. తోటి మనుష్యుల బాధలు పట్టించుకోలేని, పట్టించుకోవాలని అనిపించని ఈ తపస్సులకు అర్థమేమిటి? ఓహో! తపోవనములు ఇటువంటి కటిక, కసాయి ప్రదేశాలయిపోయినాయేమి? వీరిలో ప్రేమ ఇంతగా ఇంకిపోయిందేమి? నాకేమీ బోధపడటంలేదు. నాకేమీ అంతుపట్టడంలేదు. ఇప్పుడు నన్ను పీడిస్తున్నవి రెండు. ఒకటి దప్పిక, రెండవది ఈ మహర్షి నిర్లక్ష్యం.

'మహర్షీ ! మాట్లాడని మహర్షీ! నీవు నిజంగా ఈ స్పృహలో లేవా? ఉండికూడా ఈ దీనుడితో ఆడుకుంటున్నావా? నా కెందుకో అనుమానంగా ఉంది. ఇది సమాధిస్థితా? సమాధానం చెప్పేదేమిటని భీష్మించుకొని కూర్చున్నస్థితా? నా కెందుకో అనుమానంగా ఉంది. నీవు నన్ను అవమానిస్తున్నావేమోనని, నీవు నన్ను నిర్లక్ష్యం చేస్తున్నావేమోఅని. అనుమానంకాదు. నా కనిపించింది నిజమేననిపిస్తోంది. మహర్షీ! నిన్ను చూస్తుంటే నాకు గౌరవ భావం కలగడంలేదు. అసహ్యం పెల్లుబుకుతోంది. ఇప్పుడు ఈ పెల్లుబుకుతున్న అసహ్యంలో నుండి నీకొక సత్కారం చేస్తున్నాను. ఇది ఇంతవరకు ఎవ్వరూ, ఎవ్వరికీ, ఎప్పుడూ, ఎక్కడా చేయనిది. ఇప్పుడు నీకు నేను దుశ్శాలువా కప్పబోవటంలేదు. ఇదుగో! నీ కొరకే ఇక్కడ చచ్చిపడిఉన్నది ఒక పాము. ఈ చచ్చినపాముతో నిన్ను సత్కరిస్తున్నాను. నాకనుమానం నీవు మాటలాడ గలిగిన స్థితిలో ఉండి కూడ మాటలాడటం లేదని. నా కనుమానం నీవు పట్టించుకోగలిగిన స్థితిలో ఉండి కూడ పట్టించుకోవటంలేదని. ఆ అనుమానాన్ని ఈ చచ్చిన పామే నివారణ చేస్తుంది. మహర్షీ! నా కోసం కాకపోయినా ఈ చచ్చినపాము కోసమయినా చచ్చినట్లు నీవు కనులు తెరచిచూస్తావు. నీవు నిప్ప

త్తిలో ఉన్నట్లు ముఖం పెడుతున్నావు కదా! ఇది నటన అని నా అనుమానం. అది ఇప్పుడు నివృత్తైపోతుంది. అని అనుకుంటూ పరీక్షిత్తు తన అసహనాన్ని ఆపుకోలేని స్థితిలో వివశుడై, ఊగిపోతూ, తన వింటి కొప్పుతో ఆ సర్పశవాన్ని పైకితీసి మహర్షికి మెడచుట్టూ చుట్టాడు.

ఆ మహర్షి కదలలేదు. మెదలలేదు. కనులు తెరువలేదు. అలాగే ఎప్పటి లాగానే ఉన్నాడు. పరీక్షిత్తు వచ్చినప్పటినుండి ఎలాగ ఉన్నాడో, అలాగే ఉన్నాడు. పరీక్షిత్తుకు కొంచెం అనుమానం వచ్చింది. ఇతడు నిజంగా సమాధిస్థితిలో ఉన్నాడా? లేక ఇలాంటి క్షత్రియులతో నాకేమిపని? అన్న నిర్లక్ష్యంతో ఉన్నాడా? ఇతడిది నిర్లక్ష్యమా? నివృత్తి మార్గమా? అని తర్కించుకుంటూ వితర్కించు కుంటూ చేసేది లేక వచ్చినదారి పట్టాడతడు. మంచినీళ్లకోసం నేనొస్తే మధ్యలో ఈ మహర్షి ఏమిటి? అతడు పలకక పోవడమేమిటి? ఇలా ప్రవర్తించడమేమిటి? నాలో ఇంత అసహనం పెల్లుబుకటమేమిటి? అతడి నంతటితో వదిలివేయక చచ్చినపామును అతని మెడలో వడవేయడమేమిటి? అయినా అతడు కదలక పోవడమేమిటి? ఆ కదలికలేనితనం నన్నింతగా కదిపివేస్తున్నదేమిటి? కుదిపివే స్తున్నదేమిటి? అతడిది నిర్లక్ష్యమో, లేక సమాధి సౌఖ్యమో ఈ మనస్సునకు అంతుపట్టడం లేదేమిటి? అంతుపట్టని దానిని అంతటితో వదలక ఈ మనస్సు ఆ సన్నివేశానికి అంటుకుంటున్నదేమిటి? సమాధాన పడలేక పోతున్నదేమిటి? ఈ మనస్సును నేను సముదాయించలేక పోతున్నానేమిటి? వరదలై, బురదలై విజృంభిస్తున్న రజోగుణంలోపడి మనస్సిలా కొట్టుకుపోతున్నదేమిటి? ఇది ఎందు కిలా జరుగుతున్నది? ఇంతకూ ఈ ప్రయాణం ఎటువైపుకు సాగుతున్నది? — అన్న ఆలోచనల ఆటుపోటులతో సోలుతూ, తూలుతూ సాగుతున్నాడు పరీక్షిత్తు. అతని దృష్టి ఇప్పుడు మంచినీళ్లపైనలేదు. అనుకోకుండా జరిగిన ఈ మహర్షి కథపైన ఉన్నది.

# కోపం శాపం కాగా

పరీక్షిత్తు అలా సాగలేక సాగలేక సాగివెళ్లాడో లేదో – ఆ ఘట్టాన్ని అల్లంత దూరంలోనుండి అతడికి కనబడకుండా గమనిస్తున్న ముని కుమారులు కొందరు రెంగప్రవేశం చేశారు. ఈ వార్తను మోసుకుని, ఆశ్రమానికి దూరంగా సమవయస్కులతోకూడి ఆటపాటలలో తేలియాడుతున్న శృంగి దగ్గరకు పనిగట్టుకొని చేరుకున్నారు.

'ఓ శృంగీ! ఇటురా!' అని పిలిచారు వాళ్లు. శృంగి రావటానికి అయిష్టం గానే ఉన్నాడు. కాని కుర్రాళ్ళలోని ఆత్రుతను, ఆవేగాన్ని చూసి ఇవతలకు వచ్చేశాడు. 'ఏమిటి? ఏమి జరిగింది? మీరంతా ఇలా ఉన్నారేమిటి?' అన్నాడ తను. ఉద్వేగాన్ని కలిగించే గొంతుతో వారందరూ ఒక్కుమ్మడిగా "ఓ శృంగీ! దారుణమైన సన్నివేశం ఒకటి జరిగిపోయింది. మనుష్యులు, మదపుటేనుగులు, గుఱ్ఱాలు అనే భేదం లేకుండా అందరినీ పాలించే, అందరిపైనా స్వారీచేసే రాజొకడు ఆశ్రమానికివచ్చాడు. అతడుదాహంతో ఉన్నాడు. సమాధిలో నున్న మీ తండ్రి అతడిని పట్టించుకోలేదని కోపంతో ఊగిపోయాడు. చచ్చిపోయిన పాము నొకదానిని తెచ్చి, మీ తండ్రి మెడచుట్టూ వేశాడు. వేసి, వెళ్ళిపో యాడు -- అన్నారు.

ఆ మాటలకు శృంగికి ఒళ్లు మండిపోయింది. అతడి శిరస్సున రెండు శృంగాలు అంటే రెండు కొమ్ములు మొలుచుకొచ్చాయా? అన్నంత రోషపడి పోయాడతడు. "ఆ రాజుకు ఎంత గర్వం! ఆ క్షత్రియులకు ఎంత మదం! ప్రజలనుండి వసూలయ్యే పన్నులు తిని బ్రతికే రాజులు వాళ్లు. వాకిట్లో పెట్టే బలిమెతుకులుతిని, బలిసే కాకులు ఎలాంటివో, అలాంటివాళ్లు వాళ్ల కింత గర్వమా? రక్షణకోసం కుక్కల్ని పెంచుకుంటాం. అప్పుడా కుక్కలు ఏంచేయాలి? ద్వారాలదగ్గర పడిఉండాలి. ఊరికే పడిఉండకూడదు. విశ్వా సంతో పడిఉండాలి. నా దృష్టిలో రాజులు ప్రజలచేత తమ రక్షణకొరకు అలా పెంచుకోబడుతున్న కుక్కలు. కాని, ఈ రాజులకు ఆ కుక్కలతో కూడ పోలిక కనబడటంలేదు. వీరిలో ఆ రక్షణ స్వభావం ఏది? వీరికి ఆ విశ్వాసం ఏది? పడి ఉండాల్సిన వీరు మనమీద పడతారా? పడి ఉండాల్సిన తొత్తులకు మనం ఒత్తులు ఒత్తాలా? అసలు వీరిని రక్షకులుగా నియమించిన వాళ్లెవరు? బ్రాహ్మణులు కాదా? అలాంటివారు బ్రాహ్మణుల ఇండ్లలోనే జొరబడి ముంతలు

తడుముతున్నారనగా ఇక చెప్పవలసినదేమున్నది? వీరిని నియమించిన ఆ బ్రాహ్మణులే తమ నియామకము, తమ నిర్వాకము ఎలా ఉన్నదో చూసుకోవలసి ఉన్నది.

"మిత్రులారా ! ఆ రాజు ఇలా ఎందుకు ప్రవర్తించాలి? మా తండ్రి అతని నేమయినా దూషించాడా? ఆశ్రమ వాతావరణాన్నిదాటి బయటకు వెళ్లని మాతండ్రి, ఆ రాజుగారి శత్రువులతో ఏమైనా కలిశాడా? అడవిలో లభించే కందమూలాలనే తిని, ఈ సృష్టికి మూలమైన విష్ణువును చూస్తూ నిరంతరం అంతర్ముఖుడై ఉండే మాతండ్రి అతడికేం చేశాడు? అలాంటి దేవుడిలాంటి మాతండ్రి మెడలో చచ్చిన పామును వడేయవలసిన అవసరం అతనికేమి వచ్చింది?

"సోదరులారా ! ఈ రాజుల దగ్గరకు హిరణ్యదానాలు పట్టాడానికి మేం ఎప్పుడూ వెళ్ళలేదే ! ఆశ్రమాల పోషణకూ, గురుకులాల నిర్వహణకూ ధనం కావాలని మేమెప్పుడూ అడిగి తెచ్చుకోలేదే! వాళ్ల ద్వారాలకడ నిలబడి దొంగ దీవెనలనిస్తూ కానుకలకై కక్కుర్తిపడలేదే! సమస్తాన్ని వదులుకొని, సౌఖ్యాలకు దూరంగా సాధనే పరమావధిగా అడవులలో జీవిస్తున్నవాళ్ల దగ్గరకు వనివేలా వచ్చి పాములను చుట్టిపోతారా?

"ఈ రాజులకు పొగరు పెరిగిపోతున్నది. పొగరు పెరిగితే వదిమంది భట్రాజులను పిలిచి పొగిడించుకోమనండి. కీర్తింపబడాలన్న ఆ కండూతిని తీర్చుకోమనండి. ఇష్టం వచ్చినట్లు తిని తిరగమనండి. విలువైన దుస్తులు కట్టుకుని విలాసంగా తిరగమనండి. అంతేగాని, ఇలా అడవులలోనికి వచ్చి, పాములను మీద వడవేస్తారా? ఇలా ఇంతకుపూర్వం ఎవరైనా చేశారా?

"సఖులారా! మహానుభావుడైన శ్రీకృష్ణుడు ఈ భూమిని విడిచి వెట్టినప్పటినుండి ఇలాంటి నికృష్టులందరూ రాజులై తమనిక శాసించే వారులేరని చెలరేగుతున్నారు. విర్రవీగుతున్నారు. మంచివారిని చెరబడుతున్నారు. దీని నిక సహింపకూడదు. దీని నిక క్షమింపకూడదు. నేను సహించను. నేను క్షమించను. ఇదిగో ఇప్పుడే నాతండ్రి నిలా బాధపెట్టిన ఆ క్షత్రియ మాత్రుడిని శపించేస్తున్నాను. ఏవీ జలములు? అవిగో అక్కడ ఉన్నాయి – అంటూ బయలుదేరాడు శృంగి.

రోషంతో ఎగిరిపడుతూ అతడు నడుస్తుంటే అతడి రోషానికి, రోషపూరితమైన అతని దారుణ సంకల్పానికి భూమి కంపించిపోతున్నట్లైంది. మూడు

లోకాల పాలకులకు, ముంచుకొస్తున్న ఈ ముప్పునుచూసి, ఉలికిపాటు కలిగింది. పెద్ద పెద్ద అంగలువేస్తూ నడుస్తున్నాడు శృంగి. శృంగి అలా అంగలు వేస్తుంటే, అతడి ముంగురులు ముఖం మీదపడి ఊగిపోతూ చెదరిపోతున్నాయి. ఇప్పుడు చెదరుబాటు ననుభవిస్తున్నది ముంగురులా? లేక మూడు లోకాలా? – అన్నట్లుగా ఉన్నదా దృశ్యం.

· అతడు జలాన్ని అందుకున్నాడు. "ఇదే నాశాపం ఈ పని చేయవచ్చునా? లేదా? అన్న విచక్షణాజ్ఞానం కూడ లేకుండగ వింటితో చచ్చిన పామును తెచ్చి మారు మాటాడక మైమరచి ఉన్న మాతండ్రిపై ఆ పామును పడవైచి, తాను మాత్రము తిరిగివెళ్ళి, మద మాత్సర్యాలతో భోగలాలసుడై క్రీడిస్తూ ఉన్నటువంటి ఆ రాజు ఇప్పటికి ఏడవ రోజున తక్షకుని విషాగ్నికి గురియై తక్షణము చనిపోగలడు. శివకేశవులు కూడ ఈ శాపమును అడ్డుకోలేరు. వందె మువేశి కూడ ఇంకెవ్వరూ అతనిని రక్షింపలేరు. ఈ వాక్కు తిరుగులేనిది. ఈ వాక్కు ఎదురులేనిది. జరిగి తీరుతుంది." అని శపించి తోటి వారితో కలసి ఇంటిముఖం పట్టాడు శృంగి.

పామును వేస్తాడా? మా తండ్రిపై వేసినందుకు శిక్ష అనుభవిస్తాడు. పామును వేసినందుకు, పాముచేత కాటువేయబడటమే అతనికి శిక్ష. అతను చచ్చిన పామును వేయవచ్చుగాక! అతడు చేసిన అవమానం ఎంతటిది? కను కనే అతడు పాముకాటుతో పడి చచ్చిపోవాలి. అప్పటికి గాని ఈ రాజులకు బుద్ధిరాదు. అప్పటికిగాని ఈ నాకు కోపము తీరదు. అనుకుంటూ అతడు ఆశ్రమంలోనికి ప్రవేశించాడు. మెడచుట్టూ పాముతో తనలోకంలో తానున్న తండ్రిని చూచాడు.

తండ్రినలా చూడగానే అతడికి దుఃఖం పొంగుకొచ్చింది. "తండ్రీ ! నిన్నిలా చేసి వెళ్ళిన రాజును ఇంతకంటె ఇంకేమి చేయగలను? అతడు చేసిన ఈ పనికి నిజానికి ఈ శాపం చాలదు. అతడు చేసిన పాపానికి ఈ శాపం చాలదు తండ్రీ! తండ్రీ! ఈ రాజుల కసలు స్నేహమంటే తెలుసా! ప్రేమాభిమానా లకై, స్నేహాను రాగాలకై, భక్తి ప్రపత్తులకై, వారి మనస్సులలో వెతికిన వాడు పిచ్చివాడు తండ్రీ! అహంకార దర్పాలూ, మద మాత్సర్యాలు, అధికార దుర్వ్యిని యోగాలు – ఇవే తండ్రీ! వారి దగ్గర మనకు లభించేవి. మనకు కనిపించేవి" అంటూ శృంగి ఆ పామువైపుకు చూచాడు: తండ్రి వంటిపైనుండి తక్షణమే దాన్ని తీసి పారవేద్దామనుకున్నాడు కాని ఎందుకనో అతనికి భయంవేసింది.

అభయంతో సమీప ప్రాంతాలనున్న పెద్దల కొరకు పెద్దగా గొంతెత్తి అరచాడు. ఆ అరపునకు వారంతా చేరవచ్చారు. వారినందరినీ చూడగానే అతనికి దుఃఖం మరింత పొంగుకొచ్చింది.

"పెద్దలారా! మన రాజు వేటకని బయలుదేరి, మా ఇంటికి వచ్చాడు. తన మానాన తానున్న మాతండ్రి మెడలో పాముశవాన్ని వేశాడు. ఇది భయంకరంగా ఉంది. ఇది ఒకవేళ బ్రతికే ఉంటే ఎంత ప్రమాదం! మీరు చెప్పండి. లేదూ! దానికోర మాతండ్రి దేహాన్ని గీసుకుని ఉంటే అది ఎంత ప్రమాదం! మీరు చెప్పండి. ఓ తాపసులారా! నాకు భయంవేస్తోంది. మీరీ సర్పశవాన్ని తొలగించి మా తండ్రిని రక్షించండి. మీకిదే నా నమస్కారం" అంటూ బోరున ఏడ్చాడతను.

శృంగి అలా ఏడ్చిన ఏడుపుకు శమీక మహర్షి కనులు తెరచి చూశాడు. తనమెడలో ఉన్న పాము శవాన్ని పరికించాడు. వెంటనే తీసి అవతలకు విసిర్వాడు.

"బిడ్డా ! ఏమిటిది ! ఈ పాము శవమేమిటి ? నీకీ దుఃఖమేమిటి? అసలీ చచ్చినపాము ఇక్కడికెలా వచ్చింది? సమదృష్టి కలవారం కదా మనం. అలాంటి మనకు అపకారం తలపెట్ట గలిగిన వారెవరు? నీ వెందుకు ఊరికే బెంబేలు పడిపోతున్నావ్! ఎందుకా భయం? ఎందుకా దుఃఖం?" అని ప్రశ్నించాడు శమీకుడు శృంగిని.

శృంగి తనకు తెలిసినది చెప్పాడు. తాను చేసినది చెప్పాడు. వెంటనే "ఇంతకూ వచ్చిన దెవరు? అసలు జరిగిన కథ ఏమిటి? ఇప్పుడు జరుగ వలసినదేమిటి?' అని అంటూనే అంతర్ముఖుడై ఉండిపోయాడు శమీకుడు. అలా ఉండిపోయిన తండ్రివైపు చూస్తున్నాడు శృంగి. ఆ తండ్రీ కొడుకుల వైపు చూస్తున్నారు మిగిలిన తపస్వి జనులు. 'అతడు కనులు తెరిస్తే, తెరచి జరిగింది చెబితే, అప్పటికి మన మనస్సులు కుదుట పడతాయి అనుకుంటూ వారందరూ అక్కడే కూర్చుండి పోయారు.

# మందలింపు

శమీక మహర్షి ధ్యానముద్రను విడిచికన్నులు తెరిచాడు. తన చుట్టూ పరి వేష్టించి ఉన్న మునులందరినీ చూచాడు. అలా చూస్తూ చూస్తూ తన ప్రక్కనే నిలబడి ఉన్న శృంగి వైపుకు తన చూపులన్నింటిని త్రిప్పాడు. త్రిప్పి ఇలా అన్నాడు. "శృంగీ! నీవు శపించిన దెవరినో తెలుసునా? మనదేశపు రాజైన పరీక్షిత్తును. ఇందాకటి నుండి రాజమాత్రుడని, క్షత్రియ మాత్రుడనీ నీవు తూలనాడింది అతనినే. ఎంత తొందరపడ్డావ్! ఆయన మనకేం ద్రోహం చేశాడని ఇంత పెద్దశాపం ఇచ్చావ్? పాలపొంగులా రాజ్యంలో ఎల్లెడలా సుఖ సంతోషాలు పొంగి పొరలేటట్లు చేస్తున్నాడే అతడు. అలాంటి దక్షుడైన రాజును పట్టుకొని, తక్షకుని విషాగ్నికి తక్షణమే బలికమ్మని శపిస్తావా? పిల్లవాడా! కుర్రవాడా! నీ విచ్చిన ఈ శాపప్రభావం ఎలాంటిదో నీకు తెలుసుననుకోవాలా? తెలియదనుకోవాలా?

"పరీక్షిత్తును గూర్చి నీకు తెలుసునా? తల్లి గర్భంలో పుట్టకముందే పోవలసినవాడు. కాని అపారమైన శ్రీకృష్ణుని కరుణచేత బ్రతికి బయటపడినాడు. ఆ శ్రీకృష్ణుడి స్పర్శయే అతణ్ణి బ్రతికించింది. ఆ శ్రీకృష్ణుడి స్పర్శయే అతని బ్రతుకై నిలిచింది. ఆ స్పర్శయొక్క బలంతోనే, ఆ స్పర్శయొక్క ఫలంగానే ఏ లోటూలేని పరిపాలనను ఈ భూమికి అందించగలుగుతున్నాడు. అలాంటి రాజర్షిని పట్టుకొని ఇంత ఘోరంగా శపిస్తావా?

"శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచిపెట్టగానే కలిపురుషుడు ఈ భూమిని ఆక్ర మించుకోవాలని చూశాడు. ఈ ప్రజలు కావరిని కోల్పోయిన గొఱ్ఱెలే కదా! అనుకున్నాడు. పరీక్షిత్తు అతడిని వారించాడు. గడగడ లాడించాడు. శరణాగతుణ్ణి చేసుకున్నాడు. అతడికి కాసిని చోటులు చూపించి కాలక్షేపం చెయ్యమన్నాడు. సమబుద్ధితో, సిరిసంపదలతో తులతూగేటట్లుగా ఈ భూమిని నిండుగా పరిపా లిస్తున్నాడు. అలాంటి పరీక్షిన్మహారాజు ఏమంత పాపం చేశాడని ఇంతటి శాపం ఇచ్చావు? అతడు చేసింది చాల చిన్న తప్పు. అది కూడా సహజమైనది. ఆ స్థితిలో ఎవరున్నా అలాగే ప్రవర్తిస్తారు. చెప్పాలంటే ఇంకా ఘోరంగా ప్రవర్తిస్తారు కూడా! అతడే పరిస్థితులలో అలా ప్రవర్తించాడో అన్న దానిని పట్టించుకోకుండా, అతడేదో ఇలా చేశాడని, ఇంతటి కోపాన్ని ప్రదర్శిస్తావా? ఇది నీకు న్యాయమేనా?

"బిడ్డా! నీవు చేసిన పాపం ఎంతటిదో నీకు తెలుసునా! నీ విచ్చిన శాపం వలన పరీక్షిన్మహారాజు శరీరాన్ని విడిచిపెడతాడు. అతడు శరీరాన్ని విడిచిపెడితే ఆ తరువాత నష్టం ఎవరికి ? మనకుకాదా! మన భూమికి కాదా? సమర్థుడైన రాజు ఉన్నంతవరకే రాజ్యంలో సుఖశాంతులుండేది. దక్షుడైన రాజు కరువైనవేళ ఇక అరాచకత్వమే ప్రబలేది! బలవంతులు బలహీనులను పొడుచుకుతింటారు. వాళ్ల పశువుల్ని గుఱ్ఱాలని, ధనాలని చివరకు వాళ్ల భార్యలను కూడ దోచుకుంటారు. దొంగలు, బందిపోట్లు విజృంభిస్తారు. ఊళ్ళకు ఊళ్ళనే కొల్లగొడతారు. ఇక ప్రజలు అయినదానికి, కానిదానికీ కలహించుకుంటారు. కొట్లాడుకుంటారు. అదమాయించేవాడు లేనప్పుడు అంతకన్న ఏం చేస్తారు? ఎవరి పనులు వాళ్లు చేయడం, వయస్సులను బట్టి పద్ధతిగా ప్రవర్తించడం ప్రజలు మానేస్తారు. దక్షుడైన రాజుండి, ధర్మమార్గాన నడిపితే, కోట్లాది ప్రజలైనా శిరస్సువంచి నడుస్తారుగాని, అలాంటి రాజు లేనివేళ ధర్మానికి ప్రశస్తి తగ్గిపోతుంది. సంపద నాశించో, కాంక్షలను తీర్చుకోవడానికో, చేతయ్యీ, చేతగాని పనులను, తోచీతోచనట్లు చేస్తూ, ఎదుటివారినుండి డబ్బులు దండుకోవడం చేస్తారు. ఇక కుక్కలకూ, కోతులకూ, ప్రజలకూ తేడా ఉండదు. కుక్కలేం చేస్తాయి? ప్రతిదానికి పోట్లాడుకుంటాయి. ప్రజలూ అదేచేస్తారు. కోతులేం చేస్తాయి? కనబడినదల్లా ఉపయోగంతో నిమిత్తంలేకుండా ఎత్తుకుపోతాయి. ప్రజలూ అదేచేస్తారు. దక్షుడైన ప్రభువులేనివేళ అరాచకత్వం ప్రబలిపోయినవేళ ఆ కుక్కలూ, కోతులే మనకన్నా చాల నయమని మనకే అనిపిస్తుంది. ఇప్పుడు చెప్పు. నీవు విధించిన శిక్ష ఎవరికి? పరీక్షిత్తుకా? ప్రజలకా? బిడ్డా! నీవుచేసిన పాపం ఇంతింతకాదు. ఆ పాపఫలం ఊరికేపోదు. ఈ ప్రజలను దిక్కులేని వారినిగా చేస్తుంది.

"పరీక్షిత్తు మామూలు రాజనుకుంటున్నావా? లేదా అందరిలాంటి రాజర్షి అనుకుంటున్నావా? అతడు పరమ భాగవతమూర్తి సుమా! అశ్వమేధాలుచేసి సమ్రాట్టుగా ఎంత కీర్తిగడించాడో, అంతకంటె ఎక్కువగా ధర్మమూర్తిగా కూడ ప్రసిద్ధిచెందాడు. ఆచారపరుడు, నీతి కోవిదుడు, రాజులందరకు మకుటాయమానమైనవాడు. అలాంటి మహనీయుడు మన అదృష్టవశాన మన ఆశ్రమానికి వచ్చి కాసిని మంచి నీళ్ళడిగాడు. బిడ్డా! నేను ధ్యానంలో ఉన్నానని నీకు తెలుసు కదా! బాల్య చాపల్యంలోపడి అక్కడక్కడా తిరుగకపోతే ఇంటిపట్టున ఉండి, ఆ వచ్చిన మహారాజును స్వాగతమడిగి, సేదతీర్చి, సేవించి తృప్తునిచేసి పంపిస్తే ఎంత బాగుండేది! అలా చేయకపోగా మంచినీళ్ళకు బదులు ఈ దొడ్డశాపం

అతడికి కానుకగా ఇస్తావా? నీ కుర్రతనానికి నేనేం అనుకోవాలి? మా నాన్న నిలా చేస్తాడా? అని ఉగ్రుడవైపోయావు తప్ప, అయ్యో! అలాంటి స్థితిలో మనరాజువచ్చాడా! నేనక్కడ ఉండలేకపోయానే. ఉండి సేవించలేక పోయానే అన్న పశ్చాత్తాపం నీకెందుకు కలుగలేదు? శ్రీకృష్ణుడు కావాలని బ్రతికించుకున్నవాడిని నీవుచనిపోవాలని శపిస్తావా? అయ్యో! ఏమి దుందుడుకు స్వభావమిది!

"ఓ శ్రీకృష్ణుడా ! పరమాత్ముడా! నిరపరాధియైన మహారాజుకు చపలచిత్తుడైన ఈ నాకుమారుడు ఇంతటి శాపమిచ్చాడు. తండ్రీ! ఈ పాపాన్ని తొలగించగలిగింది ఇక నువ్వే. జరుగవలసిన దానిని నడిపించవలసింది ఇకనువ్వే.

శృంగీ ! మనము భాగవతులము కదా! భాగవత ధర్మమేమిటి? ఎవరైన మాటలతో ఎత్తిపొడవవచ్చు. తిట్టవచ్చు, కొట్టవచ్చు. భాగవతులైనవారు వాటినన్నింటినీ సహించుకోవలసిందేగాని, ప్రతీకారానికి ఎన్నడూ తలపెట్టకూడదు. మరి అలాంటిది మనకే అపకారము చేయని మహారాజును పట్టుకొని దారుణమైన శాపాన్ని ఇచ్చావుకదా! ఇది నీకు తగునా! నాకుమారుడవైన నీకిది తగునా?

అంటూ బిడ్డను మందలించి శమీకుడు మళ్ళీ కొన్ని క్షణాలపాటు అంతర్ముఖుడై అలా నిలిచిపోయాడు. కాసేపటికి కనులు తెరచి తనలో తాను ఇలా అనుకున్నాడు. చెప్పదగిన కారణమనేది లేకుండానే ఈ కథ ఇలా ఊహించని మలుపులు తిరిగిపోతున్నదీ అంటే దానికి కారణం ఇక్కడ కాక, ఈ సన్నివేశాలలోకాక, ఇంకెక్కడో ఉండితీరాలి. శ్రీకృష్ణుడా! నీవే ఈ కథకు సాక్షివి. నీవే ఈ కథకు సారధివి. జరిగిన దానికి బాధపడటం తప్ప నేను చేయగలిగిందిలేదు. శృంగి ఇచ్చినశాపం మరలింపబడే అవకాశంకనబడటంలేదు. ఇప్పుడిక నేను చేయగలిగినది ఏమున్నది? ఒక్కటే కర్తవ్యంగా తోస్తున్నది. జరిగిన సన్నివేశాలను జరిగినట్లుగా పరీక్షిత్తుకు తెలియబరిచే ప్రయత్నంచేస్తాను. అంతకన్న చేయగలిగింది నాకు కనబడటంలేదు. ఆ నిర్ణయానికి వచ్చి శమీకుడు తన శిష్యుడైన మునికుమారుణ్ణి ఈ కథనంతా తెలియజేయమని పరీక్షిత్తు దగ్గరకు పంపాడు.

వేటలో దారి తప్పి వచ్చిన పరీక్షిత్తు, దాహమై నీటి కొరకు వెతుక్కున్న పరీక్షిత్తు, దాహం తీర్చలేక పోయాడన్న బాధతో సర్పశవాన్ని శమీకుని మెడలో వేసిన పరీక్షిత్తు వేసిన తరువాత ఏమిటిలా వేశాను. ఇలా చేయడం ధర్మమేనా? అని ప్రశ్నించుకుంటూ వెనుకకు మరలిన పరీక్షిత్తు, ఆ ప్రశ్నార్థకంతో ఎలాగో

అలాగ నడుచుకుంటూ తన పరివారాన్ని చేరుకున్నాడు. పరివారం చుట్టుము ట్టారు. రాజు స్థితిని చూసి కలవరపడి పోయారు. అతడిని సేదతీర్చేటందుకు అతడిని మామూలు మనిషిగా చేసేటందుకు ఎన్నెన్ని సేవలో, ఎన్నెన్ని ఉప చారాలో చేస్తున్నారు. చేస్తూ అతడివైపు చూస్తున్నారు. అతడు మామూలు మనిషికావాలని మామూలుగ మళ్ళీ నవ్వాలనీ, విజృంభించాలనీ. కాని పరీక్షిత్తు ఆ ప్రశ్నార్థకంలోనే ఉన్నాడు. 'ఎందుకిలా జరిగింది? ఏమిటిలా జరిగింది? ఆయన అలా ప్రవర్తించడమేమిటి? నేనిలా ప్రవర్తించడమేమిటి? ఆయన ప్రవ ర్తనను, ఆ ప్రవర్తనలోని మంచిచెడులను తూచి చూడటానికి నేనెవరను? ఆ ప్రవర్తనకు వెగటుచెంది, అవమానించటానికి నేనెవ్వడను? ఒక మామూలు మనిషే మహర్షి యెడల అలా ప్రవర్తించకూడదే! మరి బాధ్యతాయుతమైన పదవిలో ఉన్న నేను, రాజునై సకల ధర్మములను రక్షింపవలసిన నేను ఇలా ప్రవర్తించవచ్చునా? ఈ ప్రశ్నార్థకములలో నలిగి పోతున్న నాకు ఏ సేవలు సేద తీర్చగలవు? ఏ ఉపచారాలు ఉపశమనాన్నీయగలవు?' అంటూ పరీక్షిత్తు పరి పరి విధాల ఆలోచిస్తూ ఉండగా, శమీకుడిచేత పంపబడ్డ మునికుమారుడు వచ్చి, జరిగినదంతా చెప్పాడు. జరిగింది జరిగినట్లుగా చెప్పాడు. బాధపడుతూ నిలుచున్నాడు.

ఆ మునికుమారుని భుజంపై చేయివేసి, ఇలా అన్నాడు పరీక్షిత్తు "ముని కుమారా! బాధపడకు శమీక మహామునిని కూడా బాధపడవద్దని చెప్పు. నాలో చెలరేగుతున్న కామ క్రోధాలను అణగించి, నా పాత్రకు కావలసిన వైరాగ్యాన్ని కలిగించే దివ్యౌషధంగా తక్షకుని విషాన్ని స్వీకరించబోతున్నానని చెప్పు. మునికు మారా! బాధపడకు" అంటూ అతనిని వెనుకకు పంపి, పరీక్షిత్తు హస్తినవైపుకు సాగాడు.

# శాపం కాదు

హస్తినాపురానికి చేరిన పరీక్షిత్తు తన భవంతిలో ఒంటరిగా కూర్చుని జరిగిన సన్నివేశాలను గూర్చి ఆలోచిస్తున్నాడు. కాలం గడుస్తున్న కొద్దీ ఎదిగి వెలుగుతున్న విచక్షణా జ్ఞానాన్ని వినియోగించి నడచిన సన్నివేశాలను సమీక్షిస్తున్నాడు. సమీక్షిస్తున్న కొద్దీ తన మీదుగా తన సంస్కారానికి విరుద్ధమైన కార్యం ఎలా జరిగిందని, దానికి మూలం ఏమిటని, ప్రేరణ ఏమిటని చింతించసాగాడు.

చింతించగా, చింతించగా అసలు వేటకని బయలుదేరటమే వీటన్నింటికి మూలమని అతనికి అనిపించింది. క్షత్రియులు వేటాడవచ్చు. వేటాడటం వారికి ధర్మమే కావచ్చు. కాని అది సామాన్యధర్మమే. మరి పరమ ధర్మం ఏమిటి? క్రూర జంతువులు తమ గతులుతప్పి, ఇతర జీవులను, జనపదాలలోని జనాలను బాధించసాగినప్పుడు, వాటి నడుపులో పెట్టడానికేవేట. వాటి బారి నుండి మిగిలిన ప్రపంచాన్ని రక్షించటానికే వేట. కాని క్రమంగా వేట ఒక వేడుకగా మారింది. క్షత్రియుల సామర్థ్యాని కది ఒక సంకేతంగా మారింది. వారిపాలిటి అది ఒక వ్యసనమై కూర్చుంది. మన అలవాట్ల వెనక, ఆచారాల వెనక ఇలా ఎన్నెన్ని పరిణామాలుంటాయో! ఆ పరిణామాల మీదుగా పరమార్థాన్ని గమనించుకొని, ఆచారవ్యవహారాలను సరిచేసుకున్నప్పుడే సమాజానికి క్షేమం.

చూడగా వేడుకగా ప్రారంభమైన నా వేటయే ఇంత మలుపు తిప్పింది. ఈ కథను నడిపిస్తున్నది. వేడుకగా ప్రారంభించాను. క్రమంగా సామర్థ్యం చూపిద్దామని విజృంభించాను. ఒడలు తెలియనంతగా ఆ విజృంభణసాగింది. ఒడలు బడలిపోయింది. దాని పట్టు సడలిపోయింది. శరీరంలోని కోశాలన్నీ శిథిలమై, ఉద్వేగాన్ని అనుభవించసాగాయి. ఆకలి, దప్పిక, అలసట చుట్టుముట్టాయి. పోను పోను నేనెలా ఉన్నాను? ఏం చేస్తున్నాను? ఎలా ప్రవర్తిస్తున్నాను? నాకే తెలియని స్థితి వచ్చింది. సరిగా అలాంటి దుస్థితిలో ఉండగా మహర్షిని నేను సమీపించడం జరిగింది. ఆయన గాఢ సమాధిలో ఉన్నాడు. నేను శిథిల శరీరంతో ఉన్నాను. రజోగుణం నాలో ప్రవర్తించి ప్రవర్తించి తన తాలూకు మలినాలతో నాలోని అన్ని కోశాలను అలముకోసాగింది. నాకిక మహర్షి నిజస్థితి గోచరించలేదు. అతడిది నటన అనిపించింది. అతడలా కావాలని చేస్తున్నాడనిపించింది. అతడిని అవమానించాలనిపించింది.

అవమానించి తృప్తిపడాలనిపించింది. ఇదంతా ఆ రజోగుణ దోషఫలితమే. రజోగుణ దోషానికి నేనంతగా అవకాశ మివ్వడమే అలా జరగడానికి కారణం. తలచుకుంటే ఇప్పుడాశ్చర్యం వేస్తోంది. మహర్షి యెడల అలా ప్రవర్తించడం ఎంత పాపం! ఇంకా చెప్పాలంటే ఎంతటి సాహసం అది! పరీక్షిత్తేనా ఇలా ప్రవర్తించింది! ఈ పరీక్షిత్తేనా ?! ఇంతటి పాపం, ఇంతటి సాహసం నా స్వభావానికి పూర్తిగా విరుద్ధమైన ఈ దుష్క్రియ నానుండి ఎలా జరిగిందో నాకే అంతుపట్టడంలేదు. ఇదేమి దైవ యోగమో! ఇలాంటి ప్రవర్తన జరిగినప్పుడు ఇక దాని ఫలితం దారుణంగా ఉంటుందని వేరేచెప్పాలా?

శృంగి నన్ను శపించాడట. ఆ శాపఫలంగా తక్షకుడు వచ్చి నన్ను కరుస్తాడట. కరిస్తే కరువనీ. ఈ ప్రాణాలు పోతే పోనీ! ఈ రాజ్య భోగాలన్నీ ఇప్పుడే నా నుండి తప్పుకోనీ. మెరుపుతీగల్లా చంచలమైనవి ఈ మానవ జీవితాలు. ఎక్కడ మెరుస్తాయో, ఎక్కడ మసగేసి పోతాయో వీటికే తెలియదు. అలాంటి ఈ నా జీవితంకోసం, నా జీవితాన్ని రక్షించుకోవడంకోసం శృంగికి ప్రతిశాపం పెట్టనా? పెట్టను. పెట్టలేను. అతనికి శాపం పెట్టను, సరికదా, అతడి శాపంనుండి తప్పుకొని బయటపడే ప్రయత్నంకూడ చేయను. అది శాపంకాదు. నిజానికి అది నాపాపఫలం ధరించిన రూపం. కనుక ఆ శాపాన్ని అనుభవిస్తాను. ఆ శాపాన్ని ఆహ్వానిస్తాను.

పాపం ఆ శృంగి తిట్టకేం చేస్తాడు! పనివేళ వాళ్ల ఆశ్రమానికిపోయి అతడి తండ్రిమెడలో పామునువేస్తే అతడు తిట్టడా? అతడికి కోపంరాదా? అతడు శపించడా? ఇదంతా ఎక్కడొచ్చింది? రాజరికం నాలో ప్రేరేపించిన రజోగుణం వల్ల. ఆ రజోగుణం విజృంభించగా రగిలిన రజోగుణ దోషం వల్ల.

రాజన్నవాడు గోవులను, బ్రాహ్మణులను, దేవతలను తాను గౌరవించాలి. ప్రజలందరూ గౌరవించేటట్లు చేయాలి. మరి నేను చేసిందేమిటి? రాజునైన నేను ఇలా ప్రవర్తింపవచ్చునా? ఇలాంటి పాపపూరితమైన సాహసానికి నేనెలా ఒడిగట్టాను? ఆ ప్రవర్తనను నేనెందుకని నిలుపలేక పోయాను? తనను తాను అదుపు చేసుకోలేని రాజు ఇక రాజ్యాన్నేమి అదుపుచేయగలడు?

నాదెలాంటి వారసత్వం! నాపెద్దలెలాంటివారు! నా పెద్దలను నడిపించిన ఆ శ్రీకృష్ణుడు ఎంతటివాడు! అతడి కరుణవలన కదా! నేను బ్రతికి బట్టకట్టినది ! మరి ఈ నా ప్రవర్తన ఆ పెద్దలకు తగినట్లున్నదా? మరి ఈ నా ప్రవర్తన ఆ పరమాత్ముని సంకల్పానికి తగినట్లున్నదా?

అని తలపోస్తూ, తర్కించుకుంటూ, ఆ కృష్ణస్మరణలోనే అలా కొంత సేపు ఆదమరచి ఉండిపోయాడు పరీక్షిత్తు.

శాప వృత్తాంతము విన్న తక్షకుడు తన పని చేయటానికి తాను సంసిద్ధుడౌతున్నాడు. పరీక్షిత్తుకు ఇక తనకు మిగిలినది కొద్ది సమయమేనని గుర్తుకు వచ్చింది. ఇప్పటికి ఏడవరోజున మరణం అతనిని సమీపిస్తున్నది. అతడు లేచి నిలబడ్డాడు. భోగాలైన వస్తు వాహనాలను విడిచిపుచ్చాడు. స్వర్గలోక భోగాలైన పుణ్య ఫలితాలను వదిలిపెట్టాడు. అన్నపాన స్వీకరణలకు కూడ స్వస్తిచెప్పాడు. గంగానదిని సమీపించాడు. ఆ నదిని చూడగానే అతనికి సంతోషం వేసింది. తులసీదళాలతో అర్చింపబడిన విష్ణుని పాదాలకు సోకే రేణువులకన్నా పవిత్ర మైనది ఈ గంగాజలం. ఎందువల్లనంటే ఇది ఆ విష్ణుమూర్తి పాదంనుండే పుట్టింది కనుక. నా వంటి పాలకులేకాదు. దిక్పాలకులు కూడా ఈ జల స్పర్శతో తరిస్తారు. దేవతలనుండి మానవుల వరకు అందరికీ సౌభాగ్యాన్ని కలిగించే పవిత్రనది ఇది. కలి దోషాలను పూర్తిగా హరించి, జీవులను పునీతం చేయగలిగిన శక్తి గలది.

ఇలా భావిస్తూ అతడు ఆ గంగానదికి మధ్యలో నివాసమేర్పరచుకుని మరణానికి సంసిద్ధుడై ప్రాయోపవేశం చేశాడు.

అతడి మనస్సు క్రమంగా నిర్మలమైంది. ఎనలేని ప్రశాంతత అతనికి అనుభవానికి వస్తోంది. చిత్తాన్ని గోవిందుడి పాదాలవైపునకు మళ్లించి, మైమరుపు చెందుతున్నాడతను.

పరీక్షిత్తు ప్రాయోపవేశం చేశాడన్న వార్త తెలుసుకున్న ఋషులందరూ వేగంగా అతనిని చేరుకున్నారు. అత్రి, విశ్వామిత్రుడు, మైత్రేయుడు, వసిష్ఠుడు, పరాశరుడు, వ్యాసుడు, పరశురాముడు, భరద్వాజుడు, మొదలైన ఋషులెందరో అతన్ని చేరుకున్నారు. పరీక్షిత్తు వారందరికీ ఎదురేగి తగిన విధంగా వారిని పూజించి, వారి ఆశీస్సులనందుకొని ఇలా విన్నవించాడు. 'మహర్షులారా! నేను కోపానికి లొంగిపోయి, ఋషి మెడలో చచ్చిపోయిన పామును ఉంచిన దారుణ స్వభావము కలవాడను. మదించి ప్రవర్తించిన పాపిని. మీరందరూ పాపములనే గడ్డిపరకలకు అగ్నిహోత్రము వంటివారు. నన్ను దయతో చూడండి. నా పాపములన్నీ తొలగిపోయే మార్గం చెప్పండి. రాజ్యాలను పాలించే రాజులను పవిత్రం చేసేవి మహర్షులారా, మీ వంటి బ్రాహ్మణోత్తముల పాదరేణువులే! మీ చరణ రేణువులు నా దేహాన్ని సోకిన ఈ క్షణంలో నేను చేసిన పాపమంతా నశించి

పోయిందనిపిస్తోంది. మీ పాదస్పర్శవల్ల ధన్యుడనయ్యాను. పెద్దలారా! దేని నాచరిస్తే సూటిగా ముక్తి దొరకుతుందో దానిని నాకు ఉపదేశించండి.

భయంకరమైన ప్రవర్తన నా నుండి వెలువడింది. తక్షకుని విషం దాని నుండి విముక్తి నివ్వడానికి నన్ను సమీపిస్తోంది.

పెద్దలారా ! నాలో అహంకారం పోలేదు చూశారా ! పోయిందనుకున్నాను నేను. కాని అది ఎక్కడో ఉండిపోయింది. వేటాడే సన్నివేశంలో అది పైకి ఉబికింది. అది గమనించిన విష్ణుమూర్తి దానిని తొలగించడానికే ఈ శాపాన్ని రూపొందించాడనిపిస్తోంది.

"మహనీయులారా! నేను జరిగిన దానికి బాధపడుతున్నానుతప్ప, జరగబోయే దానికి భయపడటంలేదు. తక్షకుని విషానికి శరీరం అర్పించడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అది ఈశ్వర సంకల్పం. దానికి తిరుగులేదు. దాని విషయమై నాకు బెంగలేదు. నేను కోరేది ఒక్కటే. రాబోయే జన్మలన్నింటిలో విష్ణువును స్మరించాలనీ, విష్ణువును గూర్చి వినడంలో ఆనందాన్ని అనుభవించాలనీ, విష్ణుని పాదసేవలో నేను పరవశించాలనీ మీరు ఆశీర్వదించండి. ఆ అభిలాష నాకు కలగాలని మీరు సంకల్పించండి. దైవ స్మరణ చేయాలన్న అభిలాష, అతడిని గూర్చివినాలన్న ముచ్చట మనస్సుకు కలగడం కన్న ముఖ్యం ఏమిటి? చెప్పండి. ఆ అభిలాష లేనినాడు, ఆ ముచ్చట కలుగనినాడు ఎన్ని సాధనలు చేసి ఏమిఫలం?

"మహర్షులారా! ఉన్నవి ఏడు రోజులు. నాకు ఉన్నవి ఏడు రోజులు. ఈ ఏడురోజులు గోవిందుని గూర్చి గానం చేయండి. హరిభక్తులను గూర్చి సంభాషణలు జరపండి. ఈనాకు కల్యాణస్థితి సిద్ధించేటట్లుగా చూడండి. ముక్తి మార్గాన్ని నాకు చూపండి.

"ఈ గంగ ఉన్నదే. ఈమెను దర్శిస్తే ఇక బెంగలేదట. సూటిగా ముక్తి మార్గం వెంట ఈమె నడిపిస్తుందిట. ఈమె నా యెడల ప్రసన్నురాలగుగాక! అమ్మా ! గంగా! నీ నిజరూపంతో ఒక్కసారి లేచిరా తల్లీ! లేచి వచ్చి ఈ నీ బిడ్డను అక్కున చేర్చుకో అమ్మా! వచ్చే జన్మలలో నాకు మంచి మనస్సునివ్వు తల్లీ. మంచి బ్రతుకునివ్వు తల్లీ. విష్ణుపాదాలను విడిచి ఉండలేని భక్తినినాకు అనుగ్రహించు. అమ్మా! అమ్మా! ఈ నాజీవితంలో కూడ విష్ణుని పాదాలను నేను ఏమరి ఎరుగను, మొన్న జరిగిన ఆ సన్నివేశంలో తప్ప. ఈ

విశ్వమే విష్ణుమూర్తి రూపంగా ఆరాధించడంలో ఆనందిస్తున్న వాడిని. ఆ కాసేపి క్షణాలలో నా దర్శనం ఏమయిందో! ఆ దర్శనాన్ని కోల్పోయిన ఆ కాసేని క్షణాలలో నా మనస్సు ఎంత వికార స్థితికి లోనయిందో! వద్దమ్మా! ఇక అలాంటి స్థితి నాకు వద్దు. జన్మంటూ ఎత్తితే, దేహాన్ని ధరించి మళ్లీ ఈ భూమి మీదకువస్తే కనబడుతున్న ఈ విశ్వమంతా విష్ణుమూర్తి రూపమని నాకు ఎరుక కలగాలి. ఆ ఎరుక నిరంతరం సాగాలి. విశ్వం రూపంలో వ్యక్త మవుతున్న విష్ణుమూర్తి పాద పూజగా జీవితం సాగిపోవాలి. అమ్మా! ఇకపైన ఎన్నిమారులు నేను దిగివచ్చినా, అలాంటి పూజగా జీవితం సాగేటట్లుగా అను గ్రహించు. అమ్మా! ఆశీర్వదించు. అసలు ఎరుకంటూ కలుగకపోతే అది ఒక పద్ధతి. ఎరుకంటూ కలిగిన తరువాత ఈ విశ్వమే విష్ణుమూర్తి విశ్వరూపంగా గోచరించడం మొదలిడిన తరువాత ఏమరుపాటు కలగడమంటే అది ఎంత బాధాకరంగా ఉంటుందో ఏమని వివరించను తల్లీ. ఇక అది నీవే గ్రహిం చుకోవాలి తప్ప. అలాంటి ఏమరుపాటుకు అవకాశం లేని జన్మలను ఇకపైన అనుగ్రహించుతల్లీ. అలా అని ఆశీర్వదించు." అని గంగకు ఏటికోళ్లు సమ ర్పించి గంగానదీ, దక్షిణతీరంలో తూర్పువైపుకు కొసలు ఉండేటట్లుగా దర్భలను తీర్చి, ఆ దర్భలపై తాను ఉత్తర దిక్కుకు అభిముఖంగా కూర్చుండిపోయాడు పరీక్షిత్తు.

కుమారుడైన జనమేజయుడిని పిలిపించి, మహర్షుల సన్నిధిలో రాజ్యభా రాన్ని అతనికి అప్పగించి నిర్వహించవలసిన ఆ ఒక్క బాధ్యతను నిర్వహిం చానన్న తృప్తితో ఋషులకు నమస్కరిస్తూ అతడు పూర్తిగా విష్ణుస్మరణలో మునిగిపోయాడు. ఋషులకు చేతులు జోడించి, వాసుదేవునికి చిత్తమప్పగించి, నిర్మలుడై నిశ్చలుడై నిలచిన అతనిపై దేవతలు పూలవానలు కురిపించారు. దేవ దుందుభులు మ్రోగాయి. ఆ దృశ్యాన్ని చూస్తూ తృప్తిగా శిరస్సులు పంకిస్తున్నారు ఋషులు.

# ఏడు రోజుల్లో

దేవ దుందుభులు మ్రోగుతూ ఉండగా, దేవతలు కురిపించిన పూలవానలో మునిగి తేలుతున్న పరీక్షిత్తును వాత్సల్యంతో నిండిన నేత్రాలతో చూస్తూ ఋషీంద్రులిలా అన్నారు : "ఓ పరీక్షిన్మహారాజా! నీది చిత్రమైన జీవితం. నీ జీవిత సన్నివేశాలు చిత్ర విచిత్రాలు. నీ పుట్టుకే ఒక విచిత్రం. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం తల్లి గర్భంలో రూపుదిద్దుకుంటున్న నిన్ను చుట్టుముట్టి ఉగ్ర జ్వాలా రూపంతో మీద కొచ్చేస్తూ ఉంటే నీవేమయిపోతావోనని నీ తల్లి తల్లడిల్లి పోయింది. ఆపద్బాంధవుడైన శ్రీకృష్ణుడిని స్మరించింది. ఆయన కలగ జేసుకుని, ఆ జ్వాలలను చల్లార్చి నిన్ను స్పృశించాడు. ఆ స్పర్శ ఎంత మరువ లేనిదో అనుభవించిన నీవే చెప్పాలి. ఎవరైనా పుట్టీ, పెరిగీ, పెద్దల వల్ల తెలుసుకుని, సాధనచేసి, క్రమంగా ఎదిగి, అప్పుడు దైవ సాక్షాత్కారానికి నోచుకుంటారు. అది కూడ ఎన్ని జన్మల తరువాతనో! అలాంటిది శరీరానికి రూపకల్పన జరుగుతున్న వేళలోనే శ్రీకృష్ణుని సాక్షాత్కారం పొందిన నీ అదృష్టం ఎంతటిదని చెప్పగలము! సాక్షాత్కారంతో బాటుగ అతడు చూపిన ఆశ్రిత రక్షణంలోని కరుణా వైభవాన్ని కూడా అనుభవించిన నీవు పొందిన ధన్యతను ఎంతటిదని వర్ణించ గలము! అలాంటి దివ్యమైన విచిత్రంతో ఈ నీ కథ ప్రారంభమైంది.

ఇక రెండవ చిత్రం. ఈ కురు వంశానికి నీవు వారసుడవు అవటం. సింహాసనం నీదాకా వచ్చి నిన్ను వరించటం. నిజంగా ఇది విచిత్రం. ఉప పాండవులంతా వెళ్ళిపోవడం, పైశాచిక ప్రవృత్తితో అశ్వత్థామ అపాండవం చేయటానికి ప్రయత్నించడం, పాండవుల వంశాంకురాలు గర్భాల్లో ఉన్నాసరే దహింపబడాలని అతను సంకల్పించడం. అలా దహింప బడిపోతూ ఉండగా, నీవు మాత్రం శ్రీకృష్ణుడి కరుణకు నోచుకోవడం, అలా బ్రతికి బయటపడి బట్టకట్టిన నీవు చిన్నతనంలోనే పాండవుల వారసునిగా పట్టాభిషిక్తుడవు కావడం - ఆలోచిస్తే ఇదంతా చిత్రం కాదా!

"నిన్ను పట్టాభిషిక్తుణ్ణి చేసి పెద్దలందరూ ఒక్కసారిగా మహాప్రస్థానం ప్రారంభించారు. అటు శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచిపెట్టాడు. ఇటు పెద్దలు నడిచి వెళ్ళి పోతున్నారు. ఇంత భూమికి, కుర్రవాడివైన నీవు ఒక్కడివి మిగి

లావు. పైగా అది కలి ప్రవేశిస్తున్న వేళ. సరే! జైత్రయాత్ర ప్రారంభించావు. ప్రవేశిస్తున్న కలిని పసి కట్టావు. పసికట్టి అతన్ని దమించావు. భూదేవి, ధర్మ దేవతల కన్నీళ్లు తుడిచావు. ఒంటికాలు, కుంటికాలు - ఇక నడక ఎలా? అని బాధ పడుతున్న ధర్మదేవతను నాలుగు పాదాలతో నడిపించావు. శ్రీకృష్ణుని స్పర్శ కోసం పరితపించి పోతున్న భూదేవికి ఆ స్పర్శను నీ ద్వారా అందించి పరవశింప జేశావు. మహారాజా! ఇది ఎంతటి విచిత్రం!

"కలిని దమించిన నీవు భూమికి స్వర్ణయుగాన్ని అందించావు. నీ పెద్ద లను మరిపింప జేశావు. ప్రజలు సుఖశాంతులనుభవించారు. యజ్ఞయాగాలు అవిచ్ఛిన్నంగా సాగడంతో దేవతలు ఎంతగానో తృప్తి పడ్డారు. ప్రజలకు ఇటు భోగం, అటు యోగం, రెండింటిని అందించావు. ఆ రెండింటినీ అనుభవిం చటానికి కావలసిన సమన్వయాన్ని నీ జీవితం ద్వారా వారికి ఉపదేశించావు. రాజయోగ మార్గమంటే ఏమిటో వారికి అనుభవానికి వచ్చేట్లు చేశావు. భగ వద్గీతలో కృష్ణ భగవానుడు ఉపదేశించిన పరిపూర్ణ జీవితం ఏదైతే ఉన్నదో, అది సకల ప్రజలకు అప్రయత్న సాధ్యం చేశావు. కలియుగం ప్రారంభించిన ఈ వేళలో ప్రజలు ఇలాంటి దివ్యవైభవాన్ని అనుభవించడం చిత్రం కాదా! మహారాజా!

"ఇలా నీ చరిత్ర అంతా చిత్రాలతో నిండి ఉంది. ఇప్పుడు ఈ జరి గిన సన్నివేశం కూడా అలాంటి చిత్రమేనని మా ఉద్దేశ్యం. త్రిగుణాలకు అతీతంగా, త్రిలోకాలు ముచ్చట పడేట్లుగా, దివ్య జీవన మార్గంలో పయని స్తున్న నీవు కొద్ది క్షణాలపాటు రజోగుణ దోషానికి గురి అయ్యావంటే, గురియై మహర్షి మెడలో పామును వేశావంటే - ఇంతకంటే చిత్ర మింకేముంటుంది? మా కనిపిస్తోంది కదా! రజోగుణ దోషం నుండి రక్షింప బడటం ఎలాగ! - అన్న ఉపదేశమేదో, నీ శేష జీవితం నుండి ఈ ప్రజలకు ఉపదేశింప బడుతోందని. అలాంటి ఉపదేశ మేదో నీ మీదుగా లోకానికి అందడానికే చిత్రమైన ఈ సన్నివేశం జరిగి ఉంటుందని.

"మీ తాతలు తపోధనులు. విష్ణుమూర్తి సాన్నిధ్యాన్ని నిరంతరం అనుభవిం చిన ధన్యమూర్తులు. ఆయన సాన్నిధ్యం అనుభవించాలంటే ఆయన ప్రకారం నడుచుకోవాలి. వాళ్లు అలాగే నడుచుకున్నారు. ఆ నడుచు కోవడం కోసం రాజ్యాలను వదులు కున్నారు. అరణ్యాలు పట్టారు. బ్రాహ్మణ వేషాలు ్వారు. మారు వేషాలలో బ్రతికారు. ఇలా ఎన్నెన్నో చేశారు. ఇదంతా ఎందుకు?

ఆయన ప్రకారం నడుచుకుందామని. ఆయన ప్రకారం బ్రతుకుదామని. అలా బ్రతకటంలోనే ఆనందం ఉన్నదని. సరే, ఆయన పూనుకొని వాళ్ళ కొరకు రాయబారం నడిపాడు. రథసారథి అయ్యాడు. చివరకు వాళ్లకు రాజ్యం దక్కేటట్లు చేశాడు. దక్కిన రాజ్యాన్ని పరిపాలించడం మొదలు పెట్టారో లేదో మీ తాతలు - ఇంతలో ఆ శ్రీకృష్ణుడు శరీరాన్ని విడిచాడు. ఆ వార్త తెలిసి మీ తాతలు వెంటనే సింహాసనాలను విడిచి ఉత్తరం వైపుకు ఆయన్ను వెతుక్కుంటూ నడచి వెళ్ళిపోయారు. మహారాజా! సరిగా నీవు కూడ మీ తాతలకు తగిన వాడివే. కృష్ణుడి ప్రకారం నడచుకోవడానికే ప్రాధాన్య మిచ్చావు నీవు కూడా. నీ జీవితమంతా ఆయన ప్రకారమే నడిచింది. 'ఇదుగో ఇప్పుడీ సన్నివేశం ఆయనకు విరుద్ధంగా నడిచింది' - అని అనుకోబట్టే కదా నీవు ఇంతగా విలవిల లాడి పోతున్నావు! ఈ విలవిల లాడి పోవడం దేనిని తెలియజేస్తోందో తెలుసునా? శ్రీకృష్ణుని ప్రకారం నడుచుకోడానికి గాను నీవు పూనిన మహోన్నతమైన దీక్షను, ఆ దీక్షలోని లోతును. మహారాజా! నీవు ఒకవైపు నుండి చూస్తున్నావు. ఆయన ప్రకారం నడుచుకో లేకపోయాను కదా! అని బాధపడి పోతున్నావు. మేము ఒక వైపు నుండి చూస్తున్నాము. ఏ మహత్తరమైన ఉపదేశాన్ని ఈ భూమికి అందించాలనో కదా! ఇతడి జీవతంలో ఇలాంటి సన్నివేశం వచ్చేటట్టుగా చేశాడు ఆ భగవంతుడు. అని. మహారాజా! మా దృష్టిలో నీవు మీ పెద్దల కన్న ఉన్నతుడివి. కృష్ణుడు వెళ్ళిపోయాడని తెలియగానే సింహాసనాలను విడిచి, నడిచి వెళ్ళిపోయారు మీ పెద్దలు. కాని నీవు ఈ దేహాన్ని విడిచే ముందు ఆ శ్రీకృష్ణుని యొక్క దివ్య వైభవాన్ని ఈ భూమికి చాటిగాని, ఈ శరీరాన్ని విడిచి పెట్టవు! అని మా కనిపిస్తోంది. అందుకే ఈ సన్నివేశం వచ్చింది అనిపిస్తోంది.

శ్రీకృష్ణుడు మృత్యువుకు కూడా మహా ప్రయోజనాన్ని సాధించిన అవతార మూర్తి. తన మృత్యువును కూడా లోక హితార్థమైన యజ్ఞంగా మలచిన లీలా మానుష విగ్రహుడు. అటువంటి అవతార మూర్తి తాను అభివ్యక్త మయ్యేందుకు వీలుగా నిన్ను మలచుకున్నాడు. నిన్ను రూపొందించు కున్నాడు. నిన్ను నడిపిస్తున్నాడు. నీ ద్వారా తానే కనిపిస్తున్నాడు. అలాంటి జగద్గురువు ఇప్పుడు నీ దేహానికి ప్రాప్తించబోయే మృత్యువును కూడా యజ్ఞార్థంగా, జగద్ధితంగా మల చబోతున్నాడని మా కనిపిస్తోంది.

"మహారాజా! నీవు ఈ తనువును విడిచిపెట్టే వరకు మేమందరమూ

ఇక్కడే ఉంటాము. ఎక్కడికీ వెళ్లము. త్రిగుణాలకు అతీతమైన దివ్యస్థితిని నీవు క్రమంగా పొందుతూ ఉంటే శోకానికీ, దుఃఖానికీ, రాగద్వేషాలకీ అతీతమైన స్థితికి నడిచి వెళ్ళడమెలాగో, ఈ నీ ప్రయాణంలో మాకు దర్శనమిస్తుంటే అలా చూస్తూ ఇక్కడే ఉండి పోతాము. నిత్యమూ మేము వల్లించే వేదాలూ, ఉపనిషత్తులు ఇక్కడ నీ జీవితంలో అంతస్సూత్రంగా సాగుతున్నాయి. ఆ వేదోపనిషత్తుల సారాంశమే నీ జీవితం. జీవితానికి అన్వయింపబడినప్పుడు ఆ వేదోపనిషత్తులు ఎంత రమణీయంగా వెలుగొందుతాయో నిన్ను చూస్తుంటే తెలుస్తోంది. ఇప్పుడు నీ శేష జీవితాన్ని విశేష జీవితంగా ఆ వేదోపనిషత్తులు ఎలా మలచబోతున్నాయో, తమ యొక్క నిజస్వరూపాన్ని నీ ద్వారా ఎలా వెల్లడి చేయబోతున్నాయో కనులార చూస్తూ ఇక్కడే ఉండి పోతాం మహారాజా!

"మహారాజా! నీ జీవితం శ్రీకృష్ణుని లీలా మయం. నీ జీవితం వేదోపనిషత్తుల కొక వ్యాఖ్యానం. నీ జీవితం భగవద్గీతకు భాష్యం. నీ జీవితం అపౌరుషేయం.

"నీ జీవితంలోని ప్రతి ఘట్టం నీ కొరకు నడిచింది కాదు. అలాంటిదే ఈ చివరి ఘట్టం కూడా. ఇది కూడా లోకహితం కోసం నడుస్తున్నదే. అందుకని చరితార్థమైన ఈ ఘట్టాన్ని చూద్దామనీ, ఈ ఘట్టం నుండి అందేటటువంటి శాశ్వతమైన సందేశాన్ని అందుకుందామనీ, మేము, ఋషులము అన్ని వైపుల నుండి అందరము వచ్చాము. నీతోడనే ఉంటాము. నీకు తోడుగా ఉంటాము. నీ దివ్య ప్రభావాన్ని కనులు పెద్దవి చేసుకుని చూచి ఆనందిస్తాము. మహారాజా! నీవు ధన్యుడవు. నీవు ధన్యుడవు. మేము ధన్యులము. ఈ జగతి ధన్యము. గ్రహించావు కదా! ఈ సన్నివేశ పరమార్థాన్ని." - అంటూ తమ చూపులతోనే అతడి ఒడలెల్ల నిమిరి సేద తీర్చారు ఋషులు.

ఆశీః పూర్వకమైన ప్రశంసా వాక్యాలతో తనను సేదతీర్చిన ఋషివరులందరినీ ఒక్కసారి కలియ జూస్తూ ఇలా అన్నాడు పరీక్షిత్తు: "మహనీయులారా! మీ వాక్కులు నాకు ఎనలేని ప్రశాంతతను అనుగ్రహిస్తున్నాయి. ఉదారమైన మీ స్వభావాన్ని, ఉన్నతమైన మీ సౌజన్యాన్ని వెల్లడి చేస్తున్నాయి. సన్నివేశాలను సత్యలోక స్థాయి నుండి చూస్తున్న వారు మీరు. వేదోపనిషత్తులు ఏ లోకం నుండి వ్యక్తం అవుతున్నాయో ఆలోకం నుండి, ఆ లోకంలో ఉండి, ఈ లోకాన్ని పరికిస్తున్నవారు మీరు. వేదోపనిషత్తులే ఆకారాన్ని స్వీకరించి, ఇలా ఋషి సమూహాలై భూమిపైన నడుస్తున్నాయి. భూమి ప్రజలను నడిపిస్తున్నాయి.

"మహర్షులారా! ఈ ఏడు దినాలలో నేను ముక్తిని పొందాలి. పరిపూర్ణ తను చెందాలి. నా మతి గతి తప్పటం మాని, హృదయ పథాన్ని పట్టాలి. ఆ హృదయంలో కరిగిపోవాలి. ఇదంతా ఈ ఏడు రోజుల్లో జరిగి పోవాలి.

"నేనడిగిన దివ్య స్థితిని అనుగ్రహించడానికి నిజానికి మీకు ఏడు రోజులు కావాలా? ఆనంద స్వరూపులు మీరు. బ్రహ్మవిద్యను బోధించడ మనే కళలో పండి పోయినవారు. అజ్ఞానాన్ని దాటి ఆత్మప్రకాశంలో వెలిగి పోతున్న వారు మీరు. మీరు పెద్దలు. దయా స్వరూపులు. మీకు తెలియని సృష్టి రహస్యా లుంటాయా? సకల జ్ఞానము మీకు అరచేతి ఆమలకము. బ్రహ్మవిద్య మీకు వెన్నతో పెట్టిన విద్య. కనుక ఈ ఏడు రోజులలో నేను ఈడేరే మార్గమే మిటో మీరే చూడండి. ఈ కథను మీరే నడిపించండి."

పరీక్షిత్తు ఇలా అడుగగానే ఋషులందరూ ఆనందంతో పాటు ఆశ్చర్యాన్ని కూడ అనుభవించారు. ఇతడు చిత్రమైన వాడు. చిత్రమైన పరిస్థితిని మన కిప్పుడు కల్పించాడు. ఆత్మవిద్యను అందించ మంటున్నాడు. అందుకు ఏడు రోజులు సమయ మంటున్నాడు. ఇతడు అజ్ఞాని కాడు. శ్రద్ధ కలిగిన సాధ కుడు. సాధనను జీవితంగా వ్యక్తం చేయగలిగిన సమర్థుడు. ఆ వ్యక్తం చేస్తున్న తరుణంలో దైవయోగం చేత ఇతని మనస్సుకు చిన్న ముడి పడింది. దీక్షా దక్షతలు కలిగిన వాడు. ఆ ముడి పడటాన్ని తానే గ్రహించాడు. ముడిని విడ దీశాడు కూడా. మరిప్పు డితనికి ఏం కావాలి? ఆ ముడి పడటం వలన కలిగిన అశాంతి ఉన్నదే అది పోవాలి. మనస్సుకు ఆ ముడిపడే స్వభావ మున్నదే - అది పోవాలి. చాలా చిత్రమైన స్థితిని కల్పించాడితడు. నిజానికి ఇతనికి తెలియని అంశాలు ఏమిటి ఉన్నాయి? ఇతడికి తెలిసిన అంశాలలో నుండే ఇత డికి తెలియ వలసిన అంశాలు ఏవో ఇప్పుడు చెప్ప బడాలి. ఇంకా చెప్పాలంటే - ఇతడికి తెలిసిన అంశాలే ఇప్పటికి కావలసిన విధంగా ఇతడికి చెప్పబడటం జరగాలి. భలే పనిని పెట్టాడే!' - అని ఇలా ఋషులు చర్చించుకుంటూ ఉండగా, దైవ యోగం చేత వారి చర్చలకు ఫలమా! అన్నట్లుగా, వారి చర్చలు సఫలమైనాయా? అన్నట్లుగా శుక యోగీంద్రుడు వారిని సమీపిస్తున్నాడు.

# సాధకుని విధులు

ఆ సమీపిస్తున్న శుకయోగీంద్రుడు పదహారు వత్సరాల దిగంబర మూర్తి. లోకులందరూ లోకాన్ని చూస్తూ ఉండగా, అతడు మాత్రం లోక రూపంలో వ్యక్తమవుతూ ఉన్న దైవ స్వరూపాన్నే చూస్తూ ఉన్నాడు. ముఖం దివ్య వర్చస్సుతో వెలిగిపోతూ ఉంది. వెలిగిపోతున్న ఆ ముఖం మీద నల్లటి ముంగురులు పడుతూ ఉన్నాయి. వికసించిన కమలం మీద తుమ్మెదలు వాలుతూ ఉన్నట్లుగా ఉన్నదా దృశ్యం. అతడు నడిచి వస్తూ ఉంటే పిల్లకాయలు నవ్వుతూ వెనక బడుతున్నారు. - 'ఇతడికి ఎలాంటి బంధమూ లేదు. ఇతడికి ఎలాంటి సంగమూ లేదు.' అని పంచ భూతాలు వెంటబడి ఘోషిస్తున్నట్లుగా ఉంది ఆ దృశ్యం. ఆ పాద మస్తకం దివ్య సౌందర్యంతో తొణికిసలాడుతూ ఉన్నాడతను. అందమే అలా రూపు కట్టిందా! ఆనందమే అలా ఆకృతి దాల్చి దిగి వచ్చిందా? అన్నట్లుగా ఉన్నాడతను. ఆ అవయవాల పొందిక, ఆ అపురూప సౌందర్యం, ఓహో! ఆశ్చర్యం.

నాకిది కావాలని ఎవరినీ అడిగి ఎరుగడతను. ఒకరు తనకు చేయలేదని ఎన్నడూ అనుకొని ఎరుగ డతను. పదిమంది కలసి కాలక్షేపాలు చేస్తున్న చోటులకు పోయి అందేమి జరుగుతున్నదని ఆత్రుతను చూపడు. ఎవరైన వాదనలలోనికి దిగిన వేళలలో తానుగా ఏమీ మాట్లాడడు. వాదించు కొనుటలో వారు ఆనంద మనుభవించుచున్న వేళ మనము అడ్డుపడటం ఎందుకని అలా ఊరకుండి పోతాడు. దైవయోగాన తనకు లభించిన దానితో తృప్తి పడతాడు. తానెంత తెలివిగల వాడైనప్పటికీ, విద్వాంసుడైనప్పటికీ, జీవితము లోని ఒడుదు తెలిసిన వాడైనప్పటికీ, ఏమీ తెలియని వాడివలె తన మానాన తాను తనపనిలో నిమగ్నమై ఉంటాడు. ఇలా సాధకులైన వారందరకీ ఆదర్శ ప్రాయుడతడు. ఆధ్యాత్మిక మార్గంలో నడువ గోరే వారందరికీ ఆనడక ఎలా సాగాలో తెలియ జెవుతున్నవాడతను.

ఆధ్యాత్మిక మార్గంలో నడవగోరిన వాడు కొన్ని నియమాలు పాటించాలి ఆ నియమాలే శుకయోగి నుండి దివ్యమైన గుణాలుగా ఎలా వ్యక్తమవ తున్నాయో ఇక్కడ వర్ణిస్తున్నాడు. ఈ మార్గములో నడువ గోరిన వాడ

ఇతరులు తనకేమి చేశారని ఆలోచించకూడదు. ఇతరులకు తానేమి చేయగ లుగుతున్నా నన్నదే చూచుకుంటూ ఉండాలి. తోటివారు తనకు తగినట్లుగా ఉండటం లేదని వెప్పపడకూడదు. వారివారి స్వభావాలను గమనిస్తూ, వారికి తగిన రీతిలో వారిని సద్వినియోగం చేయగలిగి ఉండాలి. తోటి వారిపైన మనస్సులో ఎలాంటి అభిప్రాయాలు ఏర్పడకూడదు. అభిప్రాయాలంటూ ఏర్ప డితే అవి ఇక నిలబడి పోతాయి. ఆ అభిప్రాయాలలో నుండి ఇక మనం వాళ్ళను చూస్తూ ఉంటాము. అప్పుడు మనం వాళ్ళలో వస్తున్న ఎదుగుదలను గమనించలేము. ఆ ఎదుగుదలకు దోహదమూ చేయలేము. తద్వారా మన ఎదుగుదలను కూడా వాయిదే వేసుకో గలము. అభిప్రాయం ఏర్పడట మంటే ఇంప్రెషన్ ఏర్పడటం. చూడండీ! ఇంప్రిజన్‌మెంట్ కన్నా ఈ ఇంప్రెష న్‌మెంట్ ఉన్నదే ఇది మా చెడ్డది. అంటే ఏమిటి! జైలులో నుంచయినా బయట పడవచ్చుకాని కరడు కట్టిన అభిప్రాయాలలో నుండి బయట పడటం కష్టం. కనుక తోటి వాళ్ళపైన అభిప్రాయాలు ఏర్పడకుండా జీవించడం చేత కావాలి. తేనెను ఇది నిజమైన తేనా? కల్తీ తేనా? అని చూడటానికి తెలిసిన వారు ఒక పరీక్ష చేస్తారు. మంచి రూపాయి నోటు నొక దానిని దానిలో ముంచుతారు. అది నిజంగా మంచి తేనె అయితే ఆ రూపాయి నోటు కసలేమీ అంటుకోదు. ఏ మాత్రం కల్తీ ఉన్నా నోటు మెత్తబడుతుంది. నోట్ ది పాయింట్. మనమలా మంచి తేనెలో మంచి నోటులా జీవించాలి. ఈ అంశాన్ని ఉపదేశిస్తూనే తామరాకుపై నీటి బొట్టులా జీవించ మన్నాడు శ్రీకృష్ణుడు. అందరితో కలసి పని చేయాలి. కాని ఎవరిపైనా ఇంప్రెషన్స్ ఏర్పడ కూడదు. అభిప్రాయాలు ఏర్పడటం మొదలు పెడితే అవి మన లను అదమడం మొదలు పెడతాయి. అదుపు చేయటం మొదలు పెడతాయి. క్రమంగా మనలని బంధిస్తాయి. బంధాలుగా మారిపోతాయి. సంకెళ్ళయినా విడగొట్టు కోవడం తేలికగాని, వీటి నుండి విడివడటం కష్టమవుతుంది. ఇలా అభిప్రాయాల్లో ఇరుక్కుని ఉన్నామని మనలో చాల మందికి తెలియదు. అసలు అభిప్రాయాలు లేకుండా ఎలా జీవించగలం? అని మన కనిపిస్తుంది. నిజమే. అలవాటు పడిపోయి తరువాత కష్టమే. చాల రోజుల పాటు జైలులో ఉండి విడుదలై వచ్చాడట ఒకడు. ఇంటి దగ్గర వాడికి నిద్రపట్టడం మానేసింది. కొన్నాళ్ళ పాటు పెనుగులాడి చూశాడు, నిద్ర పడుతుందేమోనని. కాని పట్టలేదు. ఇక లాభం లేదని క్రొత్తగా సంకెళ్ళను తయారు చేయించుకుని చేతులకు వేయించు కున్నాడట. అంతే. ఠక్కున నిద్ర పట్టింది. అభిప్రాయాల

కథా అలాంటిదే. వాటితో అలవాటు పడి పోయిన మనకు అవిలేకుండా పోతే ఎలా? అని అనిపించడం సహజమే. ఒక పట్టాన మానవుడు వాటిల్లో నుండి బయట పడాలని కోరడు. వాటితోనే రాగద్వేషాలను అనుభవిస్తూ, ఈర్ష్యా సూయలను వెళ్ళగక్కుతూ, మద మాత్సర్యాలను ప్రదర్శిస్తూ; ఎవరినో ఏదో సాధిస్తున్నామనుకుని, ఎవరికో ఏదో చేసేస్తున్నా మనుకొని బ్రతికి బ్రతికి, ఆ బ్రతుకులో తృప్తి దొరకక, అలసిపోయి, అలసిపోయి తీవ్రమైన తపన చెందిన నాడుగాని, ఈ అభిప్రాయాలను విడిచిపెట్టడం ఎంత అవసరమో తెలిసిరాదు. నిజానికి సన్న్యసించవలసినది వీటినే. వీడు చెడ్డవాడు. వీడు అహంకారి. వీడు మోసగాడు. ఇవన్నీ అభిప్రాయాలే. ఈ కులం గొప్పది, ఈ కులం తక్కు వది, ఇతణ్ణి తాకవచ్చు, ఇతణ్ణి తాక కూడదు. ఇవన్నీ అభిప్రాయాలే. ఈ సిద్ధాంతం గొప్పది. ఈ మతం గొప్పది. దీనిని మించిన సిద్ధాంతము లేదు. దీనిని మించిన మతం లేదు. మా గురువును మించిన గురువులేడు. మేము చెప్పేదే మతం. మేము నమ్మిందే దైవం. మా దైవం ద్వారా తప్ప మరె వ్వరూ తరించలేరు. మా మతం ద్వారా తప్ప ఎవ్వరికీ కన్ను తెరచుకోదు. మా సిద్ధాంతం ద్వారా తప్ప ఈ ప్రపంచానికి ముక్తి లేదు. విముక్తి లేదు. ఇవన్నీ అభిప్రాయాలే. చెప్పండి. వీటిని సన్యసించడం ఎంత కష్టం. వీటిని సన్యసించడం ఎవరి కిష్టం? ఇందులో కొన్ని ఇనుప సంకెళ్ళున్నాయి. కొన్ని వెండి సంకెళ్ళున్నాయి. కొన్ని బంగారు సంకెళ్ళున్నాయి. కాని అన్నీ సంకెళ్ళే. వీటిని సన్న్యసించటమే నిజమైన సన్న్యాస మౌతుంది. బట్టలు మార్చినంత మాత్రాన సన్న్యాసం రాదు. బొట్లు మార్చినంత మాత్రాన సన్న్యాసం రాదు. లేదా బొట్టు తుడిచి వేసినంత మాత్రాన సన్న్యాసం రాదు. తలుపులకీ, గుమ్మాలకీ, ఇంటికీ కాషాయరంగు కొట్టిస్తే సన్న్యాసం రాదు సరికదా గోల్డ్ స్పాట్ కలరై కూర్చుంటుంది. సన్న్యాసం భౌతికం కాదు. మానసికం. ముందు మానసికంగా వచ్చి, ఆ తరువాత భౌతికంగా వ్యక్తం కావలసినది అది. పలక మారుతున్న కాయకు చుక్క దిగినట్లుగా, అలా మనిషిని కాషాయం వరిం చాలి. గోపికా వస్త్రాపహరణ ఘట్టంలో కృష్ణుడు ఎత్తుకు పోయిన చీరలివే. ఈ అభిప్రాయలనే వస్త్రాలను అతను ఎత్తుకు పోయాడు. "అభిప్రాయాల కతీ తంగా, దేహాభిమానాల కతీతంగా జీవించాలి మీరు." అన్న ఉపదేశమే గోపికా వస్త్రాపహరణ ఘట్టంలో ఉన్నది. కనుకనే వ్యాసమహర్షి ఆఘట్టాన్ని అంతగా గానం చేసింది. అభిప్రాయాలు ఏర్పడకుండా జీవించటం చేతనైన కార్డ్లీ లోక రూపంలో ఉన్న దైవ రూపం మనకు గోచరిస్తుంది. ఈ ఛిన్నత్వంలోని

ఏకత్వం మనకు సాక్షాత్కరిస్తుంది. అదిగో, ఆ ధర్శనాన్ని, ఆ అనుభూతిని నిండుగా అనుభవిస్తూనే సాగుతున్నాడు శుకయోగి.

సాధకుడైన వాడికి తీర వలసిన అవశ్యకతలు ఉంటాయి. తీరని కోరికలు ఉండవు. ఈ శరీరం నిలబడటానికి కావలసిన కూడు, గూడు, గుడ్డ - ఇవి అవశ్యకతలు. అలాగే ఈ శరీరంతో పనిచేయటానికి కావలసిన అంగ బలం, అర్థ బలం - ఇవి అవశ్యకతలు. ఇవి కాక మిగిలినవి కోరికలు. ఏవి లేక పోయినా మనం బ్రతక గలమో అవి కోరికలు. ఏవి లేక పోతే మనం బ్రతకలేమో, బ్రతకటానికి అవకాశ ముండదో అవి అవశ్యకతలు. సాధకుడికి ఈ విభాగం తెలియాలి. ఈ విశ్లేషణ ఒంటబట్టాలి. కనుకనే శుకయోగి కోరికలు కోరని వాడుగా చెప్పబడ్డాడు.

సాధకుడైన వాడు కుతూహలానికి లోను కాకూడదు. పనిమీద బజారున నడిచి వెళుతూ ఉంటాం. మధ్యలో రోడ్డు మీద గుంపుగా చేరి జనం ఏదో కథను నడిపిస్తూ ఉంటారు. అదేమిటి? అని తెలుసుకోవాలని పిస్తుంది. అక్కడేదో గొడవ పడుతూ ఉంటారు. ఆగి చూద్దా మనిపిస్తుంది. సాధకుడైన వాడు ఇలాంటి కుతూహలానికి అతీతంగా ఉండాలి. లేక పోతే ఎక్కడ ఏది జరుగుతూ ఉందో చూస్తూ ఉండటమే సరిపోతుంది. ఇంటికి వచ్చి వాటిని గూర్చి చెప్పు కోవటంతోనే సరిపోతుంది. ఇంతలో ఆయుర్దాయం అయిపో తుంది. కనుక ఇలాంటి కుతూహలానికి అతీతంగా కర్తవ్యం వెంట సాధకుడు సాగిపోతూ ఉండాలి. అందుకే శుకయోగి గుంపులలోనికి చొరబడని వాడుగా చెప్పబడ్డాడు.

వాదనా శీలం కలిగిన వారు వాదించటంలో తమ శక్తులు సమస్తాన్నీ వెచ్చిస్తూ కాలాన్ని కలుషితం చేస్తూ ఉంటారు. ఈ వాదన వల్ల తెలిసేది ఏమీ లేదు. ఒరిగేది ఏమీ లేదు. జరిగేది ఏమీ లేదు. ఎంత గొప్పగా వాదన జరిగినా ఒకరు మరొకరిని అంగీకరించటానికి సిద్ధంగా లేరు. మరి అలాంట ప్పుడు వాదన ఎందుకు? అంటే అది వారి స్వభావం కనుక. సినిమా హాళ్ళ దగ్గర వివిధ నటుల అభిమానులు మోహరించి, మొహాలు జేవురిస్తూ ఉండగా తమతమ అభిమాన నటుల నటనా వైదుష్యాన్ని గురించి వాదించుకుంటూ ఉంటారు. ఓపికున్నంత సేపు వాదించుకుని అతి కష్టం మీద అప్పటికి వాయి దావేసి, వెళ్ళి పోతూ ఉంటారు. ఆవాదన వల్ల ఏమి ఫలం? వారే చెప్పాలి. సిద్ధాంతాల గురించిన వాదనైనా అంతే. మతాల గురించిన వాదనయినా అంతే.

ఏ రాయయితేనేం పళ్లూడ గొట్టు గోవడానికి. కనుక సాధకుడైన వాడు వాద నల జోలికి, వాదించుకునే వారి జోలికి పోకూడదు. అది వృథా ప్రపంచం. దానిలో గడపడం వృథా. కనుకనే శుకయోగి అటుపోవడం లేదని చెప్పబడింది.

సాధకుడైన వాడు క్రమ శిక్షణతో కర్తవ్యాన్ని నిర్వహించాలి. లభించిన దానితో తృప్తి పడాలి. ఆశ అనే తాడు ఉన్నదే, అది చాల పొడవైనది. దాని చివరను చూసిన వారెవ్వరూ లేరు. కనుక ఆ తాడు జోలికి పోనివాడు అదృష్టవంతుడని భాగవతమే చెబుతోంది. మనం చేయవలసింది చేద్దాం. మనకు కావలసిందేదో భగవంతుడికి తెలుసు. - అన్న విశ్వాసం కలవాడే నిజమైన సాధకుడు. శుకయోగి అలాంటి తృప్తి కలిగిన వాడట.

సాధకుడైన వాడు తన శక్తి యుక్తుల్ని తగిన రీతిలో వ్యక్తం చేయాలి. తగిన చోటనే వ్యక్తం చేయాలి. అవశ్యకత ఉంటేనే వ్యక్తం చేయాలి. మిగి లినపుడు ప్రశాంతంగా తన మానాన తానుండాలి. అలా ఉండటం అతనికి చేతకావాలి. యుక్తా యుక్తాలతో నిమిత్తం లేకుండా ప్రతి చోటా తానేమి టన్నది ప్రదర్శించ బోకూడదు. అతడేమిటన్నది, తెలియ వలసిన వాళ్లకు మాత్రమే తెలియాలి. మిగిలిన వాళ్ళకు తెలియ వలసిన పని లేదు గదా! వాళ్ళతో వాళ్ళకు తగినట్లు ఉండ గలగాలి. లేకపోతే వాళ్ళను ఇబ్బంది పెట్టిన వాళ్ళ మవుతాం. శ్రీకృష్ణుని జీవితం ఇందుకు చక్కని ఉదాహరణ. గోపికలకు కావలసిన కృష్ణుడు గోపికల దగ్గరున్నాడు. అక్కడతడు మానస చోరుడు. పాండవులకు కావలసిన కృష్ణుడు పాండవుల దగ్గరున్నాడు. అక్కడతను శిక్ష కుడు. యాదవులకు కావలసిన కృష్ణుడు యాదవుల దగ్గర ఉన్నాడు. అక్కడతను రక్షకుడు. ఋషులకు కావలసిన కృష్ణుడు ఋషుల దగ్గర ఉన్నాడు. అక్కడ తను పరాత్పరుడు. కుచేలుడికి కావలసిన కృష్ణుడు కుచేలుడి దగ్గర ఉన్నాడు. అక్కడతను ఆప్త మిత్రుడు. సత్యభామ దగ్గర కావలసిన కృష్ణుడు సత్యభామ దగ్గర ఉన్నాడు. అక్కడతను ఒదిగి నడుచుకునే భర్త. రుక్మిణి దగ్గర కావలసిన కృష్ణుడు రుక్మిణి దగ్గర ఉన్నాడు. అక్కడతను పతిదేవుడు. బలరాముడి దగ్గర కావలసిన కృష్ణుడు బలరాముడి దగ్గర ఉన్నాడు. అక్కడతను చిన్ని తమ్ముడు. ఇలా ఎవరికి ఎలా అవసరమో వారికి అలా వ్యక్తమవుతూ సాగి పోవటమ నేది సాధనకు పరమావధి. దీనినే ఔచిత్య మంటారు. ఉచితమైన ప్రవర్తన అంటారు. సందర్భోచితంగా నడచుకోవట మంటారు. అలాగ పరీక్షిత్తు కోసం నడచి వెళుతున్న శుకయోగి మిగిలిన వారందరికీ ఏ మీ తెలియని వాడిలాగ,

అమాయకుడి లాగ కనబడుతున్నాడు. మరి వాళ్ళకు కావలసిందంతే కదా!

కారణ జన్ముడైన ఆశుకయోగి నుండి అలౌకికమైన సౌందర్యం అలా అల వోకగా వ్యక్తమవుతోంది. లోకులు అందంగా కనబడటానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు కదా! కాని అందమే అర్తితో వచ్చి ఇతడి నుండి కనబడాలని ప్రయత్నం చేస్తోందిట. అలాంటి అలౌకికమైన అందాన్ని చూస్తూ ముక్తికాంతే మోహపడుతూ ఉంటే, ఇక 'ఉత్తి' కాంతల సంగతి వేరే చెప్పాలా! అన్నట్లుగా ఉందిట ఆదృశ్యం. లోకంలో ఇరుక్కు పోవడమనే వెర్రితనానికి అతీతంగా, విజ్ఞానమే ఆకారం దాల్చిందా అన్నట్లుగా పరబ్రహ్మానుభూతిలో తుష్టుడై సాగుతూ ఉన్న శుక యోగిని చూచి, ఇతడు వెర్రివాడు అనుకుంటూ పిల్లలూ, స్త్రీలూ అతని వెంట పడుతున్నారట. ఇంతకూ ఎవరిది వెర్రితనము? వెర్రితనానికి అతీతంగా ఉన్న శుకుడిదా? అతడు వెర్రివాడనుకొని వెంట బడుతున్న వీరిదా? - అలాంటి శుకుడు ఆశ్చర్యానందాలను కలిగిస్తూ ఋషులచేత పరివేష్టితుడైన పరీక్షిత్తును సమీపిస్తున్నాడు.

## దివ్య దిగంబరమూర్తి

దివ్య దిగంబర మూర్తి అయిన శుకయోగి తమను సమీపిస్తున్నట్లు గమనించిన ఋషీంద్రులు అందరు ఒక్కసారిగా లేచి అతనికి ఎదురువెళ్ళారు. స్వాగతం అడిగి తీసికొని వచ్చారు. అతడంటే ఏమిటో వారందరికీ తెలుసు. ఆ సమయంలో అతడలా రావడం వారిని ఆనందంలో ముంచెత్తింది. 'జన సామాన్యానికి దూరంగా ఎక్కడో అరణ్యాలలో సామాన్యులెవరికీ అందని స్థితిలో స్థిరుడై ఉంటూ, సర్వాంతర్యామితో శ్రుతికలిపి, అతడి సంకల్పానికి అనుగుణంగా ఈ దేహాన్ని వినియోగించుకొనే శుకయోగి ఇప్పుడిలా వచ్చాడూ అంటే ఇది నిజంగా దైవయోగమే! పరీక్షిత్తు ప్రశ్నకు సర్వాంతర్యామి ఇలా బదులు పలికినట్లున్నాడు. పరీక్షిత్తుకు కావలసినది ఏదో ఇలా ఈ రూపంలో అందించబోతున్నట్లున్నాడు'. — అని ఋషులందరూ హర్షాతిరేకం చెందుతూ ఉండగా, పరీక్షిత్తు వినమ్రుడయి శుకయోగిని సమీపించాడు. అతిధి మర్యాదలుచేసి అతనికి సాష్టాంగపడ్డాడు. తనకు తృప్తికలిగేటట్లుగా ఆ శుకయోగిని పూజించుకొన్నాడు. ఋషులమధ్యలో కూర్చొని, అలా పూజలందుకొంటున్న శుకయోగి - గ్రహాలూ, నక్షత్రాలు, తారకలు తన చుట్టూ ఉండగా వెలిగిపో

తున్న చంద్రుడిలా ఉన్నాడు.

పూజను పూర్తిచేస్తూ ఆ శుకయోగి పాదాలపై తన శిరస్సును ఉంచి, వినయ విధేయతలతో మరొక్కసారి నమస్కరించి, లేచి, చేతులు జోడించి ఇలా అన్నాడు పరీక్షిత్తు.

"యోగీంద్రా ! నీవు పవిత్రమూర్తివి. వివేకాన్ని భూషణంగా ధరించి వెలుగొందుతున్న వాడివి. నీవు ఈ వేళలో ఇక్కడకు రావడం నిజంగా ఇది నా అదృష్టం ఇది నా భాగ్యం".

"మునీంద్రా! నిన్ను స్మరిస్తే చాలు. నాబోటివారి పాపాలన్నీ క్షణమాత్రంలో నశించిపోతాయి. అలాంటిది కనులారా నిను చూడగలగడం, చేతులారా నీ పాదాలను కడిగి మనసారా నిను పూజించగలగడం సాధ్యపడిందీ అంటే – ఇక ఆ పూజించుకొన్న వారికి మోక్షస్థితి లభిస్తుందని వేరే చెప్పాలా!"

భాగవతోత్తమా! విష్ణువుచేత రాక్షసులు సంహరింపబడినట్లుగా నీ పాద స్పర్శచేత ఘోరపాపాలన్నీ ఇట్టే నశించిపోతాయి. ఏ మహనీయుడు చక్రాన్ని ధరించి, దిగివచ్చి బావమరిదిగా బంధుత్వాన్ని కలిపి మా తాతల పక్షాన్నివహించి వారిని ఈ సమస్త సామ్రాజ్యానికి పట్టాభిషిక్తులనుచేశాడో ఆ చక్రధారి కాక ఆపదల నుండి రక్షించగలవాడు ఇంకెవరు? ఆ చక్రధారి ఇలా నీరూపంలో నన్ను సమీపించాడనీ, తనను అర్చించుకొనే అదృష్టాన్ని నాకు కలిగించాడనీ గ్రహించుకోగలిగాను స్వామీ! గ్రహించుకోగలిగాను. అతడి ప్రకారం బ్రతుకుదామని సంకల్పించి బ్రతకడానికి ప్రయత్నిస్తూ మధ్యలో విధివశాన బ్రతకడం చేతకాక పడిపోతుంటే ఆయన పడిపోనీయడంలేదు. పడిపోతున్న వాడిని పట్టి, సేదతీర్చి, నిలబెట్టి కర్తవ్యోన్ముఖులనుచేయడం అతడి లీలలో ఒకభాగం. మా తాతగారి జీవితంలో జరిగిందదే కదా! మళ్ళీ అలాంటి స్థితిలోనే నిలబడిన నన్ను అలాగే సేదతీర్చి నిలబెట్టాలనే ఇదిగో ఈ రూపంలో ఇల్లా వచ్చాడని నేను గ్రహించుకో గలుగు తున్నాను ప్రభూ! గ్రహించుకోగలుగు తున్నాను. ఆనాడు తాతను, ఈ నాడు మనుమడిని - ఇలా తరతరాలు నిలబెడుతూ, కథను నడిపిస్తూ, ఈ భూమిని మురిపిస్తూ ఉండటం - ఇది నీకు క్రీడా ప్రాయమైన కర్తవ్యం ప్రభూ! క్రీడా ప్రాయమయిన కర్తవ్యం! నడుద్దామని గట్టిగా ఒక్కసారి అనుకొంటే చాలు గట్టిగా అనుకొని నడకను ప్రారంభిస్తేచాలు - ఇక ఆ నడక కడదాకా సాగేట్లుగా నీవే చూసుకొంటావు ప్రభూ! మధ్యలో నడవడం చేతకాకపోయినా, నడకలో అలసిపోయినా, పూర్వసంస్కార వశం చేత

నడక గతి తప్పినా దేశకాల ప్రభావాల చేత నడక చలించినా, అంతర్యామి వయిన నీవు ఎప్పటికప్పుడు అక్కడికక్కడే సరిచేస్తూ, సరిజూస్తూ నడక మళ్లీ మామూలుగా సాగేట్లుగా చూచుకొంటావు ప్రభూ! ఆ చూచుకొనే లీలలోని భాగంగానే ఈ రూపంలో ఇలా నాచెంతకు నడిచి వచ్చావని గ్రహించు కోగలి గాను ప్రభూ! గ్రహించు కోగలిగాను. ఆనాడు మా తాతను నిలబెట్టటందుకై నీ విశ్వరూపాన్ని దర్శింపచేసిన నీవు, ఈ నాడు నన్ను కడతేర్చే టందుకై ఈ మునిరూపాన్ని ధరించి వచ్చావా! ఓహో ఏమి నీ కరుణ! ఏమి నీ ప్రేమ! ఏమి నీ బాధ్యత! ఏమి నీ లీల! ఓహో ఆశ్చర్యము. ఆనందము అనితరసాధ్యము"-అంటూ, అనుకొంటూ ఆనంద బాష్పాలను రాలుస్తూ అలా ఉండి పోయాడు పరీక్షిత్తు కొంతసేపు.

అనుభూతి భాష్పాలుగా రూపు చెంది రాలుతూ ఉండగా ఆ పారవశ్యంలో నుండి కావాలని తెప్పరిల్లుతూ ఒక్కసారి శుకయోగీంద్రుని ఆపాద మస్తకమూ అలాగ చూస్తూ, తన చూపును సార్థకం చేసికొంటున్నాడు పరీక్షిత్తు. ఆ చూపు అలా సాగుతూ ఉండగా అతనికి అనిపించింది కదా - 'చక్రధారి ఆనాడు మా తాతకు వెలుగు నందించిన వేళ వారిరువురిపీ నరనారాయణులుగా కీర్తించారు వ్యాసమునీంద్రులు. ఏమి ఆ మునీంద్రుని దర్శనము! ఏమి ఆ దర్శన వైభవము! నరనారాయణులుగా వారిని దర్శించడం ద్వారా సాధకులకు కావలసిన సూక్ష్మాంశాన్ని ఒకదానిని వారు తెలియచెప్పారు. ఈ సృష్టిలో, ఈ సృష్టి కథ నడిచినంత కాలమూ ఉపదేశించే గురువు ఒక్కడే! ఆ ఉపదే శాన్నందుకొనే శిష్యుడూ ఒక్కడే! ఆ గురువు నారాయణుడు. ఈ శిష్యుడు నరుడు. ఉన్నవి రెండే ప్రజ్ఞలు. నారాయణ ప్రజ్ఞ. నరప్రజ్ఞ. నామరూపములు లెక్కకు మిక్కిలిగా ఉండవచ్చు. మనము లెక్క పెట్టలేనన్ని ఉండవచ్చు. ఆ నామ రూపాల మధ్య అంతరం ఎంతగానో ఉండవచ్చు. కాని జాతి భేదాల కతీతంగా, స్త్రీ పురుష విభాగాలకు అతీతంగా, వికాస తారతమ్యాల కతీతంగా పనిచేస్తున్నవి ఈ రెండు ప్రజ్ఞలు - ఇన్నిటి మాటున ఉండి పని చేస్తున్నవి. ఇన్నిటికీ అతీతంగా వర్తిస్తున్నవి. ఈ నారాయణుడే ఉపదేశింపగోరి దిగివచ్చి నప్పుడల్లా గురువు అనబడుతున్నాడు. ఈ నరుడే ఉపదేశాన్ని పొందే స్థితిని పొందినప్పుడల్లా శిష్యుడనబడుతున్నాడు. గురువు ఒక్కడే! ఇందరుగా కనబడుట లీల. శిష్యుడొక్కడే! ఇందరుగా కన బడుట క్రీడ! గురువువేరు, దైవము వేరు అనుకొనుట భ్రాంతి. మనకు ఉపదేశింపగోరి దైవము స్వీకరించిన రూపమే మన గురుమూర్తి. దేవుడు కనబడితే గురువనబడతాడు కనుక ఎక్కడి కక్కడ

ఆ నరనారాయణులే గురుశిష్యులన బడుతున్నారు. అనబడతారు. ఆ నాడు నరుడయి నిలిచిన మా తాతకు శ్రీకృష్ణుని రూపంలో సాక్షాత్కరించాడు నారాయణుడు. ఈనాడు నరుడై తపన చెందుతున్న నాకొరకు ఇదిగో - ఇలా నారాయణుడు గురువై నడిచి వచ్చాడు - 'అంటూ, అనుకొంటూ పారవశ్యాన్ని చెందుతూ, కనుల వెంట అనుభూతి, బాష్పాలుగా రూపొంది రాలుతూ ఉండగా, అలాగే ఆ యోగీంద్రుని పాదాలను అలాగే పట్టుకొని ఉండిపోయాడు పరీక్షిత్తు మరికొంత సేపు.

అనుభూతి లోకాల పారాన్ని చూస్తున్న పరీక్షిత్తును శుకయోగీంద్రుడు ప్రసన్నుడయి ఆశీః పూర్వకంగా చూస్తూ, ఆ పరీక్షిత్తు వెన్నును నిమురుతున్నాడు. పరీక్షిత్తు కన్నులలో అనుభూతి బాష్పాలు. శుక యోగీంద్రుని కన్నుల నుండి ఆశీస్సుల అభిషేకాలు. అనుభూతి బాష్పాలు కడుగుతున్నాయి యోగీంద్రుని పాదాలను. ఆశీస్సుల అభిషేకాలు చైతన్యవంతం చేస్తున్నాయి పరీక్షిత్తు దేహంలోని అణువణువునూ! అరుదయిన ఈ దృశ్యాన్ని చూస్తున్న ఋషుల మనస్సులకు ఎనలేని ముచ్చట కలిగింది. ఆ ముచ్చటలో నుండి, ఆ ముచ్చటలో నే ఉండి వారు ఒకరినొకరు చూచుకొంటున్నారు. ఆ చూస్తున్న క్షణాలలో ఎటు చూచినా వారికి కనబడుతున్న దృశ్యం ఒక్కటే! అదే శుక యోగీ, పరీక్షిత్తులూ కలిసిన ఘట్టం, కలిసిఉన్న ఘట్టం.

అంతటి అనుభూతిలో నుండి, ప్రయత్నం మీద గొంతును పెగుల్చుకుంటూ ఇలా అన్నాడు పరీక్షిత్తు: మహర్షీ! నీవు చరించే మార్గాలు మాకు అంతు బట్టేవి కావు. అయినప్పటికీ నీ దర్శనం లభించడమున్నదే అదే మాకు పదివేలు. నీ దర్శనం పొందినవారికి అభీష్టసిద్ధి కలుగుతుంది. మహాత్మా నేడో రేపో శరీరాన్ని చాలించబోయేవాడు శాశ్వతమైన మార్గాన్ని పొందాలి అంటే దేనిని ధ్యానించాలి? ఎలా జపించాలి? ఏమి చేయాలి? అది నాకు తెలుపు! తెలిపినన్ను నడుపు! గురుదేవా! నీవు అవధూత మూర్తివి! ఆవును పాలు పితికినంత సేపుగూడ ఒక తావున నిలువని వాడవు. ఉండమని నిన్నాజ్ఞాపించడానికి వీలులేదు. వీలుకాదు. ఇక నీ కరుణ! నన్ను ముక్తుణ్ణి చేయితండ్రీ! నన్ను ముక్తుణ్ణి చేయి.

"ఆనాడు బ్రాహ్మణ వేషాలతో బ్రతుకును లాగుతున్న మాతాతలను తానుగా వచ్చి ఇంటి తలుపుతట్టి అక్కున జేర్చుకొని గురువై నడిపించాడు శ్రీకృష్ణుడు. ఈ నాడు జరుగ కూడనిది జరిగిందన్న బాధతో మథన పడుతూ మృత్యువు

సమీపించబోయే లోపున శాశ్వత స్థితిని, గుణాలకు దోషాలకు అతీతమైన స్థితిని, నారాయణ స్మరణకు మాత్రమే అవకాశమున్న స్థితిని పొందడమెలాగ! అని పరితపిస్తున్న నా కోసం ఎక్కడ నుండో నేరుగా నడచివచ్చేశావు నీవు! గురు మూర్తివై ఎదుట నిలిచావు. తెలియనివారు శిష్యుడు గురువును వెతుక్కోవాలి, ఎంచుకోవాలి, చేతనైతే నియమించు కోవాలి అని అనుకుంటారు. కాని అది సరికాదు. నరుడు వెలుగు కొరకు పరితపిస్తూ శిష్య స్థితిని పొందిన వేళ నారాయణుడే తగిన రూపాన్ని ధరించి అతనికి దగ్గరై గురుత్వాన్ని నెరవుతాడు. శిష్య స్థితిని పొందిన నరునికి నారాయణుడు గురువై తానుగా దగ్గరౌతాడు. మాతాతల కథ, ఈ నాకథ, భూమి మీద సాగుతూ వస్తున్న తరతరాల కథ దీనినే తెలియ జెబుతోంది.

"నా కొరకు ఎనలేని కరుణతో నడచి వచ్చిన దైవానివి. నన్ను కడతే ర్చమని నీకు వేరుగా చెప్పాలా? ప్రభూ! కరుణామయా! ప్రేమ స్వరూపా! జ్ఞానమూర్తీ! నన్ను నీ అక్కున జేర్చుకో! నాకు కావలిసిన దేమిటి అన్నది నీవే చూచుకో! నన్ను నేను అర్పించు కోవడమే నేను చేయగలిగింది. ఇక నాకేమి కావాలన్నది, నేనేమి కావాలన్నది అది నీ యిష్టం. నీ అభీష్టం!" అంటూ అనుకుంటూ శుక యోగీంద్రుని పాదాలపై వ్రాలి పోయాడు పరీక్షిత్తు.

పాదాలకు హత్తుకు పోయిన పరీక్షిత్తును లేవనెత్తి తన హృదయానికి హత్తు కున్నాడు శుకయోగీంద్రుడు. సూటిగా అతని కనులలోనికి చూస్తూ శుకయో గీంద్రుడు ఇలా అన్నాడు: "ఓ రాజర్షీ నీ జీవితం ధన్య మోయీ! నీవు భాగవతోత్తముడవోయీ! లోకంలో తెలియక కొందరు తప్పులు చేస్తారు. ఏది తప్పు, ఏది ఒప్పు అన్నది తెలుసు కొందామని కూడ వారికి అనిపించదు. కొందరు తెలిసి తప్పు చేస్తారు. అది తప్పని తెలిసి కూడ సమర్థించు కోవాలని చూస్తారు. సామాన్యంగా లోకంలో ఈ రెండు రకాల వాళ్లే కనబడతారు. కానీ నీవు దైవయోగం చేత తప్పు చేశావు. వెంటనే గ్రహించావు. పరితపించి పోయావు. ఆదోష స్థితి నుండి బయట పడాలని తీవ్రమైన ఆర్తిని చెందావు. నిజానికి నీవు బయటపడి పోయావు. నీ చరిత మహనీయమైనది, పునీతమైనది గనుకనే ఇందరు మహర్షులు తాముగా వచ్చి ఇప్పుడు నిన్ను కంటికి రెప్పలా కాచుకుంటున్నారు. తమ చూపులతో ఊయల అల్లి నిన్ను పావను చేసి ఆ చూపుల ఊయలలో ఊపుతూ నిన్ను సేద తీరుస్తున్నారు. ఆ మహర్షులందరి గొంతునై, ఆ మహర్షులకు నీపై గల ప్రేమ నుండి రూపొందిన మూర్తినై

ఇంతవరకు ఈ సృష్టి రూపంలో సాగుతూ వచ్చిన నారాయణగాథను ఈ ఋషులు, పరంపరగా ఎలా దర్శనం చేస్తూవచ్చారో అది నీకు ఈ సమయాన వీరందరి అనుమతితో తెలియ చెబుతాను. వాక్కులకు అందీ అందని ఆ దివ్య దర్శనాన్ని దివ్యాను గ్రహానికి పాత్రుడవైన నీ కొరకు భువికి ఆహ్వానిస్తాను. నీ కొరకు అమృతగానంగా అవతరించదలుచుకుంది ఆ దివ్య దర్శనం. అందుకో! ధన్య జీవీ అందుకో! ఈ గాన గంగ నీ మీదుగా తరతరాలకు ప్రవహిస్తుంది. తరతరాలను తడిపి పునీతులను చేస్తుంది. కాలకాలాల వారికి కలి సంతరణ మార్గాన్ని అందిస్తుంది. కలి ప్రభావానికి అతీతంగా వారిని తట్టిలేపి నిలబెడుతుంది. ధన్య జీవీ! కలిని దమించాలన్నదే గదా! నీ కోరిక. ఇదిగో నీ నిమిత్తంగా నీ మీదుగా భువికి అవతరిస్తున్న భాగవతగంగ కలి యుగాంతం వరకు కలిని దమించదలచిన ప్రతి ఒక్కరికీ అక్కరకు వస్తుంది. అందుకోధన్య జీవీ! అందుకో! కలి సంతరణ మార్గాన్ని నీ మీదుగా ఈ భూమి ప్రజలకు అందించాలన్నది నారాయణుడైన ఆ బాదరాయణుని దివ్య సంకల్పం. నీ కథలోని మలుపులన్నీ ఆ దివ్య సంకల్పానికి అనుగుణంగా తిరిగినవే! జరిగినవే!

"ఓ రాజర్షి నీవు ధన్య జీవివి. నీవు భాగవతోత్తముడవు. భాగవతమార్గాన్ని ఆ నారాయణుడు నీ మీదుగా భూమి ప్రజలకు అందిస్తున్న ఈ వేళ నీకివే నా శుభాకాంక్షలు. ఇవి నిజంగా శుభ ఘడియలు. మానవ చరిత్రలో మరపునకు రాని మధురక్షణాలు -" అంటూ శుకయోగీంద్రుడు పరీక్షిత్తును మరింతగా తన హృదయానికి హత్తుకున్నాడు.

పరివేష్టించి ఉన్న ఋషులందరూ వారివైపు, ఆశుకయోగి పరీక్షిత్తులవైపు పారవశ్యంతో చూస్తున్నారు. వారి మీదుగా అవతరించ బోతున్న భాగవత గంగకు ఆత్మీయమైన ఆహ్వానం పలుకుతున్నారు.

# కలి-కృషి

సరస్వతీ నదీ తీరాన వ్యాసమహర్షి కూర్చుని ఉన్నాడు ఒంటరిగా. అతని చేత రూపుదిద్దబడిన శిష్యకోటి అంతా ఆ నదీ తీరాననే గల బదరికాశ్రమంలో బస చేసి ఉన్నారు. ఆ మహనీయుడు తమ కప్పగించిన బాధ్యతలను నిర్వహిస్తూనే, ఆయనలో కొట్ట వచ్చినట్లుగా గోచరిస్తున్న మార్పును కూడా గమనిస్తూ వస్తున్నారు ఆ శిష్య సమూహం. ఇటీవల ఆయనలో ఏదో ఆవేదన కనబడుతున్నది. ఆందోళనతో కూడిన ఒక ఉద్వేగం కనబడుతున్నది. తనను తాను సమాధాన పరచుకోలేని స్థితి ఒకటి కనబడుతున్నది. ఇదీ అదీ అని చెప్పలేని అసంతృప్తి ఏదో కనబడుతున్నది. ఆయనలో కలుగుతున్న ఆ భావన లన్నీ శిష్యకోటిని కూడా తగుమాత్రంగా స్పృశిస్తూనే ఉన్నాయి. కారణం, ఆయన తన కన్న వేరుగా తన శిష్యులను ఎన్నడూ చూడ లేదు కనుక. తన తేజోమయ శరీరంలోని భాగాలుగా వారిని ఇప్పటికే రూపొందించుకొని ఉన్నాడు కనుక. వ్యాస భగవానుని ఉద్వేగ స్థితి తమకు అనుభవానికి వస్తున్న కొద్దీ, శిష్యులందరూ బృందాలు బృందాలుగా రూపొంది, తమకు నిర్దేశింప బడిన అధ్యయన కార్యక్రమాలను మరింత శ్రద్ధతో నిర్వహించడం ప్రారంభించారు. మరి శిష్యులైన వారు చేయవలసిందదే కదా! మహర్షి ధర్మ శిక్షణకై తమ నుండి నడుస్తున్న కార్యక్రమాలను సమీక్షిస్తున్నట్లుగా గోచరిస్తున్నారు. అలా సమీక్ష చేస్తూ ఒక విధమైన అసంతృప్తికి లోనవుతున్నట్లుగా ఉన్నారాయన. అప్పుడు శిష్యులమైన మనం ఏం చేయాలి? ఆయన మనకు నిర్దేశించిన కార్యక్ర మాలను మరింత శ్రద్ధగా నిర్వహించడమే మన మిప్పుడు చేయ వలసిన పని. అప్పుడు అటుపైన మనం నిర్వహించ వలసిన దేదో ఆయనే మనకు సెలవి స్తారు. కనుక మనకు నిర్దేశించ బడిన కార్యక్రమాలలో మనం మనస్ఫూర్తిగా నిమగ్నుల మవుదాం. అనుకుంటూనే ఏకాగ్ర చిత్తులై కర్తవ్యాన్ని నిర్వహించ సాగారు శిష్యులందరూ. సమర్పణ భావంతో కూడిన ఆచరణతో మాత్రమే శిష్యుడు గురుమూర్తిని సమీపించ గలడు. ఆయనతో అద్వైత స్థితిని అనుభ వించ గలడు. ఈ సత్యాన్ని ఒంట బట్టించుకొని కర్తవ్యోన్ముఖులైన ఆ వ్యాస భగవానుని శిష్యులున్నారే వారు మనకు ఆదర్శం.

శిష్య బృందాలు శ్రద్ధతో నిర్వహిస్తున్న సమస్త కార్యకలాపాలు గమనిస్తూనే ఉన్నాడు వ్యాసమహర్షి. తానంతటి ఆవేదనలో ఉండి కూడా వారివైపు ఆశీఃపూర్వకమైన వీక్షణాలను ప్రసరింప జేస్తూ కొద్ది క్షణాల పాటు అలా ఉండి పోయాడు.

చిత్రం! నాలో కలిగిన ఆవేదన వీరిలో ప్రతిఫలించి నట్లుంది. శ్రద్ధతో తమ కప్పగింపబడిన కార్యకలాపాలను నిర్వహించడం ద్వారా నన్ను సేద తీర్చా లని చూస్తున్నారు వీరు. వీరి ప్రయత్నం బాగానే ఉన్నది. నిజానికి వీరి నుండి జరుగ వలసిన ప్రయత్నం కూడా ఇదే. కాని నా కెందుకో తృప్తి కలగడం లేదు. ఈ జరుగుతున్న కృషి చాలదనిపిస్తోంది నామనస్సుకు. ఇంకా జరుగవలసినదేదో మిగిలి పోయిందనిపిస్తోంది.

'కాలం మనకు కనబడకుండా సాగుతూ ఉంటుంది. ఒక పట్టాన మన గమనికకు అందదది. నదీ తీరాన కూర్చొని ఆ ప్రవాహ సౌందర్యాన్ని తిలకి స్తున్న మిత్రులకు ఒక్క క్షణం క్రిందట అక్కడ ఉన్న నది, ఇప్పుడక్కడ లేదని చెబితే నమ్మబుద్ధి అవుతుందా? కాని అది సత్యం కదా! ఇదిగో మిత్రమా! ఈ నదిని చూశావా? - అనే లోపున అక్కడ ఉన్న నది మారిపోతోంది. కానీ, నదీ రూపం అనేది అలాగే గోచరిస్తూ ఉండటం వల్ల అదే నదిని మనం చూస్తున్నామని అనిపిస్తున్నది. అలా నదీ తీరాన కూర్చుని ఉన్న మిత్రులు చూస్తూ ఉండగానే నదీ రూపం అలా కనబడుతూ ఉండగానే, జల ప్రవాహం మాత్రం కన్నులకు కనిపిస్తూనే కనబడకుండా దాటి పోతున్నట్లుగా కాలం కూడా, మానవుల దృష్టికి అందకుండా సాగిపోతూ ఉంటుంది.

'సృష్టి ఇలా నడుస్తూనే ఉంటుంది. కాల చక్రం తిరుగుతూనే ఉంటుంది. యుగాలు ఒక దాని వెనుక ఒకటి ప్రవర్తిస్తూనే ఉంటాయి. ఆయా యుగ ధర్మాలు మానవ జాతి మనుగడపైన తమ ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటాయి. మానవుల మనస్తత్త్వాల్లో, వారి ఆలోచనా విధానాల్లో, వారి నిత్య జీవన వైఖరుల్లో, వారి ఆశయాల్లో, ఆకాంక్షల్లో ఆయా యుగ ధర్మాలు ప్రతి ఫలిస్తూనే ఉంటాయి. ఇది సహజం. ఇందుకు మానవులను తప్పుపట్టి లాభం లేదు. మరయితే యుగధర్మాల బారికి మానవులను వదిలేయడమేనా మనం చేయవలసింది? వారలా బలయిపోతూ ఉంటే, చూస్తూ ఉండటమేనా మనం చేయవలసింది? కాదు. యుగధర్మాల కతీతంగా, శాశ్వత మైన సృష్టిధర్మాలతో శ్రుతి కలపడం ద్వారా, దేశ కాలాలకు అతీతమైన దివ్య జీవనాన్ని మానవుడు

అనుభవించ వచ్చును. అని తెలియ చెప్పడానికే, తెలిసి నడపడానికే ఋషి పరంపర ఏర్పడింది. అవతార సంప్రదాయం రూపు దిద్దుకున్నది. యుగ ధర్మానికి అతీతంగా, సృష్టి ధర్మపు స్థాయికి మానవుణ్ణి లేవనెత్తి నిలబెట్టడానికే ఈ కృషంతా జరుగుతూ వస్తున్నది.

'ద్వాపర యుగం అయిపోతున్నది. కలియుగం ప్రారంభం కాబోతున్నది. నడిచిన యుగాలూ - మానవ జాతిపై అవి చూపుతూ వచ్చిన ప్రభావాలూ, ఈ నా స్మృతి పథంలో మెదులుతూనే ఉన్నాయి. ఇక ప్రారంభం కాబోతూ ఉన్న కలియుగం యొక్క స్వరూప స్వభావాలు కూడా నా 'లోపలి' నేత్రానికి స్పష్టంగా గోచరిస్తూనే ఉన్నాయి. కాలం తిరుగుతున్న ఈ మలుపును దృష్టిలో పెట్టుకునే ఇప్పటికి కొన్ని దశాబ్దాల నుండి ఒక ప్రత్యేకమైన పద్ధతిలో కృషి చేస్తూ వస్తున్నాను. కానీ, జరిగిన కృషి ఎంతగా జరుగుతున్నా ప్రవేశిస్తున్న కలికి ఇది జవాబు చెప్పగలదా అనిపిస్తున్నది. మానవ జాతిపై కలి ప్రసరింప జేయబోతున్న అవలక్షణాలను పరిశీలిస్తూ ఉంటే, ఆ అవలక్షణాల బారిన పడ బోతున్న మానవ జాతిని రక్షించి నిలబెట్టడానికి ఈ జరిగిన, జరుగుతున్న కృషి ఎంత వరకు అక్కరకు వస్తుందా అనిపిస్తున్నది.

పరీక్షిన్మహారాజా! ఇలాంటి ఆవేదనకు లోనై, లోకహిత నిష్ఠుడైన ఆ మహర్షి అటు రానున్న కలివైపునకు, ఇటు తన నుండి జరుగుతున్న కృషివైపు నకు మరల మరల చూస్తూ, ఆ రెండిటి శక్తియుక్తులను మరల మరల తూస్తూ ఇప్పడిక జరుగ వలసిన దేమిటి? అన్నది అలోచిస్తూ, చింతా క్రాంతుడై ఆ సరస్వతీ నది ఒడ్డున అలా ఆ శిష్యుల మధ్యలో కూలబడి పోయాడయ్యా అంతటి మహర్షి కూడా! కలి పురుషుని అవలక్షణ సేనకూ, తపశ్శక్తితో తన నుండి నడుస్తున్న ధర్మబోధకూ పోటీ రాబోతున్నట్లుగా కనిపిస్తున్నదయ్యా ఆ మహర్షికి. కలి బారి నుండి మానవార్భకులను రక్షించుకోవడం ఎలాగ? అని వ్యథతో ఊగి పోతున్నాడయ్యా ఆ ప్రేమ స్వరూపుడు. మానవ జాతి మనుగడ యెడల బాధ్యత పడిన ఆ మహర్షికి ఇలా బాధ కలగడం సహజమే కదా! అతడిలా సమీక్షించు కోవడం కూడా అవసరమే కదా!

వినమ్రుడై, అర్తితో వింటున్న పరీక్షిత్తుకు బాధతో నిండిన ఆ బాధ్య తాయుత మూర్తియైన వ్యాస మహర్షి కనుల ముందు సాక్షాత్కరించాడు. అప్రయత్నంగానే పరీక్షిత్తు ఆ మూర్తికి చేతులెత్తి నమస్కరించాడు. వారిని పరివేష్టించి ఉన్న ఆ ఋషిలోక మందరూ తాము ఆ సరస్వతీ నదీ తీరాననే

ఉన్నట్లుగా అనుభూతి చెందుతూ ఉన్నారు.

## కలికాలం

కాలచక్ర గతులను సూటిగా, సూక్ష్మంగా పరిశీలిస్తున్నాడు వ్యాస మహర్షి.

'కలి ప్రవేశించిన తరువాత మానవుల ఆయుర్దాయం క్రమంగా తగ్గి పోతుంది. పోనీ ఆ బ్రతికి నన్నాళ్లైనా హాయిగా బ్రతుకుతారా అంటే ఆ కాస్త జీవిత కాలంలోనూ కావలసినన్ని ఉగ్రరోగ స్థితులు వారిని చుట్టు ముడుతాయి. దానితో శరీరాలు దుర్బలాలై పోతాయి. దార్ఢ్యత తగ్గి పోతుంది. పది మందికి పని చేసి పెట్ట గలిగిన వారు, ఈ కలి ప్రభావాన తమ పనిని తామే చేసు కోలేని స్థితికి వచ్చేస్తారు. మనుష్యులు క్రమంగా ఒకరికొకరు బరువై పోతారు. ఎవరికి ఎవరూ ఏమీ చేయలేని స్థితిలో పడిపోతారు. ఆయుర్దాయమూ అల్పం. అనారోగ్యమూ అధికం. శరీర దార్ఢ్యమూ మరి శూన్యం. ఓహో! కలియుగంలో మానవుని దేహస్థితి ఇలా దిగజారి పోతుంది గదా!

'దేహస్థితి ఇలా దిగజారి పోతూ ఉన్నదీ అంటే మానసిక స్థితి అంతకన్నా ముందే ఎంతగానో దిగజారి పోవాలి. వ్యాస మహర్షి చూపు కలియుగంలో మానవుని దేహాన్ని ఇంతగా విలవిలలాడేటట్టుగా చేసేస్తున్న అతని మానసిక స్థితి వైపుకు మళ్ళింది. కలియుగపు మానవుల మనస్సును ప్రధానంగా మూడు అవలక్షణాలు ఆవహిస్తాయి. మొదటిది అలసత్వం. రెండవది మందకొడితనం. మూడవది ధైర్యం లేక పోవడం. మనిషి జీవితం నిస్సారం కావడానికి ఇంతకన్నా కావలసిన అవలక్షణాలేమున్నాయి. వ్యాస మహర్షికి మనస్సు బరువెక్కినట్లైంది.

'అలసత్వం ఆవరించిన మనిషి క్రమంగా సోమరిగా రూపొందుతాడు. అత నికి పని చేయాలనిపించదు. తానొక్కడేనా ఉన్నది. ఇంకా చాల మంది ఉన్నారు గదా, ఇటు ఇంట్లో గాని, అటు కార్య క్షేత్రంలో గాని. వారంతా చేయొచ్చుగా, అనిపిస్తుంది. ఎవరైనా తమకు పని చెప్పినా, మిగిలిన వారుండగా తనకే చెప్పడ మెందుకు? అనిపిస్తుంది. కనుక అతడు తప్పించుకోవడానికే ప్రయత్నిస్తాడు సాధ్యమైనంత వరకు. తర్వాత చేద్దా మంటాడు. అలాగే చూద్దాం లేండి అంటాడు. ఇంకా సమయ ముందిగా ఇప్పుడే తొందరెందుకు అంటాడు. ఇలా ఏవేవో సాకులు చెబుతూ, తన అలసత్వాన్ని అన్ని వేళలా రక్షించుకుంటూ

ఉంటాడు. తప్పని సరి అయితే తప్ప, పని చేయని స్థితిలో పడి పోతాడు. తప్పని సరి అవటమంటే ఏమిటి? ఈ పని చేయక పోతే ఇక రోజు గడవదట అంటే చేస్తాడు. ఈ పని చేయకపోతే ఇక ప్రాణం మీదకు వస్తుందట, అంటే ఆమెడ మీద పడబోతున్న ఆ కత్తిని చూస్తూ అప్పుడు చేస్తాడు. ఈ పని చేయకపోతే సమాజంలో తనకున్న కాస్త పరువూ పోతుందట. తలెత్తుకు తిరగడం కష్ట మవుతుందట. అంటే అప్పుడు చేస్తాడు. దీనితో ఏమవుతుంది? తన పనులే తనకు కష్టమనిపిస్తున్నప్పుడు ఇతరుల పనులను చేయడాని కతడు ఇష్టపడతాడా? ఇష్టపడడు. దానితో బంధు మిత్రాదులకు దూరంగా ఉండాలని కోరుకుంటాడు. తానూ, తన ఆలు బిడ్డలు, తనకు చాలునను కుంటాడు. ఇలా ఒంటరి వాడై పోతాడు. తప్పని సరైతే తప్ప పని చేయటం లేదు అంటే అర్థ కామాలను తీర్చుకోవడానికి తప్ప అతను పనిచేయడం లేదన్న మాట. స్వధర్మాన్ని లోకరూపంలో నున్న దైవానికి సమర్పణగా ఆచరించడమనే దివ్య స్థితి నుండి అతడు జారిపోయాడన్న మాట. ఇప్పుడతన్ని అర్థ కామాలు నడిపిస్తున్నాయి. జీవితానికి అర్థ మేమిటి అంటే అర్థ కామాలే అనే స్థితిలో నికి పడిపోతున్నాడతను. ఓహో! అలసత్త్వమన్నది కలిగుణమై, మానవుని ఏ స్థాయికి తీసుకొని వెళుతున్నది?

అలసత్వంతో పాటుగా మందకొడి తనం కూడా కలి లక్షణమై, మానవుణ్ణి ఆవహిస్తూ ఉన్నది. దీనితో అతడు క్రమంగా మందబుద్ధై పోతాడు. మంద బుద్ధి అంటే ఏమిటి? ఒక స్థాయి దాటి ఆలోచించ లేక పోవడం. పొట్ట పోసుకోవడమే జీవిత పరమార్థ మనిపించడం. ఈ కుటుంబాన్ని ఇలా పోషించుకుంటే చాలు. ఈ కన్న వాళ్ళను ఇలా ఒక దారికి తెస్తే చాలును, ఇక మన బాధ్యత తీరి పోతుంది, అనిపించడం. చుట్టూ ఉన్నవారి ఎడల, ఈ సమాజం ఎడల, ఈ మన దేశం ఎడల మీకు బాధ్యత లేదా? అంటే అవన్నీ నాకెందుకు, నేను బాగుంటే చాలదూ అనిపించటం. దేశం, సమాజం బాగుంటేనే, మనమూ బాగుంటాం అని తెలియక పోవడం. అలా అని ఎవరైనా తెలియక చెప్పినా బోధ పడక పోవడం. ఏమిటో చెబుతున్నారు. మన కెందుకు ఈ గొడవలన్నీ, మన బ్రతుకేదో మనది, అనిపించడం. ఇవన్నీ మందబుద్ధికి లక్షణాలు. అలాగే దైహిక మైన అవసరాలే మానవ జీవితానికి ఆవశ్యకతలు అనిపించటం. ఏదో ఇంత కూడూ, గుడ్డా, గూడు, ఆ గూటిలో ఇంత కామ సుఖం, ఆ సుఖాన్ని అనుభవిస్తూ ఉండగా అనుకోకుండా పుట్టిన బిడ్డలు, పుట్టారు కాబట్టి వారిని చూడక ఎలాగూ తప్పదు కనుక చూస్తాడు.

ఇంతకు మించి ఆలోచించడానికి అతని మనస్సు ప్రయత్నించదు. అతడి బుద్ధి వికసించదు. దానితో ఈ సంప్రదాయ మెందుకు? అని పిస్తుంది. ఈ సదాచార మెందుకు అనిపిస్తుంది. ఈ యజ్ఞాలూ, యాగాలూ ఎందుకు? అనిపిస్తుంది. జపతపాలూ, నియమ నిష్ఠలూ అనవసరమనిపిస్తుంది. పవిత్ర గ్రంథాల అధ్యయనం వల్ల ప్రస్తుతం ఒరిగేది ఏమిటనిపిస్తుంది. యోగ సాధన, యమనియమాదులు వాటి అవసరం ఇప్పడే ముంది అనిపిస్తుంది. ఇంత సంపాదించుకొని, ఏదో ఇంత ఉడకేసుకుని, రోజులు గడపడమే కష్టంగా ఉంటే వీటన్నింటి గురించీ మన మెక్కడ ఆలోచిస్తాం? అనిపిస్తుంది. ఇలా మనస్సులోని పై పొరలు ఎప్పడైతే మూసుకు పోతాయో, బుద్ధి అనే దీపం ఎప్పడైతే కొడిగట్టిందో ఇక ఆ మందబుద్ధి పని ఏమవుతుంది? దైహికమైన అవసరాలు చాలు: అనుకున్న వాడు ఇక అంతటితో ఆగుతాడా? వాటిలో నియమ నిబంధనలను ఉల్లంఘించి పశువు కంటె హీన స్థితిలో పడిపోతాడు. అది చాలక క్రమంగా వ్యసన పరుడై కుళ్లిపోతాడు. ఆశలే తప్ప ఆశయాలు లేని స్థితి, ఉదర పోషణే తప్ప, పాత్ర పోషణను ఎరుగని స్థితి. మరి అలాంటి స్థితిని దాటి చూడనప్పడు, చూడలేనప్పడు మనిషి కుళ్ళిపోక ఏమవుతాడు.

'కలి కాలపు మానవుణ్ణి ఆవరించే మూడవ లక్షణం ధైర్యం లేని తనం. ధైర్యం చేయ లేడు. చేసి, ఏ నిర్ణయమూ సకాలంలో తీసుకోలేడు. ఇంక అతడెలా ఎదుగుతాడు? జీవితంలో రాజీ పడటం అతనికి అలవాటై పోతుంది. జీవితాన్ని సరిదిద్దుకోవలసింది పోయి, సర్దుకు పోవడం అలవాటు చేసుకుంటాడు. సరిదిద్దుకోవటానికీ, సర్దుకు పోవటానికీ ఎంత తేడా ఉంది? ఏనుగుకూ, పీనుగకూ ఉన్నంత తేడా ఉంది. పైగా ఈ సర్దుకు పోవడమే ఆధ్యాత్మికత అని కూడా అంటాడు. ఆధ్యాత్మిక చింతన వల్లనే ఇలా సర్దుకుపో గలుగుతున్నానంటాడు. ఇలా అనేటప్పటికి అది విన్న మరొక డంటాడు గదా! చూశారా! ఆధ్యాత్మిక చింతన మనిషిని చెడగొట్టేస్తోంది. అని. అతడు చెడిపోతున్నది ఆధ్యాత్మిక చింతన వల్ల కాదు. ధైర్యం లేని తనం వల్ల. తన ధైర్యం లేని తనానికి అతడు ఆధ్యాత్మికత అనే ముసుగు వేస్తున్నాడు. అంతే. తాను బాగు పడక పోవటానికి, తన జీవితంలో ఎదుగుదల కానరాక పోవటానికి అతడు రకరకాల కారణాలు చూపెడుతూ ఉంటాడు. ఒకసారి గ్రహాలు సరిగా లేవు అంటాడు. తప్పు. గ్రహాలు నీవు సరిగా లేవని సూచిస్తున్నాయి. 'అంతే! నీవు ధైర్యం చేసి బాగుపడితే అవి సంతోషిస్తాయి. అని చెబితే పాపం అతనికి నమ్మ బుద్ధి కాదు. ఇంకొక సారి ఇదంతా పూర్వ కర్మ ఫలం

అంటాడు. నిజమే. ఇప్పుడు సత్కర్మాచరణతో విజృంభించి, దానికి జవాబు చెప్పవచ్చుగదా! దాని ప్రభావం నుండి బయట పడ వచ్చు కదా! అంటే ధైర్యం చేయ లేడు. మరొక సారి దైవం వన్ను కరుణతో చూడటం లేదు. అందువల్ల ఇలా ఉన్నానంటాడు. దేవుని కరుణ నీవనుకున్నట్లు ఉండదు. అది సన్నివేశాల రూపంలో ఉంటుంది. నీవా సన్నివేశాలను సద్వినియోగం చేసి కోవటానికి సంసిద్ధుడవు కావాలి అంటే ధైర్యం చేయలేడు. ముందుకు సాగ టానికి అతనికి ధైర్యం చాలక, సమాజంలో మార్పు రావాలి. దైవం తలచు కోవాలి. కాలం కలసి రావాలి అంటూ ఉంటాడు. అవి సరే అవన్నీ నీవను కున్నట్లే ఒన కూడినా ముందుకు సాగడానికి నీకు ధైర్యం కావాలి కదా! అంటే మాట్లాడలేడు.

ఇలా అలసత్వం వల్ల కొంత, మందకొడితనం వల్ల మరి కొంత, ధైర్యం లేని తనం వల్ల ఇంకొంత కలియుగపు మానవుడు కుంచించుకు పోతాడు. ఇక సత్త్వ గుణ స్థితి అంటే ఏమిటో అతనికి కలలోని వార్తగా మిగిలిపోతుంది. సత్త్వగుణ స్థితిలో మానవుడికి తానంటే ఏమిటో, ఈ సృష్టి అంటే ఏమిటో స్పష్టంగా పొడగడుతుంది. దానితో అతడి జన్మ సార్థక మవుతుంది. అలాంటి అవకాశం కలిప్రభావం వల్ల మనిషి కోల్పో బోతున్నాడు. ఇక అతడు రజోగుణ, తమో గుణ దోషాలలో పడి గిలగిల లాడి పోతుంటాడు. అలాంటి మానవుడికి కూడా ఈ నా బోధ అందాలి. ఈ నా బోధ బోధ పడాలి. అతడు కూడా వినేట్లుగా, విని, పరమార్థం వైపుకు మళ్లేట్లుగా నేను బోధించ గలనా? ఇంత వరకూ నేను చేసిన కృషి అందుకు అక్కరకు రాగలదా?' - అంటూ, అనుకుంటూ ఆర్తి చెందుతున్నాడు వ్యాస మహర్షి.

శుకయోగి వాక్కులను అలా చెవులార వింటూ, ఆర్తి చెందిన వ్యాస భగవానుని రూపాన్ని అలా కనులార కంటూ, అదో విధమైన అనుభూతిలో అలా ఉండి పోయాడు పరీక్షిన్మహారాజు.

## జరుగవలసినది

దివ్యమూర్తులైన సత్యవతీ పరాశరులు ఏ శుభముహూర్తంలో తాము దంప తులుగా దగ్గరై, నన్ను తమ బిడ్డగా కన్నారో, ఆ క్షణం నుండి వేదార్థాన్ని జనుల హృదయాలలో ప్రతిష్ఠించడమనే ఈ దివ్యమైన కృషికి నన్ను నేను సమ

ర్పణం చేసుకున్నాను. గాసట బీసటగా నున్న వేద వాఙ్మయమంతటినీ ఆ తండ్రి కృపతో అవలోడనం చేసి, కావలసిన అవగాహనకు వచ్చాను. 'వేదవిద్య, వేద ధర్మం ఈ భూమి నాలుగు చెరగులా చిరకాలం వర్ధిల్లాలి.' - అన్న సంకల్పంతో వేద వాఙ్మయాన్ని నాలుగు వేదాలుగా వ్యాసం చేశాను. అప్పటినుండే నేను 'వ్యాసుడ' నయ్యాను. 'దైవం ఈ సృష్టిని తన ఉచ్చారణగా ఎలా ఉచ్చరిస్తున్నది తెలియచెప్పేది 'ఋగ్వేదం.' - సృష్టి నిర్వహణలోని విధానాన్ని ఎరుక పరచేది 'యజుర్వేదం.' నడుస్తున్న ఈ సృష్టిలో అంతర్లీనంగా సాగుతున్న దివ్యగానంలోనికి మనలను నడిపించేది 'సామవేదం.' సృష్టిరూపం నుండి వ్యక్తమవుతున్న విజ్ఞాన భాగమంతా 'అథర్వణవేదం.' ఇలా నాలుగు విధాలుగా వినియోగపడే లాగున, నాలుగు వేదాలుగా, నా వరకు నడిచివచ్చిన వేదాన్ని విభాగించి అందించాను.



వేదం వర్ధిల్లాలి. వేదం యొక్క వెలుగులో సకల జనులు వర్ధిల్లాలి. యజ్ఞ యాగాదులు ఆగకుండా సాగిపోవాలి. సృష్టి నిర్వహణలో వ్యక్తమవుతున్న వివిధ వ్యూహాలకు అనుగుణంగా, అనుకరణలుగా రూపు దిద్దబడినవే యజ్ఞయాగాది మహాక్రతువులు. చిత్తశుద్ధితో యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించినప్పుడు మానవుడు తాను పరిశుద్ధి చెందుతాడు. తనచుట్టూ ఉన్న వాతావరణాన్ని కూడా పరిశుద్ధి పరచుకున్నవాడవుతాడు. తాను పవిత్రుడవుతాడు. తన చుట్టూ ఉన్న వాతావరణాన్ని కూడా పవిత్రం చేసుకున్న వాడవుతాడు. సృష్టి నిర్వహణలో పనిచేస్తున్న దేవతా మూర్తులందరినీ ఆహ్వానించి, హవిస్సులందించటంతో తాను వారిందరికీ మిత్రుడవుతాడు. సృష్టి ధర్మంతో శ్రుతి కుదుర్చుకుని, సృష్టిలోని వివిధ వ్యూహాల యెడల మేల్కొలుపు చెందుతూ క్రమంగా సృష్టిగా వ్యక్తమవుతున్న దైవంతో, అద్వైత స్థితి ననుభవించడం అలవరచుకుంటాడు. అప్పుడతని జన్మకర్మలు దివ్యమైనవి అవుతాయి. అతని జీవితం యజ్ఞార్థంగా సాగిపోతుంది. సృష్టి యజ్ఞంలో తనవంతు పాత్రను తాను, దైవం కూడా ముచ్చట పడేటట్లుగా నిర్వహించగలుగుతాడు. కనుక ఈ అగ్నులిలా వెలుగుతూనే ఉండాలి. ఈ యజ్ఞయాగాదులిలా సాగుతూనే ఉండాలి. యజ్ఞయాగాదులు నిరాఘాటంగా సాగాలీ అంటే వేదవిద్య విజృంభించి విస్తరిల్లాలి. అందుకు తగిన వ్యూహామల్లాలి.

'నాదగ్గర శిక్షణ పొందుతున్న శిష్యులలో ఒక నలుగురిని ఎంచుకొని, వారికి నాలుగు వేదాలను అప్పగించాను. మీరు మీమీ శిష్య బృందాలతో ఈ వేదాలను వర్ధిల్లచేయండి. జన జీవితాల వరకు మీరీ వెలుగును కొనిపోవాలి. జనులు నిజ

జీవితాలలో ఈ వెలుగును నిండుగా అనుభవించాలి.' అని చెప్పాను. వారు నా ఆదేశాన్ని అందుకున్నారు. ఋగ్వేదాన్ని పైలుడూ, యజుర్వేదాన్ని వైశంపాయనుడూ, సామవేదాన్ని జైమినీ, అధర్వణ వేదాన్ని సుమంతుడూ స్వీకరించి, తమతమ బృందాలతో నేను చెప్పిన మార్గంలో కృషి చేయనారంభించారు.

వేద దర్శనాన్ని సూత్రీకరణ చేసి అందించాలి అనిపించింది. నా నుండి బ్రహ్మ సూత్రాలు దిగివచ్చాయి.

వేద దర్శనాన్ని ఉపబృంహణం చేసి జనులకందించాలనిపించింది. నానుండి పురాణ వాఙ్మయమంతా దిగి వచ్చింది. పితృదేవులైన పరాశరుల విష్ణు పురాణమే పురాణ వాఙ్మయాన్ని రూపుదిద్దడంలో నాకొక ప్రేరణగా, నాకొక ఆదర్శంగా, నాకొక ఆదేశంగా నా ముందు నిలిచింది. పురాణ వాఙ్మయాన్ని రోమ హర్షణునికి అందించి జగద్వ్యాప్తం చేయమని చెప్పాను. అతడా పనికి అంకితమయ్యాడు. అతని కుమారుడు సూతుడు ఆ విద్యలో ఆరితేరిన వాడయ్యాడు.

తల్లి సత్యవతీదేవి ఆజ్ఞననుసరించి, ధృతరాష్ట్రాదులకు తండ్రినయ్యాను. వారు, వారి బిడ్డలు, బంధుమిత్రాదుల రూపంలో వారి చుట్టూ చేరినవారూ, సృష్టిలోని సకల ధర్మాలకు ప్రాతినిధ్యం వహిస్తూ, కథను ప్రపంచ సంగ్రామం దాకా తీసుకుని వెళ్ళారు. ఆ కథను సమగ్రంగా దర్శించి మహాభారతమనే మహేతిహాసాన్ని నేను నిర్మాణం చేశాను.

సృష్టి ధర్మాలుగాని, వ్యక్తి ధర్మాలుగాని, సమాజ ధర్మాలుగాని, సామాన్య ధర్మాలు గాని భారతంలో లేనివి ఇంకెక్కడాలేవు. ధర్మాలు, ధర్మసూక్ష్మాలు, ధర్మ సమన్వయాలు - అన్నింటినీ సాకల్యంగా అందులో అందించాను. అన్నింటినీ మించి ధర్మాద్వైతమనే దివ్య స్థితిని మానవుడు ఎలా అందుకోగలడో భారత కథనే ఉదాహరణగా తీసుకుని మానవజాతికి ఉపదేశించాను. మానవుడు సాధించవలసిన చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థ కామ మోక్షాల విషయంలో మహాభారతాన్ని ఒక కల్ప వృక్షంగా రూపొందించాను. మనిషికి ఏ క్షణంలో పురుషార్థాల విషయమై, ఏ వివరణ కావలసి వచ్చినా అందులో దొరికే లాగున చేశాను. మహాభారతం ఒక ధర్మ మహా సముద్రం. అది ఒక మహా ప్రపంచం.

ఇంత రచన జరిగింది. ఇంత కృషి జరిగింది. జనులందరికీ ఇది చెందాలి. జనులందరూ ఈ జరిగిన కృషి ఫలితాలను నిండుగా అనుభవించాలి. కాని

నాకేమిటో సందేహం కలుగుతోంది. ఇంత కృషిని సద్వినియోగం చేసుకోల గలిగిన దీక్షా, ఓర్పూ ఈ కలియుగపు మానవులకు ఎంతవరకు ఉంటాయో అని. ఈ కృషిదాకా వస్తే, వారికీ కృషి నచ్చుతుంది. వారీ వాఙ్మయాన్ని మెచ్చుతారు. ఈ వాఙ్మయానికి తగినట్లుగా వారిని వారు మలచుకుంటారు. ఆ విశ్వాసం నాకుంది. కానీ, ఈ కృషిదాకా మానవుణ్ణి తీసుకువచ్చే మార్గ మేమిటి? అదే ఆలోచన. అనుక్షణం నాలో అదే ఆలోచన. అదే ఆవేదన. దైవానికి ఇదే నా నివేదన.

కలిలో మానవులను ఆవహించే లక్షణాలను చూశాం కదా! ప్రజలలో ఎక్కువమంది మేధాశక్తి లేనివారు, బుద్ధి మందగించిన వారూ అయిపోతారు. వేదాలను వల్లించేవారు వల్లించటంతో సరిపెట్టుకుంటారు తప్ప, దాని అర్థం దాకా పోవడానికి బద్ధకిస్తారు. అంతేకాదు. శ్రమజీవులకూ, స్త్రీలకూ వేదవిద్యను అందకుండా చేస్తారు. ప్రజలలో కూడా ఎక్కువమంది పొట్టపోసుకోవటమే ధ్యేయంగా కలిగినవారు అవడంచేత ఇవన్నీ మనకెందుకులే అనుకుంటూ, ఈ వెలుగు యెడల కన్నులు మూసుకుంటారు. పురాణేతిహాసాల విషయంలో కూడా ఇటువంటిదే జరుగుతుంది. సామాన్యులు కథా భాగాలతో సరిపెట్టుకోగా, మేధావులనబడేవారు వాటిలోని విశేషాంశాలను గూర్చి విశ్లేషిస్తూ కూర్చుం టారు. 'విశేషాంశాలు'-అంటే వారికి విశేషంగా కనిపించిన అంశాలన్నమాట. పరమార్థాన్ని మాత్రం వీరూ, వారూ కూడా అందుకోలేని స్థితిలో పడిపో తారు. మరిప్పుడెలాగ? ఈ కృషిని వారు సద్వినియోగం చేసుకునేటట్లుగా చూడటమెలాగ? పరమార్థానికి దూరమై, శిశ్నోదర పరాయణులై, ప్రజ్ఞాపరంగా కుంచించుకుపోతున్న వారిని, పరమార్థం వైపునకు మళ్ళించడం ఎలాగ? ఇదీ జీవితమని వారికి నచ్చజెప్పడమెలాగ? నచ్చేటట్లుగా చెప్పడమెలాగ?

చూడగా, చేయవలసినదీ,నేనింతవరకూ చేయనిదీ ఒక్కటే కనబడుతున్నది. అదేమిటంటే భాగవత మార్గాన రచన చేయక పోవడం, అందువల్లనేనేమో ఇంత కృషి జరిగినా నాలోని దైవం సంతోషాన్ని చెందుతున్నట్లుగా నాకనిపించటం లేదు.భాగవత మార్గాన రచన జరిగితే అటు దైవం,ఇటు మహాత్ములు -అందరూ ఈ జరుగుతున్న కృషి పరిపూర్ణతను సంతరించుకున్నదని తమ ఆమోదాన్ని తెలియచేస్తారనిపిస్తున్నది. ఎంత మోసం జరిగిపోయింది ఒక చిన్న ఏమరపాటు కారణాన.ఈ జరిగిన కృషి సార్థకం కావాలి అంటే, సమగ్రం కావాలీ అంటే భాగవత మార్గాన రచనను జరపడం ఒక్కటే కర్తవ్యంగా గోచరిస్తూ ఉన్నది.

అప్పుడే కాయ పండినట్లవుతుంది. ఇక ఈ పలుకు పలకమార వలసి యున్నది. దివ్యానుభూతులెన్నింటినో ఈ భూలోకాన అవిష్కరణ చేయవలసి ఉన్నది. అలా అని నాకనిపిస్తున్నది. దైవం నన్ననుగ్రహించ వలసి ఉన్నది. ఈ నా ప్రయత్నాన్ని ఆమోదించవలసి ఉన్నది. అంటూ, అనుకుంటూ సమాధానపడే ప్రయత్నం చేస్తూ సమాధిస్థితిలో నిలిచి ఉన్నాడు వ్యాసమహర్షి.

శుకయోగి పలుకులు వ్యాసుని గాధను కన్నులకుకట్టేస్తూ ఉండగా, అదోవిధమైన దివ్యానుభూతిలో సొక్కుతున్నాడు పరీక్షిత్తు.

## నారదుడు

కలికాలపు పోకడలను గమనిస్తూ, తననుండి జరిగిన కృషి ఆ కలికి ఎంత వరకు బదులు చెప్పగలదని ఆలోచిస్తూ, జరగవలసినది ఏదో మిగిలి పోయిందని తనను తాను సమీక్షించుకుంటూ, కర్తవ్యోన్ముఖుడు కావడానికి గాను ప్రయత్నం చేస్తున్న వ్యాస మహర్షి అలా అప్రయత్నంగా ఒకసారి ఆకాశం వైపుకు చూశాడు. అతడలా చూశాడో లేదో, ఆకాశ మొకసారి అలా మెల్లగా కదిలింది. కదిలిన ఆకాశం అలా నారదుని రూపై నిలిచింది. ఆకాశమిచ్చిన ఆ రూపుతో, అలా తనవైపుకే సాగి వస్తున్నాడా నారదమహర్షి అని గ్రహించిన వ్యాస భగవానునికి ఒడలెల్ల పులకించి పోయింది. అలా కదలివస్తున్న ఆయన వైపునకే చూస్తూ ఉన్నాడు. ఆయన కదలికలనే చూస్తూ ఉన్నాడు వ్యాసమహర్షి.

వ్రేలితో మహతిని మీటుతూ, గొంతుతో హరినామామృతాన్ని నలుదిక్కులకు వెదజల్లుతూ నడచి వస్తున్నాడు నారద మహర్షి. ఆ గానామృతానికి యోగీంద్రులే పరవశించి పోతున్నారు. ఎఱ్ఱని రాగిరంగు జడలు ప్రభాత కాంతుల్ని వెదజల్లుతున్నాయి. అవును. ఆయన రాక ఒక ప్రభాతమే మరి. సుప్రభాతమే. ఆయన కటాక్ష వీక్షణాలు మీద పడాలేగాని, ఇక ఆ జీవితాలకు తెల్లవారినట్లే. మెడలోని ఆ తులసి మాలల నుండి దివ్యమైన సుగంధ మొకటి దిగంతాల వరకు వ్యాపిస్తూ ఉన్నది. “అహో! నారదుని రాక నాకెంతో హాయిని కలిగిస్తూ ఉన్నది. మథనపడిపోతున్న నా మనస్సునకు ఊరటను కలిగిస్తున్నది. నాకిప్పుడు ఊపిరి అందుతూ ఉన్నది.” అని పరవశిస్తూ తన వైపునకు నడచివస్తున్న నారదునికి స్వాగతం పలకడానికై లేచి నడిచాడు వ్యాసమునీంద్రుడు.

స్వాగతం పలికేందుకు నడిచి వస్తున్న వేద వ్యాసుణ్ణి ప్రేమ కురిసే కన్ను

లతో తృప్తిగా చూస్తున్నాడు నారదముని. "ఈ వ్యాసుడు సామాన్యుడా? వేదాలను విభాగం చేసిన విచక్షణాశీలుడు. జగత్తునందలి జనులందరకు భవ దుఃఖాన్ని బాప గలిగిన సమర్థుడు. పెద్దలకే పెద్దగా గోచరించు కారణజ న్ముడు. ఈ వ్యాసుడు సామాన్యుడా?" అని అనుకుంటూ, ఆనందిస్తూ, తనకు దగ్గరౌతున్న వ్యాసమహర్షిని చూపులతోనే కుశలమడిగాడు నారదముని.

ఆ చూపులు, ఆ నవ్వులు అలా తనను సేద తీరుస్తూ ఉండగా నారద మునికి స్వాగతం పలికి, తనకు తృప్తి కలిగేటట్లుగా ఆయనకు అర్చనలు సలిపి, తన హృదయాన్నే అచట ఆసనంగా పరచి, నారదుని కూర్చోపెట్టుకున్నాడు వ్యాస మునీంద్రుడు.

వ్యాసుని వైపు చూస్తున్నాడు నారదముని. ఆ చూపునకు వ్యాస మునీం ద్రుడు సమాధిస్థితిని పొందుతున్నాడు. ఆ సమాధిస్థితిలో నుండే, 'నారద మునీంద్రా! నేను చేయవలసిందేదో నాకు తెలియజెప్పి నన్ను నడిపించవయ్యా' - అని అడుగుతున్నాడు. ఆ అడగటానికి భాషలేదు. భాషలకు అందని అభ్యర్థనమది. హృదయం హృదయంతో మాట్లాడటమంటారే, అదీ అక్కడ జరుగుతున్నది.

లాలనగా వీణను మీటుతూ, "వేదవ్యాసా! ఏమిటి నీలో చింతాక్రాం తమైన స్థితి ఒకటి కనబడుతున్నది? ఈ ఆర్ష వాఙ్మయ సృష్టికి బ్రహ్మ వంటివాడివి నువ్వు. భారత మహేతిహాసాన్ని నిర్మించి నటువంటి వాడివి. అరిషడ్వర్గాన్ని జయించిన వాడివి. 'సృష్టి తత్త్వమిది. బ్రహ్మ స్వరూపమిది.' - అని సకల జనులకూ తేటతెల్లం చేసిన వాడివి. యోగివరులకే నాయ కుడనదగిన వాడివి. నిత్య జీవితాన్ని ధర్మబద్ధంగా నడుపుకోవడమెలాగో మానవులకు అనేక విధాల బోధించిన వాడివి. అలాంటివాడివి దీనుడిలా, ఇలా చింతా క్రాంతుడవౌతున్నావేమిటి? మహర్షీ! నీకేమిటి కావాలి చెప్పు." అని అడిగిన నారద మహర్షికి అంజలి ఘటిస్తూ, కొద్ది క్షణాలలా ఉండిపోయాడు వ్యాస మహర్షి.

అరమోడ్పు కన్నులతో, అనుభూతి నిండిన గొంతుతో, నారద మునీంద్రుని పాదాలను చూపులతోనే స్పృశిస్తూ వ్యాస భగవానుడిలా అన్నాడు. "మునీంద్రా! నీవు బ్రహ్మ మానసపుత్రుడవు. సకల జీవుల మనస్సులను ఎరిగినవాడవు. ఈ నా మనస్సులో ఏమున్నదో నీ వెరుగవా స్వామీ! విష్ణులోకపుటంచులు చూసి నవాడివి. విష్ణుపదాన్ని అందించడంలో నేర్పరివి. జీవులను దైవతత్త్వంలోనికి

మేలుకొలుపగల మహా ప్రబోధం నీది. సూర్యునివలె మూడు లోకాలలో తిరుగాడ గలిగిన వాడివి. వాయువువలె సకల జీవులలో వసిస్తున్న వాడివి. సర్వమూ తెలిసిన వాడివి. సర్వమూ తెలువగల వాడివి. నీకు తెలియని ధర్మమేది? నీవు చూడని లోకమేది? తండ్రీ! నా మనస్సునకు ఈ అసంతృప్తి ఎందులకు కలుగుతూ ఉన్నదో, దానిని సమూలంగా గ్రహించి, నాకు వివరించి, దానికి పరిహారమేదో సూచింపవయ్యా!"

వ్యాస భగవానుని ఆర్తితో కూడిన అభ్యర్థనను విని కొద్ది క్షణాల పాటు అలా కన్నులు మూసుకుని తనయందు తానుండిపోయాడు నారదుడు.

మామూలు దృష్టితో చూస్తే నారదుడు కలహభోజనుడు. మహర్షుల దృష్టిలో అతడు పరమ గురువులకు పరమ గురువు. కలహ భోజనుడుగా కనిపించినప్పుడు కూడా అతడు సాధిస్తూ వస్తున్నది లోక కల్యాణమేనని మనం మరువకూడదు. రాగద్వేషాలతో సిగపట్లు పడుతున్న మానవుల్ని, ఆ రాగ ద్వేషాల నుండి ఒడుపుగా ఈవలకు లాగి, లోక కల్యాణం వైపునకు నడిపిస్తూ వస్తున్న విలక్షణమైన వ్యక్తి అయన. ఆ ఒడుపుగా ఈవలకు లాగటానికే కలహాన్ని ఒక ఉపకరణంగా ఉపయోగించుకుని కలహ భోజనుడన్న బిరుదును కూడా సంతోషంగా స్వీకరించాడాయన. నిరంతరం హరినామ స్మరణలో తేలియాడే నారదుడికి ఈ కలహప్రియత్వం ఏమిటి? రాగద్వేషాలు సృష్టించే తుఫానులను కూడా తీరాన్ని దాటించగలిగిన ఈ నైపుణ్యం ఏమిటి? ఇది విచిత్రమే. భక్తులకు లౌక్యం తెలియదని మనం అనుకుంటూ ఉంటాం. వారు లోకం పోకడలు తెలియని వారని కూడా మనం భావిస్తూ ఉంటాం. బహుశా అది తప్పేమో! ఆ లౌక్యం గాని, ఆ లోకపు తీరు తెన్నులు గాని వారికి తప్ప ఇంకెవరికీ పరిపూర్ణంగా తెలియవేమో! ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకునే 'నీవు చూడని లోకమేది?' - అంటున్నాడు వేదవ్యాసుడు. నిజమే. నారదుడు అన్ని లోకాలూ ఎరిగినవాడే. ఏ లోకంలో ఉన్నవారు ఎలా ఉంటారో, వారికి పరమార్థాన్ని ఏ రూపంలో అందించాలో అతడికి బాగా తెలుసు. ఒక నలుగురు ఒకచోట ఉన్నా, మానసికంగా ఎవరి లోకంలో వారుంటారు. 'వాడి లోకంలో వాడున్నాడురా!' అంటూ ఉంటాం మనం. కనుక అన్ని విధాల మానసిక స్థితిగతులను ఎరిగిన వాడన్నమాట నారదుడు. ఆ మానసిక స్థితిగతులకు దారి చూపగలిగిన వాడన్నమాట నారదుడు.

నారదుడు బ్రహ్మ మానసపుత్రుడు. మానవుల మనస్తత్త్వాలను తగిన

విధంగా మళ్లించేటందుకు గాను బ్రహ్మచేత నియోగింపబడినవాడు. మానవు లందరిలోనూ అతడు ప్రజ్ఞామయమూర్తియై వసిస్తూనే ఉంటాడు. మానవు లకు తెలియకుండానే సరియైన దారి వైపుకు వారిని మళ్ళిస్తూనే ఉంటాడు. 'మనకు తోచినట్లల్లా మనం చేసుకుంటున్నాం.' అనుకుంటారు మానవులు. ఆ తోచడానికి వెనుక ఉంటాడతను. ఎలా తోస్తే ఈ రాగద్వేషాల మీదుగా మానవుల్ను తమకు తెలియకుండానే తాము ముందుకు సాగగలరో అలా తోచే ట్లుగా చేస్తూ ఉంటాడతను. మానవుల మధ్య సన్నివేశాల రూపకల్పన అన్నది ఇతడి అధ్వర్యంలో జరుగుతున్నదే. సన్నివేశాలు చకచకా సాగి మానవులకు తగిన జీవన సూత్రాలను అవి అందించేటట్లుగా చూస్తాడితడు. ఆ సన్ని వేశాలు ఒక స్థాయికి వచ్చేసరికి మనిషిలో ఒక ఆర్తి కలుగుతుంది. ఏమిటీ జీవితం? ఇంతకూ తానెవరు? అసలీ సృష్టికథ ఏమిటి? మొదలైన ప్రశ్నలతనిలో ఉదయిస్తాయి. అప్పుడితడే గురుమూర్తిగ సాక్షాత్కరించి, అక్కున చేర్చుకుని ఆశీర్వదిస్తాడు. మనిషి మనస్సును ఉచ్ఛ్వాస నిశ్వాసల వైపుకు మళ్ళిస్తాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసలను గమనిస్తున్న మనస్సు ఆ ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపంలో ఒక మహత్తరమైన గానం జరుగుతున్నట్లుగా దర్శిస్తుంది. ఆ గానాన్ని చెవి యొగ్గి వింటుంది. ఉచ్ఛ్వాస సాగుతున్నప్పుడు 'సో' అన్న ధ్వని వినిపిస్తున్నది. నిశ్వాస వెడలుతున్నప్పుడు 'హం' అన్న ధ్వని వినబడుతున్నది. రెండూ కలిపితే 'సోహం' అవుతున్నది. ఈ సోహం ఇటునుండి పలుక బడినప్పుడు 'హంసో' 'హంస' అవుతుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపంలో ప్రయాణం చేస్తున్న ఈ హంసలను దర్శింప గలిగినప్పుడు, మనిషి మనస్సు 'మానస సరోవర' స్థితిని పొందుతున్నది. ఈ హంసనే అధిరోహించి మనిషి నుండి వాక్కు ఈవలకు వస్తున్నది. కనుకనే సరస్వతి 'హంస వాహన' అని చెప్పబడుతున్నది.

మనిషి మనస్సు ఉచ్ఛ్వాస నిశ్వాసలను గమనిస్తూ ఉండగా 'సోహం' అనే దివ్య మంత్రాన్ని వినగలుగుతుందని చెప్పుకున్నాం. 'సో' లోని సకారం, 'హం' లోని హకారము కరిగిపోతే ఇక అక్కడ మిగిలేది 'ఓం' కారము. ఈ 'ఓం' కారమే పరబ్రహ్మ స్వరూపమని పెద్దలందరూ అనాదిగా మనకు తెలియజెపుతూ వస్తున్నారు. అలాంటి 'ఓం' కార స్వరూపాన్ని మనిషి మనస్సుకు ప్రస న్నమయ్యేటట్లుగా చేస్తాడు నారదుడు. మనస్సు క్రమంగా ఓంకారంలో లీనమై 'ఓం' కారంలో భాగమై, 'ఓం' కార స్వరూపమై ప్రవర్తించడం నేర్చుకునేలా గున చూస్తాడు. దానితో మానవుడు బ్రాహ్మీమయ మూర్తి అవుతాడు. ఈ విధంగా మనిషి కొరకు క్రింది లోకాలకు దిగి, కలహ భోజనుడుగా రూపొంది,

క్రమంగా అతడిని కలహం నుండి 'సోహం' వరకు ప్రయాణింప చేస్తాడు నారద మహర్షి. కనుక అతనికి తెలియని లోక మింకేముంటుంది?

నారద మహర్షి అంతటివాడు. అంతర్యామిత్వం కలిగినటువంటివాడు. తాను కావాలనుకున్నప్పుడు, కావలసిన విధంగా రూపాన్ని సంతరించుకోగలిగిన మహానుభావుడు. వ్యాసమహర్షి అంటే అతడికి ఎనలేని ప్రేమ, గౌరవం. అందుకనే అతడి ఆర్తిని అందుకొని, అలా ఆకాశం నుండి కదిలి, ఇలా భూమిపైకి దిగివచ్చాడు. తన కొరకై తానుగా దిగివచ్చిన నారదమహర్షి కరుణకు కరిగిపోతున్నాడు వ్యాస భగవానుడు. 'తనకేమి ఉపదేశించబోతున్నాడా' - అని ఆర్తితో ఎదురు చూస్తున్నాడు. అంజలి ఘటించి మరీ ఎదురు చూస్తున్నాడు.

పరీక్షిత్తు కన్నులు చెమ్మగిల్లాయి. శుకయోగి కన్నులు తళుక్కుమన్నాయి.

## నిజమైన రచన

కన్నులు మెల్లగా తెరిచి ఆర్తితో తన వైపునకే చూస్తున్న వ్యాస మహర్షితో నారద _ మునీంద్రుడిలా అన్నాడు.

"మహర్షీ! మానవజాతికి చెప్పవలసిన ధర్మాలన్నింటినీ చక్కగా తెలియజెప్పావు నీవు. ఇంతగా తెలియచెప్పినా, ఆ ధర్మాల యెడల స్పందించవలసినంతగా ప్రజలు స్పందించలేదేమని బాధపడుతున్నావు.

ఈ సందర్భంలో ఒక సూక్ష్మాన్ని మనం గమనించుకోవాలి. సృష్టిలోని ధర్మాలను మానవులకు తెలియజెప్పడం ఎంత అవసరమో, ఆ సృష్టి ధర్మాలు మహనీయుల జీవితాలలో సద్గుణ సమూహాలుగా ఎలా వ్యక్తమవుతున్నాయో వర్ణించి చెప్పడం కూడ అంత అవసరం. ఇంకా చెప్పాలీ అంటే అంతకంటె అవసరం. సద్గుణాలతో నిండిన మహనీయుల జీవితాలను వర్ణించి చెప్పినప్పుడు ఆ వర్ణనకు ప్రజలు పరవశించి పోతారు. పారవశ్యంలో ఆ సద్గుణాలను మరల మరల తలచుకుంటారు. తమకు తెలియకుండానే ఆ సద్గుణాలను తామూ అలవరచుకుంటారు. సజ్జనులుగా రూపొందుతారు. సద్గుణాల చేత ఎప్పుడైతే అంతగా ప్రభావితులయ్యారో, అప్పుడు ఆ సద్గుణాలుగా వ్యక్తమవుతున్న సృష్టి ధర్మాలపై వారికి ఎనలేని ఆదరణ, గౌరవం కలుగుతాయి. ధర్మాల యెడల ప్రజలు ఎలా స్పందించాలని నీవనుకుంటున్నావో, అలా స్పందించడమన్నది

అప్పుడు సాధ్యమవుతుంది.

చిత్రమేమిటంటే నీవు ధర్మాలను గూర్చి తెలియ చెప్పినంతగా సద్గుణ సంకీర్తనాన్ని చేయలేదు. ఇంతవరకు నీనుండి వెలువడిన వాఙ్మయంలో సద్గుణ సంకీర్తనం బొత్తిగా లేదనను గాని, కావలసినంతగా మాత్రం లేదు. ఏదో అక్కడక్కడ కొంచెం కొంచెంగా ఉన్నది. ఆ కారణం చేతనే-ఈనాడు నీకీ అసంతృప్తి కలుగుతోంది. ఏదో కొరత జరిగినట్లుగా అనిపిస్తోంది. కనుక భాగవత మార్గాన మహనీయుల జీవితాలలోని సద్గుణాలను నోరార కీర్తించు. ఆ సద్గుణాలను వ్యక్తం చేస్తున్న వారి జీవిత సన్నివేశాలను అనుభూతిప్రదంగా రచించు. అప్పుడా కీర్తనకు, ఆ రచనకు ప్రజలు పరవశులై తాముగా నీకు దగ్గరౌతారు. 'నీకు' - అంటే నీ వాఙ్మయానికి దగ్గరౌతారు. దగ్గరై ఆమూలాగ్రంగా నీ వాఙ్మయాన్ని అధ్యయనం చేసి ఆచరణశీలురై, భాగవతమూర్తులై తరిస్తారు.

పంచదార తియ్యగా ఉంటుంది - అని ఎన్నిసార్లు ఎంతగా చెప్పినా పిల్లవాడు స్పందించడు. అదే పిల్లవాడికి ఆ పంచదారను కొంచెంగా రుచి చూపిస్తే! ఇక వాడు దానిని వదలిపెట్టడు. మన దృష్టిని కూడా అటు వైపుకే మళ్లింపజేసి, తనకా పంచదారను పెట్టమని మరల మరల మనలను బలాత్కరిస్తాడు. అలాగే సత్యాన్నే పలకాలి. దాంపత్యాన్ని పరమ పవిత్రంగా నడుపుకోవాలి. స్వధర్మాన్ని విడిచి పెట్టరాదు. మొదలైన ధర్మాలను మన మెన్నిసార్లు నొక్కి చెప్పినా ప్రజలు వాటియెడల అంతగా స్పందించరు. అదే ఆయా ధర్మాలకు అంకితమైన మహాత్ముల జీవితాలను రసవత్తరమైన పద్ధతిలో వర్ణించి చెప్పగలిగితే ఇక ప్రజలు ఆ ధర్మాలను ఆచరించకుండా ఉండలేరు. ధర్మంగా చెప్పడానికి, అదే ధర్మం మహాత్ముల జీవితాల్లో సద్గుణంగా వ్యక్తమవుతున్నప్పుడు దానిని దర్శించి వర్ణించి చెప్పడానికీ అంత తేడా ఉంది. ఇంతవరకు నీవు రూపొందించిన వాఙ్మయంలో మంచి కథాఘట్టాలు లేకపోలేదు. కాని, ఆ కథా ఘట్టాల రచన సాగుతున్న వేళల్లో ఎక్కువచోట్ల ఆ కథా ఘట్టాల లోని ధర్మం, ధర్మసూక్ష్మం, ధర్మ సమన్వయం మొదలైన వాటి మీదకే నీ దృష్టి ప్రసరించింది. సృష్టిలోని ధర్మాలు రక్తమాంసాలతో నిర్మింపబడిన మానవ రూపాల ద్వారా సద్గుణాలుగా ఎలా వ్యక్తమవుతున్నాయన్నది నీవు అంతగా వర్ణించి చెప్పలేదు. ఆ పని ఇప్పుడు జరగాలి. ఆ పని జరిగితే లోకానికి మేలు జరుగుతుంది. నీకు ఈ వ్యథా తొలగిపోతుంది.

ఈ సృష్టి విష్ణు స్వరూపం. విష్ణువే ఈ సృష్టిగా గోచరిస్తున్నాడు. విష్ణువు అంటే వ్యాపించేవాడని కదా అర్థం. సృష్టిగా వ్యాపించే దైవాన్ని మనం విష్ణువు అంటున్నాం. అలాంటప్పుడు సృష్టిలోని ఈ నామరూపాలన్నీ అతనివే. నామరూపాల ద్వారా వ్యక్తమవుతున్నది అతడే. అలా వ్యక్తమవుతున్నప్పుడతడేం చేస్తాడు? తనయందలి కల్యాణ గుణాలను ప్రత్యేకించి కొన్ని నామరూపాల ద్వారా వ్యక్తం చేస్తాడు. వారినే మనం భాగవత మూర్తులు అంటాం. దీనిని బట్టి ఏం తెలుస్తున్నది? భాగవత మూర్తుల ద్వారానే దైవం పరిపూర్ణంగా వ్యక్తమవుతున్నాడని, సకల జనులకూ తన దివ్య స్వరూపాన్ని రుచి చూపిస్తాడని తెలుస్తున్నది. ఆ రుచిని అనుభవించడం ద్వారా మిగిలిన మానవులు కూడా క్రమంగా భాగవత మూర్తులుగా రూపొందాలన్నది ఆ విష్ణుదేవుని ప్రణాళిక. మరి అలాంటప్పుడు ఆ భాగవత మూర్తుల దివ్య జీవితాలను గొంతెత్తి గానం చేయడం ఎంత అవసరమో గమనించు. వారి జీవితాలను గానం చేస్తే విష్ణువును గూర్చి గానం చేసినట్లే అవుతుంది. కనుక, రచయిత అయినవాడు తాను ప్రజలకు ఏమాత్రం మేలు చేయదలచినా భాగవత మార్గాన రచన చేయడానికి పూనుకోవాలి. అలాటి రచనల వలన ప్రజలకు పారవశ్యం కలుగుతుంది. విష్ణుతత్త్వం అనుభవానికి వస్తుంది. ఆ విష్ణుదేవుని కల్యాణగుణాలు భాగవతమూర్తుల మీదుగా చదువరులకు కూడా సంక్రమిస్తాయి. క్రమంగా వారు విశ్వాన్ని విష్ణు స్వరూపంగా దర్శించ గలుగుతారు. విష్ణువుకన్న భిన్నమేదీ లేదని తెలుసుకుంటారు. తామూ విష్ణు స్వరూపమై తమ జీవితాలను విష్ణుదేవుని వైభవంగా వ్యక్తం చేయగలుగుతారు. మహర్షీ! ఇప్పుడు చెప్పు. భాగవత మార్గాన రచనలను నడిపించడం ఎంతగా అవసరమో నీవే చెప్పు.

నా దృష్టిలో భాగవత మార్గాన నడచిన రచన స్వర్ణ కమలాలతో నిండి, రాజహంసల బారులతో ప్రకాశిస్తున్న మానస సరోవరం లాటిది. ఎందుకని అలా అన్నాను అంటే అలాంటి రచన చదువుతున్నప్పుడు చదువరి మనస్సు కూడా ఒక మానస సరోవరంగా రూపొందుతుంది కనుక. అలా కాక రచయిత తన పాండిత్యాన్నీ, ప్రత్యేకతనూ ప్రదర్శించడం కోసం చేసిన రచనలుంటాయే, అవి చదువరులను ఆశ్చర్య పరచగలవేమో తప్ప, ఆనందింపజేయలేవు. నా దృష్టిలో అలాంటి రచనలు పందికొక్కుల కన్నాలు వంటివి. పందికొక్కు కన్నం ఎలా ఉంటుందో నీకు తెలిసిందే కదా! సూటిగా సాగదు. ఇటునుండి అటు, అటునుండి ఇటు మెలికలు తిరుగుతూ, లోపలికి సాగుతూ ఉంటుంది. మరి

నాలతో నిండి ఉంటుంది. అలాగే కవితాపరమైన మెలికలను ఎన్నింటినో రచయిత ప్రదర్శించవచ్చు. మేధాపరమైన వైచిత్రులను మరెన్నింటినో అందులో చూపవచ్చు. ఎన్ని చూపినా, ఎన్ని చేసినా సృష్టిరూపంలో వ్యక్తమవుతున్న దైవాన్ని రుచి చూపలేని రచన వలన ఒనగూడేదేమిటి? ఇది ఆ రచయితలను నిందించడం కాదు. హెచ్చరించడం. "మీ మీ శక్తియుక్తులను దుర్వినియోగం కానీయకండి." అని మందలించడం.

మరొక మాట చెబుతాను. వ్యాకరణాలూ, అలంకార శాస్త్రాలూ - ఇలాంటివన్నీ ఉన్నాయే ఇవి కేవలం మానవ నిర్మితాలు. రచయితలయిన వారు మనం ఈ శాస్త్రాలకు న్యాయం చేశామా? లేదా? అని చూసుకుంటే సరిపోదు. అసలు కావ్యరచన ఎందుకు చేయవలసి ఉన్నదో గమనించుకోవాలి. రచన వల్ల రచయిత సాధించవలసింది ఏమిటి? చదువరిని ఆనందింపచేయడం. అతడలా ఆనందిస్తూ ఉండగానే అతడిలోని దివ్యత్వాన్ని ఆవిష్కరించ గలగడం. దివ్యత్వాన్ని ఆవిష్కరించడమంటే ఏమిటి? రచనను చదవడం వల్ల అతడు దివ్యత్వం లోనికి మేలుకుని, ఇదివరకటికన్నా దివ్యుడై మెలిగేటట్లుగా చేయడం. బాగున్నది. దివ్యత్వాన్ని ఆవిష్కరించడమన్నది ఎలా సాధ్యమవుతుంది? సృష్టి రూపంలో వ్యక్తమవుతున్న దైవత్వాన్ని రచయిత తాను నిండుగా అనుభవించి, చదువరికి కూడా తన రచన ద్వారా ఆ దివ్యత్వాన్ని రుచిచూప గలిగినప్పుడే సాధ్యమవుతుంది. నాకనిపిస్తుంది కదా, రచయిత ఆ దైవ తత్వాన్ని రుచి చూప గలిగిన నాడు, చదువరిని ఆ దివ్యానందంలో ఓలలాడించగలిగిననాడు వ్యాకరణాది శాస్త్రాలను కొన్నిచోట్ల తప్పినా, మనం పెద్దగా తప్పు పట్టవలసిన అవసరం లేదని, వంటకం రుచిగా ఉన్నప్పుడు అందులో అన్నీ పడ్డాయా, పడవలసిన పాళ్లలో పడ్డాయా అని చూసేవాళ్లుంటారా? ఒకవేళ అలాంటి వాడెవడైనా ఉంటే వాడిని పిచ్చివాడుగా జమకట్టి ప్రక్కన పెట్టవచ్చు. వంటకం రుచిగా లేనప్పుడు అందులో పడవలసినవన్నీ పడినా, పడవలసిన పాళ్లల్లోనే పడినా, మనం ఆనందిచగలమా? వంటకానికి రుచి ముఖ్యం. రచనకు ఆనందస్వరూపుడైన దైవాన్ని రుచిగా కలిగి ఉండటం ముఖ్యం. రచనలోని ఆనందమూ అతడే! సందేశమూ అతడే. ఈ సత్యాన్ని మనం గమనించుకోవాలి. ఆనంద మతడి స్వరూపం. దివ్యత్వం అతడి స్వభావం. ఈ రెండింటినీ నిండుగా అందించ గలిగిందే నిజమైనరచన అవుతుంది. మహర్షీ! ఏమంటావు?"

వ్యాస మహర్షి కనులనుండి ఆనంద బాష్పాలు రాలుతున్నాయి. 'నారద

మునీంద్రా! సాహితీ వ్యాసంగాన్ని గూర్చి నీవు చేసిన ఈ అభిభాషణ అపూర్వం. అపురూపం. ఇది ఒక మహోపదేశం. మానవజాతి మనుగడకు కావలసిన అత్యవసర సందేశం.' - అన్నట్లుగా, అంటున్నట్లుగా ఉన్నాయి ఆ వ్యాసమహర్షి చూపులు.

పరీక్షిత్తు కన్నులు అదోలా ప్రకాశిస్తున్నాయి. శుకయోగి చూపులు పరీక్షిత్తు సేద తీరుతున్న స్థితిని గమనిస్తున్నాయి.

## దివ్యక్రీడ

సావధాన చిత్తుడై సందేశాన్ని స్వీకరిస్తున్న వ్యాసభగవానుని వైపు చూస్తూ, ఇంకా ఇలా అన్నాడు నారద మునీంద్రుడు. "మహర్షీ ! జ్ఞానమంటే ఏమిటి? ఈ సృష్టి స్వభావాన్ని తెలుసుకోవడమే కదా! ఈ సృష్టి అంటే ఏమిటో, అది ఎలా వ్యక్తమవుతూ ఉన్నదో, ఎలా వర్తిస్తూ ఉన్నదో, దర్శనం చేయటమే కదా! అలాంటి జ్ఞానం కూడా భాగవత మార్గాన దర్శనం పొందినపుడే నిండైన అనుభూతిని అందిస్తుంది. భాగవత మూర్తుల గుణగణాల సంకీర్తనలలో మనం లీనమై వర్తిస్తున్న వేళలో వారి మీదుగా ఈ సృష్టితత్త్వం బోధపడినప్పుడే జ్ఞానం కూడా మనకు పరిపూర్ణమైన ఎదుగుదలను అనుగ్రహించ గలుగుతుంది. కనుక సృష్టి తత్త్వాన్ని గూర్చి విడిగా అధ్యయనంచేసేకన్నా, భాగవత మూర్తుల సన్నిధిలో దానిని దర్శించి, అనుభూతి చెందడమే కర్తవ్యమని మనం గుర్తించవలసిఉంది.

"మహర్షీ ! ఇక కర్మాచరణ మున్నది. కర్మాచరణాన్ని గూర్చి మనం ఏం చెబుతున్నాం? కర్మను నిష్కామంగా ఆచరించమని చెబుతున్నాం. కర్మఫలాల విషయం భగవంతుడికి వదిలేయమని చెబుతున్నాం. ఫలితాలవైపు చూడకుండా పనితీరువైపు చూసుకోమని చెబుతున్నాం. బాగున్నది. కాని, ఇలాంటి కర్మాచరణ విధానం అలవడట మనేది భాగవత మార్గాననే సుసాధ్యమవుతున్నదని మనం గమనించుకోవలసి ఉంది. సామాన్యుడు తన జీవితయానంలో ఒకానొక మహనీయుణ్ణి చూసి, లేదా ఒక మహనీయుని జీవిత చరిత్రను విని ప్రేరణను పొందుతాడు. ఆ మహనీయుణ్ణి అభిమానిస్తాడు. ఆరాధిస్తాడు. ఆయనలా జీవించడానికి ఉత్సాహంతో ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో క్రమంగా అతడు నిష్కామ యోగిగా రూపొందుతాడు. కనుక నిష్కామ కర్మను మానవజాతికి

అలవరచ వలెనన్నా కూడా భాగవత మూర్తుల దివ్యగాథలను మనసారా వారికి వినిపించడమే మార్గం సుమా!

"సామాన్య జనులను పట్టుకొని ఈవిషయంలో మీరిలా ప్రవర్తించండి. ఈ విషయంలో మీరిలా ప్రవర్తించకండి. అంటూ నియమ నిబంధనలను అదేపనిగా ఏర్పాటుచేస్తూ వచ్చామనుకో. అప్పుడు ఆ సామాన్య జనులు ఈ నియమ నిబంధనలే మానవ జీవితానికి పరమావధి అనుకోవచ్చు. అప్పుడేం జరుగుతుంది? వారా నియమ నిబంధనలను దాటి పైకి చూడలేరు. నిజమైన పరమార్థాన్ని వారందుకోలేరు. ఆ నియమ నిబంధనల మధ్య అలా నలిగిపోతూ, అదే సాధన అనుకుంటూ, జీవితాలను, రొష్టు పడుతూ గడుపుతారు. లేదా, నియమ నిబంధనలను పాటించడం కష్టమనిపించి, పైకి మాత్రం పాటిస్తున్నట్లుగా నటిస్తూ, చాటుగా అనేకమైన కక్కుర్తులకు లోనవుతుంటారు. ఉదాహరణకు ఒక సామాన్యుణ్ణి పట్టుకొని, సాధనకు బ్రహ్మచర్యం అవసరమని చెప్పామనుకో, అప్పుడేం జరుగుతుంది! అందుకు సిద్ధంకాని శరీరంతో అతడు యుద్ధమైనా చేస్తూ కూర్చుంటాడు లేదా పైకి బ్రహ్మచారిగా పరిగణింప బడుతూ, చాటుగా ప్రక్కదారులైనా త్రొక్కుతాడు. కనుక సామాన్య మానవులను తీర్చిదిద్దగోరి, నియమ నిబంధనల పేరిట, వారిపై ఆంక్షలను విధించి, వారిలోని కాంక్షలను రెచ్చగొట్టేకన్నా, లేదా ఆ నియమ నిబంధనల చుట్టూ మాత్రమే వారి జీవితాలు తిరుగుతూ ఉండేటట్లు చూసేకన్నా మునీంద్రుడా! ఆ సామాన్య జనుల మనుస్సులను భాగవత మూర్తుల జీవిత విధానాలవైపునకు మళ్లించినట్లైతే, వారికి ఎనలేని మేలు జరుగుతుంది కదా! భాగవత మూర్తుల వైభవోపేతమైన జీవితాలను రుచి చూసిన సామాన్యజనులు, ఇక వారి జీవితాలను వారే నియమించుకోగలరు సుమా! నియమ నిబంధనలతో వారిని మనం ఇబ్బందిపెట్టేకన్నా, మనం వారికి మహనీయులను చూపిద్దాం. వారి జీవిత వైఖరులను తెలియజెప్పుదాం. సామాన్యజనులు అందుకు పరవశిస్తారు. ఆ మహనీయులకు అనుగుణంగా తమ జీవితాలను తీర్చిదిద్దుకుంటామని, తమంతట తామే ముందుకు వస్తారు.

"ఈ విధంగా సామాన్య మానవుడు సృష్టితత్త్వాన్ని దర్శించాలన్నా, నిష్కామ కర్మలో నిపుణుడు కావాలన్నా తనకు తానుగా నియమ బద్ధుడు. కావాలన్నా, అతడిని మహనీయుల సన్నిధికి చేర్చటమే మనం చేయవలసిన పని. అప్పుడు ఆ సామాన్యుడు ఆ మహనీయుణ్ణి చూసి ముచ్చట పడతాడు.

మురిసిపోతాడు. మురిసి పోతూనే అతడితో తాదాత్మ్యం చెందుతాడు. మహనీ యునితో తాదాత్మ్యం చెందడం అనగా భగవంతునితో తాదాత్మ్యం చెందటమే కదా! భగవంతుడు భాగవత మూర్తుల రూపంలోనే కదా, తన నిజస్థితిని మనకు తెలుపుతూ ఉన్నది. ఆ తాదాత్మ్యం అలా కొనసాగుతూ ఉండగానే, అతడొక జ్ఞానిగా, యోగిగా, తుద కొక భాగవత మూర్తిగా రూపొందుతాడు. భాగవత మూర్తిని సమీపించిన సామాన్యుడు క్రమంగా తానూ ఒక భాగవత మూర్తిగా రూపొంది, వర్థిల్లుతున్నాడన్నది ఇచ్చట మనం గమనించ వలసిన సత్యం. అయ స్కాంతానికి దగ్గరైన ఇనుపముక్క ఏమవుతున్నది? క్రమంగా తానూ ఒక అయస్కాంత మవుతున్నది. ఏ మంటావు మహర్షి!

"ఎరుక గలిగినవారు ఎలాగూ తమ జీవితాలను ఈశ్వరమయంగా గడు పుతూ ఉంటారు. జీవితాలను ధర్మమయంగా, ప్రేమమయంగా నడపడంలో వారు నేర్పరులై ఉంటారు. ఇక ఎరుక ఇంకా కలుగని వారి సంగతే మనం చూడవలసింది. ఎరుక కలుగనివారు తమ జీవితాలను ఆవేశ కావేశాలకో, ఆశలూ కాంక్షలకో, ఆశయాలూ సిద్ధాంతాలకో వెచ్చిస్తూ, నిరంతరం అశాంతినీ, అసం తృప్తినీ అనుభవిస్తూ ఉంటారు. అంతేగాదు, వీరు తాము చేసే పనులన్నింటినీ తమ చుట్టూ ఉన్న నామరూపాలతో ముడిపెట్టుకొని చేస్తూ ఉంటారు. ఆలు బిడ్డలనూ, బంధు మిత్రులనూ, ఆశ్రితులనూ, వీరు సేవిస్తున్నప్పుడు వీరు చూస్తున్నది వారి నామరూపాలనే. అంతకు మించి లోపలకు చూడలేరు. అలా చూడకపోవడంవల్ల ఆ తోటి వారి ప్రవర్తనలు వీరిపైన అడుగడుగునా ప్రభా వాన్ని చూపిస్తూ, వీరి ప్రవర్తనను వీరి వశంలో లేకుండా చేస్తాయి. అంటే త్రిగుణాత్మకమైన ప్రవర్తనలలో చిక్కుకొని పోతున్నారన్నమాట. ఇది ముళ్లపా దలో పిల్లవాడు చిక్కుకొనిపోవడం లాంటిది.

"ఒక దంపతులు తమ బిడ్డతో సహా విహారానికని అలా బయటకు వెళ్లారు. కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. కాస్తాగి చూద్దురుగదా! పిల్లవాడు అక్కడలేడు. ఇంతలో అల్లంత దూరాన్నుండి వారికి ఏడుపులు వినబడ్డాయి. పరుగెత్తుకొని వెళ్ళి చూశారు వాళ్లు. ముళ్లపొదలోపల చిక్కుకొని పోయి ఉన్నాడు పిల్లవాడు, అలా ఎలా వెళ్ళాడో! ఎలా చిక్కుకొని పోయాడో! అంతు పట్టలేదు వాళ్లకు. బాధ, భయం వాళ్లను చుట్టుముట్టాయి. 'రాబాబూ! రాబాబూ!' అని ఏడుస్తూ అరుస్తారు వాళ్లు. రావడానికి ప్రయత్నించిన కొద్దీ ముళ్లు మరింతగా గుచ్చుకొని ఏడుస్తున్నాడు వాడు. ఆ ఏడుపును విని

తాళలేక పోతున్నారు తల్లితండ్రులు. వాళ్లకేంచేయాలో తోచడంలేదు. ఆ బాగని ఊరికే ఉండలేక పోతున్నారు. వాణ్ణే ఇబ్బంది పెడుతున్నారు. వాళ్లు ఇబ్బంది పడుతున్నారు.

"ఇంతలో అదృష్టవశాన బాలుర బృందం ఒకటి అక్కడికి వచ్చింది. ఆ బృందానికి ఒక నాయకుడున్నాడు. అతడు పరిస్థితిని గమనించాడు. తల్లిదండ్రులవైపు ఓదార్పుగా చూస్తూ, "మీ కెందుకు? మీరలా కూర్చోండి. కొద్దిసేపట్లో మీ అబ్బాయి మీ ఒడిలో ఉంటాడు.. నా మాట నమ్మండి' అన్నాడు. వారి కెందుకో అతనిపైన నమ్మకం కుదిరింది. వెంటనే వారి దుఃఖం ఆగిపోయింది. అలా అల్లంత దూరానికి వెళ్లి, అక్కడ కూర్చొని, 'ఈ బాల నాయకుడు ఏం చేస్తాడా! ఏం చేయబోతున్నాడా?' అని చూస్తున్నారు వాళ్లు.

"బాల నాయకుడు బాలుర చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే అక్కడొక ఆట ప్రారంభమైనది. ముళ్లపొదచుట్టూ సాగుతున్నది ఆ ఆట. బాలురంతా కేరింతలు కొడుతూ, ఉవ్వెత్తున లేస్తూ, ఉప్పొంగిన ఉత్సాహంతో ఆడుతున్నారు. ముందుకీ, వెనక్కీ నడుస్తూ, ఈ ప్రక్కనుండి ఆ ప్రక్కకు సాగుతూ, ఇంతలో అలా అలా మెలికలు తిరుగుతూ అదో క్రొత్తరకమైన ఆట ఆడుతున్నారు వాళ్లు. విచిత్రమైన ఆ ఆటను చూస్తూ తమ బాధనంతా మరచిపోతున్నారు ఆ తల్లిదండ్రులు.

"అలా ఆటను చూస్తున్న తల్లిదండ్రులకు అంతలోనే కనులకు మిరిమిట్లు గొలిపినట్లైంది. తమ కన్నులను తామే నమ్మలేక నులుముకొని మరీ చూస్తున్నారు వాళ్లు ఆశ్చర్యంగా. తమ బిడ్డకూడా ఆటలో ఉన్నాడు. వారిలో ఒకడిగా ఆడుతున్నాడు. ఇది ఎలా సాధ్యమైంది. ఇది కలా? నిజమా?

"ఆడుతున్న బాలురంతా ఆట ఫక్కీని మార్చారు. అటునుండి ఇటు, ఇటునుండి అటూ తిరుగుతూ, కూర్చున్న ఆ తల్లిదండ్రులకు చేరువయ్యారు. అలా ఆడుతూనే ఆ తల్లిదండ్రుల ఒడిలో వారి బిడ్డను కూర్చోబెట్టి బిడ్డకూ, తల్లిదండ్రులకూ కూడా వీడ్కోలు చెబుతూ సాగిపోయారు.

"తల్లిదండ్రులకు ఆశ్చర్యం వేసింది ఈ నైపుణ్యం ఏమిటా!" అని.

"మహర్షి! మనమూ ఇప్పుడలాంటి నైపుణ్యమే చూపాలి. త్రిగుణాత్మకమైన ప్రకృతిలో చిక్కుకొని గిల గిలలాడుతూ ఉన్న మానవుణ్ణి భాగవత మూర్తుల దివ్యమైన జీవన క్రీడను కన్నులకు కట్టించి ఈవలకు ఆహ్వానించ గలగాలి. అప్పుడతడు

ఎవరికి-పనిచేసి పెడుతున్నా వారి నామరూపాలనే కాకుండా, నామ రూపాలకు అవల వ్యక్తమవుతున్న దైవాన్ని కూడా దర్శించ గలుగుతాడు. అనుభవించ గలుగుతాడు. మహర్షి! ఏదీ అలాంటి దివ్యక్రీడను కన్నులకు కట్టించు. ఈ భూమి జనులు ఇక చిరకాలం నీకు ఋణపడి ఉంటారు. త్రిగుణాత్మకమైన ప్రకృతి అనే ముళ్లపొదనుండి ఈవలకు రాగలుగుతారు. గుణాలలో చిక్కుకొ నకుండా, గుణాలను సద్వినియోగ పరచగలుగుతారు. గుణాలతో క్రీడిస్తారు. మహర్షి! ఏదీ ఈ భూమి జనులను అలాంటి నిపుణులుగా రూపొందించే ఆ భాగవత రచన ఏదీ? దివ్యమైన ఆ రచనకోసం లోకంతోపాటుగా నేనుకూడా నీవైపుకు చూస్తున్నాను మహర్షి!"

వ్యాస మహర్షి హర్ష పులకాంకిత గాత్రుడయ్యాడు. జీవిత కార్యనిర్వహణకై తనను ప్రేరేపిస్తున్న నారద మునీంద్రునివైపు అర్థనిమీలిత నేత్రాలతో కొద్ది క్షణాలపాటు అలా చూస్తూ ఉండిపోయాడు.

మునివరుల గాథను వింటూ, ఆశ్చర్యానందాలను అనుభవిస్తున్నాడు పరీక్షిత్తు.

## విష్ణుని వైభవం

అర్ధ నిమీలిత నేత్రుడై తన వైపునకు చూస్తూ కర్తవ్యోన్ముఖుడవుతున్న వ్యాస మహర్షితో నారద మునీంద్రుడు మళ్లీ ఇలా అన్నాడు.

"ఇద్దరు మనుష్యులు ఒకరి నొకరు కలుసుకున్నప్పుడు, ఒకరి కొకరు సహకరించుకుంటున్నప్పుడు, ఒకరిలో ఒకరు ఏమిటి గమనిస్తున్నారు? నామరూపాలను గమనిస్తున్నారు. ఒకరి మనస్సులను ఒకరు గమనిస్తున్నారు. ఒకరి అభిప్రాయాలను, అలవాట్లను ఒకరు గమనిస్తున్నారు. ఒకరి చిత్తవృత్తులను మరొకరు గమనిస్తున్నారు. అంతవరకే గమనిస్తున్నారు. అంతే గమనిస్తున్నారు. ఆపైన ఉన్న అసలు మనిషిని గమనించలేక పోతున్నారు. ఆ అసలు మనిషినే తెలిసినవారు 'దైవం' అన్నారు. అతడిని చూడకుండానే అతడినుండి వెలువడుతున్న చిత్త వృత్తులనూ, నామ రూపాలను మాత్రం తోచిన విధంగా గమనిస్తూ, మనుష్యులు పనులు చేసుకుంటున్నారు. జీవితాలు గడిపేసుకుంటున్నారు. ఎంతకాలం బ్రతికినా, ఎంతమందితో బ్రతికినా అంతమందిలో ఉన్న అతడిని చూడకుం

గానే చనిపోతున్నారు. ఇలాంటి జన్మలు ఎన్నివందలు ఎత్తితే మాత్రం ఏమి లాభం? చిత్తవృత్తుల వరకూ చూడగలిగిన వాళ్ళం, ఆపైన ఉన్న వెలుగును కూడ చూడగలిగితే, ఆ వెలుగును చూస్తూ, చిత్తవృత్తుల యెడల మనం తగిన విధంగా ప్రవర్తించ గలిగితే, అప్పుడు మానవజన్మ ధన్యమవుతుంది. మానవుడిగా జీవించడంలోని రుచి అప్పుడు తెలుస్తుంది. ఆ రుచిని గమనించినవాడు ఇక దానిని మరచిపోలేడు. ఆ రుచి మరుగుతాడు. దాని యెడల ఏమరుపాటు చెందలేనంతగా మరుగుతాడు.

"మానవులలో చిత్తవృత్తులకు పైన వేంచేసియున్న దైవాన్ని దర్శిస్తూ, మనయొక్క కర్మాచరణద్వారా అతడిని ఆరాధించగలగాలి. ఆలుబిడ్డల రూపంలో, బంధుమిత్రుల రూపంలో ఆశ్రితులూ, అర్తుల రూపంలో తోటి మానవులు మనకు దగ్గరవుతున్నారు. వారితోటి ప్రవర్తించేటప్పుడు వారిలోని దైవాన్ని దర్శిస్తూ ప్రవర్తించడం, వారిని సేవించడంద్వారా ఆ దైవాన్ని అనుభవించగలగడం మనకు చేతకావాలి. చేతనయిననాడు మన జన్మకర్మలు దివ్యాలవుతున్నాయి. మన కర్తవ్య నిర్వహణ అంతా ఆ దైవానికి ఆరాధనా విశేషమే అవుతున్నది. మన జీవితమే మానవరూపంలో గోచరిస్తూ, దగ్గరవుతున్న ఆ దైవం యెడల ఒక తపస్సుగా పరిణమిస్తుంది. ఇలాంటి జీవితాన్ని నడపడానికి అలవాటు పడిన మానవుడు, అలాంటి జన్మలు అటుపైన ఎన్ని ఎత్తినా, దివ్యునిగానే జీవిస్తాడు. మానవరూపంలో దగ్గరవుతున్నదైవానికి ఆరాధనగానే తన జీవితాన్ని మలచుకుంటాడు. ఒకసారి కలిగిన ఆ ఎరుక ఇక జన్మజన్మలకూ కొనసాగుతుంది మహర్షీ! కూడని అలవాట్లూ, దురభ్యాసాలే సంస్కార రూపంలో మనిషితోపాటుగా జన్మనుండి జన్మకు పయనిస్తున్నప్పుడు నిత్యజీవితంలో, దినచర్యలో, విధి నిర్వహణలో దైవాన్ని దర్శిస్తూ అనుభవించడానికి అలవాటుపడిన ఆ సదభ్యాసమున్నదే, అది మనిషిని విడిచిపెడుతుందా? విడిచిపెట్టదు. ఇక మానవుడు ఎన్ని జన్మలెత్తినా, మనస్సునుండి ఈవలకు చెదిరిపోడు. అనగా సంసారజీవికాడు. తాను తానుగా ఉంటూ, మనస్సునూ, ఇంద్రియాలను, మానవరూపంలో తనను సమీపిస్తున్న దేవునిసేవలో సద్వినియోగంచేస్తూ ఉంటాడు. యోగస్థితిని అతడు పొందింది ఈ సద్వినియోగం కోసమేనని గుర్తించి మరీ మెలగుతాడు.

"మహర్షీ ! ఈ సందర్భంలో ఒక సూక్ష్మాంశాన్ని చెప్పాలి. చిత్త వృత్తులకు పైనున్న దైవాన్ని పొడగట్టించుకునే ప్రయత్నంలో ఒక్కొక్క మానవుడు

తాత్కాలికంగా కర్మాచరణను అశ్రద్ధచేస్తాడు. లేదా, ఆ దైవాన్ని కనుగొంటు తున్నానన్న సంతోషంలో, సంబరంలోపడి తాత్కాలికంగా కర్తవ్య నిర్వహణను గూర్చి మరచిపోతాడు. ఇక్కడ నేనొక మాట చెబుతాను. మానవరూపంలో గోచరిస్తున్న దైవాన్ని గమనించుకోకుండా, అతడిని కేవలం ఒక భార్యగానో, ఒక భర్తగానో, బిడ్డగానో, బంధువుగానో చూస్తూ, కర్తవ్య నిర్వహణ జన్మల తరబడిచేస్తూ పోయేవారికన్నా, ఆ నానావిధ బంధుత్వాల మీదుగా తనకు దగ్గరవుతున్న మానవులలోని దైవాన్ని చూడగలుగుతున్నవాడు తాత్కాలికంగా కర్మభ్రష్టుడైనా కొంప మునిగిపోయింది ఏమీ లేదని అంటున్నాను. దైవము యెడల కన్ను మూసుకుపోయిన స్థితిలో, ఎన్ని పనులుచేసినా, ఎంతగా చేసినా, లభించే అనుభూతి ఏమున్నది? వీరు చేశారనో, వీరు చేయలేదనో, వీరు గుర్తుం చుకున్నారనో, వీరు మరచి పోయారనో మననం చేసుకుంటూ, మరల మరల చెప్పుకుంటూ, కొంతసేపు ఇష్టపడుతూ, మరికొంతసేపు వెష్టపడుతూ జీవితాన్ని ఏమిటోగా గడపడమే కదా! అంతేనంటావా? అంతకన్న ఆస్థితిలో మానవుడు అనుభవిస్తున్న అనుభూతి ఇంకేమయినా ఉన్నదంటావా? అంతచేస్తున్న మానవుడు ఏమాత్రం అనుభూతిని చెందకుండా అలా ఎందుకని అయిపోతున్నాడు? ఎవరికైతే తాను పనులుచేసి పెడుతున్నాడో, వారిలో దైవాన్ని చూడడం వానికి చేతకాలేదు కనుక. దైవాన్ని చూడగలిగిన వానికి ఇక ఇతరమైన చికాకులుండవు. అభిప్రాయాలుండవు. అనుభూతి ఒక్కటే ఉంటుంది. ఆ అనుభూతి దొరుకుతున్న స్థితిలో ఉన్న మానవుడు, ఆ ఆనందంలో పడి తాత్కాలికంగా కర్మభ్రష్టుడైనా, అతడు దైవం యెడల మేల్కొంటున్నాడు కనుక, అచిరకాలంలో దైవమే అతడిని సరిచేసుకుంటాడు. ఇక ఆ బాధ్యత ఆ దైవమే పడతాడు. ఆ జన్మలో కాకపోయినా, ఆ తరువాతి జన్మలోనయినా, అతడు సర్వసమర్థుడయ్యేటట్లుగా, ఆ దైవమే చూసుకుంటాడు. కనుక మానవజన్మ ఎత్తినవాడికి మానవరూపంలో తిరుగాడుతున్న దైవం యెడల కన్ను తెరుచుకోనడం ముఖ్యం. మానవ జన్మకు అర్థమేమిటో, పరమార్థమేమిటో మనిషికి బోధపడేది ఆ కన్ను తెరుచుకున్నప్పటినుండే! కనుక మహర్షీ! మానవజాతికి ఆ కనువిప్పు కలుగచేయాలి నీవు. భాగవత రచనద్వారా అలవోకగా నీవు దానిని సాధించగలగాలి. నీవుచూపే భాగవత మూర్తుల దివ్యసన్నిధికి సామాన్యజనులు తండోపతండాలుగా పరుగెత్తుకొని వస్తూనే ఉంటారు. ఆ వస్తున్నవారు కనులారా తమకు నచ్చిన భాగవత మూర్తిని దర్శనంచేస్తారు. మనస్సునిండ అతనినే తమ స్మరణద్వారా నింపుకుంటారు. అతడిలో దైవాన్ని చూస్తారు.

చేతులెత్తి నమస్కరిస్తారు. అటుపైన ఏంచేస్తారో తెలుసునా? తమకు నచ్చిన భాగవత మూర్తి వలె తామూ వర్తించాలని ప్రయత్నిస్తారు. ఆ భాగవత మూర్తులు లోకమువైపుకు ఎలా చూస్తున్నారో, లోకం యెడల ఎలా ప్రవర్తిస్తున్నారో, తామూ అలా చూడటం, అలా వర్తించడం మొదలుపెడతారు. ఇంకేమున్నది? భాగవత మూర్తులవలె ఈ జనులుకూడా అడుగడుగునా, అణువణువునా దైవాన్నే దర్శిస్తూ, దినచర్యరూపంలో ఆ దైవాన్నే సేవిస్తూ ధన్యజీవులై పోతారు.

"భాగవత మూర్తులకు సామాన్యజనులు దగ్గరైనప్పుడు ఇంకా ఏం జరుగుతుందో తెలుసునా? వారిక కష్టాలకు కలవరపడరు. సుఖాలకు పొంగిపోరు. కష్టసుఖాలలోకూడ వారా దైవాన్నే చూడగలుగుతారు. తామంత వరకు ఆచరించిన కర్మాచరణలకు ఫలాలుగా రూపుకట్టుకొని వ్యక్తమవుతున్న ఆ కష్టసుఖాల ఎడల తగినవిధంగా ప్రవర్తిస్తారు తప్ప, కష్టం వచ్చిందని బెదిరిపోరు. సుఖం వచ్చిందని అదిరిపడరు. కష్ట సుఖాలకు వెనుకన ఉన్న దైవం వైపునకే సూటిగా చూస్తూ, ఈ కష్ట సుఖాలను, అతడి ఆజ్ఞానుసారం సద్వినియోగం చేయడం నేర్చుకుంటారు. దానితో ఏమవుతుందో తెలుసునా! కష్టసుఖాలకు మించిన జీవితం ఒకటి తమకు ఉన్నదని వారికి తెలుస్తుంది. కష్టసుఖాలను తనలో ఇముడ్చుకో గలిగిన, తనకు తగిన విధంగా మలచుకోగలిగిన దేవుని ప్రణాళికలో తాము పనిచేస్తున్నామనీ, తమ జీవితం ఆ దేవుని ప్రణాళికలో ఒక భాగమనీ, వారికి స్పష్టంగా బోధపడుతుంది. కనుక వారికి ఇక కష్టసుఖాలని వేరుగా ఉండవు. వారికి గోచరించేది దేవుని ప్రణాళిక ఒక్కటే.

"మహర్షి! తెలిసిన వారికి ఈ విశ్వమే విష్ణుస్వరూపం కదా! దైవము యొక్క వ్యక్తరూపమే ఈ 'విశ్వము' అని కదా భాగవత మూర్తుల దర్శనం, అనుభవం. నీవుకూడా దివ్యమైన నీ వాఙ్మయంలో ఇప్పటివరకూ ఈ సత్య దర్శనాన్ని స్థాపిస్తూనే వచ్చావుకదా! నీకు తెలియని దేమున్నది మహర్షీ! ఈ విశ్వాన్ని విష్ణుస్వరూపంగా దర్శించి, అనుభవించడమెలాగో సకల మానవులకు తెలియజెప్పేటందుకూ, తెలిపి నడిపేటందుకూ భువికి దిగివచ్చిన విష్ణుదేవుని అంశవుకదా నీవు. నీ వంటి ఒక పాత్ర కావాలి, ఈ విశ్వంలో అని ఆ విష్ణువే స్వయంగా నీవుగా రూపుదిద్దుకున్నాడు కదా! అట్టి నీ పాత్ర పోషణకు కావలసిన ప్రేరణను అందించడమే ఇంతవరకు నేను చేసినది. కృష్ణద్వైపాయనుడా! భాగవత మూర్తుల రూపంలో వ్యక్తమవుతూవస్తున్న విష్ణుదేవుని వైభవాలను

వర్ణించి చెప్పడంలో ఇక విజృంభించవయ్యా! ఆ వైభవాలను వర్ణించగలిగేది నీవే! వివరించగలిగింది నీవే! మనస్సులు ముచ్చట పడేటట్లుగా, హృదయ పద్మాలు వికసించేటట్లుగా మానవాళికి ఆ దేవుని వైభవాలను విప్పి చెప్పగలిగింది కూడా నీవే. నీవు చెప్పడంలోని ఆ రుచి ఉన్నదే అది అనితరసాధ్యం. లోక హితాన్ని కోరి ఆ పరదైవం నీకు మాత్రమే అనుగ్రహించిన ఒక మహాకళ అది. ఇక విజృంభించు. విష్ణుని వైభవాలను వర్ణించు. ఈ విశ్వమే విష్ణువని సకల జనులకూ నిత్యజీవితాలలో, నిత్యమూ అనుభవానికి వచ్చేటట్లు వర్ణించు, వచ్చేవరకు వర్ణించు. మహర్షీ! ఇక నీవు సిద్ధమే కదా!"

వ్యాస మహర్షి నారద మునీంద్రునికి శిరస్సువంచి నమస్కరించాడు. 'నీ ఆజ్ఞనిక శిరసావహిస్తున్నాను' అన్నట్లుగా నమస్కరించాడు.

శుకయోగి వర్ణిస్తున్న ఈ ఘట్టాన్ని వింటూ దివ్యానుభూతిలోనుండి తలను పంకిస్తున్నాడు పరీక్షిత్తు.

## దివ్య సన్నిధి

శిరస్సును వంచి అంజలి ఘటిస్తున్న, నీ ఆజ్ఞనిక శిరసావహిస్తున్నానని వినమ్రుడై చూస్తున్న వ్యాసమహర్షి వైపు అభినందనగా చూస్తూ ఆత్మీయతను అనుభవిస్తూ, ఇలా అన్నాడు నారద మునీంద్రుడు. "మహర్షీ! భాగవత మూర్తుల ప్రభావం సామాన్య మానవులను ఎంతగా ఉద్ధరిస్తున్నదీ. అన్న అంశాన్ని గ్రహించడానికి జన్మల పరంపరలో నుండి సాగివస్తున్న ప్రజ్ఞామయమైన నా ప్రయాణమే ఒక అద్భుతమైన నిదర్శనం. ఇదేమిటా! అని అనిపిస్తోంది కదూ నీకు! అదెలాగో వినిపిస్తాను విను. ఇప్పుడు నడుస్తున్న ఈ కల్పం కాక, ఇంతకుముందటి కల్పంలో నేనొక దాసీ పుత్రుడను. మా అమ్మ పుణ్యమూర్తులైన వేదవాదుల ఇంటిలో దాసిగా పనిచేసేది."

"నా అదృష్టవశాన మహత్తరమైన సన్నివేశం ఒకటి ఆ వేదవాదుల ఇంటికి నడచి వచ్చింది. యోగిజనులైన వారు, ఆ ఇంటికి చేరి, చాతుర్మాస్య దీక్షను అక్కడనే చేపట్టారు. ఇంకేమున్నది? ఆ నాలుగు నెలలూ ఆ ఇంట పండుగే! అది ఒక అనుభూతి ప్రదమైన సన్నివేశం. నన్ను ఆ యోగిజనులకు పరిచారకునిగా నియమించారు. నా అదృష్టమనుకున్నాను. వారు నన్ను అనుగ్రహించారు అనుకున్నాను. ఇక అంతే. ఆ ఓపిక ఎక్కడినుండి వచ్చిందో, ఆ ఓర్పు ఎక్కడ

నుండి వచ్చిందో! సదాచార సంపన్నులైన వారికి అంతగా సేవ చేయగలిగిన ఆ నైపుణ్య మెక్కడినుండి వచ్చిందో, చిత్రం! నా వయస్సు పిల్లలు కనబడినా, వెళ్ళి ఆడుకోవాలని అనిపించేది కాదు. నిరంతరం అక్కడే, వారి సేవలోనే ఉండిపోయినా మనస్సు ఇంక దేనినీ అడిగేది కాదు. దేనివైపూ చూసేది కాదు. మనస్సు కింకొక ఆలోచనే వచ్చేది కాదు. అలా వారి సన్నిధిలో వారిని సేవించుకుంటూ, అలాగే ఉండి పోవాలనిపించేది. అలా అక్కడే పనిచేస్తూ, వారు తినగా మిగిలిన ఆ ప్రసాదాన్ని ఇలా కన్నుల కద్దుకుని, దానినే ఆహారంగా స్వీకరిస్తూ, అలా ఆ సేవలో అలాగే ఉండిపోయేవాడిని. ఎండనిపించేది కాదు. వాననిపించేది కాదు. వినయ విధేయతలతో వారిముందు అలా సిద్ధంగా నిలబడి ఉండేవాడిని, ఎప్పుడు ఏ పరిచర్య అవసరమైతే, అప్పుడు ఆ పరిచర్య చేసి పెట్టేటందుకు వీలుగా.

వారి సన్నిధిలో క్షణక్షణానికి నా మనస్సు వికసించేది. క్షణక్షణానికీ నా బుద్ధి ప్రచోదనాన్ని చెందుతూ, వివేకమనే వెలుగులను విరజిమ్మేది. ఆ వివేకం ఎంతగా వెలిగేదో అంతగా నన్ను వినమ్రుణ్ణి చేసి నిలబెట్టేది. అక్కడ నడుస్తున్న సన్నివేశాలూ, సంవాదాలూ నాకెంతగా బోధపడుతున్నా, నేనంతలో ఎలా ఉండాలో, అంతలో అలా ఒదిగిపోయేవాడిని. తెలియరావడం వేరు. పాత్ర పోషణ వేరు. తెలియవస్తున్న కొద్దీ, పాత్ర పోషణలో మనం మరింత కుదురుకోవాలి తప్ప, ఇదివరకటి కన్నా, మనకు తెలివి పెరిగింది కదా అని అతిగా ఏమాత్రం ప్రవర్తించకూడదు. పాత్రపోషణ దెబ్బతిన్న తరువాత ఎన్ని తెలివితేటలుండి ఏమి ప్రయోజనం మహర్షి! తెలివి ఎంతగా ఉన్నా, అది తనకు పైనున్న వివేకానికి ఒదిగి ఉండాలి. వివేకానికి మనం ఒదిగి ఉన్నప్పుడు, ఆ పైనుండి దేవుని వాక్కు మనకు వినబడుతూ ఉంటుంది. మనం ఎక్కడ, ఎలా చేయాలో, ఎలా మసులుకోవాలో ఆ వాక్కు మన కెప్పటికప్పుడు తెలియజేస్తూ ఉంటుంది. ఆ దేవుని వాక్కును అలా వింటూ, ఆ వాక్కుకు అనుగుణంగా జీవితాన్ని మలచుకోవడమన్నది వారి సన్నిధిలో నాకు అలవోకగా చేతనయింది. మహర్షి! మహర్షి! ఆ వాక్కును వింటూ, దానికి తగినట్లుగా నడచుకొనే అదృష్టం అబ్బిననాడు ఈ మానవజన్మ ఇక పండిపోయినట్లే కదా! అలా ఆ భాగవతమూర్తుల సన్నిధిలో, వారి సేవలో పరవశిస్తూ, వారి పలుకులకు ఈ నా జీవితం పలకమారుతూ ఉండగా, ఆ నాలుగు నెలల కాలమూ, ఇట్టే కొద్ది క్షణాలుగా గడిచిపోయింది.

ఆ భాగవత మూర్తులు కల్పకల్పాలలో మరల మరల దిగివచ్చే ఆ శ్రీకృష్ణుని దివ్యమూర్తిత్వాన్ని గూర్చిన గాథలను అలా గొంతెత్తి చదివేవారు. మనసారా వర్ణించేవారు. తనివితీర గానం చేసేవారు. అలా వారు చేస్తూ ఉంటే వారి గొంతుల నుండి వెలువడుతున్న ఆ దివ్యగానం నా చెవులకు అలా సోకుతూ ఉంటే అనుభవానికి వస్తున్న ఆ రుచి అమృతాన్ని మరిపిస్తున్నది. ఆ గానం ఎంత విన్నా ఇంకా వినాలనిపిస్తున్నది. చెవులకు ఆ గానం తప్ప, ఇంకొకట సోకని స్థితి వచ్చేసింది. మనస్సు ఆ గానంతో నిండి, ఆ గానంలోనే మునకలు వేస్తూ ఉన్నది. కనులు మూసినా అతడే. కనులు తెరచినా అతడే. సర్వమూ విష్ణుమయమై నన్ను స్పృశించసాగింది. ఇక జీవితం విష్ణుని సేవగా రూపు చెందింది. ఇంకొకలా చూద్దామన్నాకూడా ఆ తలపుకు గాని, ఆ చూడటానికి గాని సందివ్వనంతగా, నాకు విష్ణుడు గోచరించసాగాడు. ఒకవేళ సందిచ్చి నట్లు కనబడినా, ఆ సందులో సందుగా కూడా అతడే ఉన్నాడని తెలిసిపోతూ ఉన్నది. కనుక ఇక ఇతరము లేదు మరియొకటి లేదు.

ఆ అనుభూతితో వారి సేవలో సాగుతున్న నాకు ఈ విశ్వం విష్ణుమ యంగా గోచరిస్తూ ఉండగానే, అటు సృష్టికర్తయైన బ్రహ్మగా, ఇటు లయాన్ని నిర్వహించే శివునిగా కూడా ఆ దైవమే ఎలా వ్యక్తమవుతూ ఉన్నదీ గోచ రించసాగింది. బ్రహ్మనుండి ఈ సృష్టి వ్యక్తమవుతున్న విధానం అనుభూతి ప్రదంగా దర్శన మీయసాగింది. ఈ సృష్టి ఎలా ఏర్పడుతున్నది? సృష్టిలోని వాడినైన నాకు ఈ దేహం ఎలా ఏర్పడుతున్నది అన్నది కూడా అనుభవానికి రాసాగింది. దేవుని మాయ ఈ సృష్టిగా, ఈ దేహాలుగా ఎలా రూపు కట్టుకుం టున్నదీ నాకు బోధపడసాగింది. నా చుట్టూ ఆవరించిన ఈ స్థూల, సూక్ష్మ శరీరాల యదార్థ స్వరూపం నాకు గోచరించసాగింది. ఈ శరీరాల మీదుగా త్రిగుణాల కలయిక మననుండి చేష్టాదికాలుగా ఎలా వ్యక్తమవుతున్నదీ కన్నులకు కట్టసాగింది. దానితో రజస్తమస్సుల ప్రభావానికి అతీతుడనై నిలబడటం ఎలాగో అంతుబట్టింది. విశ్వరూపంగా వ్యక్తమవుతున్న విష్ణురూపాన్ని సేవించడంగా ఈ జీవితాన్ని మలచుకోవడమే ఈ అన్నింటికీ అతీతంగా నిలబడేటందుకు గల ఏకైక మార్గమని నాకు స్పష్టమైంది. విష్ణుని సేవలో మనస్సు విష్ణువు నందు కరుగుతూ ఉండగా మనకా విష్ణుదేవునితో తాదాత్మ్యస్థితి అనుభవానికి రావడ మున్నదే అంతకంటె ఈ మానవ జీవితానికి కావలసినది ఏమున్నది మహర్షి!

ఇంతలో ఆ యోగిజనుల చాతుర్మాస్య దీక్ష పూర్తి అయింది. దీక్షను

విరమించి అటుపైన తమ కర్తవ్యాన్ని గూర్చి సాగిపోబోతున్న వారందరి కన్నులు ఒక్కసారి నన్ను చల్లగా చూచాయి. దయామృతాన్ని నాపైన అమితంగా వర్షించాయి.

'ఈ బాలుడు, ఈ చిన్నివాడు ఇన్నినాళ్ళుగా మనకు పరిచర్య చేసినవాడు. ఆ చేసిన పరిచర్యలో ఏమాత్రము అపచారము దొర్లకుండ శ్రద్ధ వహించిన వాడు. మన సేవలో మనమే లోకముగా బ్రతికినవాడు. ఇన్నినాళ్ళు మనమే లోకమందు విహరించామో ఆ లోకంలోనికి తానుకూడ అలవోకగా ప్రవేశించి మనతో కలసి విహరించినవాడు. చిన్నతనపు చాపల్యానికి ఏమాత్రము గురికానివాడు. ఆ చిన్నతనపు అమాయకత్వాన్ని సద్వినియోగం చేసికొన్నవాడు. మన మనస్సులకు ముచ్చట గొలిపి మన ఆత్మలకు దగ్గరైనవాడు. మనకు అన్నివిధాలా ఆత్మీయుడై వెలుగొందుతున్నవాడు' - అన్న ప్రేమ భావన నా యెడల వారిలో పెల్లుబికింది. ఇక వారు నా వయస్సును పట్టించుకోలేదు. నా పుట్టుకను పట్టించుకోలేదు. లోకరీతిలో నా కర్మాచరణపు స్థాయి ఏమిటన్నది పట్టించుకోలేదు. ఏమీ, ఇంకేమీ పట్టించుకోలేదు. ఇవేమీ పట్టించుకోకుండా వారు సూటిగా నన్నే పట్టించుకున్నారు. నా ఆర్తిని పట్టించుకున్నారు. ఈ దీనునిపైన వాత్సల్యాన్ని ప్రసరింప జేసారు. ఈ అర్తునిపైన తమ కరుణను ప్రసరింపజేసారు. నన్ను స్పృశించారు. తమ అక్కున చేర్చుకున్నారు. నాకు దివ్యస్పర్శను అందించారు. ఈ సృష్టి రూపంలో అంతు పట్టకుండా వ్యక్తమవుతున్న దేవుని మహిమ యెడల నాకు కన్ను విచ్చుకునేటట్లు చేశారు. నాకు జ్ఞాననేత్రాన్ని అనుగ్రహించారు. నాకు కావలసినదేదో నాకు ఉపదేశించారు.

ఉపదేశించి, నా వెన్ను నిమిరి, నన్నాశీర్వదించి వారటు వెళ్లారో లేదో - ఇక నాకు ఈ విశ్వమే విష్ణువై, ఈ విశ్వమందలి సర్వజీవరాసుల ప్రవర్తనలు ఆ వాసుదేవుని లీలా విశేషమై, ఆ ప్రవర్తనల కావల నిలచినది తేజోమయమైన నారాయణ స్వరూపమై గోచరించసాగింది. నానుండి వెలువడుతున్న సర్వ కర్మలూ ఆ దైవానికి సమర్పణగా నడచిపోసాగాయి. మహర్షీ! ఈ చిత్రం నీకు తెలిసిందే కదా! కర్మ మనకొరకని అనుకొని ఆచరించినప్పుడు, అది మనను బంధిస్తున్నది. ఆ కర్మయే దైవానికి సమర్పణగా ఆచరింపబడినప్పుడు, మనకు సకల బంధముల నుండి విమోచనాన్ని అనుగ్రహిస్తున్నది. అంతేకాదు. కర్మలలా దైవానికి సమర్పణగా ఆచరింపబడుతున్నప్పుడు సృష్టి రూపంలో వ్యక్తమవుతున్న ఆ దైవం సంతోషిస్తాడు. ఆ సంతోషంతో మన మనస్సును

స్పృశిస్తాడు. అది వికసిస్తుంది. ఆ వికాసాన్నే మనం జ్ఞానం అంటున్నాం. ఆ సంతోషంతో మన హృదయాన్ని మీటుతాడు. మన హృదయం అతడిలో కరిగిపోతూ పరవశిస్తుంది. దానినే మనం భక్తి అంటున్నాం. ఇలా దినచ ర్యను సృష్టి రూపంలో ఉన్న దైవానికి సమర్పణగా ఆచరించడం వల్ల ఇటు జ్ఞానం, అటు భక్తి కూడ లభిస్తున్నాయి. కర్మ, జ్ఞానం, భక్తి వీని త్రివేణీ సంగమంగా ఈ జీవితం రూపొందుతూ ఉన్నది. ఇలా దేవుని స్మరణలో, దేవునికి సమర్పణంగా జీవితాన్ని నడపడంతో విశ్వం రూపంలో ఉన్న విష్ణువు తానుగా నాకు దగ్గరై, నన్ను తానుగా చేసి నిలబెట్టుకున్నాడు. వ్యాసమహర్షీ! ఈ నీ జీవితమూ అట్టిదే కదా! అలా నిలబెట్టబడినట్టిదే కదా!

మహర్షీ! భాగవత మూర్తుల దివ్యసన్నిధి నన్నెంతగా తీర్చిదిద్దిందో గమనిం చావా! నన్ను ఏ స్థితినుండి ఏ స్థితికి కొనిపోయిందో గ్రహించావు కదా! ఆ పుణ్యమూర్తుల దివ్యసన్నిధే ఈనాడు నేను నారదుడనై నిలబడటానికి కారణం. భాగవత మార్గాన పయనించిన నరుడు ఎంతలో ఎంతగా తరించి నిలబడతాడో గ్రహించుకోవడానికి ఈ నేనే ఒక ఉదాహరణ నీకు. ఏది మహర్షీ. నీనుండి ఆ భాగవత రచన ఎంత త్వరలో ప్రారంభమైతే అంత మంచిది ఏమంటావు?"

నారదుని కథ విని ఆశ్చర్యానంద భరితుడై ఆ కథను మరింతగా కన్ను లకు కట్టించుకునే ప్రయత్నంలో ఉన్నాడు వ్యాస భగవానుడు.

శుకయోగి ఇలా చెబుతూ ఉంటే నేనూ అలాంటి ప్రయత్నంలోనే ఉన్నాను అన్నట్లుగా చూస్తున్నాడు పరీక్షిత్తు.

## అమ్మా ఇప్పటికీ—

నారదుని పూర్వజన్మ గాథను కన్నులకు కట్టించుకునే ప్రయత్నాన్ని చేస్తూ ఉన్న వ్యాసభగవానుడు ఆ కథ పరిపూర్ణంగా కన్నులకు కట్టడానికి మరికొన్ని వివరాలను నారదమహర్షి నుండి రాబట్టవలసి ఉన్నదని గ్రహించుకున్నాడు. వెంటనే నారద మునీంద్రునితో ఇలా అన్నాడు. "నారద మునీంద్రా! నీ పూర్వ జన్మ గాథ అపూర్వంగా ఉంది. ఆశ్చర్యానందాలకు నా మనస్సును లోను చేస్తూ ఉన్నది. నీవు దాసీ పుత్రుడుగా జన్మించడమా? అందునా చిన్న వయ స్సున భాగవతుల సేవయా? పరిచారకునిగా పనిచేస్తూ, పరమ గురువుల కృపకు పాత్రుడగుటయా? ఓహో! ఏమి సన్నివేశములు! ఒకదానిని మించి

ఒకటి ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉన్నవి. అదిసరేగాని, చిన్నవయస్సున ఉపదేశాన్ని పొందిన నీవు, ఆ చిన్న వయస్సులోనే పండిపోయావు కదా! శరీరమూ చిన్నది. నీవు పొందిన దర్శనమూ దొడ్డది. వృద్ధుని పోకడలతో ఉన్న మనస్సును కలిగిన నీవు ఈ చిన్ని శరీరాన్ని అటుపైన ఎలా నడిపావో, జీవితాన్ని దానితో ఎలా గడిపావో నీచేత వివరంగా చెప్పించుకుని వినాలనిపిస్తూ ఉన్నది. అంతేకాదు. అప్పుడెప్పుడో జరిగిన ఈ సన్నివేశాలన్నీ నీ కిప్పటికీ ఎలా గుర్తుండిపోయాయో కూడా, నీవు చెప్పగా తెలుసుకోవాలని ఉన్నది. మునీంద్రా! నీ దివ్యగాథలోని ఆ లోతుపాతులన్నింటినీ నాకు తృప్తి కలిగేటట్లుగా వివరించి చెప్పవయ్యా!"

తన మనస్సులోని మాటను చెప్పి, చెవులు పెద్దవి చేసుకుని వేచియున్న వ్యాసుని వైపు ఆదరంతో చూస్తూ, నారద మునీంద్రుడు ఇక ఇలా చెప్పసాగాడు. "మహర్షీ! నీ కోరిక నాకు ముచ్చటను కలిగిస్తున్నది. అసలు ఏ కథను గమనించడంలోనైనా ఒక విలక్షణమైన, విశిష్టమైన దృష్టి నీది. యుగాల తరబడి ఈ భూమిపైకి దిగివచ్చే మానవ జాతులకు మేలుకొలుపు నందించడానికై వ్యక్తమవుతున్నవాడివి నీవు. నీవు ఏది అడిగినా ఆ మానవజాతుల తరఫున, వారి మేలు కొరకే అడుగుతావు. మహర్షీ! ఈ నా కథను నీకు చెబితే, ఈ భూమి మొత్తానికీ చెప్పినట్లే! కనుక, నీవెందుకని అడిగావో, ఏ సూక్ష్మాంశాల కొరకు అడిగావో గమనించుకొనిన వాడనై, ఇక నా కథను చెబుతున్నాను విను." "ఆ యోగిజనులు నాకా దివ్యస్థితిని అందించేటప్పటికి, నా వయస్సు అయిదేళ్ళు. మా అమ్మ ఆ వేదవాదుల ఇంటిలో దాసిగా పనిచేసేదని చెప్పానుకదా! తాను చేయవలసిన పనిని ఎంత శ్రద్ధగా చేసేది అన్న అంశాన్ని గూర్చి నేనెంత చెప్పినా అది తక్కువే అవుతుంది. ఒకలా చెప్పాలీ అంటే పనియందు ఆమెకు గల శ్రద్ధయే నాయందు కూడా ప్రవేశించి, నన్ను భాగవత మూర్తులకు దగ్గరచేసి, వారి కృపకు పాత్రుడనయ్యేటట్లుగా చేసింది అని చెప్పవచ్చు. ఇంకొక చిత్రమేమిటంటే, మా అమ్మ ఎప్పుడూ వారి ఇంట పనిమనిషిగా ప్రవర్తించలేదు. వారింటిలో ఒక భాగమై, వారి హృదయాలకు చేరువై, ఈ పని ఆ పని అని అనక, వారికి ఏ పని ఏ వేళకు ఏ లాగున అవసరమో ఆ లాగున తానే గమనించుకొని మరీ చేసేది. చేరదీసిన వారిని సేవించడంలో ఆమె పొందిన ఆనందమున్నదే ఆ లక్షణమే యోగిజనుల సేవలో బాల్య చాపల్యానికి అతీతంగా నన్ను నిలబెట్టగలిగింది. ఇంతవరకు కథ బాగానే ఉంది. ఇటుపైన కథలోనే నాకు ఎనలేని నిపుణత అవసరమైంది.

మా అమ్మకు నేనంటే విపరీతమైన మమకారం. ఇంకా చెప్పాలీ అంటే దానిని వ్యామోహమని కూడా అనవచ్చు. వేదవాదుల ఇంటి దగ్గర అంత పనిచేసినా అలసట అనేది కాదు. విశ్రాంతిని అపేక్షించేదికాదు. ఇవతలకు రాగానే నేనెక్కడున్నానా అని తనువెల్ల కనులు చేసుకుని నా కొరకు వెత కసాగేది. ఇక నా సేవలో మునిగిపోయేది. నా స్నానమనీ, నా పానమనీ, నేను చిక్కిపోతున్నాననీ, నేనిక ఎదిగిరావాలనీ ఒకటే తపన ఆమెకు. అలా దగ్గరకు తీసుకునేది. మాటిమాటికి దగ్గరకు తీసుకునేది. వెన్ను నిమురుతూ, జుట్టు దువ్వుతూ, కన్నులు తుడుస్తూ, ముక్కులు సరిచూస్తూ, అలా ఏదో ఒకటి చేస్తూ, నన్ను తన గుండెలకు అదుముకుంటూ, అలా నాతోనే నేనే ప్రపంచంగా ఉండిపోయేది. ఆమెకు నేనే లోకం. కానీ, నేను ఏ లోకంలో ఉన్నానో గమనించ గలిగిన స్థితిలో ఆమె లేదు. అందుకు నాకు బాధ కలుగలేదు. కారణం, నేను పొందిన బోధ అటువంటిది కనుక.

యోగి జనులు ఈ విశ్వాన్ని విష్ణువుగా చూడటమెలాగో నాకు ఉపదేశించి వెళ్లారని చెప్పాను కదా! ఇక నేను విశ్వాన్ని విష్ణువుగా చూడటం ప్రారంభించాను. కంటికి కనిపిస్తున్న వ్యక్తులనూ, వస్తువులనూ, పశుపక్ష్యాదులనూ, ఒకటేమిటి! సకల నామరూపాలనూ ఆ విష్ణుదేవుని వ్యక్త రూపాలుగానే భావించి దర్శించడం మొదలు పెట్టాను. ఒకలా చెప్పాలీ అంటే విశ్వాన్ని విష్ణువుగా పొడకట్టించుకునే దివ్య సాధనకు మా అమ్మతోనే నేను శ్రీకారం చుట్టానని చెప్పాలి. ఎందుకనీ అంటే, నాతో ఎక్కువగా ఉండేదీ, నాకు దగ్గరగా ఉండేదీ, నా జీవితంతో సూటిగా ముడిపెట్టుకుని ఉన్నదీ మా అమ్మే కనుక. నాకనిపించింది కదా 'నీవు నన్ను చూడగలవా?' గుర్తుపట్టగలవా? నాతో అనుసంధానం కుదుర్చుకోగలవా?' అని ప్రశ్నిస్తూ, మనకొక అవకాశమిస్తూ, మనతో దాగుడుమూతలు ఆడటానికే దైవం బంధుమిత్రాదుల రూపంలో దగ్గరవుతూ ఉంటాడని. దాగుడుమూతల ఆటలో ఏం జరుగుతుంది? ఆ అసలు వాడు దాక్కొని ఉంటాడు. ఏ తలుపు చాటునో, ఏ చెట్టు మాటునో. మనం అతనిని యుక్తిగా పట్టుకోగలగాలి. అలాగే, బంధుమిత్రాదుల దేహాల మాటు నుండి అతడు మనకు చేరువై మనతోనే వర్తిస్తున్నాడు. అతడిని పట్టుకునే ఆ యుక్తి మనకు తెలియాలి. కనుక, సాధన పేరిట బంధు మిత్రాదులను వదులుకోకూడదు. వారిని వదులుకుంటే ఆ దైవాన్ని చూడగలిగిన అవకాశాన్ని కూడా వదులుకున్నట్లే. పైగా, ఈ అవకాశం ఆదైవం మనకోసం తానుగా రూపొందించినది. దానిని వదులుకోవడమంటే అది వెర్రితనమే అవుతుంది.

అందుకని ఉపదేశం పొందిన తరువాత, కూడ నేను మా అమ్మను వదులుకోలేదు. యోగిజనుల చెంత పరిచారకుడనై, నా పాత్రను ఎలా తృప్తిగా పోషించుకున్నానో, అలా మా అమ్మ చెంత కూడా ఆమెకు బిడ్డనై, అన్ని విధాలా ఆమెను తృప్తిపరచ దలుచుకున్నాను. ఆమెలో విష్ణువును చూస్తూ, నేనూ తృప్తి చెందడం నేర్చుకున్నాను.

మా అమ్మలో నేను విష్ణువును చూసే ప్రయత్నం చేసేవాడిని. మా అమ్మ నన్ను తన కొడుకుగా చూసుకుంటూ మురిసిపోతూ ఉండేది. ఆమె మురిపెం నాకు అడ్డురాలేదు. నా ప్రయత్నం ఆమెకు అడ్డుకాలేదు. నేను కాసీయలేదు. నేను ఆమెలో విష్ణువును చూడటం నాకోసం, నా సాధన కోసం. అలా నేను ఆమెలో తల్లిని గాక విష్ణువును చూస్తున్నానని ఆమెకు తెలియవలసిన అవసరమేమున్నది? అందుకనే నేను చేస్తున్న సాధనను గూర్చి ఆమెకు ఏ మాత్రం చెప్పలేదు. చెబితే ఆమె కలవరపడవచ్చు. 'అయ్యో! నా బిడ్డ నన్ను తల్లిగా చూడటం లేదా?' అని ఆమె బాధకు లోనుగావచ్చు. విష్ణువే తల్లిగా ఎలా వ్యక్తమవుతున్నదీ, ఎలా నన్ను సాకుతున్నదీ బోధ పరచుకుంటున్నానని నేనెంతగా చెప్పినా, ఆమె మనస్సుకది బోధపడక పోవచ్చు. నేనలా చూడటం ఆమెకంతగా రుచింపక పోవచ్చు. నా అభిరుచికి మరొకరు అడ్డు కాకూడదని నేననుకుంటున్నప్పుడు, మరొకరి అభిరుచికి, 'అట్లుగాదు ఇట్లు' అని నేను అడ్డు పడవచ్చునా? అయినా ఇప్పుడు అడ్డు పడవలసినంత అవసరం ఏమి వచ్చింది? ఎవరి స్థాయిని బట్టి వారి అభిరుచులు ఉంటాయి. ఎవరు ఏ స్థాయిలో ఎంతకాలముండాలన్నది నిర్ణయించేందుకు ఆ పైన ఒకడు ఉన్నాడు. మనలను ఉద్ధరించినట్లే, అతడు అందరినీ తగిన సమయంలో ఉద్ధరించగలడు. కనుక, నేనామె మమకారానికి అడ్డుపడలేదు. నా విష్ణు దర్శన ప్రయత్నానికి ఆమె వ్యామోహం అడ్డురాలేదు. ఎవరి సాధన వారికి జరుగుతున్నది. ఎవరి తృప్తి వారికి దొరుకుతున్నది. నాకనిపించింది కదా! - ఎదుటివారు మమకారాలూ, అపేక్షలతో వ్యామోహితులవుతున్నా, లేక రాగద్వేషాలతో వివశులై పోతున్నా వారిలో కూడ విష్ణువును పొడగట్టించుకోవడం ఎలాగో, నాకు నేర్పడానికే ఆ దైవం నా తల్లి రూపాన్ని ధరించి, నాతో అలా తిరుగాడుతున్నాడని.

సాధన ప్రారంభమైన తొలినాళ్ళలో మా అమ్మతో కలిసి ప్రవర్తిస్తున్నప్పుడు కాసేపు విష్ణువు గోచరించేవాడు. కాసేపు మా అమ్మ గోచరించేది. మళ్లీ కాసేపు విష్ణువు గోచరించేవాడు. ఇలా కొంతసేపు విష్ణువూ, మరికొంత

సేవు మా అమ్మా గోచరించేవారు. విష్ణువు గోచరించిన సమయం కన్నా, మా అమ్మ గోచరించిన సమయమే ఎక్కువ ఉండేది. సాధన జరుగుతున్నది. రోజులు గడుస్తున్నాయి. అమ్మ గోచరించే సమయం కన్నా, అమ్మ విష్ణువుగా గోచరించే సమయం పెరుగుతూ వస్తున్నది. అరవై పాళ్ళు విష్ణువు, నలభై పాళ్ళు అమ్మ, డెబ్బైపాళ్లు విష్ణువు, ముప్పయి పాళ్ళు అమ్మ, ఇలా నడిచి నడిచి, రోజు మొత్తం మీద నూటికి నూరుపాళ్ళు అమ్మగా ఉన్న విష్ణువే గోచరించే స్థితి వచ్చింది. అంతే! ఇక మా అమ్మ దేహాన్ని చాలించింది. 'చాలు. నీ దర్శనం పూర్తయింది.' - అన్నట్లుగా! బంధుమిత్రాదులు మనతో ఎంతకాలం ఎలా ఉంటారన్నది మనలో జరుగవలసిన సాధనను బట్టి ఏర్పాటు అవుతుందని నాకు తెలిసిపోయింది.

ఆరోజు రాత్రే మా అమ్మ పశువులను పాలు తీయడానికని పెరటిని దాటి వీధివెంట వెళుతున్నది. అలా వెళుతూ ఉండగా నల్లత్రాచు ఒకటి, ఆమె కాలిపై కాటువేసింది. అంతే! మా అమ్మ పడిపోయింది. ఆ కాల సర్పాన్ని అలా చూస్తున్నప్పుడు నాకేమనిపించిందో తెలుసునా, కాలమే సర్పమై కాటువేసి ఆమెనలా తీసుకుని వెళ్ళిందని. విషపు బాధకు తాళలేక మా అమ్మ గిల గిల లాడుతున్నద్. విలవిల లాడుతున్నది.

"అమ్మా! ఇప్పటికి ఇక సెలవు. మళ్ళీ జన్మలో నీ కింకా మంచి జన్మరావాలి. వ్యామోహాలకు అతీతంగా నిలబడి, అప్పటి నీ జీవితమంతా విష్ణుని సన్నిధిలో ఆయన లీలగా గడచిపోవాలి. నన్నింతగా పెంచావు. ఇంత చిన్న వయస్సులో మహోపదేశాన్ని పొందే మహత్తరమైన అవకాశాన్ని నాకు కలిగించావు. నీవు దాసిగా పనిచేసి, నేనా దేవుని సన్నిధిని పొందేటందుకు కారణమయ్యావు.

'అమ్మా! ఈ బంధాలు నీకిక కరిగిపోతాయి. ఈ వ్యామోహమిక ఈ మృత్యువుతోనే నిన్ను విడిచిపెడుతుంది. ఏ ఒక్కరి కొరకో కాక, అందరిలోని ఆ ఒక్కడి కొరకు జీవించగలిగిన దివ్య జన్మమిక నీకు లభిస్తుంది. అమ్మా! ఇక ఇప్పటికి సెలవు.' అంటూ ఆమెనిక సాగనంపాను."

వ్యాసమహర్షి కనుల వెంట అనుభూతి బాష్పాలు రాలుతున్నాయి. నారద మునీంద్రుని చేయి అప్రయత్నంగా మహతిని సమీపిస్తున్నది.

శుకయోగి నుండి ఈ ఘట్టాన్ని వింటున్న పరీక్షిత్తుకు ఒడలు తెలుస్తున్నట్లు లేదు.

# మహానుభూతి

అనుభూతి బాష్పాల మధ్య నుండి అలా నారద మునీంద్రుని వైపు చూస్తూ, ఇలా అన్నాడు వ్యాసమహర్షి: "మునీంద్రుడా! నీవు వివరిస్తున్న ఈ నీ గాథ అమృతోపమానంగా ఉన్నది. నీవు చెప్పిన మీ అమ్మతోడి నీ కథ ఈ భూమి జనులకు ఎల్లకాలము గుర్తుంచు కోవలసిందిగా ఉన్నది. నిత్య జీవిత నిర్వహణలో బంధు మిత్రాదులతో కూడి ప్రవర్తించేటప్పుడు ఆ బంధు మిత్రాదుల రూపంలో వ్యక్తమవుతున్న విష్ణువును ప్రసన్నం చేసుకోవడమెలా గన్నది, ఈ నీ గాథ చక్కగా తెలియ జెపుతున్నది. అందుకు గాను కావలసిన మూల సూత్రాలను చక్కగా ఉపదేశిస్తున్నది. ఆహా! ఈ నీ గాథ మరువ లేనిదీ, మరువ రానిదీ. మునీంద్రా! మరి అటుపైన నీ జీవితక్రమం ఎలా సాగిందో వివరిస్తే వినాలనిపిస్తూ ఉన్నది. వివరించవూ!"

'తప్పక వివరిస్తాను' అన్నట్లుగా చూస్తూ, నారద మునీంద్రు డిలా చెప్ప సాగాడు:

"మా అమ్మలో విష్ణుదేవుని దర్శనం నిండుగా పొందిన తరువాత, ఇక విశ్వరూపంలో ఉన్న విష్ణుదేవుని ప్రసన్నం చేసికోవడం జరుగవలసి యున్నది. అని అనిపించి, ఇంటిని విడిచి ఉత్తర దిశగా ముందుకు సాగాను. కేవల మానవ రూపాలలోనే గాక, సకల చరాచర జగత్తుగా వ్యక్తమవుతున్న ఆ విష్ణు దేవుని దర్శనాన్ని పొందే అభ్యాసాన్ని చేస్తూ, అలా ముందుకు సాగుతున్నాను. పల్లెలు, పట్టణాలు, గ్రామాలు, నగరాలు దాటుకుంటూ సాగి పోతున్నాను. పశువుల మందల వాళ్లను, ఎరుకల, చెంచుల, కోయల గూడాలను దాటు కుంటూ సాగి పోతున్నాను. వనాలను, ఉపవనాలను దాటి ధాతువులతో జేగురు రంగుతో వింతగా ప్రకాశించే మహా పర్వతాలను ఆరోహిస్తూ సాగిపో తున్నాను. ఇక అక్కడికి చేరేటప్పటికి నరసంచారం సద్దుమణిగింది. కంటి కెదురుగా కారడవులు కనిపించాయి. చెట్ల కొమ్మలను విరిచి, వాటిని చిందర వందరగా త్రొక్కుతూ, ఏనుగుల బృందాలు సాగిపోయే దారుల వెంట నడి చాను. అలా నడుస్తూ ఉండగా బాటసారులకు అలసటను తీర్చే తటాకాలు కొన్ని గోచరించాయి. 'ఆహా! భగవంతుడు జీవులకు ఎక్కడ కావలసిన ఏర్పాట్లు అక్కడే చేసి పెడతాడు కదా!' అనిపించింది. ఇంకొంచెం దూరం వెళ్ళే

టప్పటికి నీటి పక్షుల కూతలతో, తుమ్మెదల నాదాలతో, ఇంపు కొలిపే కోనేళ్లు కనిపించాయి. అక్కడికి వెళ్లేటప్పటికి నాకు ఆకలి అనిపించింది. ఒక నది నుండి రూపుకట్టు కుంటున్న కోనేటిలో స్నానం చేసి, శుచినై, ఆ తేట జలాలను కడుపు నిండ త్రాగాను. ఆకలి తీరింది. అలసటా తీరింది.

'మళ్లీ ముందుకు సాగటం మొదలు పెట్టాను. వెళుతున్న కొద్దీ అరణ్యం దట్టమైంది. ఎలుగు బంట్లు, తోడేళ్లు, అడవి పందులు, అడవి దున్నలు, ముండ్ల పందులు యథేచ్ఛగా సంచారం చేస్తున్నాయక్కడ. ఇంకొక ప్రక్కనుండి పట్టపగలే గుడ్లగూబ లరుస్తున్నాయి. అరణ్యం పగటికి ఏమాత్రం చోటు పెట్ట నంత దట్టంగా ఉన్నది. ఆ దట్టమైన అరణ్యంలో అలాగే దారి చేసుకుంటూ సాగుతున్నాను. గుర్రు పెడుతున్న పులులు కనిపించాయి. తిరుగాడుతున్న ఖడ్గ మృగాలు కనిపించాయి. అరణ్యం సృష్టిస్తున్న ఆ చిమ్మ చీకటిలో అలా అలవో కగా సాగిపోతున్న నల్లత్రాచులు, కొండ చిలువలు కనిపించాయి. అడవి అతి భయంకరంగా ఉంది. ఆ భయంకరత్వంలోనే ఒక ఆనందముంది. ఓహో! విష్ణుదేవుడు ఇన్ని విధాలైన జీవరాసులుగా వ్యక్తమవుతున్నాడు కదా! ఇంకొ కలా చెప్పాలీ అంటే, ఆ విష్ణుదేవుని ఇన్ని రూపాలను మనం చూడ గలిగాం కదా! - అని నాకు ఆనందం కలిగింది. అర్జునుడు కృష్ణదేవుని విశ్వరూపాన్ని చూస్తున్నప్పుడు, భయపడుతూనే ఆనందించాడు చూడు. అలా ఆనందించాను నే నప్పుడు.

"ఇంకొంచెం దూరం వెళ్లేటప్పటికి ఇక నాకు ఎటూ సాగలేని స్థితి ఏర్పడింది. ఆ ప్రాంతమంతా వట్టివేళ్ల గడ్డితో నిండిపోయి ఉంది. అల్లంత దూరాన పెద్ద ఎత్తున వెదుళ్లు కనిపించాయి. ఆ వెదుళ్లకు రకరకాల తీగ లల్లుకొని గుహలు గుహలుగా గోచరించాయి. మహర్షీ! ఆదృశ్యం నాకెలా కనబ డిందో చెప్పనా! ఆ వెదుళ్లు మన దేహాలలోని అస్థి పంజరాల్లా గోచరించాయి. అల్లుకున్న ఆ తీగలు అస్థి పంజరం చుట్టూ తిరుగుతున్న నరాల సమూహంగా గోచరించాయి. కనబడుతున్న ఆ తీగల గుహలు మనలోని గుండెలను తలపి స్తున్నాయి. ఓహో! మన శరీర నిర్మాణం కూడా ఇలాగే జరుగుతోంది కదా! అనిపించింది నాకు. విష్ణు దేవునికి ఈ మన శరీర మెలాంటిదో, ఈ సృష్టి శరీరం కూడా అలాంటిదే కదా! కనుకనే ఆ శరీరానికీ, ఈ శరీరానికీ అలా పోలికలు కనిపిస్తున్నాయి. అనిపించింది నాకు. ఆ దృశ్యాన్ని చూస్తూ, అలా ఉండి పోయానిక నేను. సృష్టి శరీరం, ఈ మానవ శరీరం - ఈ

రెండింటినీ ధరించి, నిలబెడుతున్నాడు ఆ విష్ణుదేవుడు, ఇలా నా భావన సాగుతూ ఉండగా, ఎదురుగా ఒక రావిచెట్టు కనిపించింది. ఆ రావి చెట్టు క్రింద కొంత సమతలమైన ప్రదేశం ఉన్నది. ఇక అంతే. నేనా ప్రదేశంలో అలా కూర్చుండి పోయాను.

"రావి చెట్టు క్రింద కూర్చుండి పోయిన నా దృష్టి ఒక్కసారిగా నా గుండెగుహావైపు మళ్లింది. ఈ గుండెలో కొలువుతీరి దీనిని కొట్టుకునేటట్లుగా చేస్తున్న వాడు, ఈ ఊపిరి తిత్తులను కదిలే టట్లుగా చేస్తూ, శ్వాస గతులను నడుపుతున్నవాడు, ప్రాణ స్వరూపుడై ఈ దేహాన్ని సజీవంగా నిలిపి నడుపుతున్నవాడు, 'నేను నేను' అనిపిస్తున్న నాకు ఆశ్రయమై నన్నిలా వ్యక్తం చేస్తూ నన్ను జీవిగా నిలబెడుతున్నవాడు, ఎవడో అతనిని ప్రసన్నం చేసుకోవా లనీ, అతడి సాక్షాత్కారం నిండుగా పొందాలనీ నాకప్పుడు అనిపించింది. ఇక అతడిని నేను విన్న రీతిగా ఉపాసించసాగాను. ఎలా విన్నాను నేను అతడిని? ఉచ్ఛ్వాస నిశ్వాసల నడుమ నుండి వ్యక్తమవుతున్న ఓంకార స్వరూపుడిగా విన్నాను. ఆ ఓంకారాన్నే, ఆ ప్రణవాన్నే ఇక ఉపాసించసాగాను. గొంతెత్తి ఓంకారాన్ని పలుకుతున్నాను. చెవులార ఓంకారాన్ని వింటున్నాను. హృదయ మందలి ఓంకారమే, గొంతు నుండి వ్యక్తమవుతూ, చెవుల ద్వారా మన స్సును సోకుతూ, మరల హృదయం లోనికి చేరుకుంటున్నట్లుగా అనుభవమైంది నాకు. ఈ చేరుకునే లోపల ఈ అనబడి, వినబడి చేరుకునే లోపల దేహం తేలిపోతున్నది దూది పింజెలా. మనస్సు మురిసిపోతున్నది. మూగపోతున్నది. ఉచ్ఛ్వాస, నిశ్వాసల మీదుగా, హృదయం వైపుకు అలా అలవోకగా సాగిపో తున్నది. మహర్షి! ఇంక అంతే! కొంత సేపటి పాటు నాకు ఏమీ తెలియ లేదు. అది ఎంత సేపటి పాటో నేను చెప్పలేను. చెప్పేటందుకు మనస్సు మనస్సుగా లేదక్కడ. అది ఏ వెలుగు నుండి దిగి వచ్చిందో, ఆ వెలుగే అయిపోయింది అది కూడా!

"ఎంతసేపు అలా ఉండి పోయానో తెలియ లేదు. కొంత సేపటికి మనస్సు లేచి, ఆ దివ్యస్థితిని గమనించే ప్రయత్నం చేసింది. ఆనందం అశ్రువులై, కన్నుల వెంట ధారలుగా కురియ సాగింది. ఒడలెల్ల పులకించింది. అంతే. ఆ అనుభూతి అట్టే మాయమై పోయింది. నాకు పిచ్చెత్తి పోయి నట్లయింది. దైవము నాయందు నిండినాడు. నేనట్లే ఉండ నివ్వ వచ్చును కదా! నాకు చూడవలెననిపించుట ఎందుకు? చూడవలెనన్నచో మనస్సుండ

వలె కదా! మనస్సున్నచోట ఇక అద్వైవ మెట్లుండ గలదు? చిత్ర మేమి టంటే - నిండుతున్న దైవాన్ని నిండనీయక, తనను కూడా తానుగా రూపొందించుకుంటున్న దైవాన్ని రూపొందనీయక, మనస్సు ఏ కొంచెమో తాను మిగిలి ఉండాలని కోరుకుంటుంది. తాను ఏదో ఒక మూలనైన ఉండాలని, 'అతడి' ని అనగా ఆ దైవాన్ని అక్కడ నుండి ఆమూలాగ్రం చూడాలని అభిలషిస్తుంది. మనస్సు తనకన్న వేరుగా ఉన్నప్పుడు, ఉండ దలచి నప్పుడు, దైవానికి పూర్ణమైన స్థితి అక్కడ ఎలా లభిస్తుంది? కనుక దైవం - 'నీ మనస్సును నీవు అట్టే పెట్టుకో. నా నిజస్వరూపాన్ని నేను ఉపసంహరించు కుంటున్నాను. అంటాడు,' అప్పుడు. అతడిని చూడాలన్న, అనుభవించాలన్న కోరిక వలన వచ్చిన ఇబ్బంది ఇది. అంతే. ఆ కోరిక కూడ కరిగిపోయినప్పుడే నిజమైన విష్ణు స్థితి మనకు లభించేది. కోరిక ఏదైనా కోరికే కదా! పదార్థాన్ని కోరితేనేం, పరమార్థాన్ని కోరితే నేం? కోరకుండానే, కోరవలసిన అవసరం లేకుండానే అతడు మనని అనుగ్రహిస్తాడని తెలిసి కూడా మనస్సెందుకో కోరుతుంది. మరి కోరకుండా ఉండలేక పోతుంది.

"మహర్షి! సాధకుడు ఈ విషయంలో జాగ్రత్తపడాలి సుమా! దైవానికి తగిన విధంగా ప్రవర్తించడంలో శ్రద్ధ కలిగి ఉండాలి తప్ప, అతడిలా చేస్తే బాగుండుననీ, అలా చేస్తే బాగుండుననీ, ఇలా కనిపిస్తే బాగుండుననీ, అలా అనుభవానికి వస్తే బాగుండుననీ కోరికలు కలిగి ఉండటం మంచిది కాదు. మన కెలా చేయాలో, మన కెలాంటి అనుభవం ఈయాలో అతనికి తెలి యదా? అతడీయడా? అతడిని మనం అడగ వలసిన స్థితిలో పెట్టుకుంటాడా అతడు? కనుక, దైవాన్ని కోరవలసిన అవసరమే లేదని మనకు తెలియాలి. కోరికన్నది మనలో కరిగి పోవాలి. ఇదిగో. ఈ అంశంలో కొంచెం ఏమ రుపాటు పడేటప్పటికి అనుగ్రహించ వచ్చిన దైవాన్నే నిలుపుకోలేని స్థితిలో పడిపోయాను నేను. అతడిలో ఒదగలేకపోయాను. అతడు కాలేక పోయాను. ఇక అతడెందుకు నిలుస్తాడు? ఎలా నిలుస్తాడు?

"రుచి చూడకుండా ఉంటే అప్పుడెలా ఉండేదో, రుచి చూస్తుండగా వెళ్ళి పోతే ఇక నేను తట్టుకోగలనా? పిచ్చెత్తినట్లయింది. ఇటు నుండి అటు, అటు నుండి ఇటు, ఎటు నుండి ఎటో పరుగులెత్తాను. ఆక్రందించాను. చేతులెత్తి ఆక్రోశించాను. అతడిని మరల మరల పిలిచాను. మరొక్కసారి కనబడమన్నాను. ఈ సారి పారబడనన్నాను. 'నీలో ఒదిగి పోతానూ, కరిగి

పోతానూ, నీ కన్న వేరుగా ఉండలేను. ఈ వియోగాన్ని భరించలేను. ప్రభూ! యోగ స్థితి నుండి వియోగ స్థితికి ఇలా నన్ను వదిలి వేయకు ప్రభూ! నన్ను కరుణించు. కనికరించు. నీ కర మందించు. ఏదీ! ఒక్కసారి కనిపించు. నేను నీవనిపించు. ఆ అనుభుతిలో నన్ను ఉంచు. ఆ అనుభూతిగా నన్ను మిగుల్చు. - అని ఎన్నివిధాల వేడుకున్నానో ! ఎన్ని విధాలుగా నా వేదనను నివేదించు కున్నానో! మహర్షి! గ్రహించగలవు కదా అప్పటి నా స్థితిని!"

వ్యాస భగవానుడు సజల నయనుడై చూస్తున్నాడు నారద మునీంద్రుని వైపు.

కన్నుల వెంట అశ్రుధారలు కదుతూ ఉండగా నిశ్చేతను డౌతున్నాడు, పరీక్షిత్తు, శుకయోగి నుండి ఆ ఘట్టాన్ని వింటూ.

## మహతి గానం

సజల నయనుడై ఆర్తితో తన వంక, 'అటుపైన ఇంకేమి జరిగింది మునీంద్రా!' అన్నట్లుగా చూస్తున్న వ్యాస భగవానునికి తన కథను ఇంకా ఇలా వివరించాడు నారద మునీంద్రుడు:

"అప్పటి ఆ స్థితిలో నేను పొందిన ఆర్తి ఇంతింత కాదు మహర్షి! ఇంతింత కాదు. నేను ఏమి చేస్తున్నానో తెలియని స్థితి అది. నేనేమయి పోతున్నానో అంతుపట్టని పరిస్థితి అది. దృష్టి అంతా అతడి-పైనే. నాలోని నేను మొత్తం అతడి కొరకే చూస్తున్నాను. తానుగా వరించిన పెన్నిధిని పోగొట్టుకొని పిచ్చి వాడై తిరుగుతున్న మానవునిలా దీనుడనై, అలా నిలబడి ఉన్నాను. ఎక్కడకు వెళ్లాలి? ఏం చేయాలి? అయన కొరకే బయలు దేరాను. అయన నన్ను స్వీకరించాడు. నేను ఒదగ లేక పోయాను. అయన తప్పుకున్నాడు. నాకు తప్పు తెలిసింది. ఇలా ప్రవర్తించానేమిటి? అని సిగ్గుతో కుంచించుకు పోయాను. ఇలా పోగొట్టుకున్నా నేమిటి? అని ఆర్తితో విలవిలలాడి పోయాను. అయనను విడిచి ఉండ గలనా? అయనగా కాకుండా వేరుగా నిలబడి నేను మన గలనా?

"ఇంతలో ఆకాశం నన్ను పిలిచి నట్లైంది. తలను పెకెత్తి అటువైపు చూశాను. అతడే. అవిష్ణుదేవుడే. కాని ఆ ఆకృతి లేదు. ఆకాశమే తానై, నాతో మాట్లాడు తున్నాడు. ఆశ్చర్యానందాలతో ఆ పలుకులను చెవి యొగ్గి

విన్నాను. మహర్షీ! ఆ దేవుడు ఏమన్నాడో తెలుసునా? 'బాలుడా! ఇక నీవు దుఃఖించ వద్దు. దుఃఖించి కూడా ప్రయోజనము లేదు. ఇక ఈ జన్మకు నీవునా పరిపూర్ణ స్వరూపాన్ని చూడలేవు. కామంతో మొదలవుతున్న అరిష డ్వర్గానికి అతీతుడై, నిష్కామ కర్మ నిర్వహణలో నిపుణుడైన వాడు గాని మౌని కాలేడు. అలాంటి మౌని గాని నా స్వరూపాన్ని అందుకో లేడు. మౌని అంటే ఎవరు? మౌనము వహించిన వాడు. మౌనము దేని యెడల? అరిషడ్వర్గము యెడల? కర్మ ఫలముల యెడల? కష్ట సుఖముల యెడల? మౌనం మానసికం. మనస్సునకు మౌనం వహించడం చేతకావాలి. అది చేతకాని వాడు కుయోగి అవుతున్నాడు. నేను నీ చెంత వ్యక్తమయ్యాను. నీలో నిండి పోయాను. కాని, నన్ను చూడాలని కోరిక నీలో మొలిచింది. నీ మనస్సు మౌనం వహించ లేక పోయింది. నేను వ్యక్తం కావడానికి అక్కడ అవకాశం సన్నగిల్లింది. నేనిక నీకు గోచరించ లేదు. నీవు ఇప్పుడు ఆర్తి చెందుతున్నావు.

'కోరిక ఉండట మన్నది మంచిది కాకపోయినా, నీ కున్నది నాయెడల కోరిక. నీకు మంచే జరుగుతుంది. ఈ కోరిక ఏమి చేస్తుందో తెలుసునా? ఇక మిగిలిన కోరికలు లేకుండా, అవన్నీ కరిగి పోయేట్లుగా చేస్తుంది. సకల దోషాల నుండి నిన్ను విడిపిస్తుంది. అంతవరకు నీకీ కోరిక ఉపయోగకరమే. అలాంటి కోరిక కలిగిన నీకు ఒకసారి పూర్ణరూపంతో గోచరించాలీ అనిపించింది నాకు. గోచరించాను. ఆ అనుభూతిని నీకు అందించాను. ఈ పూర్ణరూప దర్శనం నా వైపునకు నీవు చేస్తున్న ప్రయాణపు వేగాన్ని పెంచుతుంది. నిజం చెప్పా లంటే నీ ప్రయాణ వేగం పెరగడానికే నేను నీకు గోచరించింది. నా కొరకని బయలు దేరావు. పెద్దల ఉపదేశం వలన, నీ నిరంతర సాధన వలన, కొంతలో కొంత నన్ను అనుభవానికి తెచ్చుకుంటున్నావు. అలాంటి నీకు, ఒక్కసారి పరిపూర్ణమైన అనుభూతిని రుచి చూపిస్తే, ఆ రుచి ఎరిగిన నీవు, నా వైపుకు మరింత వేగంగా సాగి వస్తావని, భావి కాలంలో నాకు సహకరిస్తావని, ఈ కథను ఇలా నడిపాను.

'నన్ను చూడాలనీ, నాతో ఉండాలనీ, నేనుగా ఉండాలనీ నీలో కలిగిన ఈ కోరిక ఉన్నదే - ఇది క్రమంగా భక్తిగా రూపొందుతుంది. కోరిక ఉన్న చోట కుతూహల ముంటుంది. అదే భక్తిగా రూపొంది నప్పుడు, ఆరాధనా భావం కలుగుతుంది. ఆ ఆరాధనా భావం సమర్పణ బుద్ధిని కలిగిస్తుంది. దానితో తనను తాను దైవానికి సమర్పించుకోవడంలోని ఆనందం తెలుస్తుంది.

ఆయనను పొందుదామని కాక, ఆయనకు సమర్పణ చెందుదామని గాఢంగా అనిపిస్తుంది. ఇక అక్కడ కోరికలకు తావుండదు. అరిషడ్వర్గానికి చోటుం డదు. కర్మఫలములను కోరవలసిన అగత్య ముండదు. ఈ జీవితానికి ఇది కావాలీ అనిపించదు. మనకేది కావాలో అతడికి తెలుసును ·అని తెలుస్తుంది. అతడి ప్రకారం జీవించడమే ఈ జీవితానికి పరమావధి అవుతుంది. బాల కుడా! ఇకపైన నీవు అలాంటి భక్తుడిగా రూపొంద బోతున్నావు. 'నా' భక్తునిగా రూపొందుతున్న నీవు ఎప్పటికీ నా భక్తునిగానే ఉంటావు. జన్మలు జరి గినా, ఈ భక్తి మాత్రం చెదరదు, సరికదా మరింత గాఢత్వాన్ని సంతరించు కుంటుంది. ఇప్పుడు ఈ మిగిలిన జీవిత మంతా నా సేవగా నడిపి, ఇకపైన ఆ అనుభూతితో నీవు కారణ జన్ముడవై జన్మించ గలవు.

'బ్రహ్మకు ఈ పగటి కాలము పూర్తయి రాత్రి కాలము రాగలదు. అందుకు కొన్ని వేల సంవత్సరములు పట్టి గలదు. అప్పటి వరకు నీవు ఈ సృష్టిలోని నా లీలలను దర్శిస్తూ, నోరార వాటిని కీర్తిస్తూ వేచియుండ గలవు. అటుపైన బ్రహ్మకు రాత్రి. అనగా ఈ సృష్టికి ప్రళయం. ప్రళయ కాలంలో బ్రహ్మతో పాటుగా నీవు కూడ నాయందే వసింప గలవు. ఆ తరువాత రాబోయే సృష్టి కాలంలో శుద్ధ సత్త్వ స్వరూపుడవై, నావాడవై జన్మింప గలవు.

"ఆకాశం నుండి అవ్యక్త రూపుడై దైవం పలికిన ఆ పలుకులు నాకు ఎనలేని సంతోషాన్ని గలిగించాయి. మధుర గంభీరమైన ఆ వాక్కులను మళ్లీ మళ్లీ తలచుకుంటూ. నేను నా సాధనలో ముందుకు సాగాను. క్రమంగా అరిషడ్వర్గానికి అతీతుడనయ్యాను. భగవంతుని నిలుపు కొనలేక పోయాననే బాధనుండి, సిగ్గు నుండి బయట పడ్డాను. అతడు గోచరించడమే నా అదృష్ట మనుకున్నాను. మళ్లీ పలకడమే నన్ను కరుణించడ మని తెలుసుకున్నాను. అప్పటి నుండి నా కన్నులకు గోచరించే ఈ సృష్టిలోని ప్రతి చర్యనూ విష్ణు దేవుని లీలా విశేషంగా స్మరించి, భావించి, దర్శించాను. ఈ శేష జీవితం ఆ విశేష దర్శనం కొరకే వినియోగించాలన్నది విష్ణుదేవుని ఆజ్ఞయని గమనిం చుకున్నాను. 'సర్వం విష్ణుమయం. సకలం విష్ణుమయం.' అన్న అనుభూతిలో తేలియాడుతూ ఉండగా ఒకానొక క్షణంలో మృత్యువు మెరుపు వలె మెరసి ఆ నా దేహాన్ని స్వీకరించింది. అంతవరకు నా సాధనకు అమితంగా ఉపయోగ పడిన ఆ ఉపాధిని మృత్యుదేవతకు కృతజ్ఞతతో అప్పగించాను. విష్ణుదేవుని దయనలన సూక్ష్మలోకాలకు సంబంధించిన దివ్య శరీర మొకటి నాకు లభిం

చింది. ఆ దివ్య శరీరంతో ఎక్కడెక్కడ భాగవత జనులుంటే, అక్కడక్కడ నేనుండ సాగాను. భాగవత మూర్తుల దేహాలలో బసచేస్తూ, భాగవత దేహాన్ని పొందిన వాడి నయ్యాను. భాగవత మూర్తుల శరీరాలే నాకు బసలు కావడంతో, నాకు వేరే శరీరం యొక్క అవశ్యకత లేక పోయింది. విశ్వరూపంలో విష్ణు రూపాన్ని దర్శించడమనే నా సాధన నిరాఘాటంగా సాగి పోయింది.

"ఇంతలో ప్రళయం వచ్చింది. ప్రళయ కాలమనే సముద్రంలో శయనించి ఉన్న నారాయణుని దర్శించు కున్నాను. బ్రహ్మదేవునితో కలసి అయన లోనికి చేరుకున్నాను. వేయి యుగాలు గడిచాయి. నారాయణుని నుండి సృష్టి సంకల్పం జరిగింది. బ్రహ్మదేవుడు వెలువడ్డాడు. బ్రహ్మదేవుని నుండి మరీచాది ఋషులు జన్మిస్తూ ఉండగా, వారితోపాటుగా నేను కూడా జన్మించాను. బ్రహ్మ మానస పుత్రుడ నయ్యాను. బ్రహ్మయందు చరించడమే వ్రతంగా కలిగిన వాడనయ్యాను. అందుకే అఖండ బ్రహ్మచారిగా పిలువ బడ్డాను. 'నారదుఁడు' - అన్న ఈ నామంతో మూడు లోకాలలో ఏకకాలంలో చరించ గలిగిన వాడ నయ్యాను. కనబడీ కనబడకుండా సృష్టియందలి మానవులలో మేలుకొలుపును తీసుకువస్తూ ఉన్నాను. వారి లోపల నుండి పని చేస్తూ ఉంటాను. అవసరాన్ని బట్టి తగిన రూపాన్ని ధరించి, బయట నుండి కూడా వారికి చేరువవు తుంటాను. మానవ దేహాలలోని వెన్నెముకనే నా వీణగా చేసికొని మీటుతుంటాను. ఆ వీణ నుండి హరి నామాన్ని అనేక భంగిమలతో పలికిస్తూ, మురిసిపోతుంటాను. అప్పటి ఆ కల్పంలో భాగవత మూర్తుల శరీరాలలో బస చేసే టట్లుగా నాకు ఏర్పాటు గావించిన విష్ణుదేవుడు, ఇప్పటి ఈ కల్పంలో సకల మానవ దేహాలలో బసచేస్తూ, వారిని క్రమంగా భాగవత మూర్తులుగా మలచుకుంటూ వచ్చే కర్తవ్యాన్ని ఒక మహదవకాశంగా, నా కనుగ్రహించాడు.

"విష్ణుదేవుడు తీర్థపాదుడు. తన పదం పట్టిన వాడిని తరింప చేసే దేవదేవుడు. తలచినంత మాత్రాన తన చరితలను నేను గానం చేసినంత మాత్రాన పూర్ణరూపంతో నాకు గోచరిస్తూ, నన్ను అక్కున చేర్చుకుంటున్న దయామయుడు.

"ఈ విశ్వాన్ని మామూలుగా చూచినప్పుడు, మానవునికి ఈ విశ్వ సౌందర్యం ఎంతగా ఆనందాన్ని కలిగిస్తుందో, అంతగా అతడిని ఆకర్షిస్తుంది కూడా! ఆ ఆకర్షిస్తున్నప్పుడు మానవుడు ఒక మెలకువను చూప గలగాలి - ఆ ఆకర్షిస్తున్న నామరూపాలను వ్యక్తం చేస్తున్నదెవరో, ఆ విష్ణుదేవుని

చూడగలగాలి. అతడిని చూడ గలిగితే, ఆ అకర్షింప బడుతున్న క్షణాలలో అతడు దివ్యుడవు తున్నాడు. దివ్యంగా ప్రవర్తించ గలుగు తున్నాడు. అతడిని చూడలేనప్పుడు, అతడి దాకా తన చూపు సాగలేనప్పుడు, ఆ నామరూపాలకే పరిమితమై, వాటిలో చిక్కు కుంటున్నాడు. ఆ చిక్కుల నుండి బయట పడాలీ అంటే, మళ్లీ అతడిని చూడటమే మార్గమవుతున్నది. పూర్వకల్పం లోని నా జన్మ కర్మల నుండి లభించే సందేశం ఇదే. అతడిని చూడగలగడం ఎలాగ అన్నదే!

"యోగాభ్యాసం పేరిట యమనియమాదుల నెంతగా అనుష్ఠించినా, కామ క్రోధాదులు అణగి ఉంటాయేమోగాని విడిచిపెట్టవు. అవి విడిచి పెట్టాలీ అంటే, విశ్వరూపంలో ఉన్న విష్ణుదేవుని చూడగలగాలి. ఆ విష్ణు దేవుని పూజగా ఈ జీవితాన్ని నడువ గలగాలి. అలా నడప గలగాలీ అంటే, భాగవత మూర్తుల సన్నిధి మనకు లభించి, వారి అనుగ్రహానికి మనం పాత్రులం కావాలి. మహర్షి! పూర్వ కల్పంలోని నా జన్మకర్మలందలి సాధనా రహస్యమిదే. వివ రంగా చెప్పమని అడిగావు నీవు. అప్పటి నా జన్మకర్మల, లోతుపాతులను గురించి వివరించి చెప్పాను నేను. మానవుడు ఉద్ధరింప బడటానికి భాగవత మార్గం ఎంతగా అవసరమవు తున్నదో, ఆ నా జన్మకర్మలు నీకు ఋజువు పరుస్తున్నాయి కదా! ఇప్పటి నా ఈ స్థితికి అప్పటి ఆ భాగవత మూర్తుల దివ్యస్పర్శయే కారణం మహర్షి! ముమ్మాటికీ అదే కారణం.

"ఇక నీవు భాగవత రచనను అరంభించు. ఈ నా కథతోనే అరంభించు. నరజాతికి అవశ్యకమైన ఉపదేశాలెన్నో ఈ కథలో దాగి ఉన్నాయి. కనుక నీవు కోరి చెప్పించుకున్న ఈ కథతోనే నీగ్రంథానికి శ్రీకారం చుట్టు. ఇక నేను వెళ్ళి వస్తాను. అవశ్యకమైనప్పుడల్లా నీ వాడనై, నీ చెంతనే ఉంటాను. నా నుండి వెలువడు తున్న ఈ మహతీ గానమే నీ నుండి భాగవత గ్రంథమై దిగి వచ్చు గాక! నన్ను, నిన్ను నడుపుతున్న ఆ విష్ణుదేవుడు, ఈ గ్రంథ రూపమై, సకల జనులకు ఎల్ల కాలాలలో తనదైన అనుభూతిని అందించు గాక! ఈ భాగవత గ్రంథము కలి సంతరణ మార్గమై సకల జనులను సార్థక జనులుగా ఒనరించుగాక!"

వ్యాస భగవానుడు వినమ్రుడై, ఆ ఆశీస్సులను అందుకుంటున్నాడు. అందుకుంటూనే నారద మునీంద్రుని అలా సాగనంపుతున్నాడు.

నారదుని కథా విశేషాలను వివరంగా విన్న పరీక్షిత్తు పులకిత గాత్రుడై,

శుకయోగి వైపు చూస్తున్నాడు. తనకు కూడా కావలసింది ఏదో, ఆ కథ నుండి అందుకోగలిగానని ఆ చూపులతోనే తెలియజెపుతున్నాడు.

## ధర్మావేశం

నారదుని కథతో భాగవత రచనకు శ్రీకారం చుట్టాడు వ్యాసభగవానుడు. ఆ శ్రీకారం సర్వశుభకరంగా దర్శన మిచ్చింది అతనికి. ఆ దర్శనం అలా కొనసాగుతూ, భారత గాథ వైపుకు మళ్లింది.

'భారత గాథలో ఉదాత్తమైన వ్యక్తు లెందరో ఉన్నారు. వారందరూ ధర్మ మయ మూర్తులు గానే భారత రచనలో గమనించ బడ్డారు. ఆ రచనకు పరమావధి, నిత్య జీవిత నిర్వహణలో మానవునికి కావలసిన సమన్వయాత్మక మైన ధర్మ పథాన్ని చూపించడమే కనుక, ఆ ఉదాత్త మూర్తుల గురించి అంతవరకే అక్కడ రచన చేయడం జరిగింది. ఇప్పుడు, ఈ భాగవత రచన ప్రారంభమైన తరువాత ఆ ఉదాత్త మూర్తులలోని భాగవత ధర్మాన్ని కూడా ప్రత్యేకించి గుర్తించి లోకానికి అందించ వలసిన అవసరం ఎంతైనా కనిపిస్తూ ఉన్నది. భాగవత మూర్తులై వారు వెలుగొందిన సన్నివేశాలను ఈ సందర్భంగా నోరార కీర్తించాలనిపిస్తున్నది. భాగవత మార్గాన పయనించ దలచిన వారికి కావలసిన మార్గ నిర్దేశిక సూత్రాలు, ఆ సన్నివేశాల నుండి లభిస్తూ ఉన్నాయి. కనుక ఆ సన్నివేశాలను తగిన రీతిలో వర్ణించి చెప్పిన తరువాత, అప్పుడు మిగిలిన గ్రంథాన్ని నడిపించ వచ్చును అనిపిస్తున్నది. నారద మునీంద్రుడు జరుగ వలసింది తెలియ చెపుతూ జరిపిన సంభాషణలలో కూడా ఈ అంశాన్ని నొక్కి చెప్పి ఉన్నాడు. ఇంత వరకు జరిగిన రచనలలో ధర్మపథానికి ఇచ్చిన ప్రాధాన్యం, భాగవత మార్గనికి అంతగా ఈయబడ లేదని కదా అతడు తెలియ చెప్పింది. ఇప్పుడు భారత గాథలోని ఉదాత్త మూర్తులను భాగవత మూర్తులుగా దర్శించి నేను వర్ణించ గలిగితే, అతడు తెలియ చెప్పిన దానికి కొంత వరకైనా న్యాయం చేసిన వాడనవుతాను.

ఈ విధమైన దర్శనాత్మకమైన ఆలోచనతో సాగుతున్న వ్యాస మహర్షికి ద్రౌపది జీవితంలోని సార్థకమైన సన్నివేశ మొకటి కనుల ముందు నిలిచింది.

అశ్వత్థామ ఉపపాండవు లందరినీ అర్ధరాత్రి వేళ ఊచకోతగా వధించాడని

తెలిసిన ద్రౌపది నరకబడిన అరటి చెట్టులా కుప్పకూలి పోయింది. అప్పటి ఆమె బాధ వర్ణనాతీతం. భవిష్యత్తు అంతా అంధకారంగా కనిపిస్తున్న దామెకు.

'కురుక్షేత్రంలో విజయాన్ని సాధించి ఫల మేమిటి? బిడ్డలందరినీ ఒక్క సారిగా కోల్పోయిన తరువాత ఈ విజయాలన్నీ ఇక దేని కోసం? ఈ కథ ఎటు నుండి ఎటు తిరుగుతున్నది? ఈ నా జీవితం ఎప్పుడూ ఉత్కంఠ భరిత మైనదే! ఇక ఈ రోజులు ఇలా గడిచి పోతాయి అనుకోవడానికి వీలులేదు. ఏ క్షణాన ఏమైనా జరుగ వచ్చు. ఈ జీవితం ఎటునుండి ఎటైనా మలుపు తిరుగ వచ్చు. మలుపులు తిరిగీ తిరిగీ ఈ స్థితికి వచ్చాను. కృష్ణుని అండతో ఇన్ని మలుపులు తిరగ గలిగాను. లేకపోతే ఎక్కడో, ఏ మలుపు దగ్గరో అలసిపోయి, పడిపోయి ఉండేదానిని. అయితే, ఇంతవరకూ తిరిగిన మలపులలో ఒక తృప్తి ఉంది. కృష్ణుని అండతో నేను నిలబడ గలుగు తున్నాననీ, నా భర్తలను నిలబెట్టుకో గలుగు తున్నాననీ. ఆ తృప్తితో బ్రతుకుతున్న నాకు పిడుగు పాటు లాంటి ఈ వార్త ఏమిటి? బిడ్డలతో కూడి ఆనందించ వలసిన ఈ సమయంలో మాకు తీరని ఈ గర్భశోక మేమిటి? ఈ గర్భ శోకానికి నేను తట్టుకోలేక పోతున్నాను. నేను తట్టుకో లేక పోతున్నాను.'

క్రమంగా ఆమె ఆలోచన పూర్తి ఆవేదనగా మారి పోయింది. శోకంతో భూమిపైన పడిన ఆమె దొర్లుతూ ఉన్నది. కన్నుల వెంట అశ్రువులు ధార లుగా కురుస్తూ ఉన్నాయి. శరీర మంతా ధూళి ధూసరిత మవుతున్నది. ఆమె ఏమయి పోతున్నదో ఆమెకు తెలియటం లేదు. ఆమె 'అందరి' మధ్యలో ఉన్నదని కూడ ఆమెకు తెలియటం లేదు. ఆమె లోకంలో ఆమె ఉన్నది. ఆమె శోకంలో ఆమె ఉన్నది.

జరిగిన దానికి ద్రౌపదితో పాటుగా పాండవులు కూడా ఎనలేని వేద నను అనుభవిస్తున్నారు. అయితే, ద్రౌపది బాధపడుతూ, క్రుంగి పోతున్న ఈ దృశ్యం వారిని మరింతగా కలచి వేస్తున్నది. ఆమెను సముదాయించడం ఎలాగో, వారికి అంతు పట్టడం లేదు. అలాంటి స్థితిలో నిస్సహాయులై చూస్తున్న పాండవులను గమనిస్తున్నాడు శ్రీకృష్ణుడు. ఆ గమనికను అందుకున్న అర్జు నుడు కృష్ణునివైపు చూశాడు. కృష్ణుడు కర్తవ్యోన్ముఖం కావలసిందిగా సూచన చేశాడు. ఆ సూచన నందుకొని, తనను తాను కూడ దీసుకొని లేచి నిలబడిన అర్జునుడు ద్రౌపది వైపుకు సాగాడు.

ద్రౌపదిని లేవనెత్తి, ఆమె కన్నీటిని తుడిచి, ముఖంపై చిందర వందరగా

పడిన ఆమె ముంగురులను లాలనగా సర్దుతూ, అనునయంగా ఇలా అన్నాడు అర్జునుడు: "ద్రౌపదీ! నీవు క్షత్రియుని పుత్రికవు. క్షత్రియుని పుత్రిక ఇంత బేల కావచ్చునా? జరిగింది అత్యంత విషాద కరమైన సంఘటనే! అయినప్పటికీ మనం క్షత్రియులం. ఎతటి విషాదం ఎదురు వచ్చినా, మన ధర్మానికి అనుగుణంగానే మనం స్పందించాలి. అశ్వత్థామ నిర్దయుడై పిల్లల్ని పట్టుకొని చీల్చి చంపాడు. దానికి ప్రతిగా నేనిప్పుడు వెళ్ళి, అతని తలను నరికి తెచ్చి నీముందు పెడతాను. ఆ శిరస్సును త్రొక్కి అప్పుడు నీవు స్నానం చేద్దువు గాని!"

అర్జునుని మాటలకు ద్రౌపది కొంతగా తెప్పరిల్లింది. శ్రీకృష్ణుడు సారథి కాగా, అర్జునుడు రథంపై అశ్వత్థామ ఉన్నవైపుకు బయలు దేరాడు.

తనను పట్టేటందుకు వస్తున్న అర్జునుని చూచి అశ్వత్థామ భీతితోపరుగెత్తుతున్నాడు. అర్ధరాత్రి వేళ అంత మందిని అవలీలగా ఊచకోత కోయగలిగిన అతనికి, తన ప్రాణాల దగ్గరికి వచ్చేటప్పటికి మాత్రం ఇంత భయం వేస్తున్నది. ఆహా ప్రాణము! అదెంత తీపి!

పరుగెత్తుతున్న అశ్వత్థామకు కలుగుతున్న భీతి ఇంతింత కాదు. అతడి సర్వేంద్రియాలూ కూడా భీతితో అల్లల్లాడి పోతున్నాయి. సృష్టి కథ ప్రారంభంలో తన నుండి వ్యక్తమైన సరస్వతిని మోహించాడు బ్రహ్మ. మోహించి ఆమె వెంట పడ్డాడు. ఆ పడుతున్న సమయంలో అతడు శివుని కంట పడ్డాడు. ఇక అంతే! బ్రహ్మకు తానెటు పరుగెత్తుతున్నదీ తనకే తెలియని స్థితి వచ్చింది. అతడి ఇంద్రియాలు అంతగా భ్రాంతిని చెందాయి. ప్రాణ భీతితో సర్వేంద్రియాలూ భ్రాంతి చెందుతూఉండగా పరుగెత్తుతున్న ఈ అశ్వత్థామ అప్పటి ఆ బ్రహ్మను తలపిస్తున్నాడు.

పరుగెత్తి పరుగెత్తి అలసిపోయాడు అశ్వత్థామ. ఇక పరిగెత్త లేని స్థితి వచ్చింది అతనికి. కాని, తనను తాను రక్షించుకోవాలని పిస్తున్నది. తానింకా బ్రతకాలని పిస్తున్నది. ఏమయితే అది అవుతుందని చివరి ప్రయత్నంగా ప్రయోగమే తప్ప ఉపసంహారం తనకు చేతకాని బ్రహ్మాస్త్రాన్ని అర్జునుడి మీదికి మంత్రించి వదిలాడు అశ్వత్థామ.

ఆ బ్రహ్మాస్త్రం భూమ్యాకాశాలలో వెలుగులు నింపుతూ వస్తున్నది. వెలుగులు క్రక్కుతూ వస్తున్నది. అర్జునుడు ఆశ్చర్యపోయాడు. అతడి ఆశ్చర్యాన్ని

తొలగించి శ్రీకృష్ణుడు: "అది బ్రహ్మాస్త్రం. అతడు దానిని ఉపసంహరించ లేడు. నీవు దానిపై నీ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి, రెండింటినీ నీవే ఉపసంహరించు" - అన్నాడు అర్జునుడు అలాగే చేశాడు. చేయగలిగింది లేక అశ్వత్థామ అర్జునునికి దొరికి పోయాడు.

అశ్వత్థామను పొదివి పట్టుకున్నాడు అర్జునుడు. పట్టుకుంటున్న అతని కన్నులు కోపంతో ఎర్రబడి ఉన్నాయి. ఒక్క ఉదుటన అశ్వత్థామను లాగికొని వచ్చి, తన రథంలో పడవేసి, తాటితో ఆ రథానికి అంటగట్టా డతనిని. వెంటనే రథం బయలు దేరింది. బయలు దేరిన రథం ఆఘ మేఘాలలో సాగివచ్చి, పాండవ శిబిరాల దగ్గర ఆగింది.

రథం ఆగగానే, అశ్వత్థామను కట్ల నుండి సడలిస్తూ, సడలిస్తూనే అతడిని వధించే ప్రయత్నంలో ఉన్నాడు అర్జునుడు. అర్జునుడిని ఆప్రయత్నం నుండి ఆపుతూ, ఇలా అన్నాడు శ్రీకృష్ణుడు: "ఈ అశ్వత్థామ ప్రవర్తన చిత్రంగా ఉంది. ఇతణ్ణే చంపటానికని మనం ఇతని మీదకు వెళ్లాం. ఇంతటి వీరుడు కదా ఇతడు. తిరిగి మనపైన పోరాడవచ్చుకదా! ఎందుకనో ఇతడు అందుకు సిద్ధపడ లేక పోయాడు. సిద్ధపడని వాడు తన ఓటమిని అంగీకరించ వచ్చు కదా! అందుకు ఇతని ప్రాణం ఒప్పలేదు. తాను చేసేది లేదని తెలిసి కూడ, దుష్టుడై తనకు చేతకాని బ్రహ్మాస్త్రాన్ని మన మీద ప్రయోగించి ఊరుకున్నాడు. ఆ తరువాత ఏం చేద్దామనుకున్నాడు? అందుకు ఇతడి దగ్గర సమాధానం లేదు. పోతే ఈ భూగోళమే పోతుందనుకున్నాడు. సరే. దానిని కూడ నీవే ఉపసంహరించావు. ఇక ఏమీ చేయలేని స్థితిలో ఉన్న ఇతనిని వెళ్ళి, పొదివి పట్టుకున్నావు. ఆ పట్టు కుంటున్నప్పుడైనా ఇతడు తన పశ్చాత్తాపాన్ని ప్రకటించవచ్చు కదా! ప్రకటించ లేదు. ఇతని కసలు పశ్చాత్తాపం కలుగనే లేదు. పోనీ! ప్రాణ భిక్ష పెట్టమని అర్థించ వచ్చు కదా! ఆ మాత్రపు మంచి తనం కూడా ఇతని దగ్గర లేదు. దీనిని బట్టి, అర్థించడానికి కూడ కొంత సంస్కార ముండాలని తెలుస్తున్నది. ఇతడు గెలువలేదు. ఓటమి నంగీకరించ లేదు. పశ్చాత్తాప పడడు. ప్రాణభిక్షను కోరడు. ఇటువంటి వాడిని ఇప్పుడు దండించి మాత్రం ఏమి లాభం? దండన మనిషిలో మార్పు కోసం. ఇతడు మార్పుకు అంగీకరించటం లేదు. తనలో మార్పు రావాలని కోరుకోవడం లేదు. మరి ఇప్పుడు, ఇతనిని దండించి ఏమి లాభం? 'రాజు విధించిన దండన ననుభవిస్తే, ఆ దండన ననుభవించడం వలన, తనలో మార్పు తెచ్చుకుంటే,

ఇక ఆ దోషికి యమదండన ఉండదు. అన్నది పెద్దల మాట: ఇతడు ఆ సూక్ష్మం కూడా గమనించి నట్లు లేదు. ఇతడు, తాను పునీతుడు కావాలని కోరు కోవటంలేదు. మలినమైన మనస్సుతో, వెన్నాడుతున్న భీతితో ఇలాగే బ్రతుకును సాగించాలను కుంటున్నాడు ఇతడు. అలా బ్రతకటంలోని సుఖమే మిటో మరి ఇతనికే తెలియాలి. అర్జునా! ఇలాంటి పరిస్థితులలో ఉన్న ఇతడిని దండించడం కన్నా వదిలివేయడమే మంచి దనిపిస్తున్నది. ఇతడేమి కావాలన్నది ఇతడికి వదిలి వేయడమే మంచిదని పిస్తున్నది. లోక రీతుల ప్రకారం చూసినా - ఎంత చెడినా ఇతడు బ్రాహ్మణుడు కదా!"

"నీవు చెప్పావు కనుకనూ, భ్రష్టుడైనా ఇతడు బ్రాహ్మణుడు కనుకనూ నేను వదిలేస్తున్నాను. అదిసరే, మరి ద్రౌపదికి ఇచ్చిన మాట. దాని సంగతే మిటి?" అన్నాడు అర్జునుడు కృష్ణుని బోధను ఆకళింపు చేసుకుంటూ.

"ఆ సంగతి ద్రౌపది చెబుతుంది. ఇతడిని మనం ఆమె ముందు నిల బెడదాం." - అన్నాడు కృష్ణుడు.

"అలాగే" - అంటూ ఆమె ఉన్న చోటుకు అశ్వత్థామను పట్టి తీసుకొని వెళుతున్నాడు అర్జునుడు.

అర్జునుని వెంట సాగుతున్నాడు శ్రీకృష్ణుడు.

అతని వెంట సాగుతున్నాయి వ్యాసభగవానుని చూపులు.

'మనమూ మానసికంగా అటే సాగుదాం' - అని అంటున్నట్లుగా చూస్తు న్నాడు పరీక్షిత్తు శుకయోగివైపు.

## తల్లి కోసం

అశ్వత్థామను పట్టి తెచ్చి, పుత్ర శోకంతో క్రుంగి పోతున్న ద్రౌపదిముందు నిలబెట్టాడు అర్జునుడు. అశ్వత్థామ తను చేసిన పనికి ఆమెకు ముఖం చూపించ లేక తలను దించుకొని, మరో వైపుకు తిరిగి నిలబడ్డాడు. నిజానికి నిలబడ గలిగిన స్థితిలో లేడతను. అర్జునుణ్ణి చూసి పరుగెత్తుకొని పారి పోయాడు. అతడి బారి నుండి బయట పడాలని బ్రహ్మాస్త్రాన్ని కూడా ప్రయోగించి చూశాడు. కాని, ఇప్పుడు ద్రౌపది ముందు నిలబెట్టబడిన తరువాత ఏమీ చేయలేని స్థితిలో

పడిపోయాడతను. ఆమె ఎదురుగా నిలబడి ఉండలేదు. అలాగని అచ్చటి నుండి దూరంగా వెళ్లిపోలేదు. కనీసం ఆమెను కళ్లెత్తి అయినా చూడలేదు. తానే స్థితిలో ఉన్నాడో, తనకే తెలియని స్థితిలో ఆమెవైపుకు చూడటానికి సిగ్గుపడుతూ, ముఖాన్ని మరోవైపుకు త్రిప్పుకుని, తలను పూర్తిగా దించుకుని, అలా నిలబడి ఉన్నాడు ఒక జీవచ్ఛవంలా.

అలా దీనుడై తన ఎదుట నిలబడి ఉన్న అశ్వత్థామను చూచింది ద్రౌపది. చూచి ఇలా అన్నది: "నీ తండ్రి యైన ద్రోణుడు, మా మగవారందరనీ ప్రపంచ వీరులుగా తీర్చి దిద్దిన దేశికోత్తముడు. నీవా ద్రోణాచార్యుని కుమారుడవు. కుమారుని రూపంలో ఉన్న ఆచార్యునివై, మమ్మెల్లరను నిరంతరము ఆశీర్వదించ వలసిన వాడవు. అలాంటినీవు, కరుణ ఏ మాత్రము లేకుండా నీ శిష్యుల సంతతిని సమూలంగా నరికి వేశావు. ఇలా చేయడం నీకు న్యాయమేనా?

"బ్రాహ్మణుడవే. దయా బుద్ధితో వెలుగొంద వలసిన వాడివే. సమర్థులైన యుద్ధ వీరుల సమూహాలను నడిపించ గలిగిన దిట్టవే. అలాంటి వాడివైన - నీవేనా! పసి పిల్లల నిలా పొట్టన పెట్టుకున్నావు. రాక్షసుడు చేయ వలసిన పనికదా ఇది! మాకు తండ్రి వంటి వాడవైన నీవు ఈ పనిని ఎలా చేయగలిగావు?

"మా పిల్లలేమయినా శస్త్రధారులై నీ మీదకు వచ్చి, నిన్ను కవ్వించారా? లేదే! లేక యుద్ధ భూమిలో నీకేమయినా ఎదురొచ్చారా? అదీ లేదే. పోనీ, ఎప్పుడైన నీకు ఎలాంటి ద్రోహమైనా చేశారా? అటువంటిది ఎన్నడూ జరగ లేదే. మరి, అలాంటి అమాయకులను, సుకుమారులైన చిన్నపిల్లలను, యుద్ధ రీతులలో ఏ మాత్రము అనుభవము లేని వాళ్ళను, అందునా, మైమరచి నిద్రించే సమయంలో అలా తెగనరికి వేయడానికి నీకు చేతులెట్లా వచ్చాయి? నీకు ప్రాణ మెట్లా ఒప్పింది?

"పుత్రులందరినీ కోల్పోయిన దానవై, నే నిప్పుడు కుమిలి కుమిలి ఏడుస్తున్నాను కదా! అలాగే, నిన్ను చంపడానికి అర్జునుడు పట్టి తీసుకొని వెళ్లాడని తెలుసుకున్న మీ అమ్మ ఎంతగా దుఃఖానికి గురి అవు తుందో ఆలోచించావా? గర్భ శోకం ఎవరికైనా ఒకటేకదా! మా పాలిటి నీ వెంత దుష్టుడవైనా, ఆమెకు నీవు కొడుకువే కదా! అయ్యో! నా కొడుకు ఇలా పట్టి చంప బడుతున్నాడే, అని ఆ తల్లి ఎంతగా ఆక్రోశిస్తూ ఉన్నదో! తలచుకుంటేనే నేను తట్టుకోలేక పోతున్నాను. ఏమయ్యా! ఏమి బ్రాహ్మణుడ వయ్యా! ఇలాంటి

వాడివై పోయావు. ఇందరి తల్లుల కడుపులలో చిచ్చును రగిలించి ఆనందించ గలుగుతున్నావు."

ద్రౌపది మాటలకు అశ్వత్థామ మరింతగా కుంచించుకు పోతున్నాడు. ఆమె సన్నిధిలో అలా నిలబడిఉండటం అతనికి చాలా కష్టంగా ఉన్నది. ఇలాంటి కష్టమైన స్థితిని తన జీవితంలో అతను ఇంకెప్పుడూ ఎదుర్కొని ఉండడు. ఆమె మాత్రం అతనిని కేవలం రాక్షసుడిగా గాక, కృపి కొడుకుగా కూడా చూస్తున్నది. 'ఇప్పుడీతడు వధించబడితే, నా లాంటి గర్భశోకమే ఆ తల్లికీ సంప్రాప్తిస్తుంది కదా!' - అని ఆలోచిస్తున్నది. ఆవేదన చెందుతున్నది.

శ్రీ కృష్ణుడు ద్రౌపదిని గమనిస్తున్నాడు. అలాంటి స్థితిలో కూడ ఆమె అలా ఆలోచించ గలుగుతున్నందుకు ఆశ్చర్యానందాలను అనుభవిస్తున్నాడు. "తాను అంతటి బాధలో ఉండి కూడ, ఇంకొకరికి అలాంటి బాధ కలుగ కూడదని అను కుంటున్నది. ఆమె కలా అనిపిస్తున్నది. అలా అనిపిస్తున్నదీ అంటే, ఆమె ఎంతటి సౌజన్య మూర్తి అయి ఉండాలి! అశ్వత్థామను కేవలం బాలలహంతకునిగా కాక, ఆమె అతనిని కృపి కొడుకుగా కూడ చూడగలుగుతున్నది. 'ఇతడు చేసిన పనికి ఇతనిని వధించటం న్యాయమే. వధించ వలసిందే కూడాను. కాని, ఇందువలన ఆ తల్లికి గర్భశోకం కలుగుతోందే! గర్భశోకం ఎలాంటిదో నేను అనుభవించాను. ఇలాంటి బాధ, ఇలాంటి క్షోభ పగవారికి కూడ వద్దు. పగవారికి కూడ కలుగ కూడదు ' - అని ఆమెకు అనిపిస్తున్నది. 'నాకు కలిగిన ఈ బాధ ఇంకెవరికీ కలుగకుండు గాక! అందునా నా మూలంగా ఇంకెవరికీ కలుగకుండుగాక! ఆ శోకమేదో నేను అనుభవించాను. ఆ శోకమేదో నేను అనుభవిస్తున్నాను. అది చాలు. అది చాలు. అది ఇంకెవరికీ కలుగకూడదు. ఇంకెవరికీ కలుగ కూడదు. చివరకు నా కింతటి శోకాన్ని కలిగించిన ఆ నిర్దయుని తల్లికైనా ఇది కలుగ కూడదు. ఇది కలుగ కూడదు. ఇది ఎంతటి బాధో నేననుభవిస్తున్నాను. అది చాలు. అది చాలు - అని తన సర్వేంద్రియాలతో, భాష కందని భాషలో ఎల్లర గుండెలను తాకేట్టుగా, మాట్లాడుతున్నట్టి ఈమె ఎంతటి సౌజన్య మూర్తి! ఎంతటి క్షమా గుణమది!" - అను కుంటూ 'అంతటి విషాదంలో నుండి కూడ ధర్మంవైపునకు, మానవ ధర్మం వైపునకు, దేవుని భావన వైపునకు చూడ గలుగుతున్న ఆమెకు ఇవే నా హృదయ పూర్వకమైన అభినందనలు - అన్నట్లుగా చూస్తున్నాడు శ్రీకృష్ణుడు.

ఆ శ్రీకృష్ణుని అభినందనలు ఆమె హృదయాన్ని చేరి స్పృశించినవా అన్న ట్లుగా ద్రౌపది కృష్ణార్జునుల వైపునకు తిరిగి ఇట్లన్నది. "ద్రోణుని భార్యయైన కృపి, ద్రోణునితో బాటుగా శరీరమును విడిచి పెట్టలేదు. తన బిడ్డయైన ఈ అశ్వత్థామ పైన మితిమీరిన మమకారాన్ని పెంచుకుని, ఇతడి కొరకు మిగిలియు న్నది. పుత్ర శోకమున నేనే ఇంతగా కుమిలిపోతున్నాను. ఇక ఆమె ఎంతగా ఆక్రోశానికి గురి కాగలదో, అది తలచుకున్న నాకు ఇతడిపై జాలి కలుగుతు న్నది. ఇతడెంతటి దుష్టుడైన కావచ్చును. ఆ తల్లికి మాత్రము కొడుకే కదా! ఇతడి కొరకే ప్రాణాలను మిగుల్చుకుని ఇతడివైపే చూస్తున్న ఆ తల్లికోసం ఇతడిని వదిలివేయ వలసిందిగా కోరుతున్నాను. ఇతడెంతగా చెడిపోయినా, మన దృష్టిలో ఇంకను ఇతడు బ్రాహ్మణుడే కదా! ఆ విధంగా చూచినా, ఇతడిని వదిలివేయడమే కర్తవ్యమని అనిపిస్తూ ఉన్నది.

అతడెటువంటి వాడైనా, బ్రాహ్మణుని కోపింప జేయటం క్షత్రియుడికి మంచిది కాదు. కోపించిన బ్రాహ్మణుడు, వక్రించిన తన మేధతో ఈ భూమిని బూడిద చేయగలడు. ఒక భూకంపమునే సృష్టించగలడు. ముందు భూమి, ప్రజలు సుఖముగా ఉండుట మనకు ముఖ్యం. రాజ్యక్షేమం కోసం మన కష్టాలను మనమే కడుపులో దాచుకుందాం. ప్రజలు కూడ మన బిడ్డలే కదా! బిడ్డలను కోల్పోయిన మనకు ఇక మిగిలింది ఆ బిడ్డలే కదా! ఇప్పుడితనిని కోపింపజేసి వారిని కూడా పోగొట్టుకొనుట ఎందుకు?"

ద్రౌపది పలికిన ఈ పలుకులు ధర్మజునికి సంతోషాన్ని కలిగించాయి. ఆమె చూపుతున్న ఉదారతకు ఆ స్థితిలో కూడా అతడు ముగ్ధుడయ్యాడు. నకుల సహదేవులకు కూడా నచ్చాయి. ధర్మజుడికి నచ్చితే ఇక వారికి నచ్చి నట్లే. కృష్ణార్జునులు అప్పటికే ఆమె వైపు తృప్తిగా చూస్తున్నారు. ఇక తృప్తి పడనివాడు భీముడు ఒక్కడే. ఒక్క ఉదుటున లేచి అతడిలా అన్నాడు. "పసిపి ల్లలను పట్టుకుని చంపిన వానిపై దయ తలచుటా? ఈ ద్రౌపది ఎంత వెర్రిది! భ్రష్టుడైన వీడు బ్రాహ్మణుడా? బ్రాహ్మణ ధర్మాన్ని ఏనాడో మంటగలిపిన వీడు బ్రాహ్మణుడని అనుకునే వారు వెర్రివారు. చంపితే మీరు చంపండి. లేకపోతే నాకు వదిలి పెట్టండి. వాడి నెత్తిపై ఒక్క గుద్దు గుద్దుతాను. నెత్తి కాస్తా నెత్తుటి ముద్దయి కూర్చుంటుంది. మీరందరూ ఇటు చూడండి. ఇప్పుడే ఈ పనిని చేయబోతున్నాను. నేను వీడికి విధించే శిక్షను మీరంతా కళ్ళారా చూడండి."

భీముడెక్కడ ఆ పనిని చేస్తాడోనని వడిగా ముందుకు సాగి, అశ్వత్థామకు అడ్డుగా నిలిచింది ద్రౌపది. 'నామాట విని, ఇతనిని వదిలిపెట్టండి' - అన్నట్లుగా చూస్తున్నది. ఆమె ఎంతగా చూస్తున్నా భీముడంత పనినీ చేసేట్లుగానే ఉన్నాడు. అశ్వత్థామ మీదకు వచ్చేస్తున్నాడు. పిడికిలి బిగించి మరీ వచ్చేస్తున్నాడు. పరిస్థితి అదుపు తప్పుతున్నదని గమనించిన శ్రీకృష్ణుడు ఒక్కసారిగా తాను చతుర్భుజుడయ్యాడు. రెండు చేతులతో భీముని అవుతూ, మరి రెండు చేతులతో ద్రౌపదిని తన ప్రక్కకు తీసుకుని, ఆటపట్టిస్తున్నట్లుగా చిరునవ్వు నవ్వుతూ భీమునితో ఇలా అన్నాడు. "ఏమిటో నారాయణుడు ఇలా నాలుగు చేతులతో పనిగట్టుకొని ఇతడిని రక్షిస్తున్నాడని చూస్తున్నావా బావా! ఇది రక్షించడం కాదు. అతడి మానాన అతడిని వదిలేయడం. ఇతడు దుష్టుడు. పసిపిల్లలను పొట్టన పెట్టుకున్నవాడు. హత్యలు చేసినవాడు అన్నివిధాలా చంపదగినవాడు. భ్రష్ట బ్రాహ్మణుడు. ఇతడి విషయంలో నీవు చెప్పిన మాటలన్నీ నిండు నిజాలు. కానీ, బ్రాహ్మణుని చంపకూడదని చెప్పిన వేదం, ఆ బ్రాహ్మణుడు ఎలాంటివాడై ఉండాలో విశ్లేషించలేదాయె! ఏం చేద్దాం చెప్పు మరి. అది సరే బావా! నేనొక్క మాట అడుగుతాను చెప్పు. ఇతడిని చంపి నీవు సాధించేదేమిటి? నీవు కూడా ఒక హత్య చేసిన వాడవవుతావు. అతడిపైన పగతీర్చుకున్నాను కదా! అని నీకు నీవు సంతృప్తి పడతావు. అంతేనా! ఇంకేమయినా ఉందా?"

భీముడిని ఇలా చిరునవ్వుతో కాస్త చిలిపిగా మాట్లాడి సమాధానపరచిన శ్రీ కృష్ణుడు మరల తానే అందరికీ సమ్మతి కలిగేటట్లుగా, ఇతడి విషయంలో నేనొక శిక్షను విధిస్తాను చూడండి. అని ఇలా చెప్పాడు. "ఇతడు బ్రాహ్మణుడో, కాడో అది అతనికే వదిలేయండి. మన దృష్టిలో మన సంస్కారాన్ని బట్టి మనం ఇతడిని బ్రాహ్మణుడిగా గుర్తించ దలచుకున్నాం కనుక, మన కొరకు అంటే, మన ధర్మాచరణకు భంగం కలుగకుండా ఉండేటందుకొరకు ఇతడిని విడిచి పెడదాం. అయితే, ఇతనిని మామూలుగా విడిచిపెట్టడం మంచిది కాదు. శక్తి హీనుణ్ణి చేసి విడిచి పెట్టాలి. ఎందువల్లనంటే ఇతడు దుష్టుడు. ఏ మాత్రం శక్తియుక్తులు మిగిలి ఉన్నా, వాటితో లోకాన్ని క్షోభింప చేయగలిగిన నికృష్టుడు. కనుక, ఇతడికి శక్తి యుక్తులేమాత్రం మిగులరాదు. ప్రాణమంటే తీపితో ప్రాకులాడుతున్నాడు కనుక, అదొక్కటే ఇతనికి మిగుల్చుదాం. తలను చితుక కొడతానన్నాడు భీముడు. దానికి బదులుగా ఇపుడు మన అర్జునుడు శిరస్సుపైనున్న ఇతని కేశాలన్నింటినీ తన కత్తితో స్వయంగా తీసివేస్తాడు.

దానితో అతని తల తీసినట్లే అవుతుంది. అర్జునుడు ఇంకొక పని కూడా చేస్తాడు. ఆ కేశాల నడుమ ఉన్న మణిని తొలగించి, తాను స్వీకరిస్తాడు. ఆ మణి, అశ్వత్థామ సర్వశక్తిమంతుడు అయ్యేటందుకుగాను, అతని తండ్రియైన ద్రోణాచార్యుడు స్వయంగా, అతని కేశపాశాల మధ్య ఏర్పాటు చేసినటువంటిది. ఆ మణిని తీసివేస్తే ఇక ఆ మనిషివల్ల ఎవరికీ ప్రమాదముండదు. ఏదో బ్రతకాలి కాబట్టి బ్రతుకుతాడు. బ్రతుకనివ్వండి."

శ్రీకృష్ణుడు అర్జునుని వైపు చూచాడు. అర్జునుడు వెంటనే ఆ శిక్షను అమలు పరిచాడు. అశ్వత్థామను శిబిరాలకు దూరంగా విడిచిపెట్టి వచ్చే ఏర్పాటును చేశాడు. చేసి, ద్రౌపది వైపు చూచాడు. అంత విషాదంలోనూ ఒక విధమైన తృప్తితో నిట్టూర్చిందామె. కృష్ణునితో సహా అందరూ ఆమెవైపు, అనగా ఆమె సౌజన్యం వైపు చూస్తూ అలా ఉండిపోయారు కొంతసేపటిపాటు.

ఈ ఘట్టాన్ని రచించడం పూర్తిచేసిన వ్యాస భగవానుడు కూడ, ద్రౌపదిని అలా భాగవతమూర్తిగా తిలకిస్తూ ఉండిపోయాడు. అదెంతసేపో!

ఆమె సౌజన్యానికి అప్రయత్నంగా చేతులెత్తి నమస్కరిస్తూ అలాగే ఉండిపోయాడు పరీక్షిత్తు శుకయోగినుండి ఆ ఘట్టాన్ని వింటూ.

## సూత్రధారి

వ్యాస భగవానుని విశాల నేత్రాలు తృప్తితో మిలమిలా మెరుస్తున్నాయి. ఆయన కనులముందు ఇంకా ఆ ఘట్టమే. ద్రౌపదికి సంబంధించిన ఆ ఘట్టమే ద్రౌపదిలోని సౌజన్యాన్ని నిండుగా వ్యక్తం చేసిన ఆ ఘట్టమే కదలాడుతున్నది.

ఏమా ద్రౌపది! ఏమా సౌజన్యం! ఏమా పరిపూర్ణత! ఏమా పరిమళ భరితమయిన మానవీయత! ఏమయినా వదిలి పెట్టవచ్చు. ఎవరినయినా వదిలి పెట్టవచ్చు. కానీ, శత్రుత్వాన్ని వదలిపెట్టడం, శత్రువును వదిలిపెట్టడం అంత తేలిక కాదు. కాని ఆమె వదిలి పెట్టగలిగింది. అదే ఆమెలోని విశేషం. ఆమెనుండి గ్రహించుకొని మానవాళి అలవరచుకోవలసిన విశేషాంశమిదే. అంత బాధలో కూడా ఆమె అశ్వత్థామను ఒక బ్రాహ్మణుడిగా చూచి గౌరవించ గలిగింది. అంత బాధలో కూడా అశ్వత్థామకు ఒక తల్లి ఉన్నదనీ, అశ్వత్థామకు ఏమయినా అయితే ఆమె తల్లడిల్లి పోగలదనీ ఆమె గ్రహించగలిగింది.

కాస్తంత కోపం వస్తేనే ఒడలు మరచిపోతాడు మానవుడు. కాస్తంత బాధ కలిగితేనే వివశుడయిపోతాడు మానవుడు. మరి అలాంటిది, అంతటి బాధలో ద్రౌపది అలా ఎరుక కలిగి ప్రవర్తించడం నిజంగా ఆశ్చర్యం! మానవ జన్మకు పరమావధిని, మానవత్వానికి పరాంకోటి స్థితిని ఆమె చూపినట్లయింది.

మానవుడా! ఎలాంటి పరిస్థితులలో కూడా నీవు మానవుడిగానే ప్రవర్తించడం నేర్చుకో. సర్వకాల సర్వావస్థల యందూ మానవుడిగా ప్రవర్తించగలగడం అన్నదే మానవుడు చేయవలసిన ఒక మహాతపస్సు సుమా! అని ఆమె మానవజాతికి ఉపదేశించినట్లయింది. సహృదయత అంటే ఇదేనేమో! ప్రేమ అన్న పదానికి అర్థమిదేనేమో! ఆత్మౌపమ్యేన సర్వత్ర అంటూ గీతలో కృష్ణ పరమాత్మ చేసిన ఉపదేశానికి నిండయిన ఉదాహరణ ఇదేనేమో! మరి తానంత బాధపడుతూ కూడా తనలాంటి బాధ అశ్వత్థామ తల్లికి కూడా కలుగడానికి అవకాశముందని గ్రహించి - 'నేననుభవిస్తున్నాను చాలు. ఇలాంటి బాధ ఇంకెవరికీ వద్దు. చివరకు ఈ బాధను కలిగించిన వారికి కూడా! వారి వారికి కూడా. ఇలాంటి బాధవద్దు. అనుభవిస్తున్న నాకు తెలుస్తున్నది ఈ పుత్రశోకమెంతటిదో. ఈ స్థితిలో, ఈ నా స్థితిలో ఇంకెవరూ నిలబడటాన్ని నేను ఊహించలేను. అలాంటిది జరుగకూడదు. అందునా నావల్ల అసలు జరుగకూడదు.' - అని ఆమె అనగలిగిందీ అంటే ఇంతకంటే ఆత్మౌపమ్య స్థితి ఇంకెక్కడ ఉంటుంది? ఎదుటివారిని తన స్థితిలో ఊహించుకోవడమన్నది ఇంతకంటే ఇంకెక్కడ జరుగుతుంది? ఈ ద్రౌపది ఎంతటి భాగవతమూర్తి! ఈమె జీవన విధానం మానవజాతికి ఎంతగా మనుగడను నేర్పుతున్నది! భాగవతమూర్తిగా ఈమెను దర్శిస్తున్నప్పుడు నా ఒడలు ఎంతగా పులకిస్తున్నది! కలియుగాంతం వరకు ఈ దృశ్యం మానవజాతిని ఇలా పులకింపచేస్తూనే ఉంటుంది. మానవత్వాన్ని వారిలో చిగురింప చేస్తూనే ఉంటుంది. నాకిప్పుడు ఎంతో సంతోషంగా ఉంది. కలి ప్రభావాన్ని గూర్చిన తలంపులో బరువెక్కిన నా మనస్సును మహత్తరమయిన తన మహతీనాదంతో స్పృశించాడు నారదుడు. తన పూర్వగాథను విప్పిచెప్పి ఒక అపూర్వమయిన స్థితిలో నన్ను నిలబెట్టాడు. అపూర్వమయిన స్థితిలో నిలబడిన నాకు అపురూపమైన ఈ దృశ్యం కనుల ముందు సాక్షాత్కరించింది. సాక్షాత్కరించి, నన్నెక్కడికో తీసుకొని వెళ్ళిపోయింది. మానవత్వపు లోతులెన్నింటినో మనస్సునకు అందేట్లు చేసింది. 'కాయ పండితే పండయినట్లుగా, మనిషి పండితే దేవుడు అవుతాడు' - అని నాకు స్పష్టమయింది.

ద్రౌపదిది మొదటినుండీ కూడా మామూలు దృష్టికి అంతుపట్టని వ్యక్తిత్వమే. అందరిలాగా ఆమె ఆవేశపడుతుంది. కానీ ఆ ఆవేశానికి ఒక అర్థముంటుంది. ఆ ఆవేశంతో ఆమె ఒక పరమార్థాన్ని సాధించుకుంటుంది. ఆవేశపడుతూనే అవగాహనలోనికి వెళ్ళిపోతుంది. ఆ అవగాహనలో నుండి నడుస్తున్న సన్నివేశానికి పరిష్కారాన్ని చూడగలుగుతుంది. ఇది నిజంగా చిత్రమే! ఆవేశపడే వాళ్ళు ఎందరో ఉంటారు. ఆ ఆవేశపడుతూనే కావలసిన అవగాహనలోనికి ప్రవేశించగలిగిన వారు ఎందరుంటారు?

ఆమె ఉద్భవించింది యజ్ఞవాటికలోనుండి కదా! యజ్ఞార్థ దృష్టి అన్నది ఆమెకు జన్మతోనే అలవడినట్లున్నది. మనిషన్నవాడికి మనస్సుంటుంది. అసలు మనస్సుండబట్టే అతడు మనిషవుతున్నాడు. మనస్సున్న తరువాత ఆవేశాలూ, ఉద్వేగాలూ ఉంటూనే ఉంటాయి. అయితే ఈ ఆవేశాల ద్వారా, ఉద్వేగాల ద్వారా మానవునిలోని మానవత్వం వికసించాలే తప్ప ముకుళించుకు పోకూడదు. మనస్సును వికసింపచేసే ఆవేశాలూ, ఉద్వేగాలూ మనిషికి ఎప్పుడూ అవసరమే. ద్రౌపది యొక్క ఆవేశాలూ, ఉద్వేగాలూ అలాంటివి. ఆమె తన ఆవేశ, ఉద్వేగాలతో ధర్మం వైపుకు మరింత దీక్షగా చూడగలుగుతుంది. మరింత గాఢంగా ఆ ధర్మాన్ని పట్టుకో గలుగుతుంది.

అందుకే ధర్మరాజుకు ఆమె అంటే అంత గౌరవం. అందుకే కుంతీదేవికి ఆమె అంటే అంత వాత్సల్యం. అందుకే శ్రీకృష్ణునికి ఆమె అంటే అంత ఆత్మీయత. వారందరి మీదుగా మనం ఆమెను చూడగలగాలి. అప్పుడు ఆమె అంటే ఏమిటో మనకు మరింత అర్థమవుతుంది. వారిలాగా మనం చూడగలగాలి. అప్పుడు మానవీయమయిన ఆవేశాల మధ్యనుండి మెరుపుతీగలా ఆమె ఎలాగ సాగిపోయిందో మనకు బోధపడుతుంది.

ద్రౌపదిది ధర్మపరమయిన ఆవేశం. మొదటినుండీ ఆమె ధర్మం కొరకే ఆవేశపడింది. ఆ ఆవేశంతోనే ఆమె ధర్మంలో నిలబడింది. తన భర్తలను స్వధర్మంలో నిలబెట్టింది. 'ఆమె ఇలా నిలబెట్టగలదు' - అని గ్రహించింది కాబట్టే కుంతీదేవి కర్తవ్యం విషయంలో ద్రౌపది చెప్పినట్లుగా సాగిపోవలసిందిగా పాండవులకు కబురుపెట్టింది రాయబారానికి వచ్చిన కృష్ణుని ద్వారా. ఒక అత్త, కోడలి విషయంలో అంతటి విశ్వాసాన్ని ప్రకటించిందీ అంటే, ఆ అత్తాకోడళ్ళు ఎంతటి ఔన్నత్యం కలవారో, ఒకరిని ఒకరు వారెంతగా ఆరాధించుకున్నారో మనం గ్రహించుకోవచ్చు. కుంతీదేవి మాటకు చిన్నగా నవ్వాడు

శ్రీకృష్ణుడు. 'ఇప్పటికే నేనా పనిని చేస్తూవస్తున్నాను అత్తా!' - అన్నట్లుగా. ద్రౌపది ఆవేశాన్ని సద్వినియోగం చేయడం శ్రీకృష్ణుడికి బాగా తెలుసు. పాండవులు స్వధర్మంలో నిలబడటానికి తన సారథ్య, సందేశాలు ఎంతగా అవసరమో, ద్రౌపది యొక్క సాహచర్య, ఆవేశాలు అంతగానూ అవసరమని ఆ శ్రీకృష్ణునికి బాగా తెలుసు.

ఇప్పుడు ఈ సన్నివేశంలో కూడా శ్రీకృష్ణుడు ఆమెను వెన్నంటి ఉన్నాడు. ఆమెను అంటే ఆవేశాన్ని అన్నమాట. ఆమె ఆవేశపు పోకడలను ఆయన ఎప్పటిలా గమనిస్తున్నాడు. ఆత్మీయతతో గమనిస్తున్నాడు. ఆమె అశ్వత్థామను కరుణించగలిగింది. అందుకు శ్రీ కృష్ణునికి ఎనలేని తృప్తి కలిగింది. ఆమె సౌజన్యాన్ని నిండు మనస్సుతో అభినందిస్తూనే, అశ్వత్థామను అశక్తుణ్ణి చేయడంలో ఆయన తన నైపుణ్యాన్ని చూపించాడు. 'కర్మాచరణంలో కౌశలాన్ని చూపగలగడమే యోగ' మని నిర్వచించిన దేవదేవుడు కదా మరి ఆయన! మరి ఆయన కన్నా నైపుణ్యం చూపగలిగిన వారెవ్వరు? ఈ సన్నివేశంలో ద్రౌపదిలోని పరిపూర్ణత వ్యక్తం కావడం ఎంత అవసరమో దుష్టుడయిన అశ్వత్థామ శక్తిహీనుడు అవడం కూడా అంతే అవసరం. అందుకనే ద్రౌపదివైపు అభినందనగా చూస్తూనే, అశ్వత్థామను ఎంతలో ఉంచాలో అంతలో ఉంచాడాయన. అటు ద్రౌపదిలోని ఔన్నత్యాన్ని మానవజాతికి దర్శింపచేస్తూనే, ఇటు అశ్వత్థామలోని దుష్టత వల్ల లోక శ్రేయస్సుకు భంగం కలగకుండా, అతడిని నిర్వీర్యుని చేసి ఇక నిష్క్రమించమన్నాడాయన. లోక శ్రేయస్సును సాధించడం కోసమై, ఏ పాత్రను ఎలా నడిపించాలో ఆ పాత్రను అలా నడిపించగలిగిన సూత్రధారి ఆయన. ద్రౌపదిని తన ప్రతినిధిగా నిలిపి, పాండవులను ధర్మం వెంట తుదివరకూ నడిపించిన సారధి ఆయన.

అశ్వత్థామ నిష్క్రమించాడు. శ్రీకృష్ణుడు ద్రౌపది వైపునకు చూస్తున్నాడు. ద్రౌపది మనసా, వాచా, కర్మణా కృష్ణదేవునికి అంజలి ఘటిస్తున్నట్లుగా గోచరిస్తూ ఉన్నది. అంతటి విషాదంలోనూ, ఆమె చుట్టూ ఒకానొక దివ్యతేజం భాసిస్తూ ఉన్నది. వారిరువురి వైపునకు కన్నులు అర్పకుండా చూస్తున్నారు పాండవులు - మమ్ములను గతి తప్పకుండా నడిపించినది మీరిరువురే కదా! - అన్నట్లుగా. ఆ దృశ్యాన్ని చూస్తున్న నాకు ఒక విధమయిన అనుభూతితో కన్నులు చెమ్మగిల్ల సాగాయి అప్పుడూ ఇప్పుడూ కూడా. భాగవతం ఇలా ప్రారంభం కావడం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తూ ఉన్నది. 'ద్రౌపదీ!

నీవు ధన్యురాలివమ్మా! ధన్యురాలవు. నీ గాధను వర్ణించి చెప్పగలిగిన నేనూ ధన్యుడను. నీ గాధతో సాగిపోతున్న ఈ భాగవత గ్రంథం ధన్యమయినది.. ఇక తరాల తరబడి ఈ నీ గాధను చదువుకుంటూ మానవజాతి ధన్యమవు తుంది. తల్లీ! ఈ దృశ్యంలో నిన్ను చూస్తున్న నేను ముందుకు సాగలేక పోతున్నానమ్మా! చూడు. ఎతటి గాఢమయిన అనుభూతిలో నీవు నన్ను ముంచివేస్తున్నావో చూడు. మీ కథలోనుండి, మీ కథలోనుండే ఈ భాగ వతం కూడా ప్రారంభమవుతోందమ్మా! ఇక భారత, భాగవతాలు విడదీయలేని జంటగ్రంథాలై వర్ధిల్లుతాయనిపిస్తున్నది.నాకు. ఇకముందుకు సాగనా మరి? కథ ముందుకు నడవనా మరి!'

అంటూ, అనుకొంటూ కనులు తుడుచుకున్నాడు వ్యాసమునీంద్రుడు. ఆ రాలుతున్న బాష్పాలలో కూడా ఆ దృశ్యమే గోచరిస్తున్నదతనికి.

ఆ గాథను వింటున్న పరీక్షిత్తుకు బాష్పాలు ధారలుగా కడుతున్నాయి.

## తల్లిగా తాళలేక

అశ్వత్థామను సాగనంపి ద్రౌపదిని ఆశ్వాసించి పాండవుల నుండి వీడ్కోలు అందుకొని వ్యాసాది మహర్షులు వెంటనంటి సాగనంపుతుండగా ద్వారకకు పయ నమవుతున్నాడు శ్రీకృష్ణుడు. అప్పటికి అతడు ద్వారకను విడిచిపెట్టి చాలా కాలమైంది. ఉద్ధవుడు, సాత్యకి మొదలయిన వారు 'స్వామీ!' ఇకనయినా మీరు ద్వారకకు తరలి రావాలి - అన్నట్లుగా చూస్తున్నారు. వారి చూపులకు బదులుగా ఇక ద్వారకకు బయలుదేరాడు శ్రీకృష్ణుడు. అక్కడున్న వారెవరూ అతడిని విడిచిపెట్టి ఉండగలిగినవారు కారు. కాని తప్పదు కదా! పాండవులు తమ పరివారంతో బెంగగా అలా చూస్తూ స్వామి వెంట సాగుతున్నారు. ఆయ నను తప్పని సరై సాగనంపుతున్నారు.

ఇంతలో ఒక ఆక్రందన. సాగుతున్న శ్రీకృష్ణుడు ఆగి, అటువైపు చూశాడు. అతనితో పాటు అందరూ అటే చూస్తున్నారు. బాధతో మెలికలు తిరిగిపోతూ ఆక్రందిస్తున్నది ఉత్తర, ఆక్రందిస్తూ శ్రీకృష్ణుని వైపు రాలేక రాలేక వస్తున్నది. ఆమె బాధను చూసిన శ్రీకృష్ణుడు ఒక్క ఉదుటున ఆమెను చేరి అక్కున చేర్చుకున్నాడు.

అంత బాధలో కూడా ఒదిగి ఒదిగి అంజలి ఘటిస్తూ ఆ ఉత్తర ఇలా అన్నది. "తండ్రీ! కాలాగ్నిలాంటి అస్త్రమేదో ఈ నా కడుపున జొరబడి, పెరుగుతున్న ఆ పసికందును దారుణంగా దహించి వేస్తున్నది. గర్భస్థుడ యిన ఆ శిశువు తాపంతో తల్లడిల్లిపోతున్నాడు. అతడి తల్లడపాటును నేను తట్టుకోలేక పోతున్నాను. నీ చెల్లెలి కోడలిని. ఉపపాండవులు అందరూ హతుల యిపోగా, పాండవ వంశాంకురాన్ని ధరించి నిలబడిన దానిని. ఈ వంశాంకురాన్ని రక్షించు. ఈనా బాధను అర్థం చేసుకోగలవు కనుకనే నీకు మొరలిడుతున్నాను.

"మానవరూపాన వ్యక్తమవుతున్న ఓ పరబ్రహ్మ స్వరూపమా! వందలాది బ్రహ్మాండ భాండాలను లీలగా నీ గర్భమునందు ఇముడ్చుకొని ఉన్నవాడివే! దీను రాలైన ఈ ఒక్క స్త్రీ గర్భాన్ని రక్షించడం నీకెంత పని స్వామి! ఈ శిశువును రక్షించు. ఈ గర్భాన్ని నిలుపు. ఈ వంశాన్ని నిలబెట్టు.

"తాళలేక పోతున్నాడు. తల్లడిల్లి పోతున్నాడు. అగ్నిగుండం మధ్య నుండి అర్భకుడై ఆక్రోశిస్తున్నాడు. 'రక్షించేవారులేరా' అని కడుపులోనే తడుముకుం టున్నాడు. నీకోసం అక్కడే వెతుక్కుంటున్నాడు. ప్రభూ! నీవు లేని చోటు ఉంటుందా? నీవు కాని చోటు ఉంటుందా? ఈ నా గర్భం నీ స్వరూపం కాదా? ఈ వంశాంకురం నీ సంకల్పం కాదా? ఇతడిని రక్షించుకోవాలని, ఇతడిని నిలబెట్టుకోవాలని నీకు నేను తెలియచెప్పుకోవాలా ప్రభూ! తల్లిగా బిడ్డ బాధను చూడలేక పోతున్నాను. ఈ దారుణ దావానలం నుండి ఈ చిన్నవా డిని రక్షించమని వేడుకుంటున్నాను. నిజంగా దావానలమే ప్రభూ! ఈ నా గర్భంలో సుడులు తిరుగుతున్నది. సుడిగుండం లాంటి ఈ అగ్నిగుండం నుండి ఇప్పుడే రూపుదిద్దుకుంటున్న ఈ నా బిడ్డను రక్షించు ప్రభూ! రక్షించు".

ఉత్తర అలా దీనంగా వేడుకొంటున్న వేళలోనే కృష్ణదేవుడు జరుగుతు న్నది ఏమిటన్నది గ్రహించుకున్నాడు. 'ఇది అశ్వత్థామపని. అపాండవం కావాలని అతడు ప్రయోగించిన దారుణాస్త్రప్రభావమిది. ఇదిగో పాండవులను కూడా ఈ అస్త్రప్రభావం చుట్టుముడుతూ ఉన్నది. ఇక, దీనిని సాగనివ్వకూడదు' - అనుకుంటూ తన వైష్ణవ తేజాన్ని ప్రసరింపచేసి, అశ్వత్థామ విడిచిన అస్త్ర ప్రభావాన్ని రూపుమాపివేశాడు.

పాండవులు తెప్పరిల్లారు. విలవిలలాడుతున్న ఉత్తరకు ప్రశాంతత చిక్కు తోంది. గర్భస్థ శిశువునకు ఒకానొక దివ్యరూపం తనను అక్కున చేర్చుకుం

టున్న అనుభూతి కలిగింది. అగ్నిగుండం లాంటి ఆ గర్భం, ఇప్పుడా శిశువునకు దేవుని సన్నిధిగా ఒక గర్భగుడిగా రూపు చెందింది. శిశువు ఆ తేజస్సులో సేదతీరుతున్నాడు.

వ్యాసాది మహర్షులందరూ శ్రీకృష్ణుని దివ్యకరుణా విశేషానికి తమ తమ మనస్సులతోనే అంజలి ఘటిస్తున్నారు. 'అర్జునుని నిలబెట్టిన ఆదేవుడే, ఆ అర్జునుని మనుమడయిన ఈ శిశువును కూడా నిలబెట్టుకున్నాడు కదా! అవును. ధర్మయుద్ధం చేయడానికి అతను, ధర్మసంస్థాపన చేయడానికి ఇతను, ఈ పాండవులు అదృష్టవంతులు. 'దైవానికి అనుగుణంగా జీవితాలను నడపాలి' - అన్న దీక్షను స్వీకరించిన ధన్యజీవులు వీళ్లు. జీవితాల నుండి, తమ జీవితాలనుండి వీరేమీ కోరుకోవడంలేదు. ధర్మబద్ధంగా జీవించి, దేవుని కార్యక్రమంలో పాలు పంచుకోవాలన్నదే వీరి తపన. అందుకే, శ్రీకృష్ణుడు వీరిని, వీరి కుటుంబాలను ఇంతగా దగ్గరకు తీసుకున్నాడు. అసలు వీరి కోసమే దిగివచ్చాడా అన్నంతగా దగ్గరకు తీసుకున్నాడు. నడుస్తున్న ఈ దృశ్యాలు ఈ సృష్టి కథలోనే అపురూపమయినవి' - అనుకుంటూ అంజలి ఘటిస్తున్నారు.

శ్రీకృష్ణుడు ఉత్తరవైపు చూస్తూ - 'తృప్తిగా ఉందా? ప్రశాంతత చిక్కింది కదా? హాయిగా ఉన్నావుగా? బిడ్డను గూర్చిన నీ బెంగ ఇక తొలిగింది కదా!' అన్నట్లుగా ఒక చిరునవ్వు నవ్వాడు. వెన్నెల లాంటి చిరునవ్వది. అమృత స్పర్శను అందించే చల్లని చిరునవ్వది. ఆ చిరునవ్వుకు ఉత్తర ముఖం మరింత విప్పారింది. వెన్నెలకు కలువలా విప్పారింది. అవును, అతడి చిరునవ్వు అలాంటిది. చీకు చింతలనుండి ఈ వలకు లాగి ఎటువంటి వారినయినా నవ్వించగలిగిన చిరునవ్వది. ఆ నవ్వు ఎప్పటికప్పుడు క్రొత్తగానే ఉంటుంది. క్రొత్త క్రొత్త శుభాలను అందిస్తూనే ఉంటుంది. ఉత్తరేకాదు. అక్కడున్న అందరూ ఆ నవ్వుచేత అకట్టుకోబడి అలా ఉండిపోయారు. 'శిష్టులను ఇట్టే ఆ కట్టుకుంది. దుష్టులను ఇట్టే ఆటకట్టిస్తుంది - ఈ నీ చిరునవ్వు' - అనుకుంటూ అందరూ మురిసిపోతున్నారు.

ఈ ఘట్టాన్ని రచించిన వ్యాసుడు ఆ ఘట్టంలోనికి ఇంకా అలా చూస్తూనే ఉన్నాడు. అందరూ కృష్ణుణ్ణే చూచి మురిసిపోతూ ఉంటే, కృష్ణుడు ఉత్తరను చూచి మురిసిపోతున్నట్లు వ్యాసునికి గోచరించింది. పులకిస్తున్న తనువుతో అతడా కృష్ణుని మురిపెంలోనికి మరింతగా తన చూడ్కులను సారించాడు.

ఈ ఉత్తర ఎంతటి భాగవతమూర్తి! దావానలం, అశ్వత్థామ అస్త్రంనుండి వెలువడిన దావానలం తననూ, తన గర్భాన్నీ దారుణంగా చుట్టుముట్టి దహించివేస్తూ ఉంటే ఆమె అంటుంది కదా - తండ్రీ! ఈ దావానలం నా గర్భస్థ శిశువును దహించివేస్తూ ఉన్నది. అతడు తట్టుకోలేక తల్లడిల్లిపోతున్నాడు - అని 'ఆహా! ఏమి ఈ స్థితి! దావానలం ఆమెను దహించడం లేదా? ఆమెను దహించిన తరువాతనే కదా, అది ఆమెబిడ్డను దహించగలుగుతుంది. కానీ, ఆమెకు తనను దహిస్తున్న సంగతి గమనికకు రావడంలేదు. ఆమె దృష్టి అంతా ఆ బిడ్డపైననే. ఆ బిడ్డ ఎలా బ్రతికి బట్టకడతాడనే! ఓహో! తనను గూర్చి గాక, తన బిడ్డను గూర్చి మాత్రమే ఆలోచిస్తున్న ఈ మాతృమూర్తి ఎంతటిది! పైగా ఆ బిడ్డను కూడా ఆమె తన బిడ్డగా కాక, పాండవ వంశాంకురంగా దర్శిస్తూ ఉన్నది. ఆ వంశాన్ని నిలబెట్టడం కోసమే ఈ బిడ్డ తనలో రూపు దిద్దుకుంటున్నాడని అంత బాధలో కూడా గమనించగలిగిన ఆ తల్లి ఎంతటిది! శ్రీకృష్ణుడు ఉపదేశించిన నిష్కామ స్థితికి ఈ తల్లి ఒక విశిష్టమైన ఉదాహరణగా గోచరిస్తూ ఉన్నది. మానవజాతికి 'బ్రతుకును మామూలుగా కాక ఇలా బ్రతకండీ' అని ఉపదేశిస్తున్నది. ఈమెను చూస్తూ, ఈమెలా బ్రతకగలగాలేగాని మానవజీవితం ధన్యమయిపోదూ!

ఇంకొక చిత్రం - బాధతో దగ్గరయిన వేళ రక్షించమని కోరుతూ, 'నీ చెల్లెలి కోడలిని' అని చనువు చూపింది. మళ్లీ అంతలోనే 'వందలాది బ్రహ్మాండ భాండాలను లీలగా, అవలీలగా నీ కుక్షిలో దాల్చిన వాడివి అలాంటి నీకు ఒక స్త్రీ గర్భాన్ని రక్షించడం అన్నది ఏమంతపని ప్రభూ! 'అంటూ అతడికి నమస్కరించింది. బంధువుగా దగ్గరవుతూనే, బ్రహ్మాండభాండాలను ధరించిన సర్వాంతర్యామిగా శ్రీకృష్ణుని దర్శించగలిగిన ఆమె సంస్కారం ఎంతటి దివ్యమైనది! బంధువు అనగానే ఎంతటి వాళ్లకయినా ఒక పొర కప్పుతుంది. ఇక అతడిని బంధువుగా చూడటం తప్ప. అంతకు మించి చూడలేని స్థితి ఒకటి ఏర్పడుతుంది. అలాంటి స్థితికి అతీతంగా నిలిచి, పాండవులకు తగిన కోడలుగా వెలుగగలిగిన ఈమె ఎంతటి ధన్యురాలు! ఈమెలా మానవులు తమ బంధుత్వాలను సద్వినియోగం చేసికోగలిగితే, ఈమె ఎలాంటి రక్షణ పొందగలిగిందో, అలాంటి రక్షణ అనుక్షణం పొందగలుగుతారు. ఇన్ని విధాలుగా దివ్యత్వాన్ని ప్రకటిస్తున్న, ఇన్ని విధాలుగా మానవత్వాన్ని పరిమళింపచేస్తున్న ఉత్తరను చూచినప్పుడు, ఉత్తరలో తనను చూచుకుంటున్నప్పుడు ఆ కృష్ణదేవునికి ఆమె యెడల మురిపెం కలగడంలో ఆశ్చర్యమేముంది?

దర్శనం ఇలా కొనసాగుతూ ఉండగా వ్యాసభగవానుడు పులకిత గాత్రుడయి పోతున్నాడు. 'బిడ్డా! ఉత్తరా! నీవు ధన్యురాలివమ్మా! ధన్యురాలివి', అంటూ పారవశ్యంలో మురిసిపోతున్నాడు.

శుకయోగి నుండి కథను వింటున్న పరీక్షిత్తు, ఆనందానుభూతి బాష్పాలుగా మారి కనులవెంట ధారలు కడుతుండగా, ఆ బాష్పధారల మధ్యనుండి తన తల్లి రూపాన్ని నిండుగా పొడగట్టించుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

## సృష్టికార్యం

అనుభూతి భాష్పాలుగా రాలుతుండగా ఆ రాలుతున్న ప్రతి భాష్పబిందువులోనూ తన తల్లియైన ఉత్తర యొక్క దివ్యరూపాన్నే దర్శిస్తున్నాడు పరీక్షిత్తు.

అమ్మా! ఎంతటి దానివమ్మా నీవు! తన్నుమాలిన ధర్మము ఉండదంటారే! మరి నీవు నిన్ను మరచి నన్ను తలచుకున్నావే! మరి దీనిని ఏ ధర్మమనాలి? బహూశా పరమధర్మమనాలేమో! కర్తవ్య నిర్వహణంలోనికి వచ్చేటప్పటికి తమనుగూర్చి తమ సుఖాన్ని గూర్చి, అంతగా పట్టించుకోక పోవడమన్నది మీ స్త్రీజాతిలోని ఎక్కువమందిలో సహజంగా గోచరించే ఒకానొక దివ్యలక్షణం. ఈ లక్షణమే స్త్రీజాతిని మోక్షస్థితి చెంతకు అలవోకగా నడిపిస్తూ ఉంటుంది. తామటు నడుస్తున్నట్లు తమకు తెలియకుండానే ఆ నడక సాగిపోతుంది. వారు పండిపోతారు. ఇందుకే అన్నారేమో 'స్త్రీలు వేదాధ్యయనం చేయకపోయినా కొంపమునిగి పోయేదేమీ లేదని' వేదాలు ఏస్థితిని ఉపదేశిస్తున్నాయో, ఆస్థితిలో వారు నిరంతరం జీవిస్తున్నప్పుడూ, జీవించగలిగినప్పుడూ వారిక వేదాధ్యయనం చేయకపోతే మాత్రం నష్టమేమిటట! త్యాగము వలన మాత్రమే అమృతత్వం లభిస్తుంది - అని ఉపదేశిస్తున్నది వేదం. త్యాగంవలన ఎలాంటి అమృతత్వం అనుభవానికి వస్తున్నదో స్త్రీజాతిలో ఎక్కువ మంది అందునా భారతీయ గృహిణులలో ఎక్కువమంది అనాదిగా నిరంతరం అనుభవిస్తూనే వస్తున్నారు కదా!

పురుషుడు తనదికానిది తాను పొందడంలో ఆనందాన్ని అనుభవిస్తాడు. స్త్రీ తనదైనది తనకు తగిన వారికి సమర్పించుకోవడంలో ఆనందాన్ననుభవి

స్తుంది. పురుషుడు పొందడంలో ఆనందాన్ననుభవిస్తూ వుంటే, స్త్రీ సమర్పణ చెందడంలో పారవశ్యాన్ని పొందుతూ ఉన్నది. ఇక్కడొక చిత్రమున్నది. పురుషుడు కూడా పూర్ణత్వాన్ని పొందాలీ అంటే, పొందడం అనే స్థితి నుండి, సమర్పణచెందడమనే స్థితికి ఎప్పటికైనా ప్రయాణించక తప్పదు. ఈ సత్యాన్ని సూచిస్తూనే పెద్దలంటారు కదా! - దైవాన్ని చేరటానికి మానవుడు స్త్రీగా, రూపొందక తప్పదని, ఈ సృష్టిలో అతడొక్కడే పురుషుడు మిగిలిన అందరూ స్త్రీలే - అన్న పెద్దల మాటలోని అంతరార్థమిదే కదా!

'సృష్టి నిలబడటానికి పొందడమనే పురుష లక్షణం సమర్పణ చెందడమనే స్త్రీ లక్షణం. రెండూ అవసరమే. అవసరం కనుకనే అవి ఉన్నాయి. అయితే, సాధనలో ఉన్నతస్థితికి వెళుతూఉన్న కొద్దీ, సమర్పణ చెందడంలోని దివ్యానుభూతిని మానవుడు అనుభవంలోనికి తెచ్చుకుంటాడు. ఇక్కడొక సూక్ష్మాంశం కూడా మనం గమనించాలి. స్త్రీలో వ్యక్తమవుతున్న సమర్పణ చెందడమనే దివ్య లక్షణాన్ని పురుషుడు సద్వినియోగం చేయగలగాలి. ఆ లక్షణాన్ని ఆదర్శంగా స్వీకరించగలగాలి. ఆమెను ఆరాధించగలగాలి. అలాకాక, మనకు చేసిపెడుతోందికదా! మనకు చేసిపెట్టడానికే ఉందికదా! మనపైననే ఆధారపడి ఉందికదా! అని అనిపించిందో ఇక అతడి పని అయిపోయినట్లే! ఇక అతడు పతనమైపోయినట్లే! ఇక అతడు పొందగలిగినది నరకమే! నరకంలాంటి ఒంటరితనమే. అవతలివారు సహిస్తున్నారుకదా అని అలుసుతీసుకోకూడదు. తల్లి ఏమీ అనదు కదా అని త్రాగిన రొమ్ముపై గ్రుద్దకూడదు. ఎవరు మనకు పోషణనిస్తున్నారో వారిని మనం పోషిస్తున్నామనుకుంటూ అహంకరించకూడదు. స్త్రీ త్యాగమూర్తి అయితేనే పురుషుడు నిలబడతాడు. పురుషుడు సర్వసమర్థుడయితేనే స్త్రీకి అన్నివిధాలా రక్షణ లభిస్తుంది. పురుషునిలోని సామర్థ్యానికి స్త్రీ మురిసిపోతూ ఉండగా స్త్రీలోని త్యాగశీలానికి పురుషుడు కరిగిపోతూ ఉండగా ఈ సృష్టికార్యం ఇలా దివ్యానుభూతినందిస్తూ సాగిపోతూ ఉంటుంది అని మనిషికి తెలియాలి. అది తెలిస్తే, ఆ సమన్వయం అందితే ఇక అంతా ఆనందమే.

అమ్మా! స్త్రీ మూర్తికి సహజమైన త్యాగం నీలో పరిపూర్ణతను సంతరించుకున్నట్లు ఉన్నదమ్మా! నేనదృష్టవంతుణ్ణి. ఎందుకో తెలుసునా! నా తండ్రి సర్వసమర్థుడు. తండ్రిని మరపించిన తనయుడు. జగదేకవీరుడు. అతడుంటే తమ ఆటలు సాగవనీ అతడుంటే తమ అడుగిక ముందుకు పడదనీ కౌరవ పక్షంలోని యోధాను యోధులు సూటిగా అతణ్ణి ఎదుర్కొనలేక చాటుగ

అతణ్ణి హతమార్చవలసి వచ్చిందమ్మా! భయంతో దుష్టుడైన సైంధవుణ్ణి అడ్డు పెట్టుకోవలసి వచ్చిందమ్మా! నా తండ్రి అంతటి సమర్థుడు. పురుషకారం మూర్తీభవించిన పురుషుడు! మరినీవూ! స్త్రీతత్త్వం పరిపూర్ణంగా విప్పారిన స్త్రీమూర్తివి. మూర్తీభవించిన త్యాగానివి. సామర్థ్యం నాతండ్రి. సమర్పణ నాతల్లి. అన్నట్లుగా నా కన్నులకు అగుపడుతున్నారమ్మా మీరిద్దరూ. నా తండ్రిది . వెనుదిరుగని సామర్థ్యం. నా తల్లిది తనను మరచిన సమర్పణ. తను వెరుగని సమర్పణ.. తన తనువును విడిచిపుచ్చి, తన తనయునకై పరితపించిన సమర్పణ. తన తనయుని తన తనయునిగా గాక వంశాంకురంగా దర్శించగలిగిన సమర్పణ. వంశాంకురంగానే కాక, కృష్ణదేవుని సంకల్పరూపంగా అతణ్ణి చూడ గలిగిన సమర్పణ. విధివశాన తనువును విడిచిన తన భర్తకు, పుత్రునిరూపంలో తిరిగి ప్రాణ ప్రతిష్టనుచేసి ఈ జాతి రక్షణకు అర్పించుకుంటున్న సమర్పణ. అమ్మా! నేనెంతటి అదృష్టవంతుణ్ణి!

తండ్రి సామర్థ్యాన్నీ, తల్లి సమర్పణ బుద్ధినీ కలబోసుకొని మీకలను నిజం చేయాలనీ, కృష్ణుని సంకల్పానికి అనుగుణంగా ఈ జీవితాన్ని నడుపుకోవాలనీ నిరంతరం ప్రయత్నించిన వాడినమ్మా! మరి, ఈ నా ప్రయత్నంలో నేనెంత వరకు కృతకృత్యుడనయ్యానన్నది తల్లితండ్రులైన మీరు చెప్పాలి. జగద్గురువైన కృష్ణదేవుడు చెప్పాలి. అమ్మా! ఈనా జీవితంపైన మీ అభిప్రాయమేమిటి? తెలుసుకోవాలనిపిస్తోందమ్మా! నీవు, నాన్న, కృష్ణయ్య, నేనంటే ఏమిటన్నది, ఏమనుకుంటున్నారన్నది ఈనా బ్రతుకుకు అర్థమేమిటన్నది, ఇది ఎంతవరకు సార్థకత చెందినదన్నది మీ నుండి వినాలని ఉందమ్మా! ఎవరి రూపంలో చెబుతారు మీరు? నా కొరకు నడిచివచ్చి సర్వమూ తానై నిలచిన ఈ శుక యోగీంద్రుని రూపంలో చెబుతారా? ఏం అమ్మా! ఏం చెబుతారు? ఎలా చెప్తుతారు? నా గూర్చిన మీ భావన నాకందితే, అది నాకు తృప్తి. మానవజన్మ ఎత్తినందుకు మానవుడు ఇంతకంటె కోరేదేముంటుంది? తల్లి దండ్రుల తృప్తికన్నా, జాతి జనుల తృప్తికన్నా, దేవదేవుని తృప్తికన్నా అతడికి కావలసిందేముంటుంది? ఇతడు సరిగ్గా బ్రతికాడని తల్లిదండ్రులు అనుకొన్నవేళ, జాతి జనులు సంతసించినవేళ, దేవ దేవునికి ముచ్చట కలిగినవేళ అంతకంటె ముక్తి ఏముంటుందమ్మా! ఈ ముగ్గురి తృప్తియే మనిషికి ముక్తి నా దృష్టిలో

పరీక్షిత్తు కనులనుండి అనుభూతి భాష్పాలు ముత్యాల వరుసలుగా కురు స్తున్నాయి.

పరీక్షిత్తు వైపునకే చూస్తూ ఉండిపోయిన శుకయోగీంద్రునికి అతనిలోని భావనలన్నీ అద్దంలోలా అగుపడుతున్నాయి. ఆ భావనలబలానికి అంతటి యోగీంద్రుడు కూడా కదిలిపోతున్నట్లున్నాడు. కరిగి పోతున్నట్లున్నాడు.

## ప్రతిరూపం

మాతృమూర్తి స్మరణలో మైమరచి నిలచిన పరీక్షిత్తు వైపునకు పరిశీలనగా చూస్తూ, ఇలా అన్నాడు శుక యోగీంద్రుడు. అదృష్టవంతుడా ! మీ మాతృ మూర్తియొక్క మహోన్నతమైన సంస్కారానికి అద్దం పడుతున్న ఈ సన్నివేశం ఎంతగా నిన్ను నిశ్చేష్టుడను చేయగలదో నేనర్థం చేసికోగలను. పాండవులకు తగిన కోడలామె. ఆమెకు తగిన పుత్రుడవునీవు.

'సాధకులెవరైనా ఈ భూమిమీద ఏమని కోరుకుంటారు? ఈదేహం పండి పడిపోయేలోపున దైవ సాక్షాత్కారం పొందగలిగితే అదే పదివేలు అనుకుంటారు. అలాంటిది నీ విషయంలో ఏమి జరిగింది? దేహానికి రూపుదిద్దడం ఇంకా మిగిలిఉండగానే ఆ మాతృమూర్తి గర్భంలోనే నీకు దేవదేవుని సాక్షాత్కారం లభించింది. సాక్షాత్కారం లభించడమేకాదు, ఆ సర్వాంతర్యామియొక్క దయా స్వరూపమెట్టిదో నీకు పరిపూర్ణంగా అనుభవానికి అందింది. దైవతత్త్వం గోచ రించడంవేరు. అనుభవానికి రావడంవేరు. ఈ రెండు అంశాలనూ ఏకకాలంలో అందుకోగలిగిన అదృష్టం నీది. ఇందుకు అవకాశం కలిగించింది నీతల్లి. ఆ అవకాశానికి తగిన పాత్రతను అప్పటికే కలిగి దానిని సద్వినియోగం చేసికొన్న ధన్యజీవివి నీవు.

"ఇంటిని కట్టించుకుంటున్నవాడు ఇంటిలో ఇరుక్కొనిపోవడంలేదు. లోనా, వెలుపలా తిరుగుతూ ఆ ఇంటిని అన్నివిధాలా అపురూపంగా తీర్చి దిద్దుకొనే ప్రయత్నంచేస్తున్నాడు. మాతృమూర్తి గర్భంలో దేహనిర్మాణం జరుగుతున్న ప్పుడు కూడా జీవి ఆ దేహానికి అంటుకుపోనక్కరలేదు. దేహనిర్మాణం కూడా గృహనిర్మాణం లాంటిదే. ఇంకా చెప్పాలీ అంటే దేహనిర్మాణాన్ని ఆదర్శంగా తీసుకొనే పెద్దలు గృహనిర్మాణానికి శ్రీకారం చుట్టారు. దేహ నిర్మాణ సూత్రాల ననుసరించే గృహనిర్మాణ శాస్త్రానికి రూపకల్పనచేశారు. ఇంతకీ చెప్పొచ్చేదేమి టంటే యజమాని ఇంటిని నిర్మాణం చేస్తున్నట్లుగా నీవు నీ మాతృమూర్తి గర్భంలో దేహనిర్మాణం చేసినట్టి ధీరుడవుసుమా అని. నీ తల్లి నిన్ను బ్రతికిం

చమని వేడుకుంది. నీవు నీ దేహాన్ని నిలుపమని కోరుకున్నావు. భగవంతుడు సర్వాంతర్యామి అన్న అనుభవం అప్పటికే నీకు గాఢంగా ఉన్నది కనుక, ఆ గర్భాలయంలోనే అతడి కొరకు ప్రార్థించగలిగావు. ఒకలా చెప్పాలీ అంటే ఈ సన్నివేశంలో మీ తల్లీ బిడ్డలు ఒకరిని మించి ఒకరు నిలబడ్డారు. ఒకరితో ఒకరు శ్రుతికలిపి ఏకకాలంలో దేవదేవుని దివ్యకరుణా విశేషాన్ని నిండుగా అనుభవించగలిగారు.

ఆ నటన సూత్రధారి దయవల్ల నవ మాసాలనూ పూర్తిచేసికొని, ఆయన స్పర్శతో తేజస్సులు విరజిమ్ముతున్న దివ్యదేహంతో ఒకానొక శుభముహూర్తంలో భూమిపైన ప్రవేశించావు నీవు. పుట్టగానే ఆ పుట్టిన క్షణాలలోనే ఇంకా చెప్పాలీ అంటే అపుడుతున్న క్షణాలలోనే కనులింతింత చేసికొని వెదుకసాగావట నీవు. ఎవరికోసం? గర్భాలయంలో గోచరించిన ఆ లీలామానుష విగ్రహానికోసం. నీవిలా వెతకటాన్ని గమనించారు మీ పెద్దలు. ఆశ్చర్యపడుతూనే ఆనందపర వశులయ్యారు. ఆ లీలా మానుష విగ్రహానికోసం పరిశీలనగా చూస్తున్నావనీ, ఆ పరిశీలన ఒక గాఢమైన పరీక్షగా కొనసాగుతూ ఉన్నదని గమనించిన ఆ పెద్దలు నీకు 'పరీక్షిత్తు' అని సార్థకమైన నామకరణంచేశారు. పేరుకు తగిన వాడివై, నీవు కూడా అప్పటినుండి నీకు దగ్గరయిన ప్రతి వారిలోనూ, ఆ లీలామానుష విగ్రహాన్నే వెతుక్కుంటూ మరీ చూడసాగావు. పరీక్షగా అతడిని చూడటంలోనే అలా అలా ఎదిగివచ్చావు. అలా ఎదిగి వచ్చావు కనుకనే పాండవులకు వారసుడివి కాగాలిగావు. అందరి పాండవులకు బదులుగా నీవు ఒక్కడివే బాధ్యత వడగలిగావు. గర్భాలయంలో సాక్షాత్కరించిన ఆ దివ్యమూర్తినే చతుస్సాగర పర్యంతమైన ఈ భూమండలంలో పరిపాలన రూపంలో నీవు ఉపాసించగలిగావు.

పరిపాలనను పరమాత్మ సేవగా నిర్వహించడంలో నిమగ్నమయ్యావు కను కనే భూమాత, ధర్మదేవతా గో వృషభాలై నీకు గోచరించారు. గోచరించి, కలిపురుషుని పద ఘట్టనలక్రింద తామెలాంటి పీడను పొందుతున్నదీ నీ అనుభవానికి తీసుకొని వచ్చారు. వారు పొందుతున్న పీడనం ఎలాంటిదో అనుభవానికి వచ్చిన నీవు ఆ కలిపురుషుణ్ణే నిలబెట్టావు. అతడు నిన్ను చూసి అలా నిలబడిపోయాడు ఒక బొమ్మలా. చేయగలిగింది లేదని తెలిసి తన చేతులతో నీపాదాలు పట్టుకున్నాడు. నీకు శరణు అన్నాడు. అతడిని అదుపుచేశావుగాని, హతమార్చలేదునీవు. ఎందువల్లనంటే, అతడు కూడా ఈ సృష్టి కథలో ఒక

పాత్రధారేనని దర్శించగలిగావు కనుక. అతడాశ్చర్యపోయాడు. తన చర్యలను అప్పటికి ఉపసంహరించుకున్నాడు. నీ ఆదేశాలకు కట్టుబడి నీవు చూపించిన చోటులలో తలదాచుకున్నాడు. ఆ లీలా మానుష విగ్రహుడి దివ్యదర్శనం అన న్యంగా అనుభవించగలిగిన అదృష్టానికి నోచుకున్నావు కనుకనే నీవా కలిపురుషుని అలా దమించగలిగావు.

కృష్ణదేవుడు ఏ క్షణంలో తన దేహాన్ని విడిచిపెట్టాడో ఆ క్షణంలోనే కలిపురుషుడు ఈ భూమిపైన ప్రవేశించాడు. తన ప్రభావాన్ని చూపడంలో కుతూహలపడసాగాడు. శ్రీకృష్ణుడిప్పుడు దేహంతోలేడు. పాండవులు కూడా అతడి అడుగుజాడలనే అనుసరిస్తూ ఉత్తర దిక్కుగా సాగిపోయారు. ఇంక నాకు అడ్డేముంది? అనుకుంటూ విజృంభించసాగాడు. ఆ విజృంభణకు భూమాత గోమాతై ఆక్రోశించింది. ధర్మదేవత వృషభమూర్తిగా రూపొంది కుంటికాలితో నడవలేక కూలబడింది. ఆ కలికి ఇంకా తృప్తి కలుగలేదు. వారిని తన్నాడు. పడగొట్టాడు. పీడించసాగాడు. ఇకనాకు ఎదురేమిటీ అనుకున్నాడు. ఇంతలో అతని ఎదురుగా నీరూపం మెదిలింది. అతనికి కళ్లు తిరిగి ఒళ్ళు స్థంభించిపోయినట్లయిపోయింది.. పాండవులు ఎక్కడికీ వెళ్లలేదనీ శ్రీకృష్ణుడు ఈ భూమిని విడిచిపెట్టలేదనీ అతడికి తెలిసివచ్చింది. .నీలో. అతనికి పాండవులు కనిపించారు. నీలో అతనికి కృష్ణదేవుడు కనిపించాడు. ఆ కనిపించడంతో అతడు కంపించాడు. తన పదఘట్టనలతో ఈ భూమినీ భూమిపైన ధర్మాన్ని తుత్తినియలుగా చేసేయాలి అన్న ప్రయత్నంలో ఉన్న అతడు నీపాదాలకు మోకరిల్లాడు. ఆ క్షణాలలో నీవు ఆ దేవదేవుణ్ణే అనుభవిస్తూ నిలచిఉన్నావు. అలా నిలచి ఉన్న నీలో ఆ దేవదేవుడి సాక్షాత్కారాన్ని పొందాడు ఆ కలి. పాండవ సహిత శ్రీకృష్ణుడే నీ రూపమని అతడికి అనుభవమైంది. ఉత్తముడైన ఒక చిత్రకారుడు పాండవులతో పరివేష్టితుడైన కృష్ణ భగవానుని ఒక చిత్రంలో చిత్రించాడనుకో, ఉన్నది ఎందరయినా చిత్రం ఒక్కటే కదా! పాండవ సహితుడైన శ్రీకృష్ణునికి ఈనీ ఉపాధి అలాంటిది. ఈ నీ దేహం అలాంటిది.

అయితే ఆ చిత్తరువు తానుగా కదలదు. ఈ చిత్తరువు కదులుతుంది. ఈ కదులుతున్నప్పుడు కూడా తానుగా కదులుతోందా లేక దేవదేవుని సంకల్పమే ఈ కదలికగా రూపొందుతున్నదా? అన్నది అనుభవైక వేద్యమైన అంశం.

"కాలచక్రం నీ మీదుగా తిరిగింది. కావలసినంత కాలం ఈ భూమిని నిండుగా పరిపాలించావు. తృప్తిగా పరిపాలించావు. సుభిక్షంగా సకల సిరిసంపద

లతో ఈ భూమి వర్ధిల్లింది నీ ఏలుబడిలో. ప్రజలు అన్నివిధాలా నిన్ననుసరించారు. ధర్మదేవత మళ్ళీ నాలుగు పాదాలతో నడవగలుగుతున్నానని ముచ్చటపడింది. ఇంతలో నీవు శరీరాన్ని విడిచిపెట్టవలసిన వేళ అయింది. శరీరాన్ని విడిచి పెట్టడమనేది ఎవరికైనా తప్పదు కదా! అయితే ఆ తరువాత కథ ఏమిటి? ఆ తరువాతి కథ కోసమే నీ కథ ఈ చిత్రమైన మలుపు తిరిగింది".

'అలాగా మహర్షి! అందుకా ఈనా జీవితం ఇలా మలుపు తిరిగింది!' అన్నట్లుగా చూస్తున్నాడు పరీక్షిత్తు.

'అవును మహారాజా! ఈ మలుపు సామాన్యమైనదికాదు. దేవదేవుని సంకల్పమే ఇది'. అన్నట్లుగా తలను పంకిస్తున్నాడు శుక యోగీంద్రుడు.

## అనన్య చింతన

'యోగీంద్రా! ఈ నా జీవితం ఇప్పుడే తిరుగుతున్న మలుపును గూర్చి మరింత వివరంగా నీవు నాకు చెప్పగా వినాలని ఉన్నది' – అన్నట్లుగా ఆర్తితో చూస్తున్న పరీక్షిత్తును కరుగుతున్న మనస్సులోనుండి చూస్తూ, ఇలా చెప్ప సాగాడు శుకయోగీంద్రుడు "మహారాజా! దేవదేవుని గూర్చిన అనన్యచింతలో ఒకానొక దివ్యవైభవం నిన్ను వరించగా, నీ పరిపాలన అలవోకగా, హాయిగా, మూడు పూవులు, ఆరుకాయలుగా, సాగిపోతూ ఉండగా, కాల మహిమచేత, దైవయోగంచేత నీ మనస్సుకు వేటకు వెళ్ళాలనిపించింది. పాండురాజుకు వేటంటే ఎంత ఇష్టమో, నీకు తెలిసిందే కదా! ఆ వారసత్వం అప్పుడు నీలో మెదిలింది. ఆ మెదలడానికి కారణం నీ మనస్సు, ఇంద్రియాలూ కాదు. కేవలం దైవయోగమేకారణం. ఆ దైవయోగం నీకు గల వారసత్వాన్ని వినియోగించుకో దలచుకున్నది. ఇకనేమున్నది? నీవు వేటకని బయలుదేరావు.

వేడుకగా మొదలైన వేట క్రమంగా వ్యసనంగా రూపొందింది. క్షత్రియులైనవారు వేడుకగా వేటాడవచ్చు. తమ సామర్థ్యాన్ని ప్రదర్శించుకోవచ్చు. అలాగే క్రూరజంతువుల వలన జన సామాన్యానికి ప్రమాదాలు ముంచుకు వచ్చినపుడు వేటకు ఉపక్రమించవచ్చు. వివేకవంతుడైన క్షత్రియుడు తన వేడుకనూ, జన సామాన్యం యొక్క అవసరాన్ని అనకలుపుకుని, వేట యెడల గల తన అభిలాషను సద్వినియోగంచేస్తాడు. నిజానికి నీవు అలాంటి సత్ క్షత్రి

యుడవు. కాని, దైవయోగం మరొకలా ఉన్నది మరి ! వేడుకగా మొదలైన వేటను, అది వ్యసనంగా రూపొందించి వేసింది. అప్పుడిక నీచేతిలో వేటలేదు. వేట చేతిలో నీవున్నావు. వేటచేత నీవు వేటాడబడుతున్నావు. గుర్తుందా. అప్పుడేం జరిగిందో? నీ అనుచరులందరూ నీకు వెనుకబడి పోయారు. కాని అది నీ గమనికలో లేదు. ఒంటి వాడివై సాగిపోతున్నావు, కొట్టవలసిన లక్ష్యం వైపుగా.

"నిన్నంతగా రెచ్చగొట్టి తన వెంట నడిపించిన ఆ మృగము చిత్రంగా మాయమైంది. నీవు మాత్రం ధూళి ధూసరితమైన దేహంతో, ఆకలితో దహించుకుపోతున్న కడుపుతో, దాహంతో అర్చుకుపోతున్న గొంతుతో, ఏమీ తోచని స్థితిలో పడిపోయావు.

"ముందు దేహం నిలబడాలి. అందుకు కనీసం కాసిని మంచి నీళ్ళైనా కావాలి. దప్పిక తీరితే దేహానికి కొద్ది మాత్రమైన పట్టు లభించే అవకాశం ఉంది. అంతగా సడలిపోయింది నీదేహం. అంతగా బడలిపోయింది నీదేహం. ఉద్వేగంతో ఊగుతున్నది మనస్సు. అదీ అలసిపోయింది. దాదాపు శిథిల మైపోయింది పని చేయలేని స్థితిలో పడిపోయిందది. పరిగెత్తడంవల్ల దేహం ధూళి ధూసరితమై పోయినట్లుగా, వేటకోసం జరిగిన తీవ్రప్రయత్నంలో మనస్సు కూడా ధూళి ధూసరితమై పోయింది. రజస్సులో పనిచేసి పనిచేసి, ఆ రజోగుణ దోషంలో ఊగుతూ, తూగుతూ, తూలుతూ నిలబడలేక నిలబడలేక నిలబడుతోందది. దేహం, బయటి రజస్సుతో కమ్ముకుపోయింది. మనస్సు, లోపలి రజస్సుతో చుట్టుకుపోయింది. దేహానికి అన్నపానాలు కావాలి. దేహా నికీ, మనస్సుకూ కలిపి చక్కని విశ్రాంతి కావాలి. కాని అవన్నీ అక్కడెలా దొరుకుతాయి? అవన్నీ అక్కడెలా అమరుతాయి?

"కనీసం కాసిని నీళ్లయినా దొరుకుతాయేమోనని కనులకు కనబడినంత మేరా ఆశతో వెతికావు. ఆత్రంగా పరికించావు. కానీ, ఎక్కడా ఆ అవకాశం కనిపించలేదు. అలాంటి స్థితిలో, నీవేమయి పోతున్నావో నీకే తెలియనిస్థితిలో, నీ మనస్సు, నీదేహం నీవశంలో లేని స్థితిలో తూలుతూ, సోలుతూ అడుగులు వేయలేక వేస్తూ, ఎలాగో అలా అతికష్టంమీద శమీక మహర్షి ఆశ్రమం దాకా వెళ్ళగలిగావు.

"ఆ శమీకుడైనా మామూలుగా ఉండవచ్చుకదా! ఉంటే కథేముంది

చెప్పు. ఆయన ధ్యానంలో ఉన్నాడు. తనలో తానున్నాడు. తన్ను తానుచూచుకుంటున్నాడు. నీకు బాధ కలిగింది. ఆయన నిన్ను చూడలేదు. చూచి, సేదతీర్చలేదు. నీ అంతట నీవు నోరు తెరిచి అడిగినా, ఆక్రోశించినా కనీసం కదలలేదు. మెదలలేదు. ఇక్కడేదో ఆశ్రమం ఉంది. ఋషులుంటారు. ఇక నా బడలిక తీరిపోయినట్లే అనుకొని ఆశపడిన నీకు భంగపాటు ఎదురైంది. వారుగా పట్టించుకోక పోగా, నోరు తెరచి అడిగినా పట్టించుకోలేదు. ఏమిటీ దుస్థితి? దుస్థితి వారిదా, నాదా అని నీ మనస్సిక వివశత్వాన్ని పొందింది. అసలే రజోగుణ దోషంతో చుట్టుకోబడి ఉన్నదేమో ఇక ఆ వివశత్వంలో అది ప్రవర్తించిన తీరు ఉన్నదే! అది పూర్తిగా నీ జీవ లక్షణానికి భిన్నమైనది. నీకు నచ్చని ప్రవర్తన నీనుండే వ్యక్తమయిందీ అంటే, అది రజోగుణ దోషం యొక్క విలాస మనుకోవాలా? దైవయోగం యొక్క ప్రవర్తన మనుకోవాలా ? అందుకే అన్నాను నేను, ఈ సన్నివేశం మొత్తం కలిపి ఒకానొక దైవయోగమని.

"శమీకుణ్ణి అదిలించావు. బెదిరించావు. ఏమిటీ ఋషులిలా అయిపోయారన్నావు. అసలు అది సమాధేనా? అని అనుమానించావు. చచ్చిన పామొకటి అక్కడ పడి ఉంటే తక్షణమే అది అతడి మెడకు చుట్టావు. ఆ ధ్యానం అభినయమైతే అది అంతటితో తేలిపోతుందనుకున్నావు. చిత్రం! శమీకుడు ఎప్పటిలాగానే ఉన్నాడు. నీవు చుట్టిన పాము నీ పరిహాసానికి చిహ్నంగా అతని కంఠాన వ్రేలాడుతోంది. అతని యోగస్థితిని సూచిస్తున్న నాగాభరణంలా!

అనుకున్న దొకటీ, జరిగినది ఒకటి అవడంతో నీవు విచలితుడవయ్యావు. జరిగిన తప్పేమిటో నీకా వెంటనే అర్థమయింది. కాని ఏం లాభం? జరిగిపోయింది కదా! నీకు తెలియకుండానే నీ మీదుగా అది జరిగింది. ఎలా జరిగింది? నీ మనస్సుకు ఎనలేని ఆశ్చర్యం. అంతులేని ఆక్రోశం. ఆ ఆక్రోశంలో ఇక నీకు దప్పిక అనిపించలేదు. ఆకలి అనిపించలేదు. బడలిక అనిపించలేదు. నీ శరీరస్థితి ఇక దృష్టిలో లేదు. దృష్టి అంతా జరుగకూడని సన్నివేశం జరిగిందేమిటన్న అంశంపైననే ఆ దృష్టిలో, ఆ దృష్టితో అలా మథనపడుతూ వెనుతిరిగావు. ఎలా నడుస్తున్నావో, ఎటువైపుకు సాగుతున్నావో నీకు తెలియదు.

'నీకోసం వెతుకుతున్న నీవాళ్లంతా నిన్ను కలిశారు. అనేక విధాల నిన్ను సేదతీర్చే ప్రయత్నం చేయసాగారు. కాని మనస్సు సేద తీరదే! ఇంతలో శృంగి శపించాడన్న వార్తనిన్ను చేరింది. 'ఏడవ రోజున తక్షకుడు కాటువేయబోతున్నాడు' అని వినగానే నీకే మనిపించింది? 'ఈ చేసిన పాపం ఆ విషస్పర్శతో

పోతే అది చాలు అనిపించింది. పాపంచేసిన ఈదేహం తక్షకుని పుణ్యమా అని తొలగిపోవడమే మేలనిపించింది. జరిగిన పాపానికి ప్రాయశ్చిత్త మేమిటా అని, పరిష్కార మేమిటా అని ఆలోచిస్తున్న నీకు శృంగి శాపం, శాపంలా అనిపించలేదు. ఒక వరంలా అనిపించింది. తగిన శిక్ష విధింపబడుతోంది. ఈ శిక్ష నన్ను పునీతుణ్ణిచేస్తే అది చాలు అనుకున్నావు నీవు. అందుకే శపించ గలిగిన సామర్థ్యం ఉండి కూడా, నీవు శృంగిని శపించలేదు శృంగి ఉద్వేగాన్ని అర్థం చేసుకున్నావు. అతడి మీదుగా జరుగుతున్న దేమిటనేది పొడగట్టించుకో గలిగావు. అలాగే, నీవు కావాలీ అనుకుంటే తక్షకుణ్ణి ఆపగలవు. అతడి విషప్ర యోగాన్నుండి బయట పడగలవు. కానీ, నీవా ప్రయత్నం చేయలేదు. చేయాలని నీకు అనిపించలేదు. విధించబడిన శిక్షను శిక్షణగా స్వీకరించటానికి నీవు సిద్ధంగా ఉన్నావు. అయితే నీముందు రెండు ప్రశ్నలు నిలబడి ఉన్నాయి. ఈ శిక్షణ సరిపోతుందా ? ఇది పూర్తి పవిత్రతను అందించగలగుతుందా? అన్న ప్రశ్న మొదటిది. 'అసలు ఈ కూడని సన్నివేశం ఎలా జరిగింది ? ఎందుకు జరిగింది ? నిరంతరం కొనసాగే కృష్ణుని స్మరణకు, ఆ అనన్య చింతకు విఘాతం ఎలా వాటిల్లింది? విఘాతం కలిగినందుకు నా మనస్సు పడుతున్న క్షోభనుండి ఈ శిక్షానుభవం తరువాతనైనా నాకు విముక్తి లభిస్తుందా? అన్న ప్రశ్న రెండవది. ఈ రెండు ప్రశ్నలకూ బదులు పలికి, నీకు ప్రశాంతతను చేకూర్చడానికే ఇందరు ఋషులు నన్ను తమ ముఖంగా స్వీకరించి, ఇక్కడ కూర్చున్నది.

'శృంగి శాపాన్ని నీవు స్వీకరించిన వైనం, నీ వెంతటి భాగవతమూర్తి వన్న అంశాన్ని తెలియచెపుతూ ఉన్నది. నిజానికి ఆ శాపాన్ని స్వీకరిస్తున్న క్షణాలలోనే నీ పవిత్రతను నీవు నీకు తెలియకుండానే తెలియచెప్పావు. ఇంకా పవిత్రుడవు కావడానికి శాపానుభవం వరకూ వేచి ఉండాలా? ఇక నీ రెండవ ప్రశ్నకు సమాధానం ఆ ప్రశ్నకు బదులుగానే నీకీ భాగవతం వినిపించ బడు తోంది. అనన్య చింతకు విఘాతం కలుగకుండా జీవించగలిగే నైపుణ్యాన్ని సాధకునికి అందించగలిగిన, అనుగ్రహించగలిగిన పవిత్రగ్రంథమిది. ఈ గ్రంథం యొక్క మహిమ ఎంతటిదీ అన్నది చెప్పవలసినది నీవే. నీమనస్సు పడుతున్న ఆ క్షోభను తొలగించటము ద్వారా ఈ గ్రంథము లోకులమధ్య ఆవిష్కరింపబ డుతోంది. దీని ఆవిష్కర్తవు నీవే! వైభవోపేతమైన ఈ గ్రంథాన్ని నీమీదుగా లోకానికి అందించాలన్నది దైవ సంకల్పము. ఆ సంకల్పానికి కావలసిన విధంగా నీ జీవిత సన్నివేశాలు మలుపు తిరగడం జరిగింది. అందుకనే ఇది ఒక

దైవయోగం అని నేను అంటూ వస్తున్నది.

'నీవు అనన్య చింతలో నిలిచావు. నీ ప్రజలను నిలిపావు. ఇప్పుడు నీకు దేహత్యాగ సమయం సమీపించింది. మరి, ఈ ప్రజలను అనన్యచింతలో నిలువగల సాధనము ఇక ఏది? ఆ సాధనాన్ని కూడా నీ మీదుగా, నీ చేతుల మీదుగా లోకానికి అందిచడానికే ఈ కథంతా.

కనుక పరీక్షిన్మహారాజా! ఇది నిజంగా నీవు సంతోషించవలసిన ఘడియలు. జాతికి కావలసిన శాశ్వతమైన వెలుగును నీమీదుగా, నీ చేతుల మీదుగా అందించగలుగుతున్న శుభఘడియలివి. కనుక ఈ భాగవత మహిమను నీ వనుభవించి, మీరూ ఇలా అనుభవించండీ, అని లోకానికి ఇక తెలియచెప్పగలవు నీవు. అనన్యచింత యొక్క ఆవశ్యకత ఎంతటిదీ, అన్న అంశాన్ని నీజీవితమే తెలియచెపుతున్నది. రజోగుణ దోషకారణాన కొద్ది క్షణాలు అనన్యచింతనుండి నీవు తప్పుకునేటప్పటికి కదా! శమీక మహర్షి సన్నిధిలో అంతపని జరిగింది. ఈ సన్నివేశమే లోకులకు ఒక పెద్ద పాఠం. నిత్య జీవితానికి అంతగా అవశ్యకమైన అనన్య చింతనలో నిలబడగలగడానికి కావలసిన నైపుణ్యాన్ని అందించ గలిగినది, ఈ భాగవత గ్రంథం. ఇది కూడా నీద్వారానే వారికి అందుతూ ఉన్నది. అంటే అర్థమేమిటి? 'ప్రజలారా! అనన్యచింతయొక్క వైభవం ఎలాంటిదో నా జీవితంలో చూశారు. దానికి విఘాతం ఏర్పడితే సిద్ధించే పరిణామం ఎలా ఉంటుందో కూడా ఈ నా జీవితంలో మీరు చూస్తున్నారు. అలాంటి అనన్య చింతనను నిండుగా అందించ గలిగిన భాగవతాన్ని కూడా నా చేతుల మీదుగానే మీరు అందుకుంటున్నారు. ఇది నా చేతుల మీదుగా, నా వీనుల మీదుగా, మీ కందించటం ద్వారా నేను పునీతుడనవుతున్నాను. దీనిని స్వీకరించి, ఇక మీరూ తరాల తరబడి పునీతులు కండి! అని నీవు చెపుతున్నా వన్నమాట!"

పరీక్షిత్తు కనులనుండి ఆనందబాష్పాలు రాలుతున్నాయి. ఆ బాష్పాలతో శుకయోగీంద్రుని పాదాలను అభిషేకిస్తున్నాడతను. ఆ అభిషేకించబడుతున్న శుకయోగీంద్రునిలో పరీక్షిత్తుకు కాసేపు తల్లియైన ఉత్తర కనబడుతున్నది. కాసేపు తండ్రియైన అభిమన్యుడు కనబడుతున్నాడు. కాసేపు తాతలైన పాండవులు, ద్రౌపదితో కూడి కనబడుతున్నారు. మరి కాసేపటికి వీరందరినీ కలుపుకొని, తనలో నిలుపుకొని సహస్ర శీర్షాలతో కృష్ణదేవుడు దర్శన మీయ సాగాడు. అభిషేకం సాగుతూనే ఉంది.

# జీవితమే తపస్సు

తన కనుల ఎదుట జరుగుతున్న సన్నివేశాలను తనివితీరా చూస్తూ, తన మనస్సు మొత్తాన్నీ ఆ శ్రీకృష్ణుని దివ్య స్మరణకే అంకితం చేస్తూ, అందరిలో తానూ ఒకతెగా అంతవరకూ నిలబడిన కుంతీదేవి 'ఇప్పుడిక నా వంతు వచ్చింది' - అన్నట్లుగా నారాయణుని వైపు కదలి సాగింది. ఉత్తరను సమాధాన పరచి, అందరినీ సంతోషపరచి 'ఇక మరి వెళ్ళిరానా?' అని అన్నట్లుగా అందరివైపుకూ ఒక్కసారిగా కలియచూస్తున్న కృష్ణుడికి తన వైపుకే తన తనువంతా కనులు చేసికొని, కదలి వస్తున్న కుంతి కనిపించింది. అంతే! ఇక అతడికి కాలాడలేదు. అటువైపుకు సాగుదామనుకున్న కాలు ఇటువైపుకు దారి తీసింది. తన కొరకే నడిచి వస్తున్న కుంతికి ఎదురేగి 'అత్తా! నేనెప్పుడూ నీ వాడినే' - అన్నట్లుగా వైభవంతో కూడిన విధేయతతో, కన్నులతో ప్రేమను కురిపిస్తూ అలా నిలిచాడు.

"కృష్ణుడా! నీవు నాకు అల్లుడివి. అంతే కాదు. ఎప్పటికప్పుడు ఈ లోకాలన్నింటిగా అల్లుకుంటున్న వాడివి. మేనల్లుడా! ఈ లోకాలన్నింటిలో ఇటు చేతితో గాని, అటు మనస్సుతోగాని ఎక్కడ ఎలా తడిమినా అది నీ మేనుగానే నాకు భాసిస్తున్నదయ్యా! నీవు కానిది ఏమున్నది! కాని, నీవు ఇలా ఒక వ్యక్తిగా, మా వాడివిగా ఉండగోరి ఇలా వ్యక్తం కావడమున్నదే - ఇది నాకెప్పుడూ ఆశ్చర్యంగానే ఉంటుందయ్యా! ఆనందంతో కూడిన ఆశ్చర్యమది. అనుభూతితో కూడిన ఆశ్చర్యమది. ఆరాధనతో కూడిన ఆశ్చర్యమది. ఆత్మీయతతో కూడిన ఆశ్చర్యమది. ఆశ్చర్యం కాని ఆశ్చర్యమది.

జగత్తులోని వేలాది రూపాలన్నీ నీవే! నీ నర్తనలోని భంగిమలే ఇవన్నీ. నీవు జగన్నాటక సూత్రధారివి. పాత్రల నిర్వహణ నటునిపై ఎలాగ ప్రభావాన్ని చూపదో, ఈ భంగిమల విశేషాలేవీ అలాగ నీకంటవు. ఈ రాగద్వేషాలూ ఈ ఈర్ష్యాసూయలూ, ఈ మద మాత్సర్యాలూ, ఈ మంచి చెడులూ, ఈ ధర్మాధర్మాలు - ఇవన్నీ నర్తనంలో భాగంగా నీ మీదుగానే వ్యక్తమవుతున్నా, నీవు వీటన్నింటికీ అతీతుడవు. ఇలా చూస్తున్నకొద్దీ, ఈ సృష్టి, ఈ నీ సృష్టి, ఈ నీ జగన్నాటకం ఎంత విచిత్రంగా ఉంటున్నదో ఏమి చెప్పను? నీ సృష్టిని గూర్చి ఇలా అనుకుంటున్నప్పుడల్లా నీనుండి నాకొక మాట వినబడుతూ

ఉంటుంది. 'అత్తా! నీవూ నాలాగా ఉండి చూడు. అప్పుడు నీకూ నాలాగా ఎప్పుడూ హాయిగా ఉండటం చేతనవుతుంది. పాత్రపోషణ నీ మీదుగా జరుగనీ. అందులో నీవు ఇరుక్కోవలసిన అవసరమేమున్నది? ఇరుక్కుంటే సంసారజీవివి అనబడతావు. అప్పుడు నీకు సుఖమూ ఉండదు. నీ పాత్ర పోషణా రక్తి కట్టదు. ఏదీ నాలాగా నీ కీయబడిన పాత్రను నీవు వ్యక్తం చేసి చూడు. అప్పుడు ,ఆ పాత్రకు నీవంటుకోవు. నీకు హాయిగా ఉంటుంది. పాత్ర పోషణ రక్తి కడుతుంది. పాత్రను నిండుగా పోషించగలిగానన్న తృప్తీ కలుగుతుంది' అని.

ఈ విధంగా నీ నుండి సందేశం అందుతూ ఉంటే, ఈ నా పాత్రను ఎప్పటికప్పుడు నీ సందేశానికి తగినట్లుగా నడుపుకుంటూ వస్తూ ఉంటే - ఇదిగో ఇప్పటికి ఈ కథ ఇక్కడికి వచ్చింది. మరి ఇకపైన ఇంకెటు సాగనున్నదో! మామూలు నాటకంలో పాత్ర ఏమిటన్నది ముందే తెలిసి పోతుంది. మరి ఈ నీ జగన్నాటకంలో పాత్ర ఏమిటన్నది ఎప్పటికప్పుడు తెలుస్తూ ఉంటుంది. అప్పటికప్పుడు దానికి సిద్ధం కావలసి ఉంటుంది. ఈ నీ జగన్నాటకం నిత్యనూతనం. నిత్యమూ నూతనమే. ఎప్పుడూ క్రొత్తే! కాని క్రొత్తగా చూడకూడదంటావు నీవు. ఆశ్చర్యపడకూడదంటావు. అలా అవలీలగా, సహజంగా సాగిపోతూ ఉండాలంటావు.

అంతేనా అల్లుడా! ఇదేనా నీ బోధ? తెలిసీ తెలియని నేను నామూ టల్లో ఎంతవరకు చెప్పగలిగానో? ఎంతవరకు చెప్పగలిగినా ఆ చెప్పగలిగినంత సేపూ చెప్పుకుంటున్నంత సేపూ, జీవిత నిర్వహణలో ఈ సందేశాన్ని పాటించ గలిగినంత సేపూ ఎంత బాగుంటుందో! ఎంత బాగుంటున్నదో!

కనబడుతున్న ఈ సృష్టి అంతా నీ స్వరూపమే అని తెలిసినా ఈ సృష్టికి అతీతమయిన రూపం, నీ తత్త్వం ఎలా ఉంటుందో తెలుసుకోవాలనీ, అనుభవిం చాలనీ తపస్సంపన్నులయిన వారెందరో నిరంతరం ప్రయత్నం చేస్తూ ఉంటారు. మరి వారి ప్రయత్నం ఎంతవరకు ఫలిస్తున్నదీ అనేది వారు చెప్పాలి. లేదా నీవు చెప్పాలి. అది అలా జరుగుతూ ఉండగా మాలాటివాళ్ళం కనబడుతున్న ఈ లోకంలోనే, నడుస్తున్న ఈ జీవిత సన్నివేశాలలోనే, నిర్వహించవలసిన ఈ పాత్రపోషణలోనే నిరంతరం నిన్ను పొడగట్టించుకునే ప్రయత్నం చేస్తున్నాం. నీ స్మరణతోనే, నీవు ఒప్పగించిన బాధ్యతగానే ఈ జీవితాన్ని నీ సేవగ నిర్వహించుకునే ప్రయత్నంలో ఉన్నాం.

చిత్రం! మా ముచ్చటో మరి నీ ముచ్చటో, లేక మనందరి ముచ్చటో ఈ నీవు మానవుడిగా వ్యక్తమై, ఇలా మా మధ్య మనగలగడం. అల్లుడా! మేమెంతటి అదృష్టవంతులమయ్యా! తపస్సులో పండిన మునులకు మెరుపులా గోచరించి మాయమయ్యే నీవేనా? ఇలా మా మధ్య మావాడివై ఆత్మీయతను వర్షిస్తూ, అహర్నిశలూ ఇలా తిరుగాడుతున్నావు. తోటి మనుష్యులుగా ఉన్నవారు నీ రూపాలే అని భావించినందుకు వారిలో నిన్ను చూస్తూనే, వారి యెడల ప్రవర్తించినందుకు ఇలా మమ్మల్ని అనుగ్రహించావా? మామీద కరుణ కలిగి ఇలా మా తోటి మనిషిగా రూపు చెందావా? నాన్నా! నా అన్నవాళ్ళందరూ నాకు దూరమవ్వడమో, లేక నన్ను దూరంగా ఉంచడమో జరిగిన వేళ నిన్ను నమ్మి నడుస్తున్న నాకు నా వాడివిగా సాక్షాత్కరించావా? ప్రభూ! ఏమి నీ కరుణ! ఏమి నీ ప్రేమ! ఏమి నీ అనుగ్రహం! ఏమి నా అదృష్టం!

'ఏమి తపస్సు చేశాననయ్యా ఇలా నాకు దగ్గరయ్యావు?' - అని నా చూపులతోనే అడుగుతాను నేను. 'అత్తా నీజీవితమే ఒక తపస్సుకాదా?' - అన్నట్లుగా చూస్తావు నీవు. 'ఏమి నాకు తెలుసుననయ్యా ఇంత పెద్దరిక మిచ్చావు?' అని మళ్లీ అడుగుతాను నేను ఆ చూపులతోనే. అందరిలోనూ, అందరిగానూ ఉన్నది 'నేనే' నని గాఢంగా తెలిసిన నీకు ఇంకా తెలియవలసింది ఏమున్నదత్తా! అన్నట్లుగా చూస్తూ ఆదరిస్తావు నీవు. ఇంకా ఇంకా చెప్పాలనే ఉన్నది నీగూర్చి, అల్లుడా! ఇంకేమి చెప్పగలను? అన్నట్లుగా చూస్తాను నేను. 'అత్తా! వేదోపనిషత్తులు కూడా సరిగ్గా నీలాగానే చెప్పాయి.' - అన్నట్లుగా చూస్తావు నీవు. చూస్తూనే నాకు నీతో తాదాత్మ్యం అనుగ్రహిస్తావు.

తండ్రీ! ఇంతగా బాధ్యతపడి, ఇంత వాడివై, మా కొరకు ఇంతవాడివై, ఇన్ని విధాలుగా రక్షణ, శిక్షణలను అందిస్తూ నీ అడుగులోన మా అడుగు పడేట్లుగా చూస్తున్న నీకు, కంటికి రెప్పలా కాచుకుంటున్న నీకు, కృతజ్ఞతలు ఎలాగయ్యా చెప్పడం? కృతజ్ఞతలు చెప్పడం అసలు ఎలాగ సాధ్యం? కృతజ్ఞ తలు చెప్పాలీ అంటే నిన్ను మాకన్నా వేరుగా చూడాలి. అది సత్యమూ కాదు. సాధ్యమూ కాదు. మరప్పుడేం చేయాలి? నాకు తెలిసిందల్లా ఒక్కటే. హృదయాన్ని నీ సింహాసనంగా చేసి, ఈ దేహాన్ని నీ దేవాలయంగా రూపొందిం చుకొని, నీవు ఇస్తున్న ఆదేశాలను ఈ జీవిత రూపంలో నిర్వహిస్తూ ఉండాలి. ఆ నిర్వహిస్తున్న వేళలో నీతో ఏకత్వాన్ని నిరంతరం అనుభవించగలగాలి. ఆ అనుభవించగలిగేటందుకు అన్నివేళలా, అన్నివిధాలా సంసిద్ధంగా ఉండటమే

మానవుడు చేయవలసినది. అదే నాకు తెలిసింది. నా దృష్టిలో సాధన అంటే అదే! ఆరాధన అంటే అదే! అల్లుడా! ఈ సంసిద్ధతను ఇలాగే కొనసాగనీ! ఈ సంసిద్ధతను ఇలాగే కొనసాగనీ!"

కుంతీదేవి గొంతు అర్ద్రమవుతోంది. ఆమె కనులు అనుభూతిని బాష్పాలుగా వర్షిస్తున్నాయి.

కుంతీ కృష్ణులు అలాగే నిలబడి ఉన్నారు. ఒకరిలో ఒకరు కనబడుతున్నారు. ఒకరిలో ఒకరు నిలబడుతున్నారు. ఇరువురూ ఒకరుగా కనబడుతున్నారు.

ధర్మజాదులు వారికి అంజలించారు. ఋషివరులు వారిని ప్రస్తుతించారు.

రచన చేస్తున్న వ్యాసుని హృదయం అలా ఆ దృశ్యంలో కరిగిపోతున్నది.

వినిపిస్తున్న శుకయోగీంద్రునికి అనుభూతితో నిండిన గొంతు 'ఇక కాసేపటిపాటు సాగలేను' - అంటున్నది.

వింటున్న పరీక్షిత్తును కుంతీ కృష్ణుల దివ్యసన్నిధి కావలసిన లోకాలకు తరలించుకుపోతున్నది.

## అల్లుని అల్లిక

అర్ధనిమీలిత మయిన నేత్రాలనుండి జాలువారుతున్న అనుభూతి బాష్పాలను అర్థవంతమయిన భాషణాలుగా రూపొందిస్తూ కృష్ణదేవునితో ఇలా అన్నది కుంతీదేవి

"ఈ నా జీవితం ఒక దశకు చేరుకున్న చరిత్రాత్మకమయిన సమయమిది. ఈ సమయంలో కథకు సారథివయిన నిన్ను ఇలా చూస్తుంటే గతమంతా ఒక్కసారి కనులముందు మెదులుతోంది. బిడ్డలతో నన్ను మిగిల్చి, అర్థాంతరంగా నా పతిదేవుడు పరలోకానికేగినప్పుడు - అప్పటి నా పరిస్థితి తలుచుకుంటే, ఇప్పటికీ అదోలా అయిపోతాను నేను. కాని దైవగతిని తప్పించగల వారెవ్వరు? అప్పటివరకూ పతి వెంట నడిచిన నేను అప్పటినుంచి బిడ్డలను పెంచి, పెద్ద చేయడమనే కర్తవ్యం వెంట నడవసాగాను. ఆ నడకలో నా బంధువులెవ్వరూ నాకు కలిసి రాలేదు. జీవిత ప్రయాణంలో, కర్తవ్య నిర్వహణలో ఒంటరిదాన్నయి పోతానేమో అనుకున్నాను. ఒంటరితనమనే ఈ నరకాన్ని ఎలా

భరించగలను అనుకున్నాను. కాని, నడక సాగుతున్నకొద్దీ నాకు తెలిసింది - నేను ఒంటరిదాన్ని కానని, నేను ఒంటరిగా లేనని. అడుగడుగునా నీ స్పర్శ, నీ సన్నిధి, నీ సహకారం, నీ సారథ్యం నాకు నిండుగా అనుభవానికి రాసాగాయి. అంతే! ఇక నాకు జీవితం బరువనిపించలేదు. బాధ్యతగానూ కనిపించలేదు. నీ లీలగా, నీవైభవ విశేషంగా మాత్రమే గోచరించసాగింది.

గతకాలపు ఆ సన్నివేశాలు అప్పటికవి ఉత్కంఠ భరితాలు. ఇప్పటికవి మధురస్మృతులు. కృష్ణుడా! సన్నివేశం జరుగుతున్న సమయానికీ, జరిగిపోయిన కొంత కాలానికీ మనిషికి కలిగే అవగాహనలో చాలా తేడా వస్తుంది కదా! పిల్లలు పెరుగుతున్నారు. క్రమంగా చేతికి అందివస్తారు అని అనుకుంటున్న వేళ, భీముణ్ణి హతమార్చాలని దుర్యోధనుడు ఎంత ప్రయత్నం చేశాడు! పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది అన్నట్లు తానంటే ఏమిటో ఆ దుర్యోధనుడు అప్పుడే, ఆ చిన్ననాడే తెలియచెప్పుకున్నాడు. దినదిన గండం నూరేళ్లాయుష్షు అన్నట్లుగా అయిపోయింది అప్పుడు పాండవుల పని. కానీ చిత్రం! ఇక ఈ పిల్లలు ఈ పూట దక్కరేమో అన్నంతటి సన్నివేశం వచ్చినప్పుడల్లా నీ కరుణ వారిపైన ప్రసరించడం వారు బ్రతికి బట్ట కడుతూ ఉండటం జరుగుతూ ఉండేది.

పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుకుంటున్నారు. ఎదుట వీళ్ళుండగా ఇక తమ ఉనికిని ప్రజలు పెద్దగా పట్టించుకోరని కౌరవులకు అనిపించింది. 'దూరంగా తీసికొనిపోయి అక్కడ వీళ్ళను హతమార్చి పారేస్తే' - అన్న ఆలోచన వాళ్లలో మెదిలింది. ధృతరాష్ట్రుని ఆమోదమూ, సహకారమూ వాళ్ళ ఆలోచనలకు లభించాయి. అంతే! కాశీ ప్రయాణం కట్టించారు. లక్కయింటిలో కాలక్షేపం చేయించారు. ఇంటితో పాటుగా ఇందరూ కాలిపోవాలన్నదే వాళ్ళకోరిక. అప్పుడు నీ భక్తుడయిన విదురుడు నాకూ, నా బిడ్డలకూ ఎంతగానో సహకరించాడు. నీ ప్రతినిధిగా పనిచేసి లక్క ఇంటి నుండి బయటపడే మార్గాన్ని సూచించాడు. చూపించాడు. భగవంతుడు భక్తుల రూపంలో వ్యక్తమవుతాడు. అతడిలో నిన్ను చూసి నమస్కరించుకున్నాను.

ఇక ద్రౌపదీ కళ్యాణం వేళ, స్వయంవరం సాగుతున్న సమయాన నీవే స్వయంగా వచ్చి అక్కడ నిలిచావు. నీ దివ్య స్వరూపం అందరినీ మంత్రముగ్ధుల్ని చేస్తూ ఉండగా, మత్స్యయంత్రాన్ని అవలీలగా కొట్టగలిగాడు అర్జునుడు. 'మీరు వచ్చి నిలబడండి చాలు. ఇక పనులు అవే అయిపోతాయి' - అని పెద్దలను గూర్చి ఆశ్రితులు అనడం లోకంలో మనం వింటూ ఉంటాం. ఆమాట

ఎంత నిజం! ఆ క్షణాలలో ద్రౌపదీ పాండవులకు భౌతికంగా కూడా దగ్గరయి, నీవు చూపిన ఆత్మీయత ఉన్నదే - అది అనుభవించవలసిందే! అభివర్ణించ డానికి అలవి అయ్యేదికాదు. ఆ ఆత్మీయత ఎంతటిదీ అన్నది కురుసభలో, వస్త్రాపహరణ సమయాన సకల లోకానికీ తేటతెల్లమయింది. కంటికి రెప్పలా కాచుకోవడమంటారే - అంటే ఏమిటో అప్పుడు నాకు పూర్తిగా బోధపడింది. తండ్రీ! ఆ సన్నివేశమే అలాంటిది. తలుచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. అటు దుర్యోధనాదుల దారుణ దౌష్ట్యాన్నీ, ఇటు అవధులెరుగని నీ కరుణా విశేషాన్నీ - అనుభవానికి తెచ్చిన విలక్షణ సన్నివేశమది. 'పిలిస్తే పలుకుతాడు దేవుడు' - అంటారే, అంటే ఏమిటో అప్పుడు నాకు అనుభవమైంది.

వస్త్రాపహరణ సన్నివేశంతో 'కౌరవులు వధార్హులు' అని నిర్ణయింప బడింది. ధర్మం ఎటుప్రక్కన ఉన్నది? అన్నది సకలలోక వాసులకూ స్పష్టమైంది. అయినా కొన్నాళ్ళపాటు పాండవులను జన సామాన్యానికి దూరంగా ఉంచ గలిగితే తమకేదయినా మేలు జరుగుతుందేమో, తమకు ప్రజల మనస్సులో ఇంతచోటు దొరుకుతుందేమో - అని ఆశపడ్డారు కౌరవులు. మళ్ళీ మాయా జూదంలో ఓడించి 'ఈసారి అరణ్యవాస, అజ్ఞాతవాసాలు చేసిరండి' - అన్నారు. ఈ పదమూడేళ్ళ కాలంలో ప్రజలని ఆకట్టుకోలేమా అని భ్రమ పడ్డారు. కురుసభలో వస్త్రాలను అందించిన నీ కరుణ అరణ్యవాసంలో పాండవులకు అస్త్రాలను అందించింది. ఆత్మవిద్యలో పాండవులు పరిపూర్ణులు కావడానికి, స్వధర్మ నిర్వహణలో వారు రాటు తేలడానికి అరణ్యవాసం ఎంతగానో ఉప కరించింది. ఇక అజ్ఞాతవాసం బంధుమిత్రుల బలగాన్ని సమకూర్చి పెట్టింది. అజ్ఞాతవాసం పూర్తయ్యేనాటికి, కథ కురుక్షేత్రానికి సిద్ధమైంది. మామూలుగా చూస్తే అరణ్య, అజ్ఞాతవాసాలు వేదనా భరితాలు కావాలి. నీ సాహచర్యంతో అవి సాధనా భరితాలయ్యాయి. 'కష్టాలు ఊరికేరావు' - అంటారు. అంటే ఏమిటో నాకప్పుడర్థమైంది.

కురుక్షేత్రం ఒక మహాశ్చర్యం! కౌరవుల వైపు నిలిచారు ఒక భీష్ముడు, ఒక ద్రోణుడు, ఒక అశ్వత్థామ, ఒక కర్ణుడు, ఒక కృపాచార్యుడు, ఒక శల్యుడు వీరిలో ఒక్కొక్కరినీ జయించడమే ఎంత కష్టం! అలాంటిది కేవలం పద్దెనిమిది రోజుల లోపున ఒక మహాప్రపంచ సంగ్రామాన్ని ఒక కొలిక్కి వచ్చే టట్లు చూశావు నీవు. మళ్ళీ ఇందులోనే అర్జునుడు విషాదంలో పడిపోవడం, నీవు గీతా బోధ చేయడం. నాకనిపిస్తుంది కదా! నీ గీతా బోధ సృష్టించిన

వాతావరణమే ఇటు వారిని, అటు వారిని అనకలుపుకొని, కథను చకచకా నడిపించివేసిందని. 'తెలిపి నడిపేవాడుంటే పనెంతసేపు' - అంటారే, అంటే ఏమిటో అప్పుడు నాకర్థమయింది.

ఒక మహాకార్య సాధనకు ఎక్కడెక్కడివారూ ఆకర్షింపబడతారు. కార్యం సానుకూలం కాగానే ఎక్కడివారు అక్కడికి వెళ్ళిపోతారు. అశ్వత్థామలో పైశాచిక ప్రవృత్తి విజృంభించడం, ఉపపాండవులంతా వెళ్ళిపోవడం - ఈ సత్యాన్నే కళ్ళకు కట్టిస్తుంది. వారు వెళ్ళిపోయినందుకు బాధపడాలా, వచ్చి వెళ్ళినందుకు కృతజ్ఞతలు చెప్పాలా? నాకు తెలుసు - 'వెళ్ళవలసిన వారికి నీవు అడ్డు పెట్టవు. ఉండవలసిన వారిని నీవు తొణకనివ్వవు' అని. అందుకు ఈ ఉత్తర గర్భాన్ని పూనుకొని నీవు నిలపడమే ప్రత్యక్ష సాక్ష్యం. జరిగినదానికి ద్రౌపదిని తట్టుకునేట్లు చేశావు. జరుగవలసినదానికి ఉత్తరను దెబ్బతినకుండా కాచావు. 'దైవానుగ్రహం లభించాలేగాని కష్టసుఖాలు రెండూ మనస్సుకు ఒకటిగా అనిపిస్తాయి. రెండింటిలోనూ అతడి అనుగ్రహమే అగుపడుతూ ఉంటుంది' - అంటారు పెద్దలు. అంటే ఏమిటో నాకిప్పుడు అనుభవానికి వస్తూ వున్నది.

చూస్తూ ఉంటే ఈ సన్నివేశాలు - ఇవి నా జీవిత సన్నివేశాలా లేక నీ లీలా విశేషాలా? నా జీవిత సన్నివేశాలుగా అనిపిస్తున్న నీ లీలా విశేషాలని నాకు అవగతమవుతూ ఉన్నది. గతం అవగతం కావాలేగానీ, అంతటా నీవే అనుభూతమవుతావు. నా జీవితాన్ని తలచుకోవడమంటే అది నీ వైభవాన్ని స్మరించడమే అవుతుంది. మరి ఈ నేను నీకన్నా వేరుగా ఉన్నానా? లేక నీ లీలకోసం అలా ఉన్నట్లు కనిపిస్తున్నానా? అల్లుడా! ఏమి నీ అల్లిక!

తండ్రీ! ఈ నీ తోడి సాహచర్యంలో ఈ జీవిత నిర్వహణమే ఒక తపస్సని గ్రహించుకున్నాను. దేహంతో తపస్సు చేయడం చాలదు. జీవితమే తపస్సుగా సాగాలి. మనస్సునూ ఇంద్రియాల్ననూ నిలుపగలగడం చాలదు. వాటిని నీవెంట నడుపగలగాలి. పత్ర పుష్పాలతో నిన్ను అర్చించడం చాలదు. జీవిత సన్నివేశాలతో నిన్ను అర్చించగలగాలి. విగ్రహాల రూపంలో నిన్ను ఆరాధించడం చాలదు. సృష్టిలోని సకల జీవరాసులను నీ సజీవ విగ్రహాలుగా ఆరాధించ గలగాలి.

మనిషి చేస్తున్న అధర్మానికి జవాబు చెప్పి తీరాలి. అయితే, ఆ జవాబు చెప్పేటప్పుడు అతణ్ణే ద్వేషించ నక్కరలేదు. దుష్టుణ్ణే ప్రేమిస్తూనే శిక్షించవచ్చు. అతణ్ణే ద్వేషిస్తూ మనం దుష్టులం కానక్కరలేదు. దుష్ట శిక్షణలో మన

ప్రేమ మరింత గాఢత్వాన్ని సంతరించుకోవాలి. గాఢతరమయిన ప్రేమ ధర్మ సంస్థాపన కార్యక్రమంలో దేవదేవుని ఒకానొక ఉపకరణంగా మనను తీర్చిదిద్ది నిలబెడుతుంది. ప్రభూ! సాగుతున్న నీ స్మరణలో నుండి, నాకు అందివస్తున్న సందేశాలివి. ఈ జీవిత క్షేత్రం నుండి పండి వస్తున్న సస్యాలివి."

కుంతీదేవి నుండి వెలువడుతున్న సంభాషణను చెవులార వింటూ ముచ్చట పడుతున్నాడు కృష్ణదేవుడు.

'భగవద్గీత ఈమెగా మూర్తీభవించిందా!' - అన్నట్లు చూస్తున్నారు పాండవులు.

శుకయోగినుండి ఈ కథను వింటూ 'కృష్ణుడంటే ఏమిటో ఇప్పుడు బోధపడుతోంది' - అన్నట్లుగా చూస్తున్నాడు పరీక్షిత్తు.

## సమదృష్టి

మూర్తీభవించిన భగవద్గీతలా నిలిచిన కుంతీదేవి స్ఫూర్తిమంతమయిన కన్నులతో కృష్ణదేవుని దివ్య విగ్రహాన్ని తనివితీరా త్రాగుతూ, త్రాగుతున్న వేళ కలుగుతున్న దివ్యానుభూతిని అక్షర బద్ధం చేస్తూ ఇలా ఉచ్చరించ సాగింది.

"తండ్రీ! దేవుని ఎదుట నిలబడిన మనిషి 'నాకు మించిన సన్నివేశాలు నా జీవితంలో రానీయకు ప్రభూ!' - అన్నట్లుగా చూస్తాడు. తనకు మించిన సన్నివేశాలు వస్తే ఎక్కడ తల్లడిల్లిపోవలసి వస్తుందోనని అతని భయం. ఒకవేళ అలాంటి సన్నివేశాలు వస్తే, వాటిని కష్టాల పరంపరగా భావిస్తూ, 'భగావాన్! ఏమిటి నన్నిలా కష్టాలపాలు చేస్తున్నావు?' - అని అనుకొంటూ ఆక్రోశిస్తాడు. ఇంత చేస్తున్నవాడు నీవైపు సూటిగా ఒక్కసారి చూడవచ్చుకదా! అదే చేయడతను. చేస్తే, అలా నీవైపు సూటిగా చూస్తే, నీ చూపులనుండి అతనికందే సందేశమేమిటో చెప్పనా - 'పిచ్చివాడా! నీకు మించిన సన్నివేశాలు రాకపోతే అసలు నీవెలా ఎదుగుతావు? నీకు మించిన సన్నివేశాలు రాకపోతే నాతో నీకు అవసరం ఏముంటుంది? నాతో నీకవసరం కలగనప్పుడు నా స్పర్శ, నా స్నేహం నీకు ఎలా లభిస్తాయి? అవి లభించకుండా నీ వుండగలవా పోనీ? అందుకే అటు నీవు ఎదగడానికీ, ఇటు నేను నీకు అందడానికీ పనికి వచ్చేటందుకే, నీకు మించిన సన్నివేశాలను నీ జీవితంలో వచ్చేలాగున చూస్తున్నాను'

- అని. తండ్రీ! ఈ నా జీవితంలో నడిచిన సన్నివేశాలన్నీ అలాంటివే కదా! అందుకొరకు వచ్చినవే కదా! నీ సన్నిధి ననుభవించేటందుకు, నీ వాళ్ళంగా మనగలిగేటందుకు లభించిన అవకాశాలే కదా!

తండ్రీ! ఈ సందర్భంగా ఇంకొక్క మాట చెప్పనా? సర్వుల యెడల, సకల సన్నివేశాల యెడల సమదృష్టితో సాగిపోవాలని కదా నీ సందేశం. అది నీనుండి. నాకు ఎలా అనుభవానికి వచ్చిందో ఒకింత చెబుతాను విను. నీ తల్లి అయిన దేవకీదేవి స్థితిగతులకూ, నాయొక్క స్థితి గతులకూ సన్నివేశాలలో పోలిక లేకపోవచ్చుగానీ, సారాంశంలో మాత్రం సామ్యమున్నది. ఇద్దరమూ, మానవ శక్తికి మించిన సన్నివేశాలలో నిస్సహాయంగా నీవైపుకు చూస్తూ, నిలబడిపోయిన వారమే. మరి నీవు తగిన సమయం రాగానే ఆ తల్లిని ఎలా రక్షించావో, ఈ నన్ను కూడా అలాగే రక్షించావు. సమదృష్టికి ఇంతకంటే ఉదాహరణ ఏం కావాలి తండ్రీ! ఇలాంటి సమదృష్టి నీ అనుగ్రహవశాన నరునికి అలవడాలేగాని, ఇంకేమి కావాలి చెప్పు. ఇక అప్పుడు పరిమితత్త్వం ఉండదు. అజ్ఞానాంధకారం అసలుండదు. తోటివారిని మనకన్నా వేరుగా చూడటమే కదా అజ్ఞానమంటే! మన అవసరాలకు కొండంత విలువనిచ్చి, తోటివారి అవసరాలను పట్టించుకోకపోవడమే కదా అజ్ఞానమంటే! మన అవసరాలు, మనకు సంబంధించిన వారి అవసరాలు ఎలాంటివో, మానవులందరి అవసరాలు అలాంటివే కదా! - అని తెలిస్తే అంతకంటే కావలసిందేముంది? అలాంటి సమదృష్టి ఈ నాకు కూడా అలవడేటట్లుగానూ, అలవడిన ఆ సమదృష్టి అలా సర్వకాల సర్వావస్థల యందు ఒకే తీరున కొనసాగేటట్లుగానూ కరుణించు తండ్రీ! నీనుండి ప్రసరించి, నా జీవితాన్ని నడిపించిన ఈ సమదృష్టి నా నుండి వ్యక్తమవుతూ, నా పరిసరాలను ప్రభావితం చేస్తున్న ఈ నీ సమదృష్టి పదికాలాలపాటు ఈ భూమిమీద తన ప్రభావాన్ని చూపించాలనీ, తరతరాల వారికి ఎప్పటి కప్పుడు మేలుకొలుపు కలిగి, ఈ సమదృష్టి వారికి అందాలనీ, నీకు చెందిన వారుగా, నీ వారుగా వారందరూ తమ తమ జీవితాలను నడపాలనీ, మేము రుచి చూచిన ఈ దివ్య వైభవాన్ని వారందరూ మరింతగా రుచి చూడాలనీ మనసారా కోరుకుంటున్నాను.

ఏమిటో చెప్పలేను. నాకందరూ నా బిడ్డలలాగానే కనిపిస్తారు. ఇప్పుడు పుట్టి ఉన్నవారే కాదు. ఇకముందు పుట్టబోయేవారు కూడా! పాండవులు నీ వెంట నడిచినట్లుగా అందరూ నీ వెంట నడవాలని నాకెప్పుడూ అనిపిస్తూ

ఉంటుంది. ఆ అందరికీ ఒక సంకేతమేనేమో ఈ పాండవులు! ఒక తల్లిగా నీ సన్నిధిలో నాకు కలుగుతున్న అనుభూతి ఇది. అర్జునుడిని నీవు 'నరుడా! నరా!' అని పిలుచినప్పుడల్లా, నరులందరినీ ఉద్దేశించి పిలుస్తున్నట్లే ఉంటుంది నాకు. అతడికి నీవు ఏం ఉపదేశిస్తున్నా, నరులందరికోసం ఆ ఉపదేశం వెలువడుతున్నట్లుగా నాకనిపిస్తూ ఉంటుంది. నరులందరిలోనూ ఈ నరుడే నాకు కనిపించేటట్లుగా, ఆ అనుభూతి ఆచంద్ర తారార్కమూ కొనసాగేట ట్లుగా అనుగ్రహించు తండ్రీ!

నరులలో కొందరు ఉన్నతమయిన వంశములలో జన్మించవచ్చు. కొందరు అపారమయిన శక్తియుక్తులతో అలరారవచ్చు. కొందరు అమితమయిన ధన సంపత్తితో తులతూగవచ్చు. ఇంకొందరు పాండితీ ప్రకర్షతో పరిమళించవచ్చు. అయితే వారిలో ఎవ్వరూ కూడా వాటిని చూసుకొని అహంకరించే స్థితికి దిగ జారకూడదు. అలా అహంకరిస్తే వారు అంధులయిపోతారు. నిన్ను చూడలేరు. వాటిని చూచుకొని అహంకరించే బదులు, వాటిలో నిన్ను చూచి, వాటిని సద్వినియోగం చేయగలగడంలో వారు శ్రద్ధ పెట్టాలి. అవి తమకెందుకు ఈయ బడ్డాయో, సృష్టిలోని తమ పాత్రపోషణలో వాటికి ఉన్న స్థానమేమిటో వారు తెలిసి మెలగాలి. 'భగవంతుడు మన పాత్ర పోషణకు గాను ఈ ఉన్నత జన్మనిచ్చాడు. ఈ శక్తియుక్తుల నిచ్చాడు. ఈ సిరిసంపదలనిచ్చాడు. ఈ విద్యాగంధాన్ని అనుగ్రహించాడు. వీటన్నింటినీ లోకరూపంలో ఉన్న ఆయన సేవలో సమర్పించుకుందాం.' - అని వారికి తెలియాలి. అలా తెలిస్తే, ఆ తెలిసిన ప్రకారం నడిస్తే, వారికి అహంకరించలేరు. 'ఒకరికన్న మనం ఎక్కువ' - అనే అజ్ఞానం నుండి 'అందరూ ఒక్కటే అందరిగానూ ఉన్నది ఆ ఒక్కడే' - అన్న దివ్య దర్శనంలోనికి వారు అడుగు పెడతారు.

తోటి నరులలోనే కాదు. సమస్త జీవరాసులలోనూ దేవదేవుడయిన నిన్ను చూడగలగాలి. 'నరులందరూ ఒక్కటే' - అన్న స్థితినుండి 'సమస్త జీవరా సులూ ఒక్కటే సమస్త జీవరాసులుగానూ వ్యక్తమవుతున్నది ఆ ఒక్కడే!' - అన్న దివ్యానుభవం అందిరావాలి. ఆ దివ్యానుభవాన్ని నరజాతికి అందించే టందుకే నీవు నీ అవతార కార్యక్రమంలో వివిధ జీవుల రూపాలను కూడా ఎంచుకున్నావు. ఒక మత్స్యావతారం, ఒక కూర్మావతారం, ఒక వరాహావ తారం - ఇవన్నీ ఏమిటి? 'ఆయా జీవరాసుల రూపాలలో వ్యక్తమవుతున్నది నేనే సుమా!' అని గుర్తుచేయడమే కదా! 'ఆయా జీవరాసుల రూపా

లలో నన్ను దర్శించి మెలగవలసింది' - అని హెచ్చరించడమే కదా! కనుక మానవుడు ముందు తోటి మానవులతో, ఆపైన సమస్త జీవరాసులతో శ్రుతి కుదుర్చుకోవాలి. అంతటా అన్నిటా నిన్ను చూడగలుగుతూ, స్వధర్మ నిర్వహణ రూపంలో నిన్ను అర్చిస్తూ, నీ తోడి తాదాత్మ్య స్థితిని అనుభవించగలగాలి. అణువు మొదలు బ్రహ్మాండము వరకు ఉన్నది ఒకే వెలుగని అనిపించడం కాదు. అనుభవానికి రావాలి. అలా అనుభవానికి వస్తేనే నరజన్మకు సార్థకత.

మనిషి మహాజ్ఞాని కావచ్చు. అనన్య చింతనతో నీ తోడి తాదాత్మ్య స్థితిని పొందుతూ ఉండవచ్చు. అయినప్పటికీ నిత్య జీవిత నిర్వహణలో ఎప్పుడు ఎలా ఉండాలో, ఎక్కడ ఎలా ఉండాలో అలాగే ఉండాలి. తనకీయబడిన పాత్రకు తగినట్లుగా వర్తించడం అతడికి బాగా చేత కావాలి.

ఈ సందర్భంలో నాకో సన్నివేశం గుర్తుకు వస్తోంది. నీ చిన్నతనంలోని సన్నివేశమది. నీవు వెన్నముద్దలు దొంగలించే వేళ అది. వెన్నకోసం నీవు కలియబడుతున్నావు. 'అదేం పని' - అంటూ అచటి గోపిక నీతో కలబడు తున్నది. ఆమెకు నీపైన కోపం వచ్చింది. నీవూ అంతకు మించి కోపాన్ని ప్రదర్శించావు. ఆ పెరుగు కుండను బద్దలు కొట్టావు. గోపికకు ఇక వివశత్వం వచ్చింది. దగ్గరలో ఉన్న స్థంభానికి ఒక త్రాటితో నిన్ను గట్టిగా కట్టివేసింది. నీకు దుఃఖం వచ్చింది. కళ్ళవెంట నీళ్ళు రాసాగాయి నీకు. అసలే అవి కాటుక కళ్ళు. ఆపైన వాటిని నీవు చేతులతో నలపసాగావు. కాటుకను తమతో కలుపుకొంటూ కన్నీళ్ళు ఈవలకు వస్తూఉంటే, నీ చేతులతో వాటిని ముఖమంతా పులుముకోసాగావు నీవు. అసలే నల్లని వాడివి. ఆనల్లని బుగ్గలపై కాటుకతో కలిసిన కన్నీళ్ళ చారలు. కళ్ళు చిన్నవి చేసి చికిలిస్తూ, నాకేమీ తెలియదన్నట్లుగా అమాయకంగా ఏడుస్తున్నావు నీవు.

ఏ వయస్సులో ఎలా ఉండాలో, ఎవరితో ఎలా ఉండాలో, ఏ సన్నివేశంలో ఎలా ఉండాలో - నరజాతి నిన్ను చూచి నేర్చుకోవలసిందే! దైవంతో తాదాత్మ్యం చెందడం అవసరం. అంటే, మానవుడిగా ఉండటం మానివేయ మని కాదు. మానవుడిగా పరిపూర్ణతను అనుభవించడానికి అనుక్షణం దైవం తోడి తాదాత్మ్యం అవసరం అని అర్థం. అల్లుడా! నీ రాజయోగ విధానం లోని రహస్యమిదేనా! ఏమో! నేనెంతవరకు విప్పిచెప్పగలిగానో? ఎంత చెప్పినా నీ గూర్చి చెప్పవలసింది మిగిలిపోతూనే ఉంటుంది. మిగిలిపోతూనే ఉంటుంది కదా, పోనీ చెప్పకుండా ఉందాము అంటే మనస్సందుకు అంగీకరించదే! ఎంత

చెప్పుకున్నా తనివితీరనప్పుడు అలా మిగిలిపోతూ ఉండటం అదీ మన మంచికే కదా! మనమింకా చెప్పుకోవడాని కవకాశమే కదా! 'తనివి తీరని కథ మిగిలి పోతూ ఉండటమే మంచిది' - అంటుంది మనస్సు."

కుంతీదేవి విచ్చిన తన కన్నులతో తనకు చనువిచ్చి మేనల్లుడై నిలిచిన ఆ మాధవుని రూపాన్ని అలా ఆస్వాదిస్తూనే ఉన్నది.

'వీరిరువురి ఈ కలయిక ఓహో లోకోత్తరం! మనకే కాదు మానవజాతికే ఈ కలయికలో నడిచిన కథలు ఆదర్శప్రాయం' - అంటూ పరవశులవుతు న్నారు పాండవులు ద్రౌపదితో కలిసి మరీ.

'శ్రీకృష్ణుని దివ్య తత్త్వాన్ని తరచి తరచి చూపిస్తున్నది. ద్వారాలు తెరచి తెరచి చూపిస్తున్నది' - అనుకుంటూ ఆమెకు అంజలి ఘటిస్తున్నాడు పరీక్షిత్తు శుకయోగీంద్రుని నుండి ఈ గాథను వింటూ.

## కొంగు బంగారం

'కృష్ణదేవా! ఈ మన కలయిక సకారణమూ, సార్థకమూ కదా!' అన్నట్లుగా అనుభూతి లోకాలలోనుండి అలా చూస్తూ నిలబడిన కుంతీదేవి ఆ దేవదేవుని ఉద్దేశించి ఇంకా ఇలా అన్నది.

"తండ్రీ! భూమి మీద నడుస్తూ అలా పైకి అప్పుడప్పుడు చూస్తూ సాగుతున్న మానవునికి ఆకాశంలో వెలుగుతున్న సూర్యుడు తనవెంటే వస్తున్నట్లుగా గోచరిస్తాడు. తన కొరకే వ్యక్తమవుతున్నట్లుగా అనుభూతిని కలిగిస్తాడు. ఇది నిజమా అంటే నిజం. కాదూ అంటే కాదు. వస్తున్నట్లుగా కనిపిస్తున్నాడు కనుక నిజం. ఎవరికి వారికి ఇలాంటి అనుభూతే కలుగుతోంది కనుక తన ఒక్కడి కొరకే వ్యక్తమవుతున్నాడు అనుకోవడం నిజం కాదు. అలాగే ఈ నీ అవతార కార్యక్రమంలో ఏ మాత్రం పాలు పంచుకున్న వారికైనా, ఏ మాత్రం నీ స్పర్శకు నోచుకున్నవారికైనా, నువ్వు వారి కొరకే దిగి వచ్చావనిపిస్తుంది. ఎవరికి వారికి అలాగే అనిపిస్తుంది. అందునా నీవందుకు అభ్యంతర పెట్టవు కూడాను. పైపెచ్చు 'అవును. అవునవును' - అన్నట్లుగా వారి వారి పైన ఎనలేని ఆత్మీయతను ఎల్లవేళలా వర్షిస్తూ ఉంటావు. మరి, అలాంటప్పుడు వారలా అనుకోవడంలో ఆశ్చర్యమేముంది? అనౌచిత్యమేముంది? అయితే అలా అనుకోవడంలో దోషం లేదుగాని, ఎవరికీ దొరకనిది మనకే దొరికింది. మనకు దొరకినది ఇది మరెవరికీ దొరికేది కాదు. అని అనిపిస్తే మాత్రం - అలా అనుభూతి పరులుగా వర్ధిల్లుతున్న వారు కాస్తా అహంభావ మూర్తులుగా రూపొందుతారు. చక్కని, చిక్కని పాలను చేతులారా ఉప్పరాయి

వేసి మరీ విరక్కొట్టుకోవడం లాంటి స్థితి ఇది! అలా విరక్కొట్టుకునే కుసంస్కారం లేకుండా ఉండాలే కాని నీ తోడి అంతటి ఆత్మీయతను అనుభవించడం కన్నా మానవుడికి కావలసింది ఏముంటుంది? నన్ను కరుణించాడు అనుకోవడంలో దోషం లేదు. నాకోసం దిగివచ్చాడు అనుకోవడంలోనూ దోషంలేదు. నాకోసమే దిగివచ్చాడు అని అనిపించినప్పుడు మాత్రం కొంత పచ్చితనం కనబడుతున్నది. కొంత పిచ్చితనం కనబడుతున్నది. ఆ పచ్చి లేకుండా ఉండాలీ అంటే, ఆ పిచ్చిలోపడకుండా ఉండాలీ అంటే మానవుడు ఏం చేయాలని నాకనిపిస్తోందంటే నిరంతరం నీ స్మరణలో ఉండాలి. చేరువైన వారిలో, చేరవచ్చిన వారిలో ఈ నిన్నే దర్శించ గలగాలి. అలా దర్శించగలిగినప్పుడు దైవం కన్నా ఇతరం అతనికి గోచరించనప్పుడు ఇక ఎవరిని, ఎవరున్నారని అతడు చిన్నచూపు చూడగలుగుతాడు. ఎవరితో తనని పోల్చుకుంటాడు. ఎవరున్నారని తనకన్నా తక్కువగా చూస్తాడు. కనుక, అహంకార మమకారాదులకు రాగద్వేషాదులకు అతీతంగా మానవుణ్ణి నిలబెట్ట గలిగినది నిన్ను గూర్చిన అనన్య చింతన ఒక్కటే. అప్పుడు, ఆ స్మరణలో మునిగితేలుతున్నప్పుడు 'దేవా! నేను నీ వాడిని. నిరంతరం నీనుండి వ్యక్తమవుతున్నవాడిని' - అని అనగలుగుతాడు. అందుకు తగినట్లుగా మనగలుగుతాడు. నేను నీ వాడిని. అని అతని కనిపిస్తే ఇక అంతా హాయే! అలాకాక 'నీవు నావాడివి.' అని అనిపిస్తే మనిషి ఒక సత్యభామ అవుతాడు. మళ్ళీ ఒకసారి నారదుడికి పనిపెట్టిన వాడవుతాడు. మాధవా! మానవుని కథ ఇంతే కదా! మధుసూధనా! ఇదంతా నీ లీలలోని భాగమే కదా! ముకుందా! ఇవన్నీ నీ ముచ్చటలలోని మురిపాలే కదా!

నీవు దిగివచ్చినప్పుడు, నీ స్పర్శ పొందిన వారికి ఏమనిపించుటకు వీలున్నదో చెప్పాను కదా! అలాగే నీవు దిగివచ్చినప్పుడు నీచే నిర్వహింపబడే వివిధ కార్యక్రమాలను కనులార కాంచే మానవులకు కూడ ఒక చిత్రమైన భావన కలిగేటందుకు వీలున్నది. అదేమిటంటే - ఏ కార్యక్రమంలో నిన్ను చూస్తే ఆ కార్యక్రమం కోసమే నీవు దిగివచ్చావు అనిపించడం. లేదా నీవు నిర్వహించిన ఏ కార్యక్రమం వారి తలపునకు వస్తే, అసలు ఆ కార్యక్రమం కోసమే నీవు వ్యక్తమయ్యావు అనిపించడం. ఇలా కనిపించడం, ఇలా అనిపించడం ఉన్నదే ఇది కూడా నీ లీలా విశేషాలలో ఒకటి. ఏ కార్యక్రమానికి ఆ కార్యక్రమం నీచేత సమగ్రంగా, సార్థకంగా నిర్వహింపబడుతుంది. అందునా అది ఒక లోకోత్తర కార్యక్రమమై ఉంటుంది. అనితర సాధ్యమైనదై ఉంటుంది. అందువలన ఈ కార్యక్రమం కోసమే ఆయన దిగి వచ్చాడేమో అని అనిపించడానికి

అడుగడుగునా కావలసినంత అవకాశముంటుంది. అలాంటి నీ కార్యక్రమాలను ఏ కొన్నింటిని స్మరించుకున్నా ఈ విశేషం బాగా బోధపడుతుంది.

పర్వతాలు ఎన్నిలేవు. కాని మలయ పర్వతాలనే మానవులు మరల మరల స్మరిస్తారు. ఎందుకని! ఆ పర్వతాల మీద నుండి సాగివచ్చే సుగంధ వాయువులు అలాంటివి కనుక. ఆ వాయువులకు అంతటి సుగంధం, సౌకుమార్యం ఎక్కడినుంచి వచ్చాయి? ఆ మలయ పర్వతాలపై చందన వృక్షాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి కనుక. అలాగే రాజపుత్రులు ఎందరు లేరు? కాని ఈనాడు రాజపుత్రులనగానే పాండు పుత్రులే అందరికీ గుర్తుకు వస్తున్నారు. ఎందుకని! వారి పరాక్రమం అంతగా వ్యక్తమయింది కనుక. వారి పరాక్రమానికి ఆ వన్నె తెచ్చినది ఎవరు? దేవదేవుడైన శ్రీకృష్ణుడు. చందన వృక్షాల వలన మలయ పర్వతాలు మానవులందరికీ మధురానుభూతులను అందించ గలిగినట్లుగా, దేవదేవుడైన నీ సాహచర్యం వలన పాండుపుత్రులు ప్రజలకు ఇంతగా పారవశ్యాన్ని కలిగించగలుగుతున్నారు. అందునా ధర్మజుడు తన పరాక్రమంతో పాటుగా, తనలోని ధర్మతేజానికి కూడా నీ సన్నిధిలో మరింత పదును పెట్టుకున్న వాడయ్యాడు. అతడికి నీవంటే ఎంతటి భక్తి! అతడంటే నీకెంతటి ప్రేమ! పెద్దలలో కొందరంటారు కదా! 'ఇలా ధర్మరాజును ధర్మం వెంట నడిపించడానికే నీవీ భూమి మీదకు దిగివచ్చావని.

పాండవులతో కూడినప్పుడు నిన్ను చూస్తే వీరి కొరకే దిగివచ్చావనిపిస్తుంది. ఎందువలన? నీ ధర్మ సంస్థాపన కార్యక్రమం వీరిని కలుపుకొని సాగింది కనుక. అలాగే దేవకీ నందనునిగా నిన్ను చూసినప్పుడు వారి కొరకే, ఆ దంపతుల కొరకే దిగి వచ్చావు అనిపిస్తుంది. ఎందువలన? నీ రాక్షస సంహారణ కార్యక్రమం ఎక్కువగా వారితోనే ముడిపెట్టుకొని ఉంది కనుక. అందునా, పూర్వజన్మలో ఆ దేవకీ వసుదేవులు తపస్సంపన్నులై వర్థిల్లిన వేళ వారికి ప్రత్యక్షమై, 'రాబోయే జన్మలో మీరు నాకు తల్లిదండ్రులౌతారు' - అని వారికి నీవుగా చెప్పావు కనుక. పెద్దలలో కొందరు ఆ వరాన్ని అమలు పరచి రాక్షస సంహారణ కార్యక్రమాన్ని పూర్తిచేయడానికే నీవిలా దిగి వచ్చావని కీర్తిస్తూ ఉంటారు.

ఇంకొందరు పెద్దలు సృష్టి కారకుడైన బ్రహ్మ వైపునకే చూస్తున్నారు. అసలు ఆయన కోరిక మేరకే నీవిలా వ్యక్తమయ్యావని వారు అభివర్ణిస్తూ ఉంటారు. ఎందువలన అంటే మానవుల పాపచింతనల వల్ల, దుష్ట ప్రవర్తనల

వల్ల ఈ భూమి బరువెక్కి పోయింది. సముద్రంలో మునిగిపోతున్న నావలా తయారయ్యింది. అందువల్ల భూమాత మొరను ఆలకించిన బ్రహ్మదేవుడు అను గ్రహించ వలసిందిగా నీ వైపుకు చూచాడు. ఆయన ఆర్తిని గమనించి, నీవిలా లీలా మానుష వేషధారివై సాగి వచ్చావు.

తండ్రీ! ఈ నీ అవతార కార్యక్రమం చిత్రాతిచిత్రమైనదిగా నాకు కనుపిస్తూ ఉంది. వ్యక్తమైన క్షణం నుండి ఎన్నెన్ని బాధ్యతలు నిన్ను చుట్టు ముట్టాయి! ఎందరెందరు రాక్షసులు నీ మీదకు కాలు దువ్వారు! కానీ చిత్రం! చిరునవ్వు చెదరకుండానే ఇందరికీ జవాబు చెప్పావు నీవు. ఆ చెపుతున్న వేళలో కూడా. ఎవరి జవాబు వారికి అందిందే తప్ప, నీ నుండి ఏం జరుగుతున్నది అన్నది చూపరులకు అంతు పట్టింది కాదు. కర్మాచరణలో కౌశలమన్నది నరజాతి నీనుండి నేర్వవలసిందే! ఇందరికీ ఇన్ని జవాబులు చెబుతూనే ఎక్కడి బాధ్యతలు అక్కడ నిర్వహిస్తూనే, విలాసవంతమైన చిరునవ్వుతో నీవు ముందుకు సాగుతూ ఉంటే - నిన్ను చూసి మురిసిన వారు కొందరు. నీ వాక్కులకు పరవశులైనవారు కొందరు. నీ సేవలో తమను మరచిన వారు కొందరు. నిన్ను గూర్చిన ఆలోచనలో ధ్యాన నిమగ్నులై పోయినవారు కొందరు. ఇలా, కొందరు, కొందరు ఈ కొందరు ఎందరు! ఈ భూమిమీద ఉన్న అందరు. ఈ భూమిమీద ఉన్న అందరూ ఏదోవిధంగా నీ స్మరణలో గడుపుతున్నవారే ఈనాడు. నీవు దిగి వచ్చేటప్పటికి ఇంద్రియాల వెంట ఇన్నన్నని చెప్పలేని కాంక్షలతో పరిగెత్తుతున్న వీరందరూ ఈనాడు నీ స్మరణలో మునిగితేలుతున్నారు. వారి మనస్సులకు ఇంద్రియాలకు వారి సకల ప్రవృత్తులకు ఈనాడు లక్ష్యం నీవే! తండ్రీ! ఇలా జీవులందరినీ ఒక్కసారిగా పరవశింపచేసి ఈ భూమినే బృందావనంగా రూపుదిద్దడానికి నీవు దిగివచ్చావని, నీకు వీటికోళ్ళు సమర్పిస్తున్నారయ్యా కొందరు.

అదిసరేకాని ఈ సందర్భంలో నాకనిపిస్తోంది కదా! మానవజాతి ఇప్పుడేకాదు. ఎప్పుడైనా ఈ తీరులోనే తరించగలదని. అవతారమూర్తిగా వ్యక్తమవుతున్న నిన్ను చూచిగాని, మహనీయుల రూపంలో వ్యక్తమవుతున్న నిన్ను గుర్తించిగాని మానవజాతి తరించవలసిందే! అవతార మూర్తుల రూపాలలో మహనీయుల రూపాలలో వెలుగొందుతున్న నిన్ను చూస్తూ, వింటూ ధ్యానిస్తూ, పరవశిస్తూ తరించవలసిందేగాని, మరొక మార్గం లేదయ్యా మానవజాతికి. నిన్ను గూర్చి నీ ఈ సృష్టి రూపాన్ని గూర్చి ఎంతగా అధ్యయనం చేసినా, ఎన్నెన్ని

విశేషాంశాలు తెలుసుకున్నా చివరకు మానవ రూపంలో వెలుగొందుతున్న నీకు చేరువైనప్పుడు మాత్రమే మానవుడు తరించగలిగేది.

తండ్రీ! ఈ భూమి మీద నరజాతిని తరింపజేసేటందుకు ఒక వైపున బ్రహ్మదేవుని నుండి మహర్షులు అందుకొని, నోరార వెలువరించిన వేదోపనిషత్తులు గోచరిస్తున్నాయి. మరొకవైపున ఆ వేదోపనిషత్తులను నిత్యజీవిత నిర్వహణలో అనుభవానికి తెచ్చే నీ దివ్య చరిత్రలు వెలుగొందుతున్నాయి. అవతారమూర్తుల రూపంలో, మహానుభావుల రూపంలో నీవు వ్యక్తం చేసే దివ్య జీవన మార్గమే మానవజాతికి వేదోపనిషత్తులను అనుభవానికి తెస్తున్నది. అలాంటి వేదపురుషుడవైన నీవు, సనాతనుడవైన నీవు, శాశ్వతుడవైన నీవు, సర్వాంతర్యామివైన నీవు ఈనాడు మాకు కొంగు బంగారమై, మా ఇంటి దీపమై, మా కంటి పాపవై, మాలోని వెలుగువై ఇచట వర్తిస్తున్నావు. ఇచట వర్తిస్తున్నావు."

కుంతీదేవి అర్ధనిమీలిత నేత్రాలతో అర్థవంతమైన చూపులతో అలా కృష్ణదేవుని వైపు చూస్తూనే ఉన్నది.

'మనతో ఇంతగా తిరిగిన శ్రీకృష్ణుని గూర్చి మనకు తెలియవలసినది ఇంకెంత ఉన్నదో!' - అన్నట్లుగా చూస్తున్నారు పాండవులు తల్లి వాక్కులను మరల మరల తలచుకొంటూ.

'ఈమె వాక్కులు ఉపనిషత్తులు. ఈమె వాక్కులు వెలుగు ముద్దలు' - అన్నట్లుగా చూస్తున్నాడు పరీక్షిత్తు శుకయోగి నుండి కుంతీదేవి దివ్య సంభాషణలను సావధాన చిత్తుడై, ఎనలేని శ్రద్ధతో వింటున్నవాడై.

## మంచి కోరిక

ప్రేమ నిండిన గుండెతో మమత నిండిన మనస్సుతో తన కొరకు మేనల్లుడిగా దిగివచ్చిన మాధవుణ్ణి మరల మరల కనులార చూస్తూ మళ్ళీ ఇలా అన్నది కుంతీదేవి.

"తండ్రీ! అన్నీ సజావుగా సాగుతున్న వేళలో అంతర్యామివైన నిన్ను గూర్చి ఆలోచించగలవారు ఎందరుంటారు? పనులు అడ్డం తిరుగుతున్నట్లుగానో, తమకు అందకుండా పోతున్నట్లుగానో అనిపించినప్పుడు మాత్రమే నిన్ను

గూర్చిన ఆలోచన ఒకటి మనుషుల మనస్సులలో మెదులుతూ ఉంటుంది. అప్పుడు కూడ తమకు తెలిసిన వారెవరైన ఆ ఇబ్బందులను తీర్చగలిగితే 'వారున్నారు కదా! ఇక ఆ పైవాడి సంగతి ఎందుకూ?' అనిపిస్తుంది. ఆ పైవాడే ఆ తెలిసిన వారి రూపంలో ఉన్నాడని వారికెలా తెలుస్తుంది? 'సమయానికి దేవుడిలా వచ్చాడు. కాపాడి వెళ్ళాడు'. అంటారు తప్ప 'సమయానికి దేవుడు ఇలా వచ్చాడు కాపాడి వెళ్ళాడు' అని గ్రహించుకోలేరు. కదా! తమకు తెలిసినంత మేరలో, తాము చూడగలిగినంత మేరలో తాము బయట పడటానికి అవకాశమన్నది ఇక లేదూ అన్నది స్పష్టమైనప్పుడు అప్పుడు మనిషి ఇక తప్పనిసరై నీ వైపుకు తిరుగుతాడు.

నా అదృష్టవశాన నా జీవితంలో మొదటినుండీ అలాంటి సన్నివేశాలే వచ్చాయి. అడుగడుగునా నిన్ను ఆశ్రయించక తప్పింది కాదు నాకు. నిన్ను ఆశ్రయిస్తూ, నీ అడుగులలో అడుగు వేస్తూ, నీ దానినిగా మనగలిగే, అదృష్టం అబ్బిందినాకు. జీవితంలో తొలినుండీ ఎదురైన ఆ మానవాతీతమైన సన్నివేశాలన్నింటికీ నేను కృతజ్ఞురాలినై ఉండాలి. మానవులకు అసాధ్యమైన ఆ సన్నివేశాలే మాధవుడైన నీకు నన్ను ఇంతగా దగ్గర చేశాయి కనుక. దారి కనుపించని ఆ దారుణ సన్నివేశాలు అప్పటికవి భరించలేనంత కష్టంగానే ఉంటాయి కాని నీ వైపుకు దారి తీసేందుకే అవి అలా వ్యక్తమవుతున్నాయి అని అటుపైన తెలిసినప్పుడు మనస్సునకు అదెంత ఆనందమో! వాన కురిసే ముందు ఉమ్మదీస్తుంది. ఇక ఊపిరందడం కష్టమనిపిస్తుంది. ఇంటా బయటా అంతటా స్తంభించి పోతుంది. ఈ కథ ఇలా సాగడం ఇక అసాధ్యమనిపిస్తుంది. ఇంతలో వాన వస్తుంది. ఊపిరందుతుంది. చల్లని గాలులు అన్ని వైపులనుండీ తాకుతూ జగత్తునంతటినీ పులకింపచేస్తాయి. ఇంటా, బయటా, అంతా హాయి. ఎంతలో ఎంతమార్పు! ఇది నీ సృష్టి రహస్యం. ఇది నీ కృపావృష్టి రహస్యం! అవి ఉమ్మదీస్తున్న క్షణాలా? నా దృష్టిలో ఈ జగత్తు నీ కొరకు విరహ పడతున్న క్షణాలు. కష్టకాలం వచ్చిందీ అంటే జీవితంలో కృష్ణయ్య దిగివచ్చే కాలం వచ్చిందన్న మాటే! మేఘంలా నీవూ నల్లటివాడివి. నీలమేఘశ్యాముడివి. నీల మేఘమే నీవు. నీవే నీల మేఘము. ఈ నీల మేఘం నుండి వర్షించే ఆ అనుగ్రహ వర్షముంటుందే, ఆ వర్షపు జల్లులో తడిసిన జన్మ జన్మ! ఆ వర్షపు జల్లులో సాగిన బ్రతుకు బ్రతుకు. నీలమేఘుడా! నీ లీలలోని అమోఘత్వాన్ని నేనెంతవరకు ఆకళించుకోగలిగానో కదా! ఎంతవరకు ఆకళించుకోగలిగినా ఇలా ఇంతవరకు నీవు తోడుగా నడిచి రాగలగటమున్నదే, అది చాలు తండ్రీ ఈ

జన్మకు! అది చాలు తండ్రీ ఈ కుంతికి!

నీవు సర్వాంతర్యామివని నాకు తెలుసును. ఈ రూపానికే నీవు పరిమితం కాదని, ఈ కనబడుతున్న అన్ని రూపాలూ నీవేనని కూడా నాకు తెలుసు. అయినా ఈ నీ రూపం లీలా మానుషమైనది. ధర్మ సంస్థాపన కోసం నీవు ప్రత్యేకంగా కోరి స్వీకరించినది. అలాంటి ఈ రూపంలో, ఈ మానవ రూపంతో నీవు మాకు దగ్గరయ్యావు. నీవు తప్ప మా దగ్గర ఇంకేమీ లేనంతగా నీవు మాకు దగ్గరయ్యావు. మా ఇంద్రియాలు, మా మనస్సులు ఈ నీ రూపాన్ని జుర్రుకోవడానికి ఎంతగానో అలవాటు పడిపోయాయి. నిరంతరం వాటికిదే పని. ఈ పనిలో ఉంటూ మిగిలిన అన్ని పనులూ అవలీలగా, నీ అజ్ఞకు అనుగుణంగా నిర్వహించేస్తూ వస్తున్నాయవి. అలాంటి నీవు, అంతగా అలవాటైపోయిన నీవు, మా నుండి ఏ రీతిలోనూ విడదీయబడటానికి అవ కాశం లేని నీవు ఇప్పుడు మానుండి, మా దగ్గరనుండి వెళ్ళిపోయే ప్రయత్నం చేస్తున్నావు అంటే - నాకు ఏమిటోగా ఉంది. ఇది, అది. అని చెప్పలేని బాధ ఏదో కలుగుతోంది. నీవు సర్వాంతర్యామివైనా, నిన్ను ఇలా కూడా చూడా లని మా అందరికీ ఎంతగానో అనిపిస్తోంది. ఋషులు నీ సర్వాంతర్యామిత్వం అనుభవానికి వస్తే చాలు, ఇక తృప్తి పడిపోతారు. మేము సామాన్యులం. నీ సర్వాంతర్యామిత్వం అనుభవానికి వచ్చేటట్లుగా నీవు మమ్మల్ని అనుగ్రహించినా నిన్ను ఇలా మానవరూపంలో చూడాలని మరీమరీ కోరుకునేవాళ్ళం.

అన్నట్లు అల్లుడా! ఆ ఋషులందరికీ కూడా ఈ మధ్యన ఇలాంటి కోరికే, సరిగా మా లాంటి కోరికే కలిగిందని విన్నాను. ఇలా మానవరూపంలో కూడా నిన్ను చూచుకోవాలనీ నీతో కలిసి తిరుగాడాలనీ. తమ తమ జీవితా లను నీతో పెనవేసుకోవాలనీ, తమ తమ దినచర్యలు నీ చుట్టూ తిరుగుతూ ఉండగా, తాము పరవశించి పోవాలనీ వారికే అనిపించిందట కదా! అనిపించే టప్పటికి నీవు వారిని అనుగ్రహించావట! ఆ అనుగ్రహమే వ్రేపల్లెలోనూ, బృందావనంలోనూ అంచెలంచెలుగా పొంగి పొర్లి ప్రవహించిందట. యుగయు గాలనుండి తపస్సంపన్నతతో సాగివస్తున్న ఋషులందరూ గోపికలై, రాసలీలలో తేలి ఆడారట! అల్లుడా! ఇది నిజంకాదా! వారికే అలా అనిపించినప్పుడు మరి నాకింకెలా అనిపిస్తుందో! నీకు వేరుగా చెప్పాలా స్వామీ!

"కృష్ణుడా! జీవి శరీరాన్ని విడిచిపెడితే మనస్సూ ఇంద్రియాలూ ఇక ఆ దేహంలో ఎంతవరకు, మనగలుగుతాయి చెప్పు. ఇటు పాండవులు గాని అటు

యాదవులు గాని లీలా మానుష విగ్రహుడవైన నీవు దూరమైన క్షణంలో అలాగే అయిపోతారు సుమా! అయితే మరి గోపికల మాటేమిటి? 'వారికి నేను దూరమైనా వారు నా స్మరణలో మరింతగా కుదురుకున్నారే తప్ప చెదరిపోలేదు కదా!' - అని నీవనవచ్చు. తపస్సంపన్నులైన ఋషులే గోపికలుగా దిగివచ్చారన్న సత్యం ఈ సందర్భంలో కూడా ధృవ పడుతున్నది. ఎందువల్లనంటే వారిలో జన్మల తరబడి సాధన జరుగుతూ వస్తున్నది. వారి ఇంద్రియాలూ వారి మనస్సులూ వారి వశంలోనికి వచ్చి చాలాకాలమైంది. కనుక వారికి నీ విచ్చిన అనుభూతి ఉన్నదే అది అలా నిలచిపోయింది. వారిప్పటికీ నీ సాన్నిధ్యంలోనే ఉన్నారు. ఎప్పటికీ నీ సాన్నిధ్యంలోనే ఉంటారు. మరి అలాంటి సాధన ఇటు హస్తినలో గాని, అటు ద్వారకలో గావి ఎంతమందిలో జరిగిందంటావు? వీరిలో నూటికి తొంభై తొమ్మిది మంది పెద్దగా సాధన లేకుండానే కేవలం నీ అనుగ్రహంగా నీ సాన్నిధ్యాన్ని అమితంగా అనుభవిస్తున్నారు. అలాంటప్పుడు నీవు దూరమయితే, ఈ అనుభూతి మాయమై వెనుకటి స్థితులలోనికి వీరిలో ఎక్కువమంది జారిపోతారు. సాధనలేని మనస్సు అనుభూతిని ఎంతవరకు నిలుపుకోలగదు? నా అదృష్టవశాన అటూ ఇటూ నీవు తిరుగుతూ ఉండగా అందరూ అనుభూతిలో మునిగితేలడమే ఇంతవరకూ చూస్తూ వచ్చాను. ఏమిటో ఈసారి నీవు వెళుతూ ఉంటే పనిమీద వెళుతున్నట్లు లేవు. 'పని అయిపోయింది ఇక వెళుతున్నాను' - అన్నట్లుంది. అందుకే నా మనస్సు నిన్ను అడ్డుకుంటున్నది. అర్థిస్తూ ఉన్నది. ఇదివరలో నీవెన్నిసార్లు వెళ్ళలేదు. ఎన్నిసార్లు రాలేదు. కాని అప్పుడెప్పుడూ ఇంతగా అనిపించలేదు. కృష్ణుడు ఎంతగా మనవాడో అంతగా పనివాడు. పనివెంట అతడు సాగుతున్నప్పుడు మమకారంతో మనం అడ్డుపడకూడదు అనిపించేది. కాని ఇప్పుడలా అనిపించడం లేదు.

ఇటు పాండవులకు గాని, అటు యాదవులకు గాని శక్తి యుక్తులు సంక్రమించాయన్నా, రాజ్య సంపదలూ, కీర్తి ప్రతిష్ఠలూ వారిని వరించాయన్నా అవన్నీ నీ స్వరూపమే కదా! నీ వైభవమే కదా! నీ అనుగ్రహాన్నే వీరందరూ ఇన్ని విధాలుగా అనుభవిస్తూ వస్తున్నారు. నీవు దూరమైన వేళ వీరితో ఇవన్నీ నిలుస్తాయా? ఇప్పటి ఈ స్థితిలో వీరెంత వరకు నిలబడగలుగుతారు?

వీరిమాట ఇలా ఉండగా ఈ భూమిపైన నీవు అడుగిడినప్పటినుండి నీవు వేస్తూ వస్తున్న ప్రతి అడుగుకూ ఈ భూమి పులకిస్తున్నది. పల్లవిస్తున్నది. పలవరిస్తున్నది. ఆ అడుగుల కోసం పరితపిస్తున్నది. ఆ అడుగులు సోకినప్ప

డెల్ల పరవశిస్తున్నది. పరమపదాన్ని అలవోకగా అనుగ్రహించగలిగిన నీ పదాలు సోకినందుకు గాను ఈ భూమి ఇప్పుడు మోక్షభూమియై మెరసిపోతున్నది. మురిసిపోతున్నది. నేను కాదు అసలు ఈ భూమి నిన్ను విడిచి పెట్టగలదా? అల్లుడా! ఈ సంగతి కొంచెము ఆలోచించిచూడు.

నీ చూపులు సోకినంత మేర ఎన్ని పూలు, ఎన్ని పండ్లు? ఈ తీగల, ఈ తరువుల పులకింతలు అనంతం. ఈ లతల ఈ ఓషధుల ఈ పొదల పారవశ్యమది అమోఘం. ఈ నదీనదాల గుడిసుళ్ళు, పరవళ్ళు ఓహో అది ఏమందం! వీటన్నిటినీ ఏమందాం? ప్రకృతికి నీవు పెట్టిన గిలిగింతలా! నీ చూపులకు ఆమెకు కలిగిన పులకింతలా! కృష్ణుడా! నీతో కలిసిన ఈ ప్రకృతిని, నిన్ను పెనవేసుకునని ఉన్న ఈ ప్రకృతిని ఇలా చూస్తూ ఉంటే ఇలానే చూస్తూ ఉండాలని ఉంది. మరి ఆపైన నీ ఇష్టం!

నీతో నడిచే నీ నడకతో సాగివచ్చే ముచ్చట్లూ మురిపాలూ ఇవన్నీ నీ సన్నిధిలో ముక్తి ఎంతగా లభిస్తుందో ముచ్చటా అంతగా మురిపిస్తుంది. నీవు చూపే ముక్తి మార్గమే ముచ్చటయినది. ఈ ముక్తినీ ఈ ముచ్చటనూ మరింతగా మా మనస్సులు కోరుకుంటున్నాయి. అల్లుడా! అన్నట్లు మంచి కోరికలు ఉండవచ్చని నీవే చెప్పినట్లు గుర్తు."

చిరునవ్వులను చిందిస్తూ, తనతో తాదాత్మ్యం చెందుతున్న మేనత్తను మరింతగా మైమరపింపచేస్తున్నాడు కృష్ణదేవుడు.

'అమ్మా! సరిగా మాకోరికా ఇదే! అది నీ నోటినుండి వెలువడటమే సరిగా ఉన్నది' - అన్నట్లు ఆర్తిగా చూస్తున్నారు పాండవులు.

'ఆ చూపులు ఆ స్మర్శ ఈ మేనుకు కూడా సోకుతున్నట్లు గానే ఉంది మహర్షి, నీవీ గాథను ఇలా వినిపిస్తూ ఉంటే' - అన్నట్లుగా చూస్తున్నాడు అర్ధనిమీలిత నేత్రాలతో పరీక్షిత్తు శుకయోగీంద్రుని వైపు.

# ముచ్చటగా ముక్తి

'అత్తా! నీ ముచ్చట నా ముచ్చట కాదా? ఇచ్చట ఇలా ఉండాలని నాకు మాత్రం ఉండదా! కాని కథను బట్టిసాగాలి పాత్రలు. అవశ్యకతను బట్టి మసలుకోవాలి. అవతారపురుషులయినా. ఇది తప్పదు. కాల చక్రగమనాన్ని మన మందరం అనుసరించక తప్పదు. అయినా, నీ కోరిక నాకు నచ్చింది. నీ మాటలు నన్ను సంతోష పరచాయి. భూమి మీదకు నేను దిగివచ్చినందుకు నన్ను ఇలా దగ్గరగా చూడగలిగిన, దగ్గరయి చూడగలిగిన కొద్ది మంది నీలాంటి వాళ్లు చాలు నాకు. మీరే నా అనవాళ్లుగా ఆచంద్రతారార్కం యశః శరీరులై ఈ భూమి మీద మిగిలిపోతారు. తరతరాల మానవులు మిమ్మల్ని తలుచుకుంటూనే నాకు దగ్గరవుతుంటారు. అత్తా! ఈ విధంగా మన కథ శాశ్వతంగా జరుగుతుంటుంది. ప్రస్తుతానికి మనం కథను బట్టి నడచినా, నడచిన ఈ కథ వెంట నరజాతి చిరకాలం నడుస్తూనే ఉంటుంది. ఇంతకంటే ఏం చెప్పను? ఇంతకంటే ఏం చెప్పాలి?'

అని తన చూపులతోనే లాలనగా సంభాషిస్తున్న కృష్ణదేవుని గమనించుకుంటూ ఇలా అన్నది కుంతీదేవి:

"మనస్సున్న మనిషిగా, మమత లెరిగిన మనిషిగా, నాలో మెదిలిన భావనలన్నీ ఎలా మెదిలినవాటిని అలా నీ ముందుంచాను. నీ దగ్గర నాకామాత్రం స్వేచ్ఛ ఉన్నది కనుక! అలాంటి చనువును నీవే నీవుగా నాకిచ్చావు గనుక. ఈ నడచిన సంభాషణలను బట్టి ఇప్పుడు నాకేమనిపిస్తున్నదో నీకు విన్నవిస్తాను.

ఇటు హాస్తినలోని వారి గురించీ, అటు ద్వారకలోని వారి గురించీ కూడా నేను నీతో ప్రస్తావించాను. గోపికలను గూర్చిన ప్రస్తావన కూడా ఈ సందర్భంగా తెచ్చాను. తండ్రీ! ఒక్కమాట, ఆ గోపికలలో నేనూ ఒకతెను అయ్యేటట్లుగా నీవు నన్ను అనుగ్రహించాలి. శారీరకంగా మనం దగ్గరగా ఉన్నా. దూరంగా ఉండవలసి వచ్చినా - నేను మాత్రం మానసికంగా సర్వకాల సర్వావస్థల యందు నీ సాన్నిధ్యాన్నే అనుభవించాలి. నా మనస్సుకు నీ సాహచర్యం నిరంతరం లభిస్తూ ఉండాలి. 'అదేమిటత్తా' అలా అడుగుతున్నావు? ఇంతవరకు నీవు అనుభవించడం లేదా నిరంతరం నా సాహచర్యాన్ని? - 'అని నీవడగవచ్చు. నిజమే. అనుభవిస్తున్నాను. నిండుగా అనుభవిస్తున్నాను. కాని ఇప్పుడు నిన్నిలా

ఉడానికి కారణం ఒకటి ఉంది. కథ ఇంత వరకు జరిగిన తీరు వేరు. ఇకపైన జరిగే తీరు వేరు.

ఊహ తెలిసినప్పటి నుండి మానవాతీతమయిన సన్నివేశాలలో నీవు తోడుగా నడచివచ్చాను. కనబడని లోకాల నుండి కనబడే ఈ లోకాల వరకు అన్ని వైపుల నుండి, ఎన్నో విధాలుగా ముంచుకు వచ్చిన కష్టాల పరంపరలకు నిరంతరం జవాబు చెప్పవలసి రావడంతో - నా మనస్సుకు నీ స్మరణలో ఉండక తప్పింది కాదు. ఒక దాని తరువాత ఒకటి అన్నీ కష్టాలే. పైగా మామూలు కష్టాలు కావవి. మానవులు బదులు చెప్పగలిగినవి కావు. దైవం తానుగా కలగచేసుకుంటే తప్ప అవి దారిలోనికి రావు. అలాంటి వేళల్లో మనస్సు నిరంతరం నీ స్మరణలోనే ఉండేది. ఉండటం దానికి అవసరమైంది కనుక ఉన్నదా? ఉండటం దానికి అలావాటైంది కనుక ఉన్నదా? ఉండటం దానికి ఆనందంగా ఉన్నది కనుక ఉన్నదా? లేక అలా ఉండటమే తనకు అన్ని విధాలా తగినదని తెలుసుకొని ఉన్నదా? అలా అని అది తెలుసుకున్నదా? నీవు చెప్పవలసిన అంశమిది. చెప్పవలసిన అంశం కూడా కాదు. నీ దానినిగా ఉండగోరుతున్నాను కనుక నీవుగా దయ చూడవలసిన అంశమిది.

"ఇప్పటి వరకు కష్టాలూ కృష్ణుడూ నాతో కలిసి నడిచారు. మరి, ఇప్పుడేమో ఇక కష్టాలు అయిపోయినట్లుగా కనిపిస్తున్నాయి. మరి నాకేమో కృష్ణునితో కలిసి నడవాలని ఉంది. కృష్ణుడు అంగీకరిస్తాడా? 'కష్టాలు తీరిపోయాయి కదా! అత్తా! ఇక నేను వస్తాను - అంటాడా? అలా అనేటట్లయితే నేనింకా కష్టాలనే కోరుకుంటాను. ఎందుకని అంటే నాకు కృష్ణయ్య కావాలి కనుక. కష్టాలనయినా ఆహ్వానిస్తానుగాని. కృష్ణయ్యనుమాత్రం వదులు కోలేను. ఏం కృష్ణయ్యా! ఏమంటావు? అన్నీ నాతోనే మాట్లాడిస్తావు తప్ప నీవేమీ మాట్లాడవు. ఆ మౌనానికి అర్థమేమిటి? - అంటే - నీ వేది అనుకుంటే అదే - 'అన్నట్లుగా చూస్తావు. 'అన్నీ నేననుకోవడమేనా? నీ వనుకోవడమంటూ ఏదీ ఉండదా?' అంటే - అదేమిటి అలా అంటావు. నీకు అనిపించడమంటే అది 'నేను' అనిపించడం కాదా?' - అన్నట్లుగా చూస్తావు.

"సరే, నీవనిపించడమో, నాకనిపించడమో ఆ అనిపించింది చెబుతాను విను. తండ్రి అయిన శూరసేన మహారాజు ఏ క్షణాలలో నన్ను కుంతిభోజునకు అప్పగించాడో గాని - అప్పటి నుండి వయస్సుతో నిమిత్తం లేకుండా కర్తవ్యం వెంట ఈ జీవితాన్ని నడిపించడ మన్నది ప్రారంభమయింది. ఆ

నడిపించడమే నాకొక సాధన అయింది. కుంతి భోజుని ఇంట ముద్దు ముచ్చటల ననుభవిస్తూనే, నా బాధ్యతలను ఎరిగి మరీ మసలు కొనే దానిని. ముఖ్యంగా అతిథి అభ్యాగతులను సేవించడం అనాటి నా ప్రధాన బాధ్యత. ఆ బాధ్యతలో నేనుండగానే దుర్వాసమహర్షి సాన్నిధ్యం నాకు లభించింది. ఆ బాధ్యతను నేనెలా నిర్వహిస్తూ వచ్చాను అన్నదానికి ఆ మహర్షి నా యెడలః చూపిన వాత్సల్యమే ఒక తార్కాణం. 'బిడ్డా! అతిథి జనసేవ నీకొక సహజ సద్గుణమని ఆయన నన్ను మెచ్చుకున్న వేళ - కర్తవ్య నిర్వహణకు నన్ను నేను మరింతగా సమర్పించుకున్నాను. దుర్వాస మహర్షి సేవ లభించడంతో నా జీవితం మలుపు తిరిగింది. దేవ, మానవ లోకాలకు నడుమన నా జీవితం నిలిచినట్లైంది. నాకు మించిన సన్నివేశాలు నా జీవితంలో జరగడమన్నది అప్పటి నుండి ఇక ప్రారంభమైనది. సన్నివేశాలు నా నుండి సాగుతున్నాయా? లేదా సన్నివేశాల వెంట నేను నడిపించబడుతున్నానా? - అన్న మథనం నాలో ప్రారంభమైంది.

"వివాహమైంది. భర్త అరివీర భయంకరుడు. ఎంతటి వీరుడో అంతటి సాహసికుడు. ఎంతటి సాహసికుడో, అంతటి భోగి, ఎంతటి భోగియో అంతటి త్యాగి. అంతటి కర్తవ్య పరాయణుడు. ఆయన మనస్సెరిగి, ఆయనకు తగినట్లుగా, ఆయన శ్రేయస్సునకు తగినట్లుగా మసలు కోవడమే ఒక సాధనైంది నాకు. అంతటి వీరుడు ఒక్కసారిగా, అకస్మాత్తుగా ఈ నా జీవితంలో నుండి నిష్క్రమించాడు. ఈ బిడ్డలను పెంచి. పెద్ద చేసే బాధ్యతను మాత్రం నాకు వదిలాడు.

"అటుపైన కథ నీకు తెలిసినదే. నీ చేతుల మీదుగా సాగినదే కదా! బిడ్డలను పెంచి పెద్ద చేయడంలో ఎన్ని అటుపోటులను అనుభవించానో! నీవుగా కలుగ చేసికొని నాకు దగ్గరవ్వడంతో నా కర్తవ్య నిర్వహణ సూటిగా సాగింది. కష్టమనిపించలేదు. ఒక దీక్షగా సాగింది. ఇప్పుడు ఆ బాధ్యత కూడా పూర్తయింది. పాండు మహారాజు నాకు అప్పగించిన బాధ్యతను నీవు తోడు కాగా అనాయాసంగా నేను నిర్వహించ గలిగాను. అందుకు నాకు తృప్తిగా ఉంది.

"ధర్మ నిష్ఠులయిన పాండవులు నీ సారథ్యంలో విజయులై నిలిచారు. ఇక పాలకులై వెలుగుతారు. పరిపాలకులై నీ వెలుగును నలుదెసలా ప్రసరింపచేస్తారు. మరి నేను - నేనేం చేయాలి? ఇప్పుడిక నా కర్తవ్య మేమిటి?

రాజమాతగా హోదాల ననుభవించాలని నా కనిపించడంలేదు. పెద్దవాళ్లై నీ శిక్షణలో రాటు దేలిన ఈ పాండవులను ఇంకా కనిపెట్టుకొని ఉండవలసిన పని కూడా నాకు కనిపించడం లేదు. ఇక నా పని ఏమిటి అన్నది ఇప్పటికి తోచడం లేదు. పదవులు, హోదాలు, భోగభాగ్యాలు పరివార వైభవాలు మాత్రం చుట్టు ముట్ట బోతున్నాయి. తండ్రీ! ఇప్పడే నీ రక్ష నాకు కావాలి. నీ స్మరణలో ఈ మనస్సు ఇలాగే నిలిచేలాగున నీవే ఇక చూచుకోవాలి. కష్టస్థి తులలో నీవు గుర్తుకు రావడం సహజం. సుఖ భోగాలమధ్య నిన్ను గుర్తుంచు కోవడానికి మాత్రం చాలా సాధన కావాలి. అన్నిటికీ మించి నీ అనుగ్రహం కావాలి.

"సుఖ భోగాలను అనుభవించడం తప్పని నేను అనను. ఆ అనుభవం బిడ్డలయిన ఈ పాండవులకు చెందాలి. వారు ఆ సుఖ భోగాల రూపంలో కూడా నిన్నే అనుభవించగలగాలి. అలా అనుభవిస్తారనే నేనను కుంటున్నాను.

"ఇక నా విషయం. సుఖ భోగాల అనుభవం ఇప్పటి నా కర్తవ్యం కాదని నాకు అనిపిస్తున్నది. తండ్రీ! కరుణించు. నా కర్తవ్యమేదో దర్శింప చేసి, దాని వెంట నన్ను నడిపించు. బిడ్డలన్న మమకారం తల్లికి ఉండటం సహజం. బిడ్డలు పెరిగి పెద్దవాళ్లు కావాలీ అంటే తల్లికి ఆ మమకారం తగుమాత్రం ఉండాలి. నీ దయవల్ల నా బిడ్డలు ప్రయోజకులయ్యారు. సమర్థులూ, సంపన్నులూ అయ్యారు. చాలు. ఈ మమకార మిక చాలు. ఇక దీనిని ఉపసంహరించు తండ్రీ! 'వీరు పాండవులు కనుక వీరితో ఉండాలి. వీరు యాదవులు కనుక వీరి బాగోగులు నాకు కావాలి. - అన్న భావనలను, భ్రమలను నా నుండి ఇక తొలిగించు. ఈ భూమిపైన ఏ కర్తవ్యాన్ని నేను నిర్వహించ వలసి ఉన్నదో, ఏ పనిలో నేనుంటే - అది నీకు ముచ్చటో అదే నాకప్పగించు. నీ ప్రకారం, నీ ప్రణాళిక ప్రకారం కొసవరకు ఈ జీవితం సాగించ గలిగాను - అన్న తృప్తిని నాకందించు. 'భూమి మీదకు దిగివచ్చింది నాకు నచ్చిన పనిని చేయటానికి కాదు. నీవు అప్పగించిన పనిని నీ ప్రకారం పూర్తిగా చేయడానికి - అన్న వివేకాన్ని నిరంతరం నాలో వెలుగనీ తండ్రీ! నిరంతరం నాలో వెలుగనీ!

"మనిషి పిచ్చివాడు. తన ఇష్ట ప్రకారం బ్రతకాలనీ, అలా బ్రతకడం ద్వారా ఏదో బావుకోగలుగుతాననీ అనుకొంటూ ఉంటాడు. తన ఇష్టాలన్నీ జరిపించమని నిన్ను అడుగుతూ ఉంటాడు కూడా! కాని అతడికి ఒకటి తెలియటం లేదు. తన ఇష్టాన్ని నీ పాదాల దగ్గర సమర్పించి, నీ ఇష్టానికి

అనుగుణంగా నడుచుకోవడం మొదలుపెడితే అదెంత హాయిగా ఉంటుందో - అదే అతడికి తెలియడం లేదు, నీ ఇష్టాన్ని తన ఇష్టంగా రూపొందించు కోగలిగితే మనిషి ఇక ధన్యుడైనట్లే!

"తండ్రీ! అలాంటి ధన్యతను నా కందించు, నీ ఇష్టమే నా ఇష్టమై, నేనే నీవై, నీవే నేనై ఈ జీవితం నీ లీలా విశేషమై సాగిపోనీ! నది సముద్రంలో సంగమం చెందుతూ ఉంటుంది చూడు. అలాంటి సంగమాను భూతి నాకు నిరంతరం కలుగచేయి. అలా సంగమం చెందుతూ ఉండటంలో ఒకా నొక అనుభూతి ఉంది. సంగమానికి నోచుకోక పోయినా అనుభూతి లేదు, సంగమం చెందడం అన్నది పూర్తయి పోతే ఆ అనుభూతి కూడా అయిపోతుందేమో! అందుకని సంగమం చెందుతున్న అనుభూతి కావాలి నాకు. ఈ నేను నిరంతరం నీ వైపుకు ప్రయాణం చేస్తూ, అహర్నిశలూ నీతో సంగమం చెందుతూనే ఉండాలి. నిష్కామ కర్మ నిర్వహణ నిరంతరం జరుగుతూ ఉండగా, అహర్ని శలూ ఆ సంగమానుభూతి అనుభవానికి వస్తూనే ఉండాలి.

"మనిషి సాధారణంగా తానుగా జీవించకుండా మనస్సుగా జీవిస్తూ ఉంటాడు. తోటివారి వైపుకు చూసేటప్పుడు కూడా వారిలోని మనస్సుల వైపుకే చూస్తూ ఉంటాడు. మనస్సుతో, మనస్సుల వైపుకు చూస్తూ ఉంటే ఏం జరుగుతుంది? ఇష్టానిష్టాలు, రాగద్వేషాలు, ఈర్ష్యాసూయలు, మద మాత్సర్యాలు - ఇలాంటి వన్నీ పుట్టుకువస్తూ ఉంటాయి. అలాకాక - మనస్సు హృదయంలో కరిగి, తానంటే ఏమిటో తానెరిగి, ఆ వెలుగునే అంతటా చూడగలిగితే అది నీ రాజ్యమవుతుంది. అతడు నీవాడు అవుతాడు. అలాంటి నీ రాజ్యంలో శాశ్వతంగా నన్నుండి పోనీ తండ్రీ! అలా నిన్ను చూడటంలోని తరుగని అనుభూతిని మరింతగా నన్ననుభవించనీ!

"మొక్కుబడిగా నిన్ను చూచేస్థితి నాకొద్దు. నిన్ను నేను ఇష్టపడి చూడాలి. ఎంతగా ఇష్టపడాలీ అంటే నిన్ను తప్ప ఇంకేమీ చూడలేనంతగా ఇష్టపడాలి. నీవు తప్ప మరేమీ లేదని నాకు తెలిసి వచ్చేటంతగా నేను ఇష్టపడాలి. కోరి తెచ్చుకునే ఇష్టం కాకూడదది. లోన నుండి పొంగుకువచ్చే ఇష్టం కావాలి. నది సముద్రం వైపుకు పరిగెత్తుతుంది చూడు. అలా పరుగెత్తమని దానికెవరు చెప్పారు? ఎవరూ చెప్పనవసరం లేకుండానే పరిగెత్తుతోంది చూడు. అలా నా మనస్సు నీ వెంట పరుగెత్తాలి. నీ కొరకు పరుగెత్తాలి. నీ వరకు పరుగెత్తాలి. నీవుగా అయిపోయేటట్లుగా పరుగెత్తాలి. ఆ సంగమ స్థితిని నిరంతరం నేను

అనుభవించాలి. సర్వకాల సర్వావస్థల యందు, సకల కర్మాచరణలలో నుండి ఆ సంగమ స్థితిని నేననుభవిస్తూ ఉండాలి. తండ్రీ! సరేనా. ఈ నా కోరక సరి అయినదేనా?"

శ్రీకృష్ణుడు కుంతీదేవికి మరింతగా దగ్గరయి. ఆమెలోనికి చూస్తూ, చిత్రంగా చిన్నగా నవ్వాడు. ఆ నవ్వు సమ్మోహనంగా ఉంది. నోటిలోపల భువన భాండాలను చూపడమన్నది పూర్తయిన తర్వాత, ఆ ఆశ్చర్యంలో నుండి తేరుకునేట్లు చేయడానికై యశోదమ్మను చూచి, చిన్న నవ్వొకటి నవ్వాడే, సరిగా అలా ఉన్నది ఆ నవ్వు.

"కొద్ది క్షణాలు అలా చిత్రంగా నడిచాయి. ఆ క్షణాలలో ఏమి జరిగింది అన్నది ఆ కృష్ణునికే తెలుసు.

"అత్తా! ఒక్కమాట చెప్పనా! నే నిప్పుడు ద్వారకకు వెళ్లడం లేదు. ఎందుకో తెలుసునా? నీవింతగా అడిగిన తర్వాత నేను ఎలా వెళ్లగలను? మన మిప్పుడు హస్తినకు వెళదాం. అందరం కలిసి జరుగవలసిన కార్యక్రమాలలో నిమగ్నమవుదాం. అటు పనులూ జరుగుతాయి. ఇటు మనం కలిసి ఉన్నట్లూ అవుతుంది."

కృష్ణుని పలుకులకు నవ్వుకుంటూ ఇలా అన్నది కుంతీదేవి: "అల్లుడా! ఎంత సంతోషాన్ని కలిగించావు. ఏమయినా సమయస్ఫూర్తి అంటే నీదే! ఈ అత్త ఎలాగో వదిలిపెట్టదు. ఇక్కడిలా ఇందరూ నిలబడి పోవడం కన్నా, అలా హస్తిన వైపుకయినా అందరినీ బయలు దేర దీస్తే బాగుంటుందనుకున్నావా?"

"లేదత్తా! 'అప్పుడే వెళ్ళడమా?' - అని నీవన్నావు. అవును అప్పుడే వెళ్లడమా? అని నాకూ అనిపించింది." - అన్నాడు కృష్ణుడు.

"నీకలా అనిపించిందీ అంటే, నీవుగా నిర్వహించవలసిన కర్తవ్యమేదో ఇంకా మిగిలి ఉన్నదన్న మాట?" - అన్నది కుంతీదేవి.

"పుడుతూ ఉండగానే మా అమ్మ కొన్ని పనులు అప్పచెప్పింది. అవి పూర్తవుతూ ఉన్నాయి అనుకొంటూ ఉండగానే నీవు కొన్ని పనులు అప్ప చెప్పావు. చూస్తూ ఉంటే మీ వదినా మరదళ్ళు అప్పచెప్పిన పనులను పూర్తి చేయడమే నా అవతార కార్యక్రమంగా కనబడుతూ ఉన్నది. చూద్దాం. హస్తినలో మరేం పని అప్పచెబుతావో ఏమో?" - అన్నాడు కృష్ణుడు అదోలా నవ్వుతూ.

"బలే వాడివయ్యా అల్లుడా! అలా ఎందు కనుకోవాలి? నీ అవతార కార్యక్రమం కోసం నీవే మా వదినా మరదళ్ళను వినియోగించదలిచావు అను కోవచ్చుకదా! ఏది ఏమైనా మేం ధన్యులం."

"మీరు ధన్యులయితే మరి నేను?" - అన్నాడు కృష్ణుడు.

కుంతీదేవి నవ్వింది. కృష్ణుడూ నవ్వాడు. అక్కడున్న అందరూ నవ్వారు.

కథ వింటున్న పరీక్షిత్తునవ్వాడు. చెబుతున్న శుక యోగీంద్రుడు నవ్వాడు.

ఇన్ని నవ్వుల అర్థమేదో అదే అతడు.

## విషాద యోగం

తన వెంట అందరూ కదలిరాగా హస్తినకు చేరుకొన్నాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుని పాదస్పర్శతో పులకించిపోయింది హస్తిన. 'ప్రభూ! ఎప్పుడూ నేనిలా రాజకీయమయిన ఆవేశకావేశాలకు లోనుకావలసిందేనా? రగులుతున్న ఈ రాగ ద్వేషాలకు ఆలవాలం కావలసిందేనా? ఇప్పటికయినా నీ పాదస్పర్శతో నన్ను పునీతం చేసి, నాకొకింత ప్రశాంతత ఒనగూర్చు ప్రభూ!' - అన్న ప్రార్థన ఒకటి హస్తిన పొందుతున్న ఆ పులకింతలలో నుండే మంద్రంగా, ఇంకా చెప్పాలంటే ఆర్ద్రంగా వినిపించింది స్వామికి. ఆ ప్రార్థనను విన్న స్వామి అర్థవంతమైన తన చూపులతో హస్తిననంతా ఒక్కసారి కలియ జూచాడు.

'ఓ హస్తినాపుర పట్టణమా! నీ బాధ నాకు బోధపడింది. నీ ప్రార్థన నన్ను అదే పనిగా చుట్టుముడుతున్నది. నిజమే. రాజకీయమైన ఆవేశకావేశా లకు, రాగద్వేషాలకు ఆలవాలమై ఇప్పటికి అనేక శతాబ్దాలుగా నీవు సంక్షుభిత మవుతున్న మాట నిజమే, కాని. ఇది తప్పదు. ఈ మథనం రాబోయే కాలాలలో కూడా ఇక్కడ ఇలా కొనసాగక తప్పదు. అమృతమథనంలో అనేకం పుడతాయి. విషమూ పుడుతుంది. అన్నింటితో పాటుగా అమృతం పుట్టేవరకు ఎప్పటికప్పుడు ఈ మథనం ఆగకుండా సాగుతూనే ఉంటుంది. విలంబనం జరగవచ్చుగాని, అమృతం పుట్టక తప్పదు. అధర్మం ఒకప్పుడు పైకి లేవవచ్చు గాని ధర్మానికి జయం లభించక తప్పదు. కనుక నీవు బెంగపడవద్దు. భరత భూమికి నీవు అటువంటి మథన బిందువువి. ఎన్ని ఘోషలు నీపై నుండి వెలువడినా, అవశ్యకత ఏర్పడినప్పుడల్లా ఆఘోషల మధ్య నుండి నా భాషలు

కూడా వినబడుతూనే ఉంటాయిక్కడ. ఎప్పటికప్పుడు నిన్ను సేద తీరుస్తూనే ఉంటాయి. అన్న సందేశం ఆ చూపుల నుండి ఆ భూ భాగానికి అందుతూ ఉండగా, కావలసిన వారందరితో రాజమందిరంలోనికి ప్రవేశించాడు స్వామి. ప్రవేశించినదే తడవుగా ఎవరెవరిని ఎక్కడ ఎలా నిలువవలసి ఉన్నదో, అలా నిలుపసాగాడు.

ఋషులందరూ కలిసి కథను చక్కబెడుతున్న స్వామికి దగ్గరయ్యారు. 'ఊరకరారు మహాత్ములు' - అన్నట్లుగా చూసాడు స్వామి. "అదే ఇంతకూ మన ధర్మజుని కథ ఏమిటీ అన్నది మీతో మాట్లాడు దామని వచ్చాము' అన్నారు వాళ్లంతా. 'ఏమంటున్నాడు ధర్మజుడు?' - అడిగాడు స్వామి.

"కథ మొదటికి వచ్చేటట్లుంది అతన్ని చూస్తుంటే! మనమేమో చివరికి వచ్చింది అనుకొంటున్నాం. అతడిప్పుడు 'ఈ రాజ్యం నాకెందుకు?' అన్నట్లు చూస్తున్నాడు. అసలు యుద్ధమైనప్పటి నుండీ అలాగే చూస్తున్నాడు. ఆ చూపును గురించి అప్పట్లో మాట్లాడుకొన్నాం కూడా! 'ముందు బాధ్యత నప్పగిద్దాం. కథ ముందుకు అదే నడుస్తుంది - 'అన్నారు మీరు. సరే అతణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేసాం. కాని ఒక పట్టాన అతను దారికి వచ్చేట్లు కనబడటం లేదు. అతని ముఖంలో ఆ దుఃఖపు రేఖ మరింత గాఢత్వాన్ని సంతరించుకుంటోంది తప్ప, అతణ్ణి వదిలి పోవడంలేదు. కాస్తంత కదిలించి సేద తీరిస్తే ఎలా ఉంటుందోనని చూచాం. సేద తీరే మాట అటుంచి, అతని మాటలకు మాకు తల తిరిగినంత పనయింది. మమ్మల్ని మీరు సేద తీర్చవలసిన పరిస్థితి ఏర్పడుతుందేమోనని భయపడి ఇలా వచ్చాం. నిజానికి మీ సన్నిధిలో ఇప్పుడు జరుగుతున్నది కూడా అదే!"

'అంతగా భయపడేట్లు చేశాడా మిమ్మల్ని?' - అన్నట్లుగా చూశాడు శ్రీకృష్ణుడు ఆ ఋషులందరివైపు ఒక్కసారిగా. ఆ చూపును ఆదేశంగా అందుకొని ఋషులు ఇలా చెప్పసాగారు: "ధర్మజుడు సామాన్యుడు కాడు. ధర్మాధర్మాల పారం ఎరిగినవాడతను. అనుగ్రహంగా లభిస్తూవస్తున్న మీ దివ్య సన్నిధిలో అనుక్షణం ఎదుగుతూ వస్తున్న వాడతను. యక్షుని ప్రశ్నలకు ధీరుడై నిలబడి, దీటుగా జవాబు చెప్పిన వాడతను. అలాంటి ధర్మజుడు ఇప్పుడు మమ్మల్ని యక్షప్రశ్నలు వేయసాగాడు. ఎవ్వరూ చెప్పలేని యక్షప్రశ్నలకు జవాబు చెప్పినవాడు కదా అతను. అలాంటి అతను తానే యక్షప్రశ్నలు వేస్తే!

"మచ్చుకు కొన్ని ప్రశ్నలను మీకు వినిపిస్తాము. ఇవన్నీ మీకు తెలియనివని కాదు. అతడి పరిస్థితిని మేముగా మీకు వినిపిస్తే మాకు తృప్తిగా ఉంటుంది. మా బాధ్యతను మేము నిర్వహించినట్లవుతుంది. మీ రప్పగించిన కార్యక్రమంలో మేము ఎరుక గలిగి ప్రవర్తిస్తున్నట్లవుతుంది. అన్నింటినీ మించి, ధర్మజుని మేమలా చూడలేక పోతున్నాము స్వామీ! మీదయ వలన అతడు తన స్థితిలో తాను ఎప్పటికి ఉండగలుగుతాడా, అని మేము ఎదురుచూస్తున్నాం. అందుకనే కలిసికట్టుగా వచ్చి ఇలా జరుగుతున్న కథను వివరిస్తున్నాం.

"అతడంటాడు కదా! 'తన దేహం కోసం. తన ఆకలి కోసం వరుసపెట్టి, జంతువులను చంపుకు తింటున్నవాడినే మనం దుర్జనుడు అంటున్నామే! ప్రాణాలను నిలబెట్టు కోవాలీ అంటే రోజూ ఇన్ని ప్రాణాలను తీయాలా! - అన్నట్లు చూస్తున్నామే. అలాంటిది నేను రాజ్యం యెడల నాకు కలిగిన దాహం కోసం ఒక్క జంతువులనే కాదు. గురువులను. బ్రాహ్మణులను, - అన్నదమ్ములను, కన్న బిడ్డలను ఒకరేమిటి. అందరినీ పొట్టన పెట్టుకొన్న వాడిన య్యాను. నేను చేసిన ఈ పాపానికి అసలు ప్రాయశ్చిత్త మనేది ఉంటుందా? లక్షల సంవత్సరాలు నరకంలో మ్రగ్గినా ఈ పాపం తీరుతుందా? నాకు తెలుసు మీరేం చెబుతారో. ఆహారంగా స్వీకరించడానికి ప్రాణివధ చేయడంలో దోషం లేదంటారు. క్షత్రియుడైన వాడికి యుద్ధంచేయడం తద్వారా దిగ్విజయాన్ని సాధించడం - అది అతడి స్వధర్మ మంటారు. మీరు పెద్దలు. మీ మాటలను పెడచెవిని పెడుతున్నానని మీరనుకోకండి. మిమ్మల్ని తప్పుపడుతున్నానని భావించకండి. దయతో నన్నర్థం చేసికోండి. ఎందుకనో నాకు ఈ సమాధానాలు సంతృప్తినియ్యడం లేదు. నేను సరిపెట్టుకోలేక పోతున్నాను. సమాధాన పడలేక పోతున్నాను. నాకెందుకో జరగ కూడనిది జరిగినట్లు అని పిస్తోంది. చేయకూడనిది నేను చేసినట్లు అనిపిస్తోంది. నన్నర్థం చేసికోండి. మీకు ఎదురు చెప్పాలన్నది నా అభిమతం కాదు. నామనస్సు వేస్తున్న ఈ ప్రశ్నను నేను ఎదుర్కొన లేక పోతున్నాను. ఎదుర్కొనలేని ఇలాంటి ప్రశ్నలను గూర్చి మీకు కాక ఇంకెవరికి చెప్పుకోగలను? నాకిప్పుడు ఈ రణరంగంలో కుప్పలు తెప్పలుగా లెక్కకు మిక్కిలిగా పట్టించు కొనే దిక్కులేక హృదయ విదారకంగా పడి ఉన్న సైనికుల శవాలు గుర్తుకు వస్తున్నాయి. దిక్కులేకుండా పోయిన ఆసైనికుల భార్యలు గుర్తుకు వస్తున్నారు. ఈ విధంగా అబాలగోపాలాన్ని నా ఒక్కడి కోసం ఏడిపించిన వాణ్ణి అయ్యాను కదా నేను. నాకింకా ఆ ఏడుపులు వినిపిస్తూనే ఉన్నాయి. ఇందరి ఏడుపుల మధ్యలో నేనొక్కణ్ణే

నవ్వుతూ ఈ సింహాసనం మీదెలా కూర్చోగలను? ఎలా కూర్చోగలను? పెద్ద లారా! మీ రొక సూచన చేయగలరు - 'ధర్మజా నీవు క్షత్రియుడివి. అందునా చక్రవర్తివి. అపైన గృహస్థువి. రాజర్షివైన నీవు అశ్వమేధాది యాగాలను ఆచరించటం ద్వారా పునీతుడవు కాగలవని. పెద్దలారా! నా మనస్సెందుకో సమాధాన పడలేక పోతోంది. ఆ యాగాదుల పేరిట మరి కొంత హింస చేసిన వాడినవుతాను తప్ప, జరిగిన ఈ హింసకు నాకెలా బదులు చెప్పగలవు అవి? నా కనిపిస్తోంది కదా - బురద నీటితో బురదను కడగగలమా? మద్య భాండాన్ని మద్యంతో శుద్ధి చేయగలమా? హింసను, హింసాదోషాన్ని హింసతో పోగొట్టు కోగలమా? - అని. నేనన్నానని అనుకోకండి. ఇలా అడుగుతున్నాడే మిటా అని వేరుగా తలంచకండి. నా మనస్సును పట్టి పీకుతున్న ప్రశ్నలివి. ఇలాంటి ప్రశ్నలతో పీక బడుతున్న నేను ఈ సింహాసనం మీద ప్రశాంతంగా ఎలా కూర్చోగలను? ప్రజలను ఎలా పాలించగలను?

"ధర్మజుని మాటలు, ప్రశ్నలు ఇలాసాగుతున్నాయి. ఆనాడు అర్జునుడు విషాదంలో పడినట్లుగా, ఈనాడు ధర్మజుడు విషాదానికి గురి అవుతున్నాడు. ఆనాడు అతడిని కనులు తెరిపించి, నడిపించినట్లుగా ఈ నాడు ఇతడిని కూడా మీరే వెన్ను తట్టి, వెలుగుచూపి, ముందుకు నడిపించాలి. రాజ్యం ఇప్పటికే కల్లోలంగా ఉంది. సమర్థుడయిన రాజు యొక్క ప్రగాఢ మయిన స్పర్శను అది కోరుకుంటోంది. జరిగిన దానిని గూర్చి సమాధాన పడలేక పోతున్న ఇతను జరుగవలసిన దాని వైపుకు చూడలేక పోతున్నాడు. తప్పనిసరై జరిగిన దానికి, తాను కర్తనని భ్రమిస్తున్నాడు. నిమిత్త మాత్రుడనని అతను గ్రహించేటట్లుగా చూడండి ప్రభూ! మీరిచ్చిన వెలుగులో, సమాధాన మేమిటో, ఈ పరిస్థితికి పరిష్కారమేమిటో, మేమూ గ్రహించుకోగలిగినా - వినబడుతున్న ఆ సమాధా నాన్ని వినిపించవలసింది మాత్రం మీరే! కన బడుతున్న ఆ పరిష్కారాన్ని సాధించవలసింది మాత్రం మీరే! స్వామీ! ఇక మీరు కలుగజేసుకోవాలి. ఇక మీరు కలగచేసుకోవాలి!"

ఋషులు పలికిన బాధ్యతాయుతమయిన పలుకులను సావధానుడయి విని పించుకొన్న కృష్ణమూర్తి అర్థవంతమయిన చిరునవ్వు నొకదానిని అలవోకగా వ్యక్తం చేస్తూ ఇలా అన్నాడు: "ఋషివరులారా! మీరడిగిన దానిని నేను అవును అననిది ఎప్పుడు? అలాగే కలుగజేసుకుంటాను. అయితే ఈ సారి భీష్ముని రూపంలో కలుగజేసుకుంటాను. ఎందువలన అంటే - ఇప్పటి సన్నివేశానికి

అలా కలుగ చేసికోవడమే ఔచిత్యవంతంగా ఉంటుంది కనుక. ఈ రూపంతో ఇలా చెప్పినా వినకపోడు. కాని 'కృష్ణుడు ఎంతదేవుడయినా మన పక్షంలో పనిచేసిన వాడు. కనుక జరిగిన దానిని కావలిసిన విధంగా సమన్వయించి చెబు తున్నాడు' - అని అతనికి అనిపించడానికి అవకాశముంది, ఇప్పుడున్న స్థితిలో. అందువల్ల అవతలి పక్షానికి చెందిన కురువంశం వారందరికీ పెద్ద దిక్కయిన, జ్ఞానమే తన స్వరూపంగా వెలుగుతూ ఉన్న, ఆ భీష్మాచార్యునిచే చెప్పించిన ట్లయితే, ఆ మహనీయుని సన్నిధిలో ఇతడిని కొంతకాలముపాటు ఉండేటట్లుగా చేసినట్లయితే - ఈ కలత తీరి పోతుంది. ఈ భ్రమ తొలిగి పోతుంది. కనుక మనం మెల్లగా ధర్మజుని తీసికొని భీష్ముని వైపుకు సాగుదాం.

"మహర్షులారా! మరొక్క మాట. ద్వారక వైపుకు సాగేలోపల భీష్మా చార్యుణ్ణి మరొక్క సారి దగ్గరగా చూడాలని నాకున్నది. చిత్రమేమిటంటే - అతడి దగ్గర సెలవు తీసికొని, నేను ద్వారకకు కదులు దామనుకుంటు న్నాను. నా దగ్గర అనుమతిని పొంది అతడు తన దేహం నుండి సెలవు తీసుకుందా మనుకుంటున్నాడు. విశిష్టమయిన ఈ కార్యక్రమానికి మీరందరూ నాతో కదలిరావాలి."

కృష్ణదేవుడు ఆర్ద్రంగా చూస్తున్నాడు ఋషులవైపు.

ఋషివరుల కన్నులు చెమ్మగిల్లుతూ కృష్ణుని వైపుకు చూస్తున్నాయి.

శుకయోగీంద్రుని గొంతు గద్గదమవుతూ ఉన్నది.

పరీక్షిత్తు మనస్సు భీష్మ, కృష్ణులను స్మరిస్తూ తరిస్తున్నది.

# తీరిన ముచ్చటు

అల్లంత దూరాన అలికిడి అవుతున్నట్లు గమనించిన భీష్ముడు ఆ అంపశయ్యపై నుండే, తన దృష్టిని అటువైపుకు సారించాడు.

'తలచినంత మాత్రాన తన దివ్య సాన్నిధ్యాన్ని తనివితీరా అందిస్తూ, తన్మయత్వాన్ని అనుగ్రహిస్తూ వస్తున్న కృష్ణదేవుడు ఇప్పుడు మరింకేదో తలపెట్టి నట్లున్నాడు. అదిగో ధర్మజుడు సోదర సహితుడై ఆ ప్రక్కగా సాగివస్తున్నాడు. ఋషివరులెందరో ఆ వెనుకగా తరలి వస్తున్నారు. ధర్మజుని ఇలా చూసి ఎన్నాళ్లయింది! రాజలాంఛనాలతో, ఇందరితో కలిసివస్తున్న అతణ్ణి చూస్తుంటే ముచ్చటగా ఉంది. యక్షులతో సాగివస్తున్న కుబేరుడిలా కనిపిస్తున్నా డిప్పుడు. నిజానికి ఈ ముచ్చట ఎప్పుడో తీరవలసింది. కాని, కాలం కలిసివచ్చింది కాదు. కృష్ణదేవుని కరుణ వల్ల ఈ చివరి క్షణాలలో నయినా కనువిందు కలిగించే ఈ దృశ్యాన్ని కనులార కాంచగలగడమనేది నా అదృష్టం. ఇంతవాణ్ణి చేసి, ధర్మజుణ్ణి ఇంతవాణ్ణి చేసి, తీసికొని వస్తున్న ఆ స్వామి, అతణ్ణి ఇంకెంతవాణ్ణి చేయదలచు కొన్నాడో! అయినా ఇందరు ఇటువైపుకు ఇలా తరలివస్తున్నారు. ఉత్తరాయణం కోసం ఊపిరిని పొదివి పట్టుకొని వేచి ఉన్న ఈ వృద్ధునితో ఏమి పని ఉంటుంది వీరందరికీ!

'కృష్ణదేవుడు నా కొరకే ఈ సన్నివేశానికి రూపకల్పన చేస్తూ ఉన్నాడు . ఉత్తరాయణం ప్రవేశిస్తోంది కదా! ఇక మన భీష్ముడు దేహత్యాగానికి సంసిద్ధుడవుతూ ఉంటాడు. ఈ సందర్భంగా బంధుమిత్రాదులను, ఋషి ప్రముఖులను వెంట తీసికొని, ఒక్కసారి అతణ్ణి ఆనందింప చేసివద్దాము -' అని ఆ దేవదేవునికే అనిపించినట్లుగా ఉంది. బాగుంది. నేను చూద్దామనుకుంటున్న వాళ్లు, నన్ను చూద్దామను కొంటున్న వాళ్ళు అందరూ కలిసి వస్తున్నారు. కాలం కలిసిరావడ మంటే ఇదేనేమో! వీరందరినీ నాతో కూర్చోపెట్టుకొని, ఆదేవదేవుని సన్నిధిలో ఈ నా జీవితాన్ని ఒకసారి సమీక్షించు కోవాలని ఉంది. మనిషన్నవాడు అవకాశం కలిగినప్పుడల్లా తనను తాను సమీక్షించుకొంటూ ఉండాలి. అంతటి అభ్యాసం లేనివాడు అప్పుడప్పుడయినా తన జీవితాన్ని తాను సమీక్షించుకొంటూ, కావలసిన మార్పులను చేసి కొంటూ ముందుకు సాగాలి. అలాంటి సమీక్షను నేను నా జీవితంలో అవశ్యకత ఏర్పడినప్పుడల్లా చేసుకొంటూనే వస్తున్నాను. అయితే. ఆ సమీక్షా ఫలితాలను నేను ఎంతవరకు

ఆచరణలో పెట్ట గలిగాను అన్నది ఒక ప్రశ్న. నాకు నేను వేసికోవలసిన ప్రశ్న. నిజానికి ఈ ప్రశ్నను కూడా నేను వేసికొంటూనే వస్తున్నాను. కరుణామయు డయిన కృష్ణదేవుడు  ఈ నా ప్రశ్నకు నిండయిన సమాధానం ఇచ్చాడు కూడా. అయితే ఈ ప్రశ్న - సమాధానం  మాటల్లో నడిచింది కాదు. చేతల్లో నడిచింది. మా మనస్సులలో నిలిచి ఉంది. ఇద్దరి మధ్యా  నడిచిన ఈ సమీక్షా సారాంశాన్ని ఇప్పుడు ఇందరి మధ్యలో ఒక్కసారి గుర్తు చేసికోవాలని ఉంది. గొంతెత్తి గుర్తు చేసికోవాలని ఉంది. అలా చేసికోవడంలో ఒక తృప్తి ఉంది. ఆ తృప్తిని నాకందించడం కోసమే దేవదేవుడు ఈ సన్నివేశానికి రూపు దిద్దు తున్నాడు.

'కృష్ణదేవా! అందరూ నీకు గుర్తేనయ్యా! ఆ అందరికీ ఏమి కావాలో కూడా నీకు గుర్తే ఉంటుంది. పశువుల కాపరి, పశుపాలన చేస్తూ, వాటి మంచి చెడులు చూస్తూ, వాటి మానాన వాటిని  తిననిస్తూ, తిరగనిస్తూ, అవసరాన్ని బట్టి అదిలిస్తూ, వాటితో మనస్సు కలిపి మసలు  కుంటాడు. అందులో ఏ ఒక్క పశువు దారి తప్పుతున్నా, అతడు అలవోకగా దానిని దారి వైపుకు  మళ్లిస్తూ ఉంటాడు. ప్రతి పశువూ వాడికి గుర్తే! ప్రతి పశువూ అతని సొత్తే! అందునా దారి  తప్పుతున్న పశువు యెడల అతను మరింత బాధ్యత పడతాడు. ఆ దారిని పడలేక పోతున్న లేగల యెడల అతడు మరింత ప్రేమను వర్షిస్తాడు. ఊహించ లేనంత చేయూత నందిస్తాడు.

'కృష్ణదేవా! చిన్ననాడు పశువుల కాపరివై నీ వెందుకు గోచరించావో రానురాను బాగా  బోధపడుతున్నదయ్యా! బాగా బోధ పడుతున్నది. నీ పశుపాలనలోని ఔచిత్యాన్ని, పరమార్థాన్ని  పది మందికీ పరవశిస్తూ, చెప్పే అవకాశానికి రూపు దిద్దుతున్నావా ప్రభూ! ఆ పశుపాలనలోని ఔచిత్యమేమిటో, పరమార్థమేమిటో చేరవచ్చిన వారందరికీ మరొక్క సారి తన్మయత్వంతో తెలియ చెబుతూ, ఈ నేను నీలో కలిసిపోనా? నీవు నేనై నిలిచిపోనా! అటు నీలో కరుగుతూ, ఇటునీ  నుండి వెలుగుతూ మురిసిపోనా?

రా తండ్రీ! రా. త్వరత్వరగా రా! దగ్గర దగ్గరగా రా! ఆ నాడు చక్రం చేతబట్టి మీద మీదకు నీవు వస్తున్నప్పుడు ఇలాగే పిలిచాను. నీవు చేత బట్టిన చక్రానికి అంకితమైన మనస్సుతో ఇప్పుడు పిలుస్తున్నాను రా. చక్రానికి అంకితమై, చక్రాంకితమై ఈ మనస్సు నీ కొరకు పరితపిస్తున్నది రా. చక్రం చేతబట్టి మీదకు వస్తున్న వేళ ఆ చక్రం నుండి వెలువడుతున్న వెలుగుల  వెల్లు

వలు నాలోని అజ్ఞానాన్ని ఎలాగ కరిగించాయో, ఎలా వెలిగించాయో ఇందరితో ఒక్కసారి చెబుతానురా.

'రా స్వామి రా. త్వర త్వరగా రా. దగ్గర దగ్గరగా రా. హృదయంతో పిలుస్తున్నాను రా. హృదయం లోనికి రా. నీవే నా హృదయం రా! అలా జ్ఞాన స్వరూపుడై వెలిగిపోతూ, ప్రేమ స్వరూపుడై తనలో కరిగిపోతూ ఉన్న ఆ కురు వృద్ధుని తన చూపుడు వ్రేలితో ధర్మజునికి చూపిస్తూ ఇలా అన్నాడు శ్రీకృష్ణుడు: "ధర్మజా! చూస్తున్నావా మీ తాతను? ఎలా అగపడుతున్నాడ తను? వెలుగుల ముద్దలా అగుపడటం లేదూ? దివి నుండి భువికి దిగబడిన ఒకనొక దేవతా మూర్తిలా గోచరిస్తున్నాడు చూడు. సృష్టిని నిర్వహిస్తున్న దేవత లలో ఒకానొక దేవత, మానవాకృతి ధరించి ఇక్కడ ఇలా ఉన్నట్లున్నది చూడు. దేవతలు ఈ సృష్టికీ సృష్టిలోని మానవులకు రూపు దిద్దుతూ ఉండటమే కాదు, అప్పుడప్పుడు అవసరాన్ని బట్టి సృష్టిలోనికి మానవ రూపాలతో వ్యక్తమై వర్తిస్తూ ఉంటారు కూడా! అలా అనడానికి ఇదిగో ఈ మహనీయుని లాంటి వారే మనకు ప్రమాణం. ఇలాంటి దివ్యమూర్తిని తాతగా పొందిన మీరందరూ ధన్యులు.

"ధర్మజా! ఒక్కమాట చెప్పనా! ఈ భీష్ముడు ఒక జ్ఞానపు కణిక. ఈ సృష్టిలో ఇంతగా జ్ఞానం మూర్తీభవించిరావడం ఇది వరలో జరగలేదు. ఇక ముందు కూడా జరుగుతుందని లేదు. అలాంటి జ్ఞాన స్వరూపాన్ని మనమిప్పుడు సమీపిస్తున్నాం. మానవ జన్మ ఎత్తి జీవితాన్ని ఇంతగా పండించుకున్నవారు చాలా అరుదుగా ఈ భూమి పైన కనబడుతుంటారు.

"ధర్మజా! ఏమి చిత్రమయిన జీవితం ఈయనది! ఎప్పుడయినా ఆలోచించావా? తన తండ్రి కోసం తాను రాజు కావడం మానుకొన్నాడు. మీ తండ్రుల కోసం తాను తండ్రి కావడం మానుకొన్నాడు. అవతార మూర్తినయిన నాకోసం తాను మీ జీవితాలలో కలుగ చేసుకోవడం మానుకొన్నాడు. ఇంతకంటే త్యాగ మెక్కడుంటుంది? ఇంతకంటే త్యాగమూర్తు లెక్కడుంటారు? మన మిప్పుడు అలాంటి పెద్దవాడిని సమీపిస్తున్నాం. "ధర్మజా! తాతకు దగ్గరవుతూ ఉన్నాం కదా! ఎలా కనబడుతున్నాడు తాత? సామాన్యంగా జనులందరూ మృత్యువు యొక్క వశంలో ఉంటారు. కాని. ఇక్కడ మృత్యువు ఈయన వశంలో ఉంది. రమ్మంటే వస్తుందట. లేక పోతే రాదట! తాత - మానవలోకంలోనే ఒక మహాద్భుతం గదా! జీవితాన్నే ఒక పరిశోధనగా మహాసాధన నొకదానిని

గావించి, నేడు మానవ జాతికి పరమార్థాన్ని పంచిపెట్టగలిగిన ఆచార్య శేఖరుడ య్యాడయ్యా! అరివీర భయంకరుడిగా జీవితాన్ని మొదలు పెట్టిన ఇతడు, ఇలా ఆచార్య శేఖరుడయి, నేడు నిలబడటం నడుస్తున్న ఈ సృష్టి కథలోనే ఒక విశిష్టమయిన ఘట్టమవుతున్నది. వీరునిగా అతనికి ఎదురు లేదు. ఆచార్యునిగా అతనికి బదులు అసలు లేదు ఇప్పటికీ ఎప్పటికీ కూడా.

"ఈ విచిత్రం చూడు! నాకిప్పుడు పండిన చింతగుల్ల ఒకటి గుర్తుకొస్తు న్నది. చింతకాయ పండటం మొదలు పెట్టిన కొద్దీ కాయగానే ఉంటుంది కాని, పెచ్చుకు దూరమవుతుంది. పూర్తిగా పండేటప్పటికి ఆ పెచ్చు ఒక గుల్లలాగ, అలా నిమిత్త మాత్రంగా ఉంటుంది. లోపల ఆ పండు, ఆ గుల్ల లోపల అలా దీపంలో దీపకళికలా వ్రేలాడుతూ ఉంటుంది. నా కిప్పుడు, ఈ భీష్మాచార్యుడలా కనబడుతున్నాడు. దేహమనే చింత గుల్లలో పండిన పండులా ఆయన అలా నిలబడినట్లుగా ఉన్నాడు. నన్నడిగితే ఇలాంటి వారినే జీవితంలో 'పండిన వారు' అనాలి. మిగిలినవారు పండినవారు కారు. ఎండిన వారూ. వడిలిన వారూ అవుతారు. పండినవారు దేహాన్ని తాముగా వదులుతారు. ఎండి నవారు. వడిలిన వారు దేహాన్ని వదలడానికి ఇష్టపడరు. ఇక దేహమే అతి కష్టం మీద వారిని వదిలించు కొంటుంది. విదిలించు కొంటుంది.

"దేహమే దేవాలయం. జీవుడే సనాతనుడయిన దేవుడు - అని అనా దిగా ఋషులందరూ చెప్పుకుంటూ వస్తున్న ఆ వాక్కు ఉన్నదే - అది ఇక్కడ మనకు దృశ్యమై భాసిస్తూ ఉన్నది. అలాంటి సజీవ దేవాలయాన్ని మన మిప్పుడు సమీపిస్తున్నాం. ధర్మరాజా! ఈ అవకాశం మహత్తరమైనది! ఈ సన్నివేశం అపూర్వమయినది! లభించనున్న ఈ దర్శనం లోకోత్తరమైనది! చూడు. తనివితీరాచూడు. విను. చెవులారా విను. అనుభవించు. అది నీవయ్యే వరకు అనుభవించు. ఆనందించు. అదే నీపై ఆనందించు.

రా. వెలుగులు విరజిమ్ముతున్న ఆచార్యశేఖరునికి నమస్కరిద్దాం రా.రా,. ఆచరణలో పండిన ఆ ధర్మ నిష్ఠునికి అంజలి ఘటిద్దాం రా! రా తన సుఖమన్నది తలపెట్టక, తనవారి కొరకు ఆహుతయిపోయిన ఆ త్యాగమూర్తి హృదయాన్ని తడిమి చూద్దాం రా! రా. ధర్మాధర్మాల మధ్యన తానుగా నిలబడి నలిగిపోతూ, వెలిగిపోయిన ఆ ధన్య చరితుని సేద తీరుద్దాంరా! రా ధర్మజా! రా. మనకు కావలసిన ధర్మమూర్తి ఇడిగో ఇక్కడున్నాడు రా! రా ధర్మజా! రా! మనకు కావలసిన మధుర హృదయుడు ఇక్కడున్నాడు. రా!

ఆ హృదయంలోని మాధుర్యం అనుభవిద్దాం రా! అనుభవిస్తూ ఆ హృదయాన్ని స్వీకరిద్దాం రా! మనమే అతనై, అతనే మనమై వెలుగులలోకాలలో విహరిద్దాం రా! రాధర్మజా! రా ధర్మజా!"

ధర్మజుని కన్నుల వెంట అనుభూతి బాష్పాలు జాలువారుతున్నాయి. జాలువారుతున్న ఆ బాష్పాలతో తాత పాదాలను తడుపుతున్నాడు అతను. కడుగుతున్నాడు అతను.

పాదాల దగ్గర ధర్మజుడుంటే, ఆ ఆచార్యుని హృదయానికి దగ్గరగా కృష్ణ దేవుడు నిలిచాడు. దగ్గరవుతున్న కృష్ణదేవుని స్పర్శకు పులకించి పోతున్నాడు భీష్ముడు. ఆ దేవదేవుని చేతులను పట్టుకొని, తనకు దగ్గరగా తీసికొని. మాన సికంగా ఆ చేతులలో తనను తాను నిలుపు కొని పరవశిస్తున్నాడు.

భీష్ముని చూసి పరవశిస్తున్నాడు ధర్మజుడు. కృష్ణదేవుని చూస్తూ తన్మ యుడవుతున్నాడు భీష్ముడు.

ఆ దృశ్యాన్ని అలా చూస్తూ తమని తాము మరచిపోతున్నారు పాండ వులూ పరివారమూ.

అపురూపమయిన ఆ దృశ్యానికి అంజలి ఘటిస్తూ నిలిచారు ఋషులందరూ.

కథను చెబుతూ శుకయోగి కూడా అప్రయత్నంగానే అంజలి ఘటిస్తున్నాడు.

వింటున్న పరీక్షిత్తు కూడా అదే స్థితిలో ఉన్నాడు.

## సౌజన్యమూర్తి

తనను చూచి తాదాత్మ్యం చెందుతున్న భీష్మాచార్యుణ్ణి సేదతీరుస్తూ, అర్థవంతమైన తన చూపులను ఆ ఆచార్యుని పాదాలను అభిషేకిస్తున్న ధర్మ జుని వైపుకు మళ్ళించాడు కృష్ణదేవుడు.'భీష్ముడా! ఇప్పుడు నీ చూపుకూడా అతడివైపుకే మళ్ళవలసిఉంది. ఇప్పటి మన కర్తవ్యంలోని మొదటి అంశమది.' - అని చెబుతున్నట్లున్నాయా చూపులు. ఆ చూపులను అందుకొన్న భీష్ముడు మెల్లగా లేచి కూర్చొని ధర్మజుణ్ణీ, మిగిలిన పాండవులను తనకు ఎదురుగా కూర్చోపెట్టుకున్నాడు. కృష్ణదేవుడు భీష్మునికి ప్రక్కగా కూర్చున్నాడు. తన చేతులతో ఆచార్యుని స్పృశిస్తూ అలా ఆయనను సేద తీరుస్తూనే ఉన్నాడు.

తన పనిని తాను చేస్తూనే ఉన్నాడు.

తన పనికి తాను న్యాయం చేకూర్చగలిగిన వాడే తనతో ఉన్నవారి పను లేమిటన్నది గ్రహించగలడు. వారిచేత ఆయా పనులను తగిన ప్రోత్సాహమిస్తూ చేయించగలడు. తాను కూర్చొని తోటివారిచేత పనిచేయించాలనుకున్నవాడు వారికి నాయకుడు కాలేడు. కనీసం ఆ పనినైనా వారిచేత పూర్తిగా చేయించలేడు. నడుస్తూ నడిపించేవాడు, చేస్తూ చేయించేవాడూ, వెలుగుతూ వెలిగించేవాడూ, తరిస్తూ తరింపచేసేవాడూ అతడు నాయకుడు. అతడే నాయ కుడు.

కన్నులారా, తనివితీరా పాండవులను కలియజూస్తూ, ధర్మజునితో ఇలా అన్నాడు భీష్ముడు "ధర్మజా! నీవూ నీతమ్ములూ ఇటు వినయం అటు ప్రేమ విశేషంగా కలిగిన సుందరమూర్తులు. దేహ సంబంధమైన సౌందర్యం. అదేం సౌందర్యం! సౌందర్యానికి సంబంధించిన చిన్న మచ్చు అది. గుణసంబం ధమైన సౌందర్యం అదీ నిజమైన సౌందర్యం. నిండైన సౌందర్యం. ఆత్మపరమైన అసలు సిసలైన సౌందర్యమది. అందుకే అన్నాను 'మీరు వినయ, ప్రేమ సుంద రులు' అని. దేహసంబంధమైన సౌందర్యం తాత్కాలికమైంది. కనీసం దేహము న్నంత వరకైనా అది ఉంటుందని చెప్పలేం. ఒక వయస్సులో వ్యక్తం కావడం మొదలుపెట్టి ఒక వయస్సు వచ్చేటప్పటికి తప్పుకునే ప్రయత్నం చేస్తుందది. గుణ సంబంధమైన సౌందర్యం అలాంటిది కాదు. వయస్సు పెరుగుతున్నకొద్దీ ఇది పెరుగుతూ ఉంటుంది. వ్యక్తి శరీరం పడిపోయినా ఇది మాత్రం నిలబడి ఉంటుంది. ఆ వ్యక్తిని అమరుణ్ణి చేస్తుంది. ఆచంద్ర తారార్కం అతణ్ణి జనుల నాలుకల పైన నిలిచి పోయేలా చేస్తుంది. ధర్మజా! ఈవిధంగా చూస్తే నీవూ నీ తమ్ములూ ధన్యజీవులు.

నిజం చెప్పాలీ అంటే ఈ భూమి మీద ఇప్పుడున్న వారిలో కృష్ణదేవుని తరువాత ధర్మమూర్తివి నీవే. ఇది ధర్మము అని తెలియడంలో గాని, దాని ప్రకారం నడవడంలోగాని, నీవు చూపిన దీక్ష అనితరసాధ్యమైంది. అయితే. అంతటి ధర్మమూర్తివై ఉండి కూడ నీవు పెదతండ్రి అయిన ధృతరాష్ట్రుడికి ఎదురు చెప్పలేదు. అతడు చేస్తున్న అవకతవకలు నీకు తెలిసినవే అయినా, అత డేది నిర్ణయించినా, దానిని విధి విలాసంగా పరిగణిస్తూ, అనుసరిస్తూ వచ్చావు. అలాగే నేను, ద్రోణుడు మొదలయిన వాళ్ళం పెద్దలమయి ఉండి కూడా, ఏది ధర్మమో తెలిసిఉండి కూడా దాన్ని అమలు పరచలేకపోయాం. నీకు సహకరిం

చలేక పోయాం. ఇక్కడ నీకూ అంటే ధర్మానికి అని అర్థం చెప్పుకోవాలి. ధర్మానికి ప్రతినిధివి నీవు. నీ తోడి ప్రవర్తించడంలో మా జీవితాలు అడుగడుగునా తూచబడ్డాయని చెప్పవచ్చు. అయినా మేం సహకరించలేక పోయాం. నిస్సహాయులమై నిలబడ్డాం. కాని నీవు మమ్మల్ని తిరస్కరించలేదు. మాకు నిరంతరం నమస్కరించావు. నీ వినయ విధేయతలు చూచి మాకాశ్చర్యం వేసేది. 'ఏమిటిలా ఇతడు ఇంకా మనకు నమస్కరిస్తున్నాడు' - అనిపించేది. మా మటుకు మాకు నీనమస్కార ముద్ర ఒక ప్రశ్నార్థకంగా కనిపించేది. 'నేను మిమ్మల్ని గౌరవిస్తూనే ఉన్నాను. ఇక మీరేమిటన్నది మీరే ఆలోచించుకోవలసి ఉంది. మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోవలసి ఉంది' - అని హెచ్చరిస్తోందా ఆ నమస్కారం అనిపించేది. 'ధర్మజుడు నమస్కరిస్తాడే తప్ప హెచ్చరించడు. శిరస్సు వంచుతాడే తప్ప తిరస్కరించడు. అయినా మనమే మనకోసం ఆ నమస్కార ముద్రను ఒక హెచ్చరికగా ఒక ప్రశ్నార్థకంగా తీసుకుందాం' - అని నేనూ, ద్రోణుడూ అనుకుంటూ ఉండేవాళ్లం. ధర్మజా! అదే వినయాన్ని నీవు నీ తమ్ములకు కూడా అలవాటు చేయడం వారిచేత అవలంబింప చేయడం నిజంగా ఒక విశేషం.

ఇక మీరు చూపిన ప్రేమ నిజంగా అది లోకోత్తరమైనది. నిజానికి ఈ రాజ్యం నీది. పద్ధతి ప్రకారం నిన్ను యువరాజును చేశాం. కొన్నాళ్లయ్యేటప్పటికి దుర్యోధనుడిలో అసూయా అసహనాలు పెరిగాయి. రాజ్యం లేనిదే ఉండలేనన్నా డతడు. 'ధర్మజుడు రాజయితే నేనా రాజుకు తమ్ముడిలా హీన స్థితిలో రోజులు గడుపు కోవాలా?' అని తండ్రిని సతాయించసాగాడు. ధృతరాష్ట్రుడు నా వైపుకు చూచాడు. పరిస్థితిని గమనించిన నేను, మనస్తత్వాలను గమనించిన నేను మనస్సుకు ఇష్టం లేకపోయినా ప్రాణం ఏమాత్రం ఒప్పకపోయినా, ఈ రాజ్యాన్ని రెండుముక్కలు చేశాను. నీకు అర్థరాజ్యమిచ్చి ఇవతలకు పంపించాం. అదేమిటి అనలేదు నీవు. నా నిర్ణయం ప్రకారం ఇంద్రప్రస్థానికి చేరుకున్నావు. పెద్దల నిర్ణయానికి కట్టుబడ్డావు. నిజానికి కట్టుబడాల్సిన పని లేదు. నోరు తెరచి నీవు నిలదీస్తే, రాజ్యాన్ని నీకప్పగించడం తప్ప మేం చేయగలిగింది లేదు. కాని, మా ఎడల నీకు గల వినయ, విధేయతలు, తమ్ముడైన దుర్యోధనుడి ఎడల నీకు గల ప్రేమాభిమానాలు ఎలాంటివో అనాడే నీవు చూపించావు. ధర్మజా! నీ ప్రేమ అంతటిది. అర్థరాజ్యం అందివ్వగలిగినంతటిది.

కాని దుర్యోధనుడికి అది అర్థం కాలేదు. 'అర్థం ఏమిటి? సొంతం

నాదే కావాలి' అన్నాడతడు. అయినా అవకాశమున్నంత వరకు ప్రేమతో అతణ్ణి సహించారు మీరు. నీ సహనాన్ని అతడు నీ చేతకానితనంగా చూశాడు. తనకు చాతనయినవన్నీ చేశాడు. అప్పుడు కూడా నీవు కర్తవ్యాన్ని నిర్వహించావే తప్ప ఆవేశపడలేదు. ఎలాంటి పనులు చేశాడతను! ఎంత నీచంగా ప్రవర్తించాడతను! అలాంటి దారుణ స్థితిలో మేము కూడా నిస్సహాయులమై నిలబడిపోయిన వేళలో నీవు దైవం వైపుకు చూశావే తప్ప, అతణ్ణి ద్వేషించలేదు. మేమెవ్వరం నీకేమీ చేయలేక పోయాం. సభ మొత్తం ఒక చిత్తరువులా నిలబడింది. కాని కలగచేసుకోవలసినవాడు కలగచేసుకున్నాడు. కనబడకుండానే కలగచేసుకున్నాడు. కర్తవ్య నిర్వహణకు కనబడవలసిన పనిలేదు అన్నట్లుగా కలగచేసుకున్నాడు. బాధతో మూల్గుతున్న మాకు, ఊపిరి అందక కొట్టుమిట్టాడుతున్న మాకు, ఆ మాకు తెలుసు ఆ కలగచేసుకున్న క్షణాలు ఎంతటి అమూల్యమైనవో! కృష్ణదేవుని కరుణ మీతో ఉన్నదని ఆనాడు సూటిగా స్పష్టమైంది. మా మనస్సులకు పండుగైంది. ధర్మజా! ఎంత పండుగై ఏమి లాభం! మాకు మేము కట్టుబడినవాళ్ళం కావాలని మమ్మల్ని మేము కట్టేసుకున్నవాళ్లం. నీ పాలిటి మూగవాళ్ళమయ్యాం. మూగవాళ్లుగా ఎవరుండ మన్నారు మమ్మల్ని? అదే చిత్రం!

ఇంత చేసినవాడు అరణ్యావాసంలో మీరుండగా, ఘోషయాత్రకని మీ దగ్గరకు వచ్చాడు. తన భోగభాగ్యాలని మీ ముందు ప్రదర్శించి అట్టహాసం చేయబోయాడు. కాని, కాలం కలిసిరాలేదు. గంధర్వరాజు అతన్ని, చితుక తన్ని, తన రథచక్రానికి కట్టుకొని బయలుదేరాడు. అప్పుడు నీవేం చేయనక్కరలేదు. ఊరుకుంటే చాలు. అతని పని పూర్తయ్యేది. కాని నీ ప్రేమ ఉన్నదే అది నిన్ను ఊరుకోనివ్వలేదు. తమ్ముళ్లని పంపించావు. దుర్యోధనుడిని విడిపించావు. అతణ్ణి దగ్గర కూర్చోపెట్టుకున్నావు. 'తమ్ముడూ సేదతీరు' - అన్నావు. అతడికి నీ ప్రేమ అర్థం కాలేదు. నీవు అతడిని అవమానిస్తున్నట్లుగా అనిపించిందతనికి. అతడికి నీమీద ద్వేషం పెరిగిందే తప్ప కనీసం నామమాత్రమైన కృతజ్ఞత కూడా కలుగలేదు. కాని నీవు దానిని పట్టించుకోలేదు. ప్రేమగలవాడు తాను చేయగలిగింది చేస్తాడే తప్ప, అవతలి వాడేమి చేశాడన్నది పట్టించుకోడు.

యుద్ధానికి సిద్ధమయ్యారు. అప్పుడు కూడా మీరేమన్నారు 'ఇంతమందిమి హతమారిపోవడమెందుకు ఇరుపక్షాల మధ్యా యుద్ధం తప్పనిసరయితే, దానిని

ఒకలా నిర్వహిద్దాం. మీ పక్షం నుండి ఒక యోధుణ్ణి నిర్ణయించండి. మా పక్షంనుండి ఒక వీరుణ్ణి నిర్ణయిస్తాం. వారిరువురిలో ఎవరు గెలిస్తే ఆ పక్షం గెలిచినట్లుగా స్వీకరిద్దాం' - అన్నారు. ఆమాట దుర్యోధనుడికి రుచించలేదు. మీ రాజ్యం మీకివ్వడానికతను అంగీకరించలేదు. కనీసం అయిదుగురికీ అయి దూళ్లిమ్మన్నావు నీవు. అందుకూ అతడిష్టపడలేదు. సూది మొనను మోపే చోటును కూడా ఇచ్చే పని లేదన్నాడంతే. ఇక మీరు చేయగలిగిందేముంది యుద్ధం తప్ప.

కురుక్షేత్రంలో ఇరుపక్షాల సేనలు యుద్ధానికి సిద్ధమై నిలిచాయి. ఇక యుద్ధం ప్రారంభం కాబోతూ ఉంది. ఆ సమయంలో నీవు రెండు సేనల మధ్యలోకి వచ్చి 'ఎవరైనా మా పక్షానికి రాదల్చుకుంటే ఇప్పటికయినా రావ చ్చును' - అని అడిగావు. యుయుత్సుడు ఒక్కడు వచ్చాడు. అసలు వాళ్ళల్లో ఎవ్వరిలోనూ కదలిక లేదు. ఆత్మ పరిశీలనకు అవకాశమిచ్చావు. ఆ అవకా శాన్ని సద్వినియోగం చేసికొనే వాళ్లే లేకపోయారు. ధర్మజా! చివరిక్షణం వరకు ఎదుటి వారికి అవకాశమియ్యగలిగిన నీ ప్రేమను ఏమని అభినందించను! ఆపైన కృష్ణదేవుని సారథ్యంలో కథ నడిచింది. జరుగవలసింది జరిగింది. ఎవరి విధిని వారనుభవించారు.

ఇంతచేసిన ధృతరాష్ట్రుడు చివరకు ఒంటరివాడైనాడు. నా కొడుకులు, నా కొడుకులని తాపత్రయపడిపోయాడు. బాధ్యతాయుతమైన పదవిలో ఉన్నవాడికి తాపత్రయాలుండకూడదు. ఉంటే ఆ పదవినంతా అతడు ఆ తాపత్రయాలకే వినియోగించుకుంటాడు. ఎంత తాపత్రయ పడినా చివరికి అతనికి కొడుకులుగా మిగిలింది మీరే, మిమ్మల్ని కూడా కొడుకులుగా చూడమంటే అతనికి ప్రాణ మొప్పింది కాదు. కాని అతణ్ణి నీవు ఇప్పటికీ తండ్రిగానే ప్రేమిస్తున్నావు. నీ తమ్ముళ్లను కూడా అలాగే ప్రేమించమన్నావు. ఈ రోజున నా పాదాలను కూడ అదే ప్రేమతో ముంచెత్తావు. మీ వంటి మనుమల్ని పొందిన మీ వంటి మానవుల్ని చూడగలిగిన నేను ధన్యుణ్ణి నాన్నా! నేను ధన్యుణ్ణి."

భీష్ముని వాక్కులు ధర్మజుని అన్ని వైపులనుండీ తడుముతున్నాయి. అత డిలోని అన్ని కోశాలను తడుముతున్నాయి. అతడు సేద తీరుతున్నాడు. అతడు మేల్కొంటున్నాడు. అతడు మళ్ళీ నిజస్థితిలో నిలబడుతున్నాడు.

కృష్ణదేవుడు ఆ తాతా మనుమలను తృప్తిగా చూస్తున్నాడు.

ఋషులందరూ 'హమ్మయ్య' అనుకుంటున్నారు తమలో తాము.

పరీక్షిత్తు తన తాత జీవితంలోనికి పరిశీలనగా ప్రవేశించగలిగాను కదా! అని పరవశిస్తున్నాడు శుకయోగినుండి గాథను వింటూ.

## ఏవి తల్లీ!

తన నిజస్థితిలోనికి తాను మేల్కొంటూ, తాతవైపుకు కృతజ్ఞతా పూర్వకంగా చూస్తున్నాడు ధర్మరాజు. ధర్మజుని అభివందనాల నందుకుంటూ భీష్ముడు ఇంకా ఇలా అన్నాడు.

"ధర్మజా! నిరంతరం ఒకవైపు ఋషులతోనూ, మరొకవైపు పరమేశ్వరుడైన శ్రీకృష్ణదేవునితోనూ కలిసి మెలసి నడిచారు మీరు. ఈ ఇద్దరి నుండి రక్షణను పొందడమే కాదు. ధర్మశాస్త్రాల యెడల కన్నులను విప్పారచేసే శిక్షణను కూడా అనుక్షణం పొందుతూ వచ్చారు. సామాన్యులు, పెద్దలు తమకు దగ్గరయినా, వారినుండి తగిన రక్షణను పొంది, వారికి నమస్కరించి తృప్తి పడిపోతారు. సాధకులయిన వారు అప్పటికి అవసరమయిన రక్షణను పొందుతూనే ఎప్పటికీ రక్షణ నందించగలిగిన ధర్మ దర్శనాన్ని అనుగ్రహించగలిగిన శిక్షణను కూడా ఆ పెద్దల నుండి పొందగలుగుతారు. మీరు అలా పొందుతూ వచ్చినవారు, ఏమరపాటుకు లోనుకాకుండా, పొందుతూ వచ్చినవారు. అయినప్పటికీ కూడా ఏమిటీ చిత్రం! ఇలా ఆపదలను ఒక పరంపరగా మీరనుభవిస్తూ రావడమేమిటి? ఒకటి కాదు. రెండుకాదు. దాదాపుగా ఇంతవరకూ మీ జీవితంలో జరిగిన సన్నివేశాలన్నీ ఆపదలే అని చెప్పవచ్చు. ఒకరకంగా ఆపదలకు మీరలవాటు పడిపోయారేమో ననిపిస్తుంది. 'జీవితమన్న తర్వాత ఆపదలు తప్పవు' - అంటారు. కాని, జీవితంలో ఆపదలు తప్ప, ఇంకేమీ లేనివారిని మిమ్మల్నే చూస్తున్నాను. పైగా మీరు ధర్మాన్ని దిక్కుగా చేసుకొని బ్రతుకుతూ వస్తున్నవారు. మీ జీవితంలో ఇలా ఈ ఆపత్పరంపర నడవడమేమిటి?

ఇక, మీ తల్లి ఉన్నదే. ఆ కుంతి అమెను తలచుకుంటేనే, నా మనస్సు చెప్పలేనంత బాధ పడుతుంది. అడుగడుగునా కష్టాలే అమెకు. కష్టపడటానికే, దుఃఖాన్ని అనుభవించడానికే ఆమె పుట్టినట్లున్నది. జీవిత ప్రారంభంనుండి

ఈనాటివరకు సంతోషపడేందుకు ఒక చిన్న అవకాశమయినా వచ్చిందా ఆమెకు?

పాండురాజుతో ఆమెకు వివాహమై, ఈ ఇంటికోడలిగా ఆమె అడుగు పెట్టింది. పాండురాజు పరాక్రమశాలి. ఎప్పుడూ యుద్ధం యుద్ధమంటూ శత్రురాజ్యాల మీదకు వెళ్ళిపోతూ ఉండేవాడు. యుద్ధానికీ, యుద్ధానికీ మధ్య వ్యవధి ఏమన్నా దొరికితే ఏ అడవికో వేటకని వెళ్ళిపోయేవాడు. ఇంటిపట్టున ఉండటం మాత్రం అతనికి అంతగా ఇష్టముండేది కాదు. ఇంక అతడు భార్యలతో కలసి అన్యోన్యంగా గడిపేటందుకు అవకాశమెక్కడ? ఏ వయస్సులో ముచ్చటలు ఆ వయస్సులో జరగాలికదా! ఒకరోజున నేనతన్ని కొంచెం మందలించాను. అతడర్థం చేసుకున్నాడు. 'జీవితాన్ని సమపాళంగా నడుపుకోవాలబ్బాయీ!' అని తెలియచెప్పాను. 'అలాగే' అన్నాడతను. కొద్దిరోజులు జరిగాయి. గృహస్థుగా అతడింటి వద్దనే ఉన్నాడు. నేను ముచ్చటపడ్డాను. ఒకరోజు వచ్చాడు 'వేటకు బయలుదేరుతున్నాను. ఆశీర్వదించండి' అని. అప్పుడే! అన్నాను. 'కుంతీ మాద్రిలను వెంట తీసుకొని వెళుతున్నాను.' అని చెప్పాడు. కొంతలో కొంత నయమనుకున్నాను. ఏమి కొంత నయం! కొంపే మునిగిపోయింది. పాండురాజు శాపగ్రస్తుడయ్యాడు. ఆ తరువాతనుండి అతని యెడల కుంతి పడిన బాధ్యత ఇంతింతకాదు. తానంతటి కష్టస్థితిలో ఉండికూడా తన భవిష్యత్తు అంధకార బంధురమయిపోయిన తరువాత కూడా ఆమె తనను తాను కూడదీసుకొని, పాండురాజుని ఓదార్చి ముందుకు నడిపే ప్రయత్నం చేసింది. అది నిజానికి ఆమెను ఎవరయినా ఓదార్చవలసిన సమయం. అయినా ఆమె ధీరురాలై నిలబడింది. పాండురాజుని సాకసాగింది. ఉన్నట్టుండి పాండురాజు ఒకరోజున తనకు సంతతి కావాలన్నాడు. అందుకు ఏవేవో మార్గాలను చెప్పాడతను. అన్నీ విన్న ఆమె గౌరవప్రదమయిన మార్గాన్ని తనకు తానే ఎన్నుకొన్నది. దేవతా మూర్తులను ఆవాహనంచేసి, వారి ఆశీస్సులతో సంతతిని పొందింది. మాద్రికి కూడా ఆ దేవతా మూర్తుల కృపవల్ల సంతతి కలిగేటట్లు చేసింది. పాండురాజు మురిసిపోయాడు. మురిసిపోయినవాడు తృప్తికూడా పడితే బాగుండేది. అది పడలేకపోయాడు. మాద్రియెడల అతనికి కోరిక కలిగింది. అంతే! ఆ క్షణంలోనే మృత్యువు అతన్ని స్వీకరించింది. మీ తల్లి నిశ్చేష్టురాలై నిలబడింది. మీరు పసి కూనలు. మాద్రి తానూ భర్తతో వెళ్లిపోతానంది. కుంతి మాత్రం పిల్లలకోసం ఉండిపోవాలంది. మాద్రి తన పిల్లలను కూడా ఆమెకే అప్పచెప్పింది. క్షణంలో కుంతి ఒంటరిదైపోయింది. చుట్టూ కీకారణ్యం. ఆ అరణ్యం మధ్యలో పసి కూనలతో తాను. ఇంతకంటే కష్టమేముంటుంది. ఎండ కన్నెరుగని ఆమెకు

ఎన్ని కష్టాలు! ఎన్నెన్ని కష్టాలు! ఆ కష్టాలలో దైవం కోసం చూసింది. ఆ దైవమే ఋషుల రూపంలో నిలచి, ఆమెను హస్తినకు చేర్చింది. 'దిక్కులేని వారికి దేవుడే దిక్కు!'

ఆ తరువాత ఆమె మిమ్మల్ని పెంచి పెద్ద చేసే పనిలో పడింది. మీరు ఎదిగివచ్చి తనకు అండగా నిలుస్తారనుకుంది. మిమ్మల్ని పెంచటం ఆమెకు గగనమైపోయింది. సుయోధనాదుల నుండి మిమ్మల్ని రక్షించుకోవడం ఎలా అన్నది ఒక సమస్యయిపోయింది. ఆ సమస్య ఇప్పటివరకూ కొనసాగింది. ఇంతవరకు మీరే నిలద్రొక్కుకోలేదు. ఇప్పుడిక నిలద్రొక్కుకోవాలి మీరు. ఏం నిలద్రొక్కుకుంటారు! మీకూ వృద్ధాప్యం వచ్చేసింది. వృద్ధిలోకి వస్తారనుకున్న తన కొడుకులు వృద్ధాప్యం వచ్చేవరకు స్థిరపడలేదంటే ఆపదల పరంపరలతో కాలాన్ని వెళ్లబుచ్చుతున్నారంటే ఇక ఆ తల్లికెలా ఉంటుంది? భౌతికంగా సుఖభోగాలకు అవకాశముండదు. మానసికంగా నిరంతర మథనం నడుస్తూ ఉంటుంది. నాకనిపిస్తూ ఉంటుంది. 'ఈ కుంతీదేవి జీవితంలో నిజంగా సుఖప డిన క్షణాలున్నాయా?' అని. ఏమిటి ఈమె జీవితం ఇలా నడుస్తున్నది? అని నాకాశ్చర్యం కలుగుతున్నది. అసలు ఇలాంటివాళ్లు కొందరు కొందరు కష్టాలన నుభవించడం కోసమే పుడతారేమో ఈ భూమిమీద! ఆ కొందరు కొందరికి మీ తల్లియొక్క జీవన యాత్ర ఒక ఆదర్శమవుతుంది. 'ఆమే అన్ని కష్టాలు పడిందికదా, ఇక మనమెంత? మన కష్టాలెంత?' - అని వారు తేరుకోవడా నికి పనికివస్తుంది.

ఆమె ఎలాంటి సుఖశాంతులను అనుభవించిందీ అనేది ఒక చిత్రమైన ప్రశ్న. సామాన్యస్థితికి అందని ప్రశ్న. సుఖశాంతులనేవి పరిస్థితులను బట్టికాక, ఆ వ్యక్తియొక్క మనస్సుపైన, హృదయం పైన, మనస్సుకూ, హృదయానికీ ఆ వ్యక్తిలో ఏర్పడిన చుట్టరికం పైన ఆధారపడి ఉంటాయి. మనస్సుకీ, హృదయానికీ సఖ్యత కుదిరితే పరిస్థితులెలాంటివయినా మనిషి చెదరడు. తన స్థితిలో తానుండి, పరిస్థితుల యెడల ప్రవర్తించే ప్రయత్నం చేస్తాడు. కావలసిన విధంగా ప్రవర్తిస్తాడు. ఈ విధంగా చూస్తే కుంతిది ఒక మహోన్నతమయిన స్థితి. మాటలకు అందేదికాదు. నా బాధల్లా ఏమిటంటే - అన్నీ ఉండి కూడా ఆమెకు ఏదీ అందకుండా పోయింది. అనుభవించడానికి యోగ్యత లేని వారెం దరో సుఖభోగాలు అనుభవిస్తూ ఉండగా, అన్ని యోగ్యతలూ ఉండికూడా, సుఖభోగాలు ఆమె అనుభవించడానికి వీలు లేకపోయింది అని.

ధర్మజా! నన్నర్థం చేసుకో. ఏర్పడిన పరిస్థితుల యెడల ఆమె ఎలా స్పందించిందీ అన్నది, అది ఆమె సంస్కారానికి నిదర్శనం. నా బాధల్లా 'అన్నీ తెలిసికూడా, అన్నీ చూస్తూకూడా, సహించలేని స్థితిలో ఉండికూడా, చెలియలికట్ట దాటలేని సముద్రంలా నేనెలా ఉండిపోయాను!' అని. ఏవో కన బడని సంకెళ్ళు నన్ను అనుక్షణం బంధిస్తూ వచ్చినట్లు అనిపిస్తుంది నాకు. దీక్షల పేరిట, నిర్ణయాల పేరిట నిలబడిపోయి, చివరకు ఎవరికీ ఏమీ చేయలేని వాడనైపోయానేమో! అనిపిస్తుంది నాకు. ఆ తల్లిని తలచుకుంటే, ఇంత కాలం ఆమె పెట్టబడిన పరిస్థితులను తలచుకుంటే. ఆమెకు ఏమీ చేయలేక పోయినందుకు నన్ను నేను సంబాళించుకోలేక పోతున్నాను. ఏది ఆ తల్లి! ఇంతకుముందు మీతో పాటుగా నా పాదాలకు నమస్కరించి నేను గమనించే లోపలే వినమ్రతతో అవతలకు వెళ్లింది ఆ తల్లి. ధర్మజా! ఆ తల్లి ఏది? ఆ పుణ్యమూర్తిని కనులారా ఒక్కసారి చూడాలని ఉందయ్యా!

అమ్మా కుంతీ! అడుగుతూ ఉండగానే ఆజ్ఞగా స్వీకరించి దగ్గరయ్యావా తల్లీ! వయస్సులో చిన్నదానవయినా, హృదయపరంగా మహోన్నతురాలివమ్మా! భౌతికంగా నేను నీకు ఏమీ చేయలేకపోయాను. మానసికంగా మాత్రం నిత్యమూ నిన్ను స్మరించుకుంటాను. మా మాతృమూర్తితో పాటుగా స్మరించుకుంటాను. మా మాతృమూర్తితో పాటుగా నిన్నూ స్మరించుకుంటాను."

కనుల వెంట బాష్పాలు జాలువారుతూ ఉండగా వాటిని పమిటచెంగుతో అద్దుకుంటూ ఇలా అన్నది కుంతి. "మీ మాటలు నన్ను కదిలించి వేస్తు న్నాయి. మీరలా మాట్లాడుతూ ఉంటే, నా స్థితిని గూర్చి తడిమి తడిమి మీరు పరామర్శిస్తుంటే మానసికంగా నేను కదిలిపోతున్నాను. ఇంతసేపూ నా మనస్సు మీ గురించే ఆలోచిస్తున్నది. సుఖభోగాలు నాకు అందలేదనీ, ఈ నా జీవితంలో సౌఖ్యవంతమయిన క్షణాలు కానరావడం లేదనీ పెద్దమనస్సుతో విలవిలలాడి పోతున్నారు మీరు. కాని మీ పరిస్థితి ఏమిటి? మీరు సుఖప డింది ఎక్కడ? అన్నీ ఉండికూడా అవన్నీ మీకే చెందవలసి ఉండికూడా మీరనుభవిస్తూ వచ్చిన ఈ విచిత్రమైన ఈస్థితి ఏమిటి? సుఖభోగాల మధ్య ఉండి కూడా, వాటిని అందుకునే పరిస్థితి మీ కెప్పుడయినా లభించిందా? చుట్టూ సమస్యలు. నిరంతరం మానసిక మథనంతో మీలో మీరు ఎంత వేగిపోయారు! ఎంత కాగిపోయారు! అన్నింటినీ మించి, అలాంటి పరిస్థితులలో భయంకరమయిన ఒంటరితనం అనుభవిస్తూ వచ్చారు మీరు. కనీసం మిమ్మల్ని

సేదదీర్చగలిగిన వారెవ్వరు? అసలు ఆ ప్రయత్నం చేసిన వారు ఎందరు? ఇంత మంది మధ్య ఉండి కూడా ఎంత ఒంటరితనాన్ని అనుభవించారు! ఎంత ఒంటరితనం అనుభవించారు!

చేసిన త్యాగానికి ఫలంగా సమస్యలు ఒకదాని తరువాత ఒకటి పుట్టుకు వస్తుంటే ఆ విచిత్రాన్ని గమనిస్తూ, నిరంతర మథనంలో మీరు గడిపిన రోజులు అన్నీ ఇన్నీనా!"

భీష్ముని కన్నుల నిండా నీళ్లు తిరిగాయి. 'తల్లీ! నేను నీ గురించి ఆలో చిస్తున్న క్షణాలలో నీవు నా గురించి ఆలోచిస్తున్నావా అమ్మా! నా గురించి ఆలోచిస్తున్నావా! పిచ్చితల్లీ! ఎంతటి దయామయురాలివమ్మా నీవు!'

కుంతి ఇంకా ఇలా అన్నది. "ఒక్కమాట చెబుతాను. నాకు తెలుసును మీ ఆశీస్సులు నాకున్నాయని మహానుభావులు మీరు. మీ ఆశీస్సులు చాలవా నన్ను నడిపించడానికి! ఏమయినా లభించవచ్చుగాని, నిజమైన పెద్దలనుండి నిండైన ఆశీస్సులు వాటికవిగా లభించడం ఈ లోకంలో చాలా అరుదయిన విషయం. అలాంటివి నాకు నిరంతరం అందుతూ ఉన్నాయని నేను మీ యెడల కృతజ్ఞతా భావంతో ఉన్నానే కాని, నా మనస్సెన్నడూ మిమ్మల్ని తప్పు పట్టలేదు. ఏం జరుగుతూ ఉన్నదో తెలుస్తూ ఉన్నప్పుడు ఎలా తప్పు పట్టగలుగుతుందది? మీ ఎడల ఎలాంటి అసంతృప్తీ నా కెన్నడూ కలుగలేదు. భయంకరమయిన మీ ఒంటరితనం మాత్రం నాకు రోజూ గుర్తుకు వస్తుంది. కృష్ణయ్యను ప్రార్థిస్తూ ఉన్నప్పుడల్లా గుర్తుకు వస్తూ ఉంటుందది.

మీ అంతటి మహనీయులు నాకు మామగారు కావడం, దేవదేవుడయిన శ్రీకృష్ణుడు నాకు సాక్షాత్తు మేనల్లుడు కావడం, ఇంతకంటే అదృష్టం ఇంకే ముంటుంది! ఈ అదృష్టాన్ని స్మరించుకుంటూనే మనస్సుకు కష్టమన్నది అనిపించకుండా ఈ పెద్ద ప్రయాణం చేయగలిగాను."

భీష్ముని గుండెనిండా నిండిన ఆర్ద్రత అతని కనులనుండి రూపుకట్టి ఈవ లకు జారిపడుతున్నది. అలా జారుతున్న ప్రతి బాష్పబిందువులోనూ తల్లి కుంతి ప్రతిబింబిస్తున్నది.

కుంతీదేవి మరింత ఆర్ద్రమైంది. ఆమె కనులనుండి మరింతగా బాష్పాలు జాలువారసాగాయి. జాలువారుతున్న ఆ బాష్పాల వర్షంలో అంత మంది భీష్ములూ ఒక్కసారిగా కదిలారు. కొంతసేపటి పాటు వారలా ఉండిపోయారు. అంతలో

భీష్ముడు కృష్ణదేవుని వైపు తన చూపును మళ్లించాడు. అది గమనించిన కుంతి తన దృష్టి కూడా అటువైపుకే మరల్చింది అప్రయత్నంగా.

ఇప్పుడు వారి బాష్పాలలో కృష్ణయ్య ప్రతిబింబిస్తున్నాడు. ఆయన వారిని చూపులతోనే కౌగిలిస్తున్నాడు.

పరివేష్టితులయిన వారందరూ పారవశ్యంలో మునిగితేలుతున్నారు. వారి పారవశ్యం కనులనుండి బాష్పాలుగా వర్షిస్తూ ఉన్నది. ఆ భాష్పాలలో కుంతీ, కృష్ణుడు, భీష్ముడు, ఆ ముగ్గురూ కలిసిన మొత్తం దృశ్యం ప్రతిబింబిస్తున్నది. రాలుతున్న ప్రతి బాష్ప బిందువు నుండీ ఈ దృశ్యమే!

పరీక్షిత్తు పరవశుడైపోతున్నాడు. కుంతీ, భీష్ములను మరల మరల స్మరించుకుంటూ, తెలియచెప్పబడుతున్న వారి జీవితపు లోతులను మనస్సుతో తడిమి తడిమి చూస్తున్నాడు పులకిత గాత్రుడవుతూ!

## చిన్న ప్రశ్న

శ్రీకృష్ణుని స్పర్శలో, స్మరణలో తనను తాను కూడదీసుకుంటూ, ధర్మజునితో ఇలా అన్నాడు భీష్ముడు.

"ధర్మజా! ఆకాశంలోని మేఘాలతో వాయువు జరిపే లీలలను నీవూ గమనిస్తూనే ఉంటావు కదా! ఆ వాయువే మేఘాలనొకదానికొకటిగా కలుపుతూ ఉంటుంది. మళ్లీ కాసేపటిలో వాటిని విడదీస్తూ ఉంటుంది. ఒకప్పుడు తనవల్ల ఇక్కడ చేరిన మేఘాలను తానే ఎక్కడెక్కడికో తరిమి కొడుతుంది. ఇంకొకప్పుడు ఎక్కడెక్కడి మేఘాలను అంతలోనే ఇక్కడకు నడుపుకు వచ్చి నిలబెడుతుంది. ఇంతకూ ఇప్పుడు వాన ఎక్కడ పడుతుంది? వాయువు ఎక్కడ తలచుకుంటే అక్కడ! ఇదిగో ఇక్కడ పడబోతోందని మనమందరం అన్నీ సర్దుకుంటాం. సర్దుకునేలోపలే, సర్దుకొని మనం పైకి చూసే లోపలే, ఆ వాయువు - ఆ మేఘాలను ఎక్కడికో, ఎక్కడెక్కడికో తీసుకొనిపోయి, ఆ వానల్లులతో వాటి ఉనికిని ఏ మాత్రం గమనించని ఎవరెవరినో, ఎందరెందరినో అలా తడిపివేస్తూ ఉంటుంది. బయటనుండి లోపలికి వెళ్లేలోపలే వాళ్లందరూ తడిముద్దలయి కూర్చుంటారు. మళ్లీ వాళ్లు తలలు తుడుచుకునే లోపల అక్కడ వాన ఉంటుందని చెప్పలేం! ఏమో! ఆ వాయుదేవుడు ఎప్పుడు ఎటు తలు

చుకుంటాడో! మేఘాలు కదులుతూ, పరిగెడుతూ కనిపిస్తూ ఉంటాయి. కాని వాటిని కదిలిస్తున్న పరుగెత్తిస్తున్న వాయువు మాత్రం మనకు కనిపించదు. మన కున్న విచక్షణతో మనం అతడిని గమనించుకుంటే తప్ప. నాయనా! ఈ మన మానవ జీవితాలలో నిరంతరం నడిచే సన్నివేశాలున్నాయే అవి ఆ ఆకాశం లోని మేఘాల లాంటివి. మేఘాలను వాయువు నడిపిస్తూ ఉన్నట్లుగా ఈ మన జీవిత సన్నివేశాలను కాలం నడిపిస్తూ ఉంటుంది. మేఘాలు వాయువశమై ఉన్న ట్లుగా ఈ మన జీవిత సన్నివేశాలన్నీ కాలానికి వశమై నడచిపోతున్నాయి. ఏది ఎందుకు జరుగుతున్నది అన్నది ఆ కాలపురుషునికి మాత్రమే తెలిసేటటువంటి అంశం. మేఘాల నడకలను చూస్తూ, వాయుదేవుని యొక్క పోకడలను గమనించగలిగినట్లుగా, మనను చేరవస్తున్న సన్నివేశాలను చూడవలసిన రీతిలో చూడటం ద్వారా మనమూ కాలపురుషుని పోకడలను గమనించుకోవలసి ఉంది.

లేకపోతే ఏమిటి చెప్పు. ఏమిటీ విచిత్రం! మామూలు కంటికి అసలేమ యినా అంతుపడుతుందా అని. ధర్మరాజు రాజట. యుద్ధం చేస్తున్నవాడు గాండీవాన్ని ధరించిన అర్జునుడట. చక్రాన్ని చేతబట్టిన కృష్ణదేవుడు ఆ పార్థునికి సారథిట. తన గదయొక్క కదలికలతోనే శత్రురాజుల గుండెలను కంపింపచే యగలిగిన భీమసేనుడు ఆ కృష్ణార్జునులకు సహకారిట. అలాంటి అలాంటివారు అంతటంతటి వారు అలా ఒక్కటిగా కదలివచ్చిన కలసి వచ్చిన ఈ యుద్ధంలో వాళ్లకు కూడా ఎన్నెన్నో బాధలు ఎదురు వచ్చాయంటే అనుకోని ఆపదలు, వారిని ముంచివేసాయంటే - ఏమిటిది? ఏమిటీ ఆశ్చర్యం? కాల పురుషుని లీలకాక మరేమిటిది? కాల పురుషుని లీలగా కాక దీనిని మనమెలా అర్థం చేసికోవాలి.

మరి ఆ కాలపురుషుడే ఈ కృష్ణదేవుడు కదా! ఈయన చిత్రమయిన వాడు. ఏవి చెప్పాలో అవి చెబుతాడు తప్ప అన్నీ చెప్పడు. కథ ముందుకు సాగడానికి ఏవి కావాలో అవి చెబుతాడు తప్ప మిగిలిన వాటి ఊసెత్తడు. కాలపురుషుడే ఈయన అయినప్పుడు ఈయనకు ఇవన్నీ తెలియవని మన మను కోగలమా! ఈ వైష్ణవ మాయను అర్థం చేసికోవడం కష్టం. కష్టమనడం కన్నా అదొక ఆశ్చర్యం! ఇక్కడ ఈ కథలో కాలపురుషుడు తానయి వుండికూడా తానూ మనతోపాటు ఒక పాత్రగా మసలుకోవడం అదెంతటి ఆశ్చర్యం!

అది సరేగాని ధర్మజా! అలాంటి దేవదేవుని సన్నిధిలో విన్నాక చిన్న ప్రశ్న అడగాలని నాకనిపిస్తోందయ్యా! నాకు అనిపించడమో, ఆయన నాచేత

అడిగించడమో, మొత్తంమీద ప్రశ్నమాత్రం ఇది"

భీష్ముడు కొద్దిక్షణాల పాటు ధర్మజునికి తెలియకుండానే ధర్మజుని గమనిస్తూ ఉన్నాడు. గమనించి అప్రయత్నంగా తల పంకించాడు. 'భేష్! ఏమిటి ఆ ప్రశ్న? అన్న కుతూహలం అతని ముఖంలో కనబడలేదు. ఆ ప్రశ్న ఏమయి ఉంటుంది? అన్న ఒత్తిడిని కూడా అతని మనస్సు అనుభవిస్తున్నట్లు లేదు. అతడు సావధాన చిత్తుడై కనిపిస్తున్నాడు. నిండయిన శ్రద్ధతో కనిపిస్తున్నాడు. అంకిత భావంతో కనిపిస్తున్నాడు. అర్పణ భావంతో శోభిస్తున్నాడు. అనన్యచింతనలో కుదురుకొని ఉన్నాడు. ఈ నా మనుమడు అవతార మూర్తికి ప్రీతి పాత్రుడు. తగిన జవాబులు చెప్పడంలో సర్వ సమర్థుడని యక్షప్రశ్నల నాడే జగత్తునకంతటికీ ఇతడి దివ్య వైభవం తెలియచెప్పబడింది. అలాంటివాడిని, అలాంటి 'వాడి' కలిగిన వాడిని ఇప్పుడు ప్రశ్నించబోతున్నాను. అసలు ప్రశ్నిస్తే ఇలాంటివాడినే ప్రశ్నించాలి. అప్పుడది ప్రశ్న అవుతుంది. ఆ వచ్చినది సమాధానమవుతుంది.'

అనుకొంటూ భీష్ముడు మరొక్కసారి ధర్మజుని వైపుకు తేరిపార చూచాడు. అతడు అలాగే ఉన్నాడు. అదే దివ్యస్థితిలో ఉన్నాడు. అతడిలో ఎక్కడా తాత ఇంకా ప్రశ్నించడేమి అన్న ఆత్రుత కనిపించడం లేదు. కుతూహలం, ఒత్తిడి, ఆత్రుత ఇలాంటి సంచలనాలకు అతీతమయిన సంయమస్థితిలో ఉన్నాడతడు. సర్వ సమర్థుడూ, సర్వసన్నద్ధుడూ అతడు. యుద్ధమునందు స్థిరముగా నిలిచేవాడు కాబట్టి యుధిష్ఠిరుడు అని పేరు వచ్చిందతనికి. మామూలు యుద్ధం మాట అటుంచి, ఈ మానవజీవిత సంగ్రామంలో తాను స్థిరంగా నిలిచాడు. తన తమ్ములను చెదరకుండా పొదవి పట్టుకున్నాడు. పేరుకు తగినవాడు. తరతరాలు పేర్కొన తగినవాడు.

తాతగా అలా ముచ్చటపడుతూ, ఆ మనుమడితో ముచ్చటలాడుతున్నట్లుగా కథను ఇలా కొనసాగిస్తున్నాడు భీష్ముడు "ధర్మజా! సావధాన చిత్తుడవై ఉన్న నీకు ఆ దేవదేవుని సన్నిధిలో వేస్తున్న చిన్న ప్రశ్న ఇది. సామాన్యంగా లోకంలో జీవితంలో కష్టనష్టాలు వచ్చినప్పుడు వాటిని గూర్చి ఎలా విశ్లేషిస్తూ ఉంటారో నీకు తెలుసును కదా! 'పూర్వజన్మలో ఏదోచేసి ఉంటాం. అందువల్ల ఇలా జరిగి ఉంటుంది' - అని సరిపుచ్చుకుంటారు కొందరు. 'ప్రయత్నం చాలనప్పుడు ఇలాంటి ఇబ్బందులు రాక తప్పుతుందా?' - అని ఆలోచిస్తుంటారు కొంతమంది. 'మనం ఎంతచేసినా దైవానుగ్రహం ఉండాలికదా! తానొకటి తల

ఉన దైవమొకటి తలచును' - అని పెద్దలనడం మనం వినలేదా? మానవ ప్రయత్నం ఎంత జరిగినా దైవం కలిసిరానపుడు అది ఏమి ఫలిస్తుంది? - అని పైకి చూస్తూ నిట్టూరుస్తూ ఉంటారు కొందరు. దీనిని బట్టి ఎంతవ రకు తెలుస్తూ ఉన్నది? మనిషి జీవితంలో ఒడిదుడుకులు వచ్చాయి అంటే అది అతడి పూర్వకర్మ విశేషాన్ని అనుసరించి అయినా అయి ఉండాలి. లేక అతని మానవ ప్రయత్నమయినా చాలకపోయి ఉండాలి. లేదా దైవమయినా అతనికి కలిసిరాకపోయి ఉండాలి. ఏమంటావు? ఈ మూడింటిలో ఏ ఒకటో రెండో అంశాలకు అతడు గురియై, అతడా ఒడిదుడుకులు అనుభవిస్తూ ఉండి ఉండాలి. అవును కదా! చూడటానికి అలాగే అనిపిస్తూ ఉన్నది కదా!"

ధర్మజుడు సావధాన చిత్తుడై వింటున్నాడు. ఋషులందరూ ఒక్కక్షణం అటు తాతా మనుమల వైపు చూస్తున్నారు. మరుక్షణం ఇటు కృష్ణదేవుని వైపు చూస్తున్నారు. మరోక్షణం విశిష్టమయిన ఈ సన్నివేశం మొత్తాన్ని ఒకే సారి తమ చూపులలో ఇముడ్చుకొంటున్నారు. తాతా మనుమలు ఇద్దరూ జీవితాలే తపస్సులుగా సాగినవారు. శ్రీకృష్ణునిపై చూపెట్టుకొని తమ తమ జీవిత తపస్సులను కొనసాగించినవారు. ఇప్పుడా తాతా మనుమలు ఆ సారథి సన్నిధిలోనే మాట్లాడుకొంటున్నారు. మనస్సు విప్పి మాట్లాడుకొంటున్నారు. మానవజాతి మనస్సులోని ముడులను విప్పుతున్నట్లుగా మాట్లాడుతున్నారు. ఓహో! ఏమి విశిష్టమయిన సన్నివేశమిది! ఆహా! ఎంత అర్థవంతమయిన సన్నివేశమిది! ఋషులు మురుస్తున్నారు. సారథి సరసంగా చూస్తున్నాడు సాగుతున్న సన్నివేశం వైపు.

ధర్మజుని వంక మరింతగా చూస్తూ భీష్ముడిలా అన్నాడు. "తండ్రీ! లోక సామాన్యమయిన భావనలను గూర్చి మనం చెప్పుకున్నాం కదా! మరి ఇప్పుడు ఈ భావనలతో మీ కథను ఒకసారి పరిశీలించి చూద్దామా! మీరు ఆపదల పరంపరలను అనుభవిస్తూ వచ్చారని వేరే చెప్పనక్కరలేదు కదా! అయితే అన్ని ఆపదలు, అన్నిరకాల ఆపదలు మిమ్ములను దేని ప్రకారం ఎందువల్ల చుట్టుము ట్టాయి? అన్నది ప్రశ్న. పూర్వకర్మ బంధాన్ని బట్టి, ఆ కర్మ విశేషాన్ని బట్టి, ఈ ఆపదలు చుట్టుముట్టాయని అనుకొందామా? అలాంటి వీలు ఏమాత్రం కనబడటం లేదు. ఎందువల్లనంటే మీరందరూ దైవాంశసంభూతులు. కారణజ న్ములు. మీకు పూర్వకర్మ బంధం ఉండటానికి అవకాశమేది?

పోనీ, మానవ ప్రయత్నం చాలక మీరు ఈ ఇడుములకు లోనయ్యారం

దామా? మీ కంటే సమర్థులు ఇప్పుడు ఈ లోకంలో ఎవరు ఉన్నారు. మీరు జగదేకవీరులు కదా! మీ ఆయుధాలు, మీ అస్త్రాలు తపస్సంపన్నమైనవి. దేవ తలచే స్వయంగా మీకు అందించబడ్డవి. ఇక ప్రయత్నలోపమన్నది ఏ కోశానా మీలో లేనేలేదే! సర్వసమర్థులయిన మీరు సర్వ సన్నద్ధులయి నిరంతరం కర్తవ్య నిర్వహణం చేస్తూ వచ్చారు. మరి, అయినా ఈ ఆపదలు మిమ్మల్నెందుకు చుట్టుముట్టాయి? మీరు చేసినంతగా మానవ ప్రయత్నాన్ని చేసిన వారు ఈ భూమిమీద ఎందరుంటారు?

కాదు. కాదు. దైవానుగ్రహం చాలలేదు. అందువల్ల ఈ ఆపదలన్నీ పడక తప్పలేదు అని అందామా అంటే అందుకు అసలే వీలు దొరకదు. సాక్షాత్తూ దేవదేవుడే మీవాడై నిలిచాడు. మీలోని వాడై మెలిగాడు. మీ పనిని తన పనిగా బాధ్యత పడ్డాడు. మీకన్నివిధాలా సారథి అయ్యాడు. మీగుర్రాల పోషణ దగ్గరనుండి, మీ పాత్ర పోషణ వరకు అన్నీ తానే చూచుకొన్నాడు. తానే మీరుగా, మీరే తానుగా నడిచాడు. నడుస్తున్నాడు. మిమ్ములను నడిపిస్తున్నాడు. మీ కష్టం తన కష్టంగా, మీ సుఖం తన సుఖంగా, మీ విజయం తన విజయంగా, మీరే తన సర్వస్వంగా ఈ భూమి జనులు ఎప్పటికీ ఆశ్చర్యపడేలాగున తన అవతార కార్యక్రమాన్ని మీతో ముడివేసి, పెనవేసి నడిపిస్తున్నాడు. అతని కొరకు మీరు, మీ కొరకు అతను అన్నట్లు నడుస్తున్నది ఈ కథ. అలాంటప్పుడు అలా జరుగుతూ వస్తున్నప్పుడు ఇంక దైవానుగ్రహానికి లోటున్నదని అనగలమా? అసలు దైవానుగ్రం పొందని చోటు మీ జీవితంలో ఎక్కడయినా ఉన్నదా! ఏమి ధర్మరాజా! ఏమంటావు?

కనుక. ఈ మీ విషయంలో పూర్వకర్మ బంధం ఉండటానికి అవకాశం లేదు. మానవ ప్రయత్నంలో లోటు జరిగిందేమోననడానికి ఏమాత్రం వీలు లేదు. దైవానుగ్రహం అందలేదేమో అనుకోవడానికి అసలు కుదరనే కుదరదు. మరి, ఇంత కుదురయిన కథలో ఈ కుదుపులేమిటయ్యా? ఈ కుదుపులేమిటి?"

సావధాన చిత్తురాలయి సన్నివేశాన్ని సాకల్యంగా గమనించుకొంటూ వస్తున్న కుంతీదేవి ఒక్కసారి మామగారివైపు తలపైకెత్తి చూసింది. ఆమె ముఖాన చిరునవ్వు వెలిసింది. ఆ ముఖాన్ని తన వైపుకు మామూలుగా వంచేసుకుంటూ, 'మామగారు ఆ యక్షుణ్ణే మరిపిస్తున్నారు' - అనుకొన్నది.

ధర్మజుడు వినమ్రుడై మనస్సుతో ఆ మహనీయునికి అంజలి ఘటిస్తూ ఇలా అన్నాడు. "తాతా! అవసరమయిన ప్రశ్న వేశావు. నీ వంటి పెద్దల

అండదండల వల్ల, ఆశీస్సుల వల్ల నా జీవితంలో అడుగడుగునా అగుపిస్తూ, అనుక్షణం అనుభవానికి వస్తూ, క్షణం క్షణం నన్ను ముందుకు నడిపించిన దివ్యమయిన ఆ సమాధానాన్ని మీ ముందు నివేదించుకొంటున్నాను. దుర్లభ మయిన అవకాశంగా లభించిన ఈ మానవ జీవితాన్ని నేను కేవలం నుదుటి వ్రాతను అమలుపరిచే కథగా చూడలేను. చూడను కూడా! ఇక, మీరు వివ రించారే - లోకంలో సమాన్యంగా అందరూ అనుకునే ఆ మూడు అంశాలు - ఆ మూడు అంశాలకు కూడా దివ్యమయిన ఈ మానవ జీవితాన్ని ముడిపె ట్టలేను. ముడిపెట్టను. అయితే, ఆ మూడు అంశాలనూ నేను అశ్రద్ధచేయను. కాదనను. మానవజీవితం కర్మబంధాలకు అతీతంగా సాగవలసిందే. మానవ ప్రయత్నంలో ఏమాత్రం లోపం జరుగరాదు. ఏమరపాటు కలుగరాదు. దైవా నుగ్రహమూ అది అవశ్యం అవసరం. అసలది లేనిదే ఏదీ లేదు. అయితే ఈ జీవితం ఈ మూడింటికి మాత్రమే పరిమితం కాదు. అలా పరిమితం చేయబ డలేదు. మానవ జీవితంలోని సన్నివేశాలు ఎందుకు ఎలా వస్తాయి అన్నదానికి ఇంకొక వైపునుండి కూడా మనం చూడవలసి ఉందికదా! ఆ ఇంకొకవైపు నుండి జీవితం చూడటం నేర్చుకోమనే కదా, మీలాంటి పెద్దలు అనాదిగా చెబుతూ వస్తున్నారు. అటునుండి, అనగా ఆ వైపునుండి చూచినప్పుడు ఇదే జీవితం మరొకలా కనబడుతుంది.

జీవితంలో సన్నివేశాలు నడుస్తున్నాయి. నడిచివస్తున్నాయి. ఒకదాని వెంట ఒకటి వస్తున్నాయి. మన కర్మఫలాలుగా కాదు. మానవ ప్రయత్న లోపానికి బదులుగా కాదు. దైవానుగ్రహం లేదని చెప్పడానికి సంకేతాలుగా కాదు. మనకు అవసరమై ఆ సన్నివేశాలు నడుస్తున్నాయి. మన పాత్ర పోషణకు అవసరమై ఆ సన్నివేశాలు నడిచివస్తున్నాయి. జగత్కల్యాణ సాధనకు అవసరమై, దేవ దేవుని అనుగ్రహంగా, ఆయా సన్నివేశాలు రూపుదిద్దు కుంటున్నాయి. సృష్టి లీలలో భాగంగా ఆయా సన్నివేశాలు సాగిపోతున్నాయి. మనమూ ఆ లీలలో ఒకానొక భాగమేగా తాతా! జీవితాన్ని ఇలా చూడటమన్నది ఈ తల్లి ఒడి నుండే, ఈ తల్లి స్పర్శతోనే, ఈ అమ్మ పెంపకంలోనే నాకు అలవాటయింది తాతా! ఇది ఈ తల్లి చూపిన బాట. నా దృష్టిలో ఈ తల్లి సాక్షాత్తూ ప్రకృతి మాత. ఆపదల పరంపరలు అనబడేవి - అన్నివైపుల నుండి చుట్టు ముడుతున్నా ఈ తల్లి తాను బెదరలేదు. మమ్ములను చెదరనీయలేదు. ఈ జీవితాన్ని ఎలా చూడాలో అలాగే మేం చూచేటట్లుగా, కంటికి రెప్పలా కాచుకుంటూ వచ్చింది ఆ తల్లి. ఆ విషయంలో ఇప్పటికీ నాకు ఆమెచేత

సాకబడుతూనే ఉన్నట్లుంటుంది. ఇప్పటికీ ఆమె నా వెన్ను నిమురుతూ, అంతలోనే ఆ వెన్ను తడుతూ ఉన్నట్లు ఉంటుంది. మీ వంటి మహనీయులను బోధపరచుకోగలిగినా, దివ్యమంగళ రూపులయిన వ్యాస, కృష్ణులకు చేరువయినా ఇదంతా ఈ తల్లి మాకు పెట్టిన భిక్ష! ఇవన్నీ ఈ తల్లి మాకు కట్టిన రక్ష!

జీవితంలోని సన్నివేశాలు మనిషి ఎదగడానికిగాను వ్యక్తమవుతున్న అవకాశాలు. జీవితంలోని సన్నివేశాలు, మనిషి చేయవలసిన సాధనలోని భాగాలు. జీవితంలోని సన్నివేశాలు మనిషి పోషించవలసిన పాత్రకు ఆవశ్యకమయిన అంశాలు. జీవితంలోని సన్నివేశాలు జగత్కల్యాణ సాధనలో భాగంగా భగవంతుడు, మనకు అనుగ్రహిస్తున్న దివ్యలీలా విశేషాలు. తెలిసి బ్రతికిన బ్రతుకే తపస్సు! ఇలా అని తెలిసి బ్రతికిన బ్రతుకే తపస్సు! తాతా! ఈ తల్లి స్పర్శలో నిరంతరం నేనందుకొన్న బోధ ఇది. ఈ తల్లి దయవల్ల జీవితంలో బోధలే నడిచాయి తప్ప, బాధలు మాకు అగుపడలేదు. జన్మ ఎత్తినందుకు మానవుడు ధీరుడయి ఎలా జీవించాలో ఉగ్గునాటినుండి ఈమె మాకు ఉపదేశిస్తూనే వచ్చింది. ఆమె మాలో పాదుకొలిపిన ధీరత్వమే అవతారమూర్తితో చేతులు కలిపి నడిచే పాత్రతను మాకు సిద్ధింప చేసింది. తాతా! నిజం చెప్పనా! కృష్ణదేవుని చూస్తున్నా, నాకు ఒక్కొక్కప్పుడు మా అమ్మను చూస్తున్నట్లే అనిపిస్తుంది. అంతర్యామిలో నిలిచిన మా తండ్రి - అమ్మను మా కప్పగించినందుకు మాకు అన్నీ ఆ అమ్మే అయింది. ఇది తాతా! ఆ అమ్మ చేసిన అక్షరాభ్యాసం! ఇది తాతా! ఆ అమ్మ గరిపిన విద్యాబోధన! ఆమే మమ్ములను గురువుగా నడిపించి జగద్గురువునకు తగిన పరివారంగా మమ్ములను తీర్చిదిద్దింది. నా దృష్టిలో ఆమే అమ్మ. ఆమే వ్యాసుడు. ఆమే కృష్ణుడు. ఆమే అంతా!"

భీష్ముడు కదిలాడు. భీష్ముడు కరిగాడు. ధర్మజుని తన గుండెలకు హత్తుకొన్నాడు. తానే అతడు అన్నట్లుగా హత్తుకొన్నాడు.

కృష్ణుడు తన రెండు చేతులనూ వారిద్దరిపై వేసాడు. ఇద్దరూ తనవారే. అసలు వారిద్దరూ తనే అన్నట్లుగా నిలిచాడు.

ఋషిలోకం అర్ద్రమైంది. తానే ఆ సన్నివేశమయింది అదే అనుభూతిలో నిలిచివుంది.

తల్లి కుంతి వినమ్రురాలైంది. చేతులు జోడించింది. 'నా జన్మ ధన్యమైంది' - అన్నట్లుగా ఉంది.

ఆకాశం పూలవాన కురిపించింది. లోకాల మధ్య తెరలను కాసేపు తొల గించింది.

పరీక్షిత్తు పరవశుడవుతున్నాడు. పరితృప్తుడవుతున్నాడు పండిపోతున్నాడు.

శుకయోగీంద్రుడు నిశ్చలుడై నిలిచాడు. నిండుగా గోచరించాడు.

## వైష్ణవ మాయ

తన హృదయానికి దగ్గరయినవాడూ, తన హృదయమే తానై పలికినవాడూ అయిన ధర్మజుణ్ణి తనకు దగ్గరగా కూర్చుండబెట్టుకొని అతనిలోనికి మరల మరల చూస్తున్నాడు భీష్ముడు. పైపుకు చూసేవాళ్లు చాలామంది ఉంటారు. లోనికి చూసేవాళ్లే కావాలి. అప్పుడు ఆలోన ఉన్న వెలుగు మరింత ప్రజ్వ రిల్లుతుంది. వెలుగులు విరజిమ్ముతుంది. ఇప్పుడు ధర్మజుడు అలా వెలుగులు విరజిమ్ముతున్నాడు.

భీష్మునికి ముచ్చట కలిగింది. 'ముక్తి మార్గాన్ని ఎంత ముచ్చటగా చెప్పాడు నా మనుమడు!' అనిపించింది. ఆ ముచ్చటలోనుండే ఇలా అన్నాడతను. "ధర్మజా! ఈ విశ్వం విష్ణుస్వరూపం! ఆ విష్ణుదేవుడు ఈ విశ్వంలో ఎక్కడ ఎప్పుడు ఏమి చేస్తాడు అన్నది ఆయనకు మాత్రమే తెలిసే అంశం! ఎవరి జీవితాల్లో ఎలాంటి సన్నివేశాలు వస్తాయి అన్నది కూడా అంతే! అలాంటప్పుడు నీవన్నట్లుగా మానవుడు దీక్షాబద్ధుడయి, నడచి వస్తున్న సన్నివేశాలను సాధన లోని అంశాలుగా స్వీకరించి దేవదేవుని వెలుగులో తన పాత్రపోషణను తృప్తిగా నిర్వహించడమే జరుగవలసిన పని. ఇదీ కర్తవ్యమని మనకు తెలిసి వస్తున్నంత వరకు మనమెప్పుడయితే శ్రద్ధగా దాని నాచరిస్తామో మిగిలిన కర్తవ్యం దైవా నుగ్రహ విశేషాన దానికదిగానే భాసిస్తూ ఉంటుంది. ఎప్పటికప్పుడు భాసిస్తూ ఉంటుంది. కనుక బుద్ధిమంతుడు భవిష్యత్తును గూర్చి అంతగా ఆలోచించడు. ఆదేపనిగా ఊహించడు. 'ఇలా జరిగితే బాగుండును' - అని ఆశపడడు. కర్తవ్యమిది అని తెలిసి వస్తున్నంత వరకు లోక హితానికి అనుగుణంగా, దైవానికి సమర్పణగా ఆ కర్తవ్యాన్ని నిర్వహిస్తుంటాడు. ఎప్పటికప్పుడు అంతర్యామి చేసేటటువంటి ఆదేశాలకై ఏమాత్రం ఏమరుపాటు లేకుండా సర్వసన్నద్ధంగా ఉంటాడు.

నిజానికి ఈ విశ్వానికి రక్షకుడెవరు? కనబడుతున్న ఈ నానావిధ జీవరా

సులను అనుక్షణం కాచుకొంటున్నవాడెవరు? విశ్వంగా కనబడుతూ చూడటానికి ఈ కంటికి కనబడని విష్ణుదేవుడే! ఈ విశ్వరూపంలోనే దాగి ఉండి, సకల జీవరాసులను సదా రక్షించుకొంటూ ఉంటాడతను. అతడలా రక్షించుకొంటు న్నట్లు ఈ జీవరాసులలో ఎన్నింటికి తెలియవస్తున్నదంటావు? మానవులలో నయినా ఎందరు ఆ రక్షణను గుర్తించ గలుగుతున్నారంటావు?- తమకు రక్షణ లేదే అని, రేపు ఏమవుతుందోనని భయంగా ముఖం పెట్టేవాళ్లే ఎక్కువమంది కనబడుతుంటారు గాని ఇప్పుడు ఈ క్షణంలో వారు పొందుతున్న రక్షణను వారు గుర్తింప గలుగుతున్నారా! అని. అదే చిత్రం! రక్షణ పొందుతున్నాం. నిండుగా పొందుతున్నాం. కాని గమనించలేకున్నాం. పైగా రేపటిమాట ఏమిటని అడుగుతున్నాం. చిత్రంగా లేదూ!

ముందు ఇప్పటికి అనుభవానికి వస్తున్నది గమనించు. ఆ లభిస్తున్న రక్ష ణకు కృతజ్ఞతలు చెప్పు. రక్షణ లభిస్తున్న ఈ క్షణాలను సద్వినియోగం చేయి. ఇలాంటి మంచి లక్షణాలను అలవరచుకో! అప్పుడు నీవు రేపటిని గుర్గించి చింతించవలసిన అవసరమే ఉండదు. నేడు రక్షిస్తున్న వాడు రేపు రక్షించడా? అతడెప్పుడూ రక్షిస్తూనే ఉంటాడు. ఒకవైపు రక్షిస్తూనే, మరొక వైపు జరుగవలసిన కథకు అనుగుణంగా పాత్రలనూ, సన్నివేశాలనూ నడిపిస్తూ ఉంటాడు. సాగుతున్న ఆ నడకను చూసి ఇదేమిటె ఇన్నిమార్పులు అని కలత చెందకు! కథ కదలకుండా ఉంటుందా? మలుపులు తిరగకుండా ఉంటుందా! మార్పులు రాకుండా ఉంటాయా? అయితే ఒక్కటి గమనించు. ఇన్నింటిలో నుంచి నీకు లభించవలసిన రక్షణ లభిస్తూనే ఉంటుంది. ఇది సత్యం! ఇది నిత్యం! ధర్మజా! విష్ణుదేవుని నుండి మానవుడు నిరంతరం అందుకోవలసిన సందేశమిదే! అసలయిన ఆదేశమిదే!

ధర్మజా! ఒక చిత్రాన్ని గమనించావా? అలా అనుక్షణం ఈ కనిపిస్తున్న అంతటినీ తానై రక్షించుకుంటున్న విష్ణుదేవుడు - ఈ కృష్ణదేవుడై యాదవులలో దిగివచ్చాడు కదా! ఎంతమంది యాదవులు ఇతడి యెడల మేల్కొలుపు చెంది ప్రవర్తిస్తున్నారంటావు? అతడు కనబడుతున్నాడు. కాని అతడిగా కనబడటం లేదు. మనలో ఒకడిగా కనబడుతున్నాడు. మన పనులన్నీ చేసిపెడుతున్నాడు. మనను మురిపిస్తున్నాడు. మైమరపిస్తున్నాడు. ఇప్పుడు కూడా రక్షణ పొందుతు న్నాము గాని అతడిని గమనించ గలుగుతున్నామా? కనబడనప్పుడు కనబడలేదు అన్నాం. కనబడితే, మన మధ్య నిలబడితే మనవాడే కదా మనలోని వాడేకదా

అంటున్నాం. అనుకొంటున్నాం.

యాదవుల మాట అటుంచు. మీ అన్నదమ్ములు మాత్రం ఇతణ్ణి అనేక విధాల వినియోగించలేదూ! బావమరిదిగా, సారథిగా, సచివునిగా, నెచ్చెలిగా అతడు మీ కెన్నెన్ని పనులు చేసిపెట్టాడు! మీరు ఎప్పుడు ఎలా చూస్తే అలాగే గోచరించాడు కదూ! అదే అక్కడున్న చిత్రం! అదే అతడి వైష్ణవ మాయ! అదే అతడి పరమప్రేమ! నాచేత ఇలాంటి పనులు చేయిస్తున్నారే మిటి అని అతడికి అనిపించలేదు. అన్ని పనులూ నావే కదా అనిపిస్తుంది. ఇలా ఇన్నిరకాల స్థితిగతులతో ఉన్నవారితో నేను తిరగవలసి వచ్చిందేమిటి అని అతనికనిపించలేదు. ఈ రూపాలన్నీ నావే కదా అనిపిస్తుంది! అందుకే అతడు దైవంగా ఎన్ని రూపాలు వ్యక్తం చేస్తున్నాడో - వ్యక్తిగా వ్యక్తమవుతున్నప్పుడు కూడా అన్ని రూపాలనూ, కావలసిన అన్ని రూపాలనూ అలా లీలగా ధరిస్తూ వస్తున్నాడు. అలా ధరిస్తూ వస్తున్న ఇతనిని ధర్మజా! మనం ఎంతవరకు గుర్తు పట్టగలుగుతామంటావు! ఆ గుర్తులో ఎంతసేపు నిలబడుతున్నామంటావు! అత డిని అతడిగా ఎన్నిసార్లు మనం చూడగలుగుతున్నామంటావు! ఇంకా చెప్పాలీ అంటే, ఎన్నిక్షణాలు మనం చూడగలుగు తున్నామంటావు కాని అతడేమీ అను కోడు. అది సహజమేలే అనుకొంటాడు!

సాధకుడివి! సన్నివేశాలలో వాసుదేవుని స్వరూపాన్ని పొడగట్టించుకొనేం దుకు నిరంతరం ప్రయత్నిస్తున్న వాడివి! ధర్మజా! జరుగవలసిన సాధన అదే! కొనసాగనీ! జీవితాన్ని అతని కర్పించడమంటే ఏమిటి? ఈ జీవి తంలో అతణ్ణి చూడగలగడమే! ఈ జీవితం అతడిదిగా చూడగలగటమే! అలా చూడగలగాలేగాని, అతడెంతగా చేరువవుతాడో, నీకు తెలియనిదేముంది! అతడే మనము అన్నంతగా చేరువవుతాడతడు. అంతటి ప్రేమమయుడు! ఆ భక్తసులభుడు. అంతటి ప్రేమ మయుడు!

ఎంతటి ప్రేమమయుడు కాకపోతే ఇలా మిమ్మల్నందరినీ వెంటబెట్టుకొని ఈ సమయంలో నా చెంతకు వస్తాడు! 'ఉత్తరాయణం రాబోతోంది. ఇక భీష్ముడు శరీరాన్ని విడిచిపెడతాడు. కనుక మనం ఈ కొద్ది సమయాన్నీ అక్కడే గడుపుదాం. అతడు సంతోషిస్తాడు' - అనిపించిందతనికి. అంతే! వచ్చే శాడు. అందరితో వచ్చేశాడు.

ఊరికే రావటం కాదు. 'ఈ చివరి క్షణాలను కూడా సార్థకంగా విని యోగిద్దాం. భీష్మణ్ణి ధన్యుణ్ణి చేద్దాం' - అని సంకల్పించి మరీ వచ్చాడు.

ఇప్పుడు నేను నీకు బోధ చేయాలట! ఆ బోధగా తాను నా నుండి వెలువడుతాడట! వెలువడుతున్న ఆ బోధయందలి అక్షరధ్వనుల తరంగాలతో ఈ శరీరం, ఈ పరిసరాలు, ఈ జగత్తు మొత్తం అన్నీ పునీతమవుతాయట! అదీ ఆయన సంకల్పం! అమోఘమయిన సంకల్పం!

నాకనిపిస్తోందికదా ఏ భగవద్గీతనయితే ఆయన తననుండి దివ్యసందేశంగా వెలువరించాడో, ఆ భగవద్గీతకు ఇప్పుడు నీకు చేసే బోధ రూపంలో ఒక విలువయిన భాష్యాన్ని నానుండి అందించనున్నాడని!

కాయమంతా గాయమే కదా! అన్నట్లు చూచాను నేను. 'నేను లేనా, వెలువడుతున్నది నేను కానా! ఇప్పుడా గాయాలు కూడా నా గూర్చిన గేయాలనే ఆలపిస్తాయి' - అన్నట్లుగా చూచాడతను. అలాగే చేశాడతను. ఇప్పుడు నాకీ శరీరం ఏమాత్రం ఇబ్బందిగా లేదు! నాకెంతో హాయిగా ఉందిప్పుడు! నాలో నేనన్నది కనిపించడం లేదిపుడు! నేరుగా అతడే కనిపిస్తున్నాడు.

కాలం సమీపిస్తోంది. ఈ కాసిని మంచిమాటలు అందరి మధ్యలో మనం చెప్పుకొందాం. మానవులందరూ దేహాలను విడిచిపెట్టేవేళ ఏ దేవదేవుణ్ణి పొడగట్టించుకొనే ప్రయత్నం చేస్తారో అతడే తానుగా వచ్చి, నా ఎదుట కొలువుదీర్చిన వేళ ఇది! కొలువు దీర్చి 'భీష్ముడా! ఇక నన్ను కొలువు!' - అంటున్నాడతను. ఇప్పుడు ఈ బోధరూపంలో అతడిని కొలిచి, ఇక నేను అతడిలోనికి ఒరిగిపోతాను. అతడిలోనికి కరిగిపోతారు. ఏది ధర్మజా! ఇక మొదలు పెడదామా శాంతి బోధను!"

వాతావరణం పరమ ప్రశాంతంగా ఉంది. బోధ మొదలయింది. కృష్ణదేవుని దివ్య స్పర్శ తరంగితమవుతూ ఎల్లెడలా నిండసాగింది.

ధర్మజుడు తాతలో కృష్ణుడిని చూస్తున్నాడు. తన తాతను కృష్ణదేవుడిగా దర్శిస్తున్నాడు. వినాలని ఇంకా ఇంకా అనిపిస్తూ ఉండగా, ఎన్నింటినో వరుసగా అడుగుతున్నాడు. అన్నింటినీ చెవులార వింటున్నాడు.

ఋషిలోకం పులకించి పోతున్నది. 'కృష్ణునిగా, భీష్మునిగా, ధర్మజునిగా - ఈ మూడు మూర్తులుగా నిలిచి ఉన్నది ఆ ఒక్క కృష్ణుడే!' అన్న దర్శనం అది పొందుతున్నది. ఆ దర్శనంతో తాదాత్మ్యం చెందుతున్నది.

అపురూపమయిన ఆ బోధను అందుకొంటూ పరవశుడవుతున్నాడు పరీక్షిత్తు. శుకయోగీంద్రుని వైపు కృతజ్ఞతతో చూస్తున్నాడు.

# నల్లవాడినైనా

భీష్మ, ధర్మజులు ఒకరికొకరు దగ్గరవుతున్నారు. ఇది వరకటికన్నా దగ్గరవు తున్నారు. ఇంకా ఇంకా దగ్గరవుతున్నారు. దైహికంగానే కాదు. ధర్మపరంగా, దైవ పరంగా కూడా మరింతగా ఒకరినొకరు మరువలేనంతగా దగ్గరవుతున్నారు. ఆత్మల కలయికలో నుండి అందివస్తున్న అమృతానుభూతిని కొల్లగా అను భవిస్తున్నారు. ఇది కదా ఆత్మీయత అన్న పదానికి అసలయిన అర్థమని అదరమచిపోతున్నారు.

'నాయనా చాలునా' - అన్నట్లు చూస్తున్నాడు భీష్ముడు. 'తాతా నేనుధ న్యుడను' - అన్నట్లు వినమ్రుడవు తున్నాడు ధర్మజుడు. అతడు తన వినయంతో ఇంకా ఒదుగుతున్నాడు. ఆయన తన వెలుగుతో ఇంకా పొదుగుతున్నాడు. కృష్ణుడు వారిద్దరిలో నిండుగా వెలుగుతున్నాడు. తానే వారుగా కదులుతున్నాడు. కథలు నడుపుతున్నాడు.

'మనుమడా తృప్తిగా ఉన్నదా?' - అన్నట్లు చూస్తున్నాడు భీష్ముడు. 'తాతా తనివి తీరుతుందా' - అన్నట్లు అంజలి ఘటిస్తున్నాడు ధర్మజుడు.

నిజమే. ఇలా ఎంతసేపు నడిచినా తనివి తీరదు నిజమే. కాని ఈ తనువుకు తీరే కాలం వస్తే, అప్పుడేం చేయాలి? తనువులు తీరినా తనువులు జారినా తనివి తీరని ఆ అనుభూతిలో మనం అలా అలా ఉంటూనే ఉండాలి. మళ్ళీ ఒకవేళ ఎప్పుడయినా మనకు తనువు లభిస్తే ఆ అనుభూతిలో నుండే లభించాలి. నీటి ఆవిరి నీరయినట్లుగా నీరు మంచుగడ్డయినట్లుగా ఆ అను భూతే అలా అలా ఘనీభవిస్తూ దేహంగా రూపొందాలి. అప్పుడే, అలాంటప్పుడే దేవదేవుని కార్యక్రమాన్ని ఈ భూమిపైన నిండుగా నిర్వహించ గలుగుతాం.

భీష్ముడు భావమయమయిన భాషతో ధర్మజుని ఆపాంతము స్పృశిస్తు న్నాడు. ధర్మజుడు ఆ స్పర్శకు పరవశిస్తూ ఆ శాంతమును అందుకుంటూ అన్నివిధాలా తాతతో తాదాత్మ్యం చెందుతూ తానూ తరిస్తున్నాడు.

అలా అనుభూతిమయ లోకాలలోనుండి ఆ తాతవైపుకు అలాగే చూస్తూ ఉన్న ధర్మజునికి తాత ఇక తనువును చాలించబోతున్నాడనీ అందుకొరకై కృష్ణదేవుని వైపునకు తన దృష్టిని సారించబోతున్నాడనీ స్పష్టమైంది. 'తాత ఇక మనతో మాట్లాడవలసినది పూర్తయినది ఇక దేవదేవుని గూర్చి అతడేమి

పలుకబోతున్నాడన్నది. - అది మనమందరం నిండైన శ్రద్ధతో వినవలసి ఉన్నది. నిండయిన శ్రద్ధతో వినవలసి ఉన్నది.' - అనుకుంటూ ధర్మజుడు భీష్మునితో పాటు తానుకూడా కృష్ణదేవుని వైపునకే తిరిగి అంజలి ఘటించాడు.

కృష్ణదేవుని వైపునకు తిరిగిన భీష్మాచార్యుడు చేతులు రెండూ జోడించి వినమ్రుడవుతూ వానిని శిరస్సునకు అనించి, ఆ శిరస్సును క్రమంగా క్రిందకు వంచి అలాగే ఉండిపోయాడు కాసేపు.

క్రమంగా వంచిన శిరస్సును ఎత్తుతున్నాడాయన. ఆ ఎత్తటం పూర్తయ్యేటప్పటికి ఆయన మనస్సు ఇంద్రియాలను స్వీకరించి తాను బుద్ధిని చేరుకున్నది. బుద్ధిగా వెలుగుతున్నది. ఆ వెలుగు కన్నుల ద్వారా చూపులుగా వ్యక్తమవుతూ ఉండగా, భీష్మాచార్యుడు ఆ చూపులతో స్వామి ముఖారవిందాన్ని చూసే ప్రయత్నం చేస్తున్నాడు. తనివితీరా చూసే ప్రయత్నం చేస్తున్నాడు.

కృష్ణదేవుని కన్నుల నుండి ప్రేమామృతం చూపులై అతనిపై వర్షిస్తున్నది. దేవదేవుని ఆ ఆలోకనామృతంలో అలా తడిసి ముద్దైపోతున్న భీష్మునికి శరీరం దూది పింజెలా తేలిపోతున్నది. చిత్తం పరవశిస్తూ మూగపోతున్నది. అతడికి ఇప్పుడు కృష్ణుడు మామూలుగా కనబడటం లేదు. నాలుగు భుజాలతో నారాయణుడై కనబడుతున్నాడు. ఆది పురుషుడై కనబడుతున్నాడు. వేద పురుషుడై కనబడుతున్నాడు. ఈ సర్వాన్నీ నడిపిస్తున్న పరమేశ్వరుడై కనబడుతున్నాడు. సకల దోషాలనూ హరించ గలిగిన తేజోమూర్తిగా కనబడుతున్నాడు.

భీష్ముడు పరవశుడవుతున్నాడు. పరవశుడవుతూనే ఇలా అన్నాడు. "స్వామీ ఏమి నీ కరుణ! ఏమి నా అదృష్టం! ఏమి నీ అనుగ్రహం! ఏమి ఈ దర్శనం! ఓహో ఇది అపూర్వం ఆశ్చర్యం ఆనందం పరమానందం. ఇంతటి పరమానందాన్నీ పరమాద్భుతమయిన దర్శనాన్నీ నీవందిస్తున్న వేళ నోరార నిన్ను కీర్తిస్తూ నీలోన కలిసిపోనా! నిన్ను కీర్తిస్తూ నీలో కలిసిపోయేలోపున ఇంతకాలం నాకు సహకరించిన ఈ ఇంద్రియాలు, ఈ దేహం, ఈ చిత్తం అన్నీ కూడా, ఇవన్నీ కూడా నీ మయమై పోవాలి. నీ పరమై పోవాలి. ఇంతకాలం నాకు సహకరించినందుకు ప్రభూ! వీటినన్నింటినీ నీలో కరిగిపోనీ! నీవై వెలిగిపోనీ! నా కీర్తన అలా వీటిని వెలిగించేలాగున సాగనీ. పంచ భూతాత్మకమయిన ఈ శరీరం పరమ పవిత్రమయినది. ఇంతకాలం నన్నంటిపెట్టుకున్నందుకు ఏవైనా వాటికి కొద్దో గొప్పో మలినాలు అంటుకొని ఉంటే అవి ఇలా తొలగిపోనీ, ఆ పంచభూతాలను పవిత్రంగా నీకు అప్పగించనీ తిరిగి నీకు అప్పగించనీ.

అంతేకాదు. ఈ దేహాన్ని పవిత్రంగా నీకప్పగించడమే కాదు. ఇంతకాలం నీ అనుగ్రహం మేరకు నిర్వహించిన ఈ జీవితాన్ని కూడా ఈ సంకీర్తన రూపంలో ఒక్కసారి సమీక్షించుకోనీ. ఈ నా జీవితాన్ని ఆ నీ విలాసంగా దర్శిస్తున్నవేళ నన్ను నేనెలా తెలుసుకున్నానో, ఈ జీవితాన్ని నీకనుగుణంగా ఎలా పవిత్రీకరించు కున్నానో ఒక్కసారి మనస్సు విప్పి చెప్పుకోనీ, అంతేకదా ప్రభూ! దేహం, మనస్సు వాటి రెండింటి ద్వారా వ్యక్తమవుతున్న ఈ జీవితం పవిత్రీకరింపబడటానికే కదా ప్రార్థన. అంతేకదా ప్రభూ!

ప్రభూ! ఒక చిత్రం చెప్పనా! దేవుడు మనిషి కావడానికి తపస్సు చేస్తున్నాడు. తాను మనిషి రూపు ధరించడానికి తపస్సు చేస్తున్నాడు. మనిషి మళ్ళీ తాను దేవుడు కావడానికి తపస్సు చేస్తున్నాడు. తాను దేవుడైపోవడానికి తపస్సు చేస్తున్నాడు. అంతేకదా ప్రభూ! సకల వేదాల సారాంశం ఆ తపస్సుతోనే దేవుడు మనిషవుతున్నాడు. ఆ తపస్సుతోనే మనిషి దేవుడవుతున్నాడు. ఏమి నీ లీల! ఏమని చెప్పను ప్రభూ! ఒకపని చేస్తాను. మనిషిగా దేవుడు కావడానికి నేను చేసిన తపస్సేమిటో తగుమాత్రం వివరిస్తూ. నీలో కలసిపోతాను. నీలో కరిగిపోతాను.

ప్రభూ! నేనెప్పుడూ నిన్నెలా చూస్తూ ఉంటానో నిన్నెలా చూడాలని కోరుకుంటానో ఎలాంటి నీ రూపం ఎల్లవేళలా నా మనస్సులో మెదులుతూ ఉంటుందో చెబుతాను చూడు. నీవు నల్లవాడివి. అయినా అందగాడివి. నల్లదనాన్ని అంత అందంగా ఎలా మలచుకున్నావయ్యా! పైగా అది మామూలు అందమా! మూడులోకాలను మైమరపింపచేసే అందమే! ఆకాశం నుండి అన్నీ వచ్చాయి నేను ఆకాశ స్వరూపాన్ని అని గుర్తుచేయడానికిగాను ఇలా ఆ ఆకాశపు రంగయిన నీలిరంగుతో దిగివచ్చావు కదూ! ఆ నీలి ఆకాశంలో సూర్యోదయమవుతూ ఉంటే ఎలా ఉంటుంది? నీవు పట్టుబట్ట కట్టుకుని కదిలి వస్తుంటే సరిగా అలా ఉంటుంది! ఆ బంగారు రంగుతో మిలమిలా మెరసిపోతూ బంగారు తండ్రిపై నీవు నడచి వస్తూ ఉంటావు. వస్తుంటే ఇంతలో ఏమవుతుందీ నీ నల్లని ముఖంమీద ఇంకా నల్లని నీ ముంగురులు పడుతూ ఉంటాయి. అలా లీలగా, హేలగా ఆ ముంగురులు విలాసంగా కదులుతూ ఉంటే, అసలు నీ విలాసమంతా ఆ ముంగురుల కదలికలలోనే ఉన్నదనిపిస్తుంది. అలా విలాసంగా, వికసిస్తున్న పద్మంలా ప్రకాశిస్తున్న నీ ముఖం ఉన్నదే - దాని అందాన్ని ఏమని వర్ణించను! ఆ ముఖాన్ని అలా చూస్తూ ఉంటే కలిగే అనుభూ

తిని ఎంతని విప్పిచెప్పను! అలాంటి నీవు మా అర్జునుడికోసం వెతుక్కుంటూ వస్తూఉంటే, మైత్రీభావం ఉప్పొంగుతూ ఉండగా నీవు మా విజయుణ్ణి సమీపిస్తూ ఉంటే - ఆ దృశ్యాన్ని మళ్లీ మళ్లీ చూడాలనిపిస్తుంది నాకు. వీలు కలిగినప్పుడల్లా ఆ దృశ్యాన్నే నేను మానసికంగా చూస్తూ ఉంటాను. అలా నిన్ను స్మరించుకుంటూ ఉంటాను. అలాంటి చెలికాడవుగా నీవు నా మనస్సును ఎప్పుడూ ఆవేశిస్తూ ఉంటావు. చెలిమిలోని తీపిని నిరంతరం అనుభవానికి తెస్తూ ఉంటావు.

ప్రభూ! ఇంత అందమయిన వాడివే! ఇంత నాజూకయిన వాడివే ఇంత సున్నితమయిన వాడివే. అలాంటి నీవే ఆ చెలికాడికోసం - అదే మా విజయుని కోసం అతనికి విజయాన్ని అందించడం కోసం ఎలాంటి రూపు ధరించావో చెప్పనా! యుద్ధంలో అతనికి సారథివయ్యావు. రథాన్ని నడుపుతున్నావు. ఆ గుర్రాల గిట్టల నుండి పైకిలేచిన దుమ్ము నీ ముంగురులను కప్పేస్తున్నది. రథాన్ని నడపడంలో కలుగుతున్న శ్రమకు నీ వంటికి చెమట పట్టింది. నీ ముఖం నిండా చెమట బిందువులే. అయినా నీ ముఖం ఎంతో అందంగా ఉంది. అందగాడికి శ్రమకూడా అందాన్నే కలిగిస్తుందేమో! ధూళి ఎగిరివచ్చి పడుతున్నా, శరీరానికి శ్రమకలుగుతున్నా నీవు వీటిని వేటినీ లక్ష్యపెట్టడం లేదు. అర్జునుడికి విజయాన్ని కలిగించాలన్న నీ లక్ష్యం వైపుకే నీవు సాగిపోతున్నావు. ఇంకా కాస్త ఇబ్బంది పెడితే నీవేం చేస్తావో చూద్దామని ఉన్నవాణ్ణే ఉన్నట్టు ఊరుకోకుండా, నేను నీ మీదకు బాణాలను అదేపనిగా ప్రయోగించాను. అవి నిన్ను నొప్పించసాగాయి. అయినా నీవు కథను నడిపిస్తూనే ఉన్నావు. చెలికాడయిన అర్జునుడిని నడిపించడానికి దీక్షబూనిన ఆ నీరూపం ఉన్నదే అది నిరంతరం నా మనస్సులో మెదులుతూ ఉంటుంది. దీక్షను పూనితే ఎలా పూనాలో నాకు తెలియచెబుతూ ఉంటుంది.

ప్రభూ! ఇంకొక్క దృశ్యం చెబుతాను. అది కూడా నీవు మా విజయుడితో కూడినప్పటిదే. అప్పటికి యుద్ధం ఇంకా ప్రారంభం కాలేదు. ఉభయ సేనలకూ నడుమ రథాన్ని నిలిపావు. చిరునవ్వు నవ్వుతూ శత్రుసేనలో ఉన్న వీరాధి వీరులందరినీ అర్జునుడికి చూపిస్తున్నావు. అలా చూపిస్తూనే విలాసవంతమయిన ఆ చూపుతోనే శత్రుసేనలోని మహామహుల ఆయుర్దాయాలన్నింటినీ అప్పుడే నీవు హరించేశావు. ఆపైన వారి దేహాలను పడగొట్టే పనిని మాత్రం మావాడికి అప్పగించావు. ఆ నీ పరమేశ్వర రూపం ఈ హృదయ పద్మంపైన

నిరంతరం అధిష్ఠించి ఉంటుంది ప్రభూ!

ఆ తరువాత దృశ్యాన్ని కూడా నేను మరచిపోలేను ఇందరినీ చూపించిన తర్వాత అర్జునుడు తీరికగా దుఃఖించాడు. కూడని విషాదానికి గురయ్యాడు. అప్పుడు నీవేం చేశావు? అతణ్ణి ప్రబోధించావు. క్రమంగా యోగస్థితిని అందు కునేవరకు అతణ్ణి నడిపించావు. ఆ కాసిని క్షణాలలో ఏమి చెప్పావో! అతడిలో ఎంతటి మార్పును తీసుకొచ్చావో! ఆ దృశ్యాన్ని నేను మరచిపోలేను. కొద్ది సేపటిలో అర్జునుడిని కర్తవ్యోన్ముఖుణ్ణి చేసి కథకు ఏమాత్రం ఇబ్బంది కలుగ కుండా నడిపించిన ఆ నీ రూపమున్నదే - అది సర్వులకూ నమస్కరింపదగిన రూపం. అప్పటి నీ రూపాన్ని ఎప్పటికీ స్మరిస్తూ నీ పాదాలకు అలా నమస్క రిస్తూ నా దినచర్యను ఆ బోధకు అనుగుణంగా నడుపుతూ ఉంటాను నేను. తండ్రీ! అలాంటి నీ పాదాలకు నమస్కరిస్తూ, నీ అడుగుజాడలకు అంకితం కావడంకన్నా నరజాతికి ఇంకొక తరుణోపాయం ఉన్నదా!"

భీష్ముని గొంతు ఆర్ద్రమైంది. కృష్ణుని వేణువు అతనిని తాకింది.

అక్కడున్న అందరూ కన్నులు అద్దుకొంటున్నారు. వారిరువురినీ తమ హృదయాలకు హత్తుకుంటున్నారు.

మనం అనుభవిస్తున్నదీ అలాంటి స్థితే కదా అన్నట్లుగా చూస్తున్నాడు పరీక్షిత్తు, గాథను వినిపిస్తున్న శుకయోగీంద్రుని వైపు.

## నేనూ ఒక వేణువునే!

కన్నులు తృప్తితో మెరుస్తూ ఉండగా, కృష్ణదేవుని మరింతగా చూస్తూ భీష్ముడిలా అన్నాడు. "ప్రభూ! ఇంతవరకు ఈ దృశ్యాలన్నింటినీ - అవే మా విజయునితో నీవు నడిపిన సన్నివేశాలన్నింటినీ - వర్ణిస్తూ వచ్చాను. అలాంటి సన్నివేశాలు ఇంకా చాలా ఉన్నాయి. ఇవి విజయునితో నడిచిన సన్నివేశాలు కదా, మరి నా మనస్సునకు అవి ఇంతగా ఎందుకని హత్తుకున్నాయి! అవి నన్ను నేనే ప్రశ్నించుకుంటూ ఉండే వాడిని. అవి విజయునితో జరుగు తున్న వయినా నా ఎదురుగా ఎందుకు జరుగుతున్నాయి! నాకు తెలిసేట్లుగా ఎందుకు జరుగుతున్నాయి! అంటే అవి నా కొరకు కూడా జరుగుతున్నా యన్నమాట! నాకు కూడా తెలియచెప్ప వలసిన సత్యాలను తెలియచెప్పడానికే

అలా జరుగుతున్నాయన్నమాట.

చిన్ననాడు గోపికల తోడి నీ ప్రవర్తన, వారితోడి నీ అల్లరి, అప్పటి నీ చిలిపిచేష్టలు నాకు మరల మరల స్ఫురణకు వస్తూ ఉంటాయి. చిత్రమయిన చిలిపి తన మది. అందమయిన చిలిపిదనం. అలా వారితో కబుర్లు చెబుతూ ఉండే వాడివి. నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడివి. వాళ్లతో కలసి అనేక విధాలుగా తిరుగాడుతూ ఉండేవాడివి. ఒక్కొక్కప్పుడు వాళ్లమీద అలిగేవాడివి. మరొకప్పుడు కొంటెగా వారివైపు చూసేవాడివి. ఇన్ని రకాల ప్రవర్తనలతో వారికి తెలియకుండానే వారి మనస్సులకున్న ముడులన్నీ సడలించేవాడివి. అలా ఒక చూపుతో, ఒక నవ్వుతో, ఒక అలకతో ఆ గోపికలను ఎంత ఎత్తునకు తీసుకు వెళ్లి నిలబెట్టాలో, అంత ఎత్తునకు తీసుకువెళ్లి నిలబెట్టేవాడివి. ఎంత లోతులకు తీసుకువెళ్లి కరిగించాలో, అంతలోతులకు తీసుకువెళ్లి కరిగించేవాడివి. మా విజయునితో నీవు ప్రవర్తించిన సన్నివేశాలతో నీవు సరిగా నాలో చేసినదీ అదే. ఆ గోపికలను అనాడు ఎలా ఉద్ధరించావో, ఈనాడు సరిగా నన్నూ అలాగే ఉద్ధరించావు. నా మనస్సుకు పడిన ముడులన్నింటినీ సడలించి, నన్ను మళ్లీ మనిషిని చేశావు.

"నిజానికి ఈ కురువంశాన్ని నడపవలసిన బాధ్యత ఎవరిది? నాది. ఇప్పుడు నిజంగా నడుపుతున్నదెవరు? నీవు. ఎందుకని ఇలా జరిగింది? నేను నడపలేక పోయాను కనుక. కారణం ఏమిటి? నేనెంచుకున్న మార్గం. ఆ మార్గం సరయినదా కాదా అని చెప్పగలిగిన వారెవరు? నీవే! చెప్పగలిగినదీ చెప్పినదీ కూడా నీవే! అలా ముడులు విడదీసి ధర్మసూక్ష్మాన్ని ఉపదేశించిన నీకు, ప్రభూ! ఇవే నా ప్రణామాలు.

సర్వ సమర్థుడనయిన నేను, ఏమీ చేతకాని వాడిలా నిలబడి పోయాను అంటే, జరుగకూడని వన్నీ నా ఎదుటనే జరుగుతున్నా ఒక స్థితిని దాటి కలుగ చేసుకోలేక పోయాను అంటే సాక్షాత్తు దేవదేవుడే దిగివచ్చి తానుగా కలుగ చేసుకో వలసిన అవసరాన్ని కలిగించాను అంటే - చిత్రంగా లేదూ! ఈ కథ నానుండి జరుగుతున్నదా! నాకొరకు జరుగుతున్నదా! అన్నీ నిజ మేననిపిస్తున్నది. అన్నీ కలిపి నిజమనిపిస్తున్నది. ఆ నిజంలో ఇవన్నీ కలసి ఉన్నాయనిపిస్తున్నది.

"చిన్ననాడు తల్లితో ఉండిపోయాను. తండ్రి అప్పుడు కనబడలేదు. ప్రయోజకుడనై తండ్రిని చేరాను. తల్లి ఇక కనబడలేదు. తండ్రినయినా

సుఖపెడదామనుకున్నాను. ఆయనకు ఏది సుఖమో అది చేద్దామనుకున్నాను. ముసలి తనంలో ఆయన కొక ముచ్చట కలిగింది. ఆ ముచ్చటను తీర్చడం నాకర్తవ్య మనుకున్నాను. దానితో కథ మలుపు తిరిగింది. బిడ్డగా తండ్రి సుఖం నాకు ముఖ్యమనుకున్నాను. తండ్రిని సుఖపెట్టని తనయుడు ఎందుకు అనుకున్నాను. నా తండ్రి ముఖంలో చిరునవ్వును చూడటం కోసం నారా జ్యాధికారాన్ని తృణంగా వదులుకున్నాను. అయినా దాశరాజు తృప్తిపడలేదు. నీ పిల్లల సంగతేమిటీ అన్నాడు. నేనసలు పెళ్లే చేసికోను అన్నాను. తండ్రి బాగుంటే చాలునను కున్నాను.

"కాల చక్రం తిరుగు తున్నది. తండ్రి కాలం చేశాడు. తమ్ముళ్లు మిగి లారు. ఒకడు యుద్ధ ప్రియుడు. మరొకడు స్త్రీలోలుడు. పెళ్లి కాకుండానే ఒకడు, పెళ్లి చేసుకొని ఒకడు పరలోకానికి వెళ్లి పోయారు.

"మాతృమూర్తి సత్యవతీ దేవి నన్ను పిలిచింది. అర్తితో అడిగింది ప్రతి జ్ఞను విరమించి వివాహం చేసుకోమని! ఆ పని చేయలేనన్నాను. మార్గాంతరం చూద్దాము అన్నాను. వ్యాస భగవానుడు ప్రవేశించాడు. నేను చేయలేనిది అతడు చేశాడు. ప్రతిజ్ఞనుండి నేను దిగి రాలేక పోయాను. తపస్వి స్థితినుండి అతడు దిగి వచ్చాడు. లోకహితం ముఖ్యం. తపస్సుకు ఫలితం లోకహితమే. అన్నట్లు ప్రవర్తించాడు ఆ వ్యాసమహర్షి. నేనలా నిలబడి చూస్తున్నాను. ఇంతకూ నేనెక్కడున్నాను, కర్తవ్య నిర్వహణలో నేనెక్కడున్నాను - అని ప్రశ్నించు కుంటున్నాను.

"కథ పెరిగింది. పెద్దదయింది. చిలవలు పలవలైంది. చేయిదాటి పోతోంది. చేయవలసిందేమిటి? అన్న ఆలోచనలో పడ్డాను. ఆలోచన తెమలటం మాట అటుంచి, కథ తిరుగుతున్న మలుపులు అంతుపట్టని స్థితికి వచ్చాయి. నిజమే నేను నిలబడితే ఎదురెవ్వరూ నిలబడరు. ఈ రాజ్యం నాది అని నేను స్వీకరిస్తే మాట్లాడ గలిగిన వారు మరి లేరు. అప్పుడు ఎక్కడి వాళ్లక్కడ సర్దుకుంటారు. ఈ గొడవలకు అవకాశమే ఉండదు. కాని నేను అనలేదు. ఎందుకని అనలేదు? అదే నా బలం! అదే నా బలహీనత! ప్రతిజ్ఞకు కట్టుబడటం వ్యక్తిగతంగా నాకు బలం. రాజ్యపరంగా ఏమీ చేయలేని స్థితిలో నన్ను నిలబెట్టిన బలహీనత కూడా అదే! ఈ బలహీనతను ఆసరాగా చేసుకొనే దుర్యోధనాదులు విజృంభించారు. ఏదుష్టులూ చేయలేనంత దుండ గాలు చేశారు. నేనట్టుడికి పోయాను. ప్రతిజ్ఞను వదలలేను. దారుణాలను

చూడలేను. చేయలేని స్థితిలో నేనుంటే - 'మనమేం చేయగలం, మనవల్ల ఏం జరుగుతుంది' - అని సరిపెట్టుకొని ఉండేవాడిని. చేయగలిగీ చేయలేని స్థితిలో ఉంటే నా మనస్సిక తట్టుకోలేక పోయింది. 'గట్టిగా నిన్ను పిలిచింది. నీ ప్రవేశం జరిగింది. నాకు కొంత ఉపశమనం దొరికింది. నేను చేస్తున్నది తప్పో, ఒప్పో నా వలన ఈకథ పాడు కాకుండా, కాచుకోవడానికి కావలసిన వాడొకడువచ్చాడు అనిపించింది. నా కంటికి కునుకు పట్టింది. నా మనస్సు సేద తీరింది. నా హృదయం పరవశించింది. నిన్ను అధ్యయనం చేయడం ప్రారంభించింది. ఆనందిస్తూనే అధ్యయనం చేయసాగింది.

అర్ధరాజ్య విభజన జరిగేటంత వరకూ కౌరవులూ, పాండవులూ అందరూ నా దగ్గరే ఉన్నారు - గొడవలెన్ని పడుతున్నా! రాజ్య విభజన తరువాత పాండవులు నాకు దూరమయ్యారు. నీకు మరింతగా దగ్గరయ్యారు. వారికన్నీ నీవే అయ్యావు. అన్నివిధాలా బాధ్యతపడ్డావు. అందుకు సంతోషపడుతూనే నీవెలా బాధ్యత పడుతూ వస్తున్నది నేను గమనించసాగాను. ఎందుకనీ అంటే కథ ఒక్కటే! దానియెడల నేనూ బాధ్యత పడ్డాను. నీవూ బాధ్యతపడ్డావు. ఇంకా చెప్పాలీ అంటే నేను బాధ్యత పడలేని స్థితిలో పడినప్పటి నుండీ నీవు బాధ్యతపడ్డావు. అందువల్ల ఆ బాధ్యత పడట మెలాంటిదో చూద్దామని మరింతగా పరిశీలించసాగాను. నాకు ఆశ్చర్యం వేస్తుంది. ఎప్పుడు ఏం చేయాలో అప్పుడది చేసేస్తావు నీవు. ఏ రూపం అవసరమయితే ఆ రూపాన్ని ధరిస్తావు. మొహమాట పడవు. చిన్నబుచ్చుకోవు. మానావమానాలను పట్టించుకోవు. ఏది ధర్మమో అది చేయటానికి ఏమయినా అయిపోతావు నీవు. ఎంత చిత్రమైన వాడివయ్యా నీవు! రాయబారివయ్యావు. రథసారధి వయ్యావు. మిత్రుడవయ్యావు. మంత్రివి అయ్యావు. ఏ పాత్ర అవసరమయితే, ఆ పాత్ర నీవయ్యావు. కథను ముందుకు నడిపావు. నీవు బాధ్యత పడిన వైనం నాకు నచ్చింది. ఈ కథ యెడల నేను అంతగా బాధ్యత పడగలిగానా అనిపించింది. నేను ఏది కావాలంటే అది కాలేకపోయాను. నేను నేనుగానే మిగిలిపోయాను. కారణం నా ప్రతిజ్ఞ. నాలాంటి ప్రతిజ్ఞే నీకూ ఎదురయితే నీవు ఏం చేస్తావో నాకు చూడాలనిపించింది.

కాలం కలిసివచ్చింది. యుద్ధంలో ఆయుధం పట్టనని ప్రతిజ్ఞ చేశావు నీవు. అమ్మయ్య అనుకున్నాను నేను. ఎందుకని! నీవు నాకు దొరికావని! ఇప్పుడు ఇద్దరం ప్రతిజ్ఞా బద్ధులం. కథ బాగుంది కదూ! బహుశా నా కొరకే అలా

తిరిగి ఉంటుంది. మరి గోపికలను ఇలా ఆడించి అలా కథ రక్తి కట్టించిన వాడివి కదా!

యుద్ధం ప్రారంభమయింది. నాకు అవకాశం దొరికింది. సందు చూసుకొని అర్జునునితో పాటు నిన్ను కూడా నేను బాణాలతో ముంచెత్తాను. అర్జునుడికి తనను తాను రక్షించుకోవడమే కష్టంగా ఉంది. ఇక నీ స్థితిని అతడేం పట్టించుకోగలడు? నేను విజృంభిస్తున్నాను. అర్జునుడు బిత్తరపోతున్నాడు. నిన్ను నేను బాణాలతో ముంచేస్తున్నాను. కావాలనే అలా చేస్తున్నాను. నీవు ప్రతిజ్ఞ వైపు నిలబడతావా? ధర్మం వైపు నిలబడతావా చూద్దామనీ, తేల్చుకుందామనీ. జీవించడమెలాగో నీ దగ్గర నేర్చుకొందామనీ నేనలా చేస్తున్నాను. నీ విషయాన్ని తేల్చుకోవడానికి, భరించలేని నా లోని మథనానికి ఇక స్వస్తి పలకడానికీ అంతకన్నా నాకు మార్గం కనబడక అలా చేస్తున్నాను.

నిజానికి నిన్ను నేను బాణంతో కొట్టగలనా! అందుకు నాకు ప్రాణం ఒప్పుతుందా! కానీ కొట్టాను. ఎవ్వరూ నిన్ను ఇబ్బంది పెట్టనంతగా ఇబ్బంది పెట్టాను. ఎందుకని నేనంత ఇబ్బంది పెడుతున్నానో నీవర్థం చేసుకోగలవన్న విశ్వాసంతోనే ఇబ్బంది పెట్టాను.

అదృష్టం. నా అదృష్టం. నీవు నాకు బదులు పలికావు. ఎలా! ఎలా పలికావు? చెప్పనా! ఆ దృశ్యాన్ని వర్ణించి చెప్పనా! జన్మ జన్మలకూ నా గుండెల్లో పదిలంగా నిలచిపోయే దృశ్యమది. కల్పాలెన్ని గడిచిపోతున్నా నాకు స్పష్టంగా కనిపిస్తూనే ఉండేదృశ్యమది. చెప్పనా! వర్ణించి చెప్పనా! ఒక్కసారిగా రథం మీదనుండి నా మీదికి ఉరుకుతున్నావు నీవు. ఏనుగు మీదకు ఎగిరి వస్తున్న సింహంలా ఉన్నావు. ఆ ఎగురుతున్న వేళలో నీకుండలాల కాంతి ఆకాశమంతా నిండిపోయింది. ఆ ఉరుకుతున్న వేళలో నీ కుక్షిలో ఇమిడి ఉన్న వేల వేల బ్రహ్మాండాల బరువుకు ఈ చిన్నిభూమి తాళలేకపోయింది. ఇంకేమున్నది! నీవు నా మీదకు వచ్చేస్తున్నావు. చక్రాన్ని చేపట్టి నీవు నా మీదకు వచ్చేస్తూ ఉంటే నీ పై బట్ట అలా జారిపడిపోతున్నది. అయినా నీవేమీ పట్టించుకోవడం లేదు. నీ చూపంతా నాపైననే ఉన్నది. నీవు నా మీదకు వచ్చేస్తున్నావు. నా సమీపానికి వచ్చేశావు. ఇంతలో అర్జునుడు ఎలా వచ్చాడో ఏమో గబగబా వచ్చి నీకడ్డు పడ్డాడు. బావా! ఈ ఒక్కసారికీ నన్ను మన్నించు. ఇది నీ ప్రతిజ్ఞకూ భంగాన్ని కలిగిస్తుంది. నా సమర్థతకూ భంగపాటవుతుంది. బావా! ఈ ఒక్కసారి మన్నించు - అన్నాడు. అప్పుడు

నీవేమన్నావు! 'అర్జునా! ఇక తప్పుకో. కర్తవ్యాన్ని నాకు విడిచిపెట్టు. ఈ భీష్ముణ్ణి ఇప్పుడే చంపుతాను. నిన్ను నేను రక్షించుకుంటాను. అడ్డురాకు' - అన్నావు.

అటు చెప్పి ఇటు చెప్పి అర్జునుడు నిన్ను ఉపశమింపచేశాడు. కాని నాకు మాత్రం నీవు నా మీదకు రావాలనే ఉంది. నీ చేతులలో వెళ్ళిపోవాలనే ఉంది. కానీ మిగిలిపోయాను. నీ చేతనే మిగల్చబడ్డాను నేను. ఎందుకని? ఈ కథంతా అందరికీ చెప్పాలిగా! అందుకని.

అర్జునుణ్ణి నీవు కలిసినప్పుడల్లా నీవు నన్ను కలుస్తున్నట్లుగానే ఉండేది నాకు. మీ మైత్రి అలా కొనసాగుతూ ఉంటే, నా మనస్సూ ఆ మైత్రిని అనుభవించేది. అతడి యెడల నీవు బాధ్యతపడుతూ ఉంటే నా యెడల పడుతున్నట్లే ఉండేది. విషాదంలో పడిన అతడిని లేవనెత్తి నీవు నిలబెడుతున్నప్పుడు ఏదో ఒకనాడు నన్నూ అలాగే నిలబెడతావు అనిపించేది. ఆరోజు రానే వచ్చింది. నీవు ఆయుధాన్ని చేతబట్టిన రోజే అది నాకర్థమయింది. నేనేం చేయలేక పోయానన్నది నాకర్థమయింది. ధర్మరక్షణ కోసం ప్రతిజ్ఞను వదులుకొన్నావు నీవు. ధర్మం చెరపట్టబడుతున్నా ప్రతిజ్ఞను వదులుకోలేక పోయాను నేను. అర్థమయింది! నేనేమి చేసి ఉండవలసిందో అర్థమయింది. ధర్మ రక్షణకోసం ఆరాటపడ్డాను. కాని వ్యక్తిత్వాన్ని వదులుకోలేక పోయాను. ఆ అవసరం వచ్చినపుడు ఆ క్షణంలోనే వ్యక్తిత్వాన్ని అవలకు నెట్టి, ధర్మం వైపు నిలబడ్డావు నీవు. 'భీష్ముడా! ధర్మరక్షణ కన్నా, వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడం అంత ముఖ్యమంటావా, ధర్మరక్షణకు వినియోగపడని వ్యక్తిత్వం ఉండిమాత్రం ప్రయోజనమేమిటి?' - అని చూపులతోనే సూటిగా ప్రశ్నించావు నన్ను. అర్థమైంది. నీవు నన్ను అర్థం చేసుకున్నావని అర్థమైంది. అర్థం చేసుకున్నావు కనుకనే నా ప్రశ్నకు బదులు దొరికింది. నా మథనానికి ఫలితం అందింది. నేనేమిటో, నేనెక్కడున్నానో, నేనెక్కడుండాలో నాకు తెలిసింది."

కృష్ణదేవుడు భీష్మునికి దగ్గరయ్యాడు. భీష్మాచార్యుడు ఆ దేవదేవుని కౌగిలిలో ఇమిడిపోయాడు.

కృష్ణుని వేణువు భీష్ముని వెన్నును స్పృశిస్తోంది. ఆ వెన్నెముక 'అతడికి నేనూ ఒక వేణువునే' - అన్నట్లు పులకిస్తున్నది.

పాండవులు తల్లితో కలిసి తన్మయులవుతున్నారు.

ఋషిలోకం భీష్మకృష్ణులను ఒక్కటిగా చూస్తున్నది. పులకించిపోతున్నది.

పరవశుడవుతున్నాడు పరీక్షిత్తు. శుకయోగీంద్రుని వైపు తదేక దృష్టితో చూస్తున్నాడు.

## ఆరాధను నేనై

అర్ధ నిమీలిత నేత్రాలతో అర్థవంతమయిన చూపులతో ఆ దేవదేవుని అన్ని విధాలా తడిమిచూస్తూ భీష్మాచార్యుడు ఇలా అన్నాడు.

"తండ్రీ! మామూలు ధర్మము వేరు మహాధర్మము వేరు. ధర్మిష్ఠుడయిన వాడికి మామూలు ధర్మమూ తెలియాలి. మహాధర్మమూ తెలియాలి. ఈ సత్యం నాకు బోధపడింది. ఎప్పుడో తెలుసునా నీవు చక్రం చేతబట్టి నా మీదకు వస్తున్నప్పుడు! అప్పుడు నిజంగా నాకు ఆశ్చర్యంవేసింది. ఎంత ఆనందం కలిగిందో అంత ఆశ్చర్యంవేసింది. ఒకవైపు కర్తవ్యం! మరొకవైపు వ్యక్తిత్వం! ఈ రెండింటినీ అనగలుపుకుంటూ సాగడమెలాగ అన్నచోట నీవు చూపిన సాహసోపేతమయిన ఆ సమన్వయమున్నదే అది నన్ను కదిలించివేసింది. నా వ్యక్తిత్వాన్ని కరిగించి కావలిసిన విధంగా దానిని మలచి నిలబెట్టివేసింది. క్షణాల్లో నాలో ఏదో మార్పు! నాలో ఏదో కూర్పు. నేను మళ్లీ జన్మించినట్లయింది. నీవే నేనుగా నిలచినట్లయింది. అంతే! అప్పటినుండి నేను నీకు మరింత దగ్గరయ్యాను. ఎటుచూసినా నీవే! చివరకు ఈ నన్ను చూచుకున్నా నీవే కనపడసాగావు. గోపికలు అనుభవించిన స్థితి ఏమిటి అన్నది నాకు అనుభవానికి రావడం మొదలుపెట్టింది. కనువిప్పు కలగాలేగానీ జీవి దేవుడు కావడానికి ఎంతసేపు కావాలి!"

"ఈ సందర్భంగా నాకొక సన్నివేశం గుర్తుకు వస్తున్నది. మన ధర్మజుడు రాజసూయం నిర్వహించిన సందర్భమది. ఆ రాజసూయానికి నేను వచ్చాను. ముచ్చట పడుతూనే అబ్బురపడ్డాను. ఎందుకో తెలుసా? నేను అర్థరాజ్యమిచ్చి పంపించివేసిన ధర్మజుణ్ణి నీవు ప్రపంచ విజేతగా నిలబెట్టినందుకు! దైవం తలచుకుంటే అసాధ్యమేముంటుంది! ఇంకా చెప్పనా నేను. ధర్మజుణ్ణి ప్రపంచ విజేతగా నిలబెట్టడమేకాదు, ఆ సందర్భంలో ఆ యాగం నిర్వహింపబడుతున్న సందర్భంలో అందరు రాజులతోపాటు నీవూ కానుకలు సమర్పించుకున్నావు. తల్లి, బిడ్డను అలంకరిస్తుంది. ఆ అలంకారానికి ముచ్చటపడి

తానే మొదటి ముద్దు పెడుతుంది. ఆ దృశ్యం గుర్తుకువచ్చింది అప్పుడు నాకు. తల్లిచేత ముద్దుపెట్టించుకున్న ఆ బిడ్డ ఏం చేస్తాడు? ఆ ముద్దులోని తీపిని అనుభవిస్తూనే ఆమె పాదాలకు నమస్కరిస్తాడు. అలాగే ధర్మజుడు నీకు అగ్రపూజచేసి ఆనందపడ్డాడు. ఆ సందర్భంగానే మయసభలో విహరించబోయి ఇబ్బందిపడ్డాడు ధుర్యోధనుడు. నిజానికి అతని కప్పుడు కనువిప్పు కలుగవలసింది. కాని కలుగలేదు. కథ ఇంతదాకా రావలసి ఉంటే అప్పుడెలా కలుగుతుంది. అప్పుడే శిశుపాలుడు లేచాడు. ఇతనికెందుకు అగ్రపూజ చేయాలి అంటూ నిన్ను నిందించడం మొదలుపెట్టాడు. నీవంటే ఏమిటి అన్నది సభాముఖంగా నేనతనికి తెలియచెప్పవలసి వచ్చింది. అతడికి నా మాటలు రుచించలేదు. కాని ఆ నా మాటలు నా నుండి వెలువడిన ఆ మాటలు నీవంటే ఏమిటో నేను తెలుసుకోవడానికి. నా మనస్సును నీ వెంటనడువుకోవడానికి నా కెంతగానో పనికివచ్చాయి. పనికివస్తున్నాయి.

"శిశుపాలుడు తన మూర్ఖత్వాన్ని వీడలేదు. చివరకు అతని శిరస్సును నీవు ఖండించవలసి వచ్చింది. భూమికిభారం కనుక అతడిని దేహంనుండి తప్పించావు. నీకు భారమన్న ప్రశ్నలేదు కనుక, అతనిని మళ్ళీ నీలోనే నిలుపుకున్నావు. ఇదెంతచిత్రం! కనువిప్పు కలిగేదాకా ఎన్ని అవకాశాలనయినా జీవికి అందించగలిగిన కరుణనీది!"

"దుర్యోధనుడు కనులు తెరిచే బదులు కక్ష పెంచుకున్నాడు. ఎలాగయినా పాండవులను నామరూపాలు లేకుండా చేయాలనుకున్నాడు. కథ చాలా దూరం నడిచింది. రాయబారానికి నీవు కురుసభకు రావలసివచ్చింది. నాకు చిత్రమనిపించింది. అప్పుడు రాజసూయం సందర్భంగా ఆ సభలో మనం కలుసుకున్నాం. ఇప్పుడు రాయబార సందర్భంగా మళ్లీ ఈ సభలో మనం కలుసుకున్నాం. దుర్యోధనుడికి చెప్పవలసిందంతా చెప్పావు నీవు. నీవంటే ఏమిటో తెలుసుకొని నీవెంట నడిచి పొమ్మని నేనూ చెప్పాను. కాని శిశుపాలుడి లాగానే ఇతనూ వినిపించుకున్నాడు కాడు.

"మాట వినని దుర్యోధనుడు కురుక్షేత్రంలో నేల కొరిగాడు. అప్పటికీ అతనికి కనువిప్పు కలుగలేదు. ఈ యుద్ధంలో మీరే మాత్రం ధర్మాన్ని పాటించారని అతడు నిన్ను నిలదీశాడు. గుర్తున్నదా ప్రభూ! ఆశ్చర్యం! నీవతనికి బదులుచెప్పావు. అతడు ఏమి చేసినందుకు ఇదంతా ఇలా అనుభవించ వలసివచ్చిందో వివరంగా చెప్పావు. అయినప్పటికీ అతనికి కనువిప్పుకలుగలేదు. ఆ తరువాత ఆ కొన ఊపిరితోనే అశ్వత్థామను ప్రేరేపించి, ఉపపాండవ వధ జరి

పించాడు. అతను అసలతని కోరిక ఏమిటంటే ఈ భూమి మీద అసలెవరూ లేకుండా చేసికాని ఈ భూమిని విడిచి తాను పోకూడదూ అని. చేయగలిగి నదంతా చేసి శరీరాన్ని విడిచిపెట్టాడు. అతణ్ణికూడా నీలోనే నిలుపుకున్నావు".

"నేను నిన్ను గమనించడమన్నదే రాజసూయంలో మనం దగ్గరయ్యేటంత వరకు, అది ఒకలా సాగింది. రాజసూయంనుండి ఆ గమనిక చిత్రమయిన మలుపు తిరిగింది. నా జీవితాన్ని ఒక మలుపు తిప్పిన ఘట్టంగా రాజసూయం నా కిప్పటికీ ఎప్పుడూ గుర్తొస్తూనే ఉంటుంది. ఆ సభలో ఇలా మామూలుగా కనబడుతూనే ఎన్ని కథలు నడిపావు నీవు! ఎన్ని చిత్రాలు చూపావు నీవు! తలచుకుంటేనే తనువు పులకించిపోతూ ఉన్నది. ఇందరిలో వీరందరిలో నీకు అయిన వారెవరు! కాని వారెవరు! అందరూ నీవారే! కొందరు ధర్మమార్గాన నడుస్తున్నారు. వారు నీ నుండి రక్షణ పొందుతున్నారు. కొందరు అధర్మ మార్గాన పడుతున్నారు. వారు నీనుండి శిక్షణ పొందుతున్నారు. రక్షణ శిక్షణ అనేవి నీకు రెండు బాహువులు కాగా, అందరినీ ఒక్కలా అక్కున చేర్చుకుంటున్నావు నీవు.

"ఆకాశంలో సూర్యుడున్నాడు. నిజానికతడు ఒక్కడే కాని చూడటానికి ఎవరికి వారికి ఒక్కొక్కడుగా కనిపిస్తున్నాడు. ఎవరి సూర్యుడు వారికే ఉన్నాడా? అన్నట్లుగా అనిపిస్తున్నాడు. ఎవరికి వారికి వారికొరకే ఉదయిస్తున్నట్లు వారితోనే పయనిస్తున్నట్లు వారినే కనిపెట్టుకొని ఉన్నట్లు వారి కొరకే పనిచేస్తున్నట్లు గోచరిస్తున్నాడు. సూర్యుడొక్కడే అయినా చూస్తున్న ప్రతి ఒక్కరికీ ఒక్కొక్క సూర్యుడిగా గోచరిస్తున్నాడతను. అలాగే నిజానికి ఉన్నది నీ వొక్కడివే! నీవే ఇందరిగా అవుతున్నావు. ఇన్ని జీవరాసులుగా వ్యక్తమవుతున్నావు. కాని ఎవరికి వారికి, ఎక్కడికక్కడ ఒక్కొక్కడుగా గోచరిస్తున్నావు. ఏ జీవికాజీవి 'నేనున్నాను' 'నేనున్నాను' అంటున్నాడు. నిజానికి ఇందరు 'నేను'లు ఉన్నారా? ఇందరిలో నుండి 'నేను' అంటున్నవాడు, నేను అనబడుతున్నవాడూ ఒక్కడే కదా! ఆ ఒక్కడూ నీవేకదా!

ఆకాశంలో సూర్యుడు ఒక్కొక్కసారి ఒక్కొక్కలా కనబడతాడు. ఒక్కొక్కచోట ఒక్కొక్కలా కనబడతాడు. ఒకసారి ఎండతో మండిపడతాడు. ఒకచోట మంచుతో చల్లబడతాడు. ఒకసారి ధూళితో చుట్టబడతాడు. ఒకచోట మబ్బులు అడ్డుపడుతుంటే ఆ వెనకనుంచి తొంగిచూసే ప్రయత్నం చేస్తుంటాడు. ఒకసారి ఉదయించలేక, ఉదయించలేక ఉదయిస్తున్నట్లుగా బద్ధకంగా మొహం పెడతాడు.

ఒకచోట భళ్లున తెల్లవారేటట్లుగాచేసి భయపెడతాడు. కాసేపు కాంతిని పుంజు కున్నట్లుగా ఉంటాడు. కాసేపుకాంతిని కోల్పోతున్నట్లుగా ఉంటాడు. కాసేపు మీద మీదకు వచ్చేస్తున్నట్లుంటాడు. కాసేపు చాటు చాటుకు వెళ్లిపోతున్నట్లు ఉంటాడు. ఒక కాలంలో వెలిగిపోతాడు. ఒక కాలంలో ఇంతకన్నా వెలగ లేను అన్నట్లుగా ముఖం పెడతాడు. ఇంకొక కాలంలో ఇప్పట్లో వెలగలేనేమో అన్నట్లు కబురుపెడతాడు. అన్నీ ఆ సూర్యుడే! అన్నీ ఆ ఒక్కడే! కాని ఎన్ని విధాలుగా కనబడుతున్నాడు! ఎన్నెన్ని విధాలుగా అగుపడుతున్నాడు! అలాగే నీవుకూడా ఈ జీవరాసుల రూపంలో సరిగా అలాగే అనేక రూపాలుగా కనబ డుతూ ఉంటావు".

ఇందరు జీవుల రూపంలో ఇన్నిన్ని రూపాలుగా నీవు వ్యక్తమవుతూ ఉంటే ఈ సృష్టి చిత్రం చూడటానికి ఎంత విచిత్రంగా ఉంటుంది! ఒకచోట రాగద్వే షాల మధ్యలో కనిపిస్తుంటావు. ఒకచోట ప్రేమాభిమానాల మధ్యలో గోచరిస్తూ ఉంటావు. ఒకచోట విజ్ఞానం నీకు సేవచేస్తూ ఉంటుంది. ఒకచోట అజ్ఞానం నిన్ను చుట్టుముట్టే ప్రయత్నంచేస్తుంది. ఒకచోట మమకారం, ఒకచోట అహం కారం, ఒకచోట ప్రతీకారం, ఒకచోట ఉపకారం, ఇన్ని ఆకారాలలోనుండి నీవు వ్యక్తమవుతున్నప్పుడు ఎప్పుడు ఎక్కడ ఏ 'ఆకారం' వ్యక్తమవుతుందో ఎవ్వరు చెప్పగలరు! ఒకచోట ఉన్నట్లు ఒకచోట ఉండవు. ఒక జీవి ఉన్నట్లు ఒక జీవి ఉండడు. కొన్ని ఆకారాలలో నీవు కొలువుదీరినట్లు కనిపిస్తావు. కొన్ని ఆకారా లలో నీవు కొరత ననుభవిస్తున్నట్లు అగుపిస్తావు. కొన్నిచోట్ల ఆకారాలను నీవు నడిపిస్తూఉంటే, కొన్నిచోట్ల ఆకారాలే నిన్ను నడిపిస్తున్నట్లుగా అనిపిస్తుంది. అన్నిచోట్ల ఉన్నది, అన్నిటిగా ఉన్నది నీవే అని తెలిసినా ఇతడు మంచి వాడు ఇతడు చెడ్డవాడు ఇతడు మహాత్ముడు, ఇతడు మరీ దుష్టుడు ఇతడు సమర్థుడు, ఇతడు పూర్తిగా చేతకానివాడు ఇతడు శీలవంతుడు. ఇతడు వ్యస నపరుడు, ఇతడు త్యాగి, ఇతడు లోభి, ఇతడు మనిషి, ఇతడు పశువు అని అనిపించడం, అలా అనాలని అనిపించడం చిత్రంకదూ! చిత్రంగా లేదూ! ఇన్ని రకాలుగా అనబడుతున్నది నీవేకదూ! అలా అనబడుతుంటే నీకెలా ఉంటుంది చెప్పు ప్రభూ!

నేనడిగిన ప్రశ్నకు నీ సమాధానమేమిటో నేను చెప్పనా 'ఒక చిరునవ్వు' ఆ చిరునవ్వుకు అర్థమేమిటంటే 'సఖుడా' అలా చూస్తున్నప్పుడు నీకే మనిపిం చింది? నిజంగా ఇందరున్నారని అనిపించిందా? లేక ఈయన ఒక్కడే అయినా

ఇందరిగా అయిపోయాడు అనిపించిందా? కొన్నిచోట్ల ఫరవాలేదుగాని, కొన్నిచోట్ల మరీ ఇంత దారుణంగా ఉన్నాడేమిటి అనిపించిందా? కొన్ని చోట్ల ఎదురు వచ్చి తీసుకువెళ్లిన నీకే, కొన్నిచోట్ల విదిలించి కొట్టాలనిపించిందా? కొన్నిచోట్ల కౌగిలించుకోవాలనిపించిన నీకే, కొన్నిచోట్ల కన్నెత్తి చూడకూడదనిపించిందా? ఏమనిపించింది? ఎలా అనిపించింది? అని ఇదీ నీ చిరునవ్వుకు అర్థం. ప్రభూ! నీ దయవల్ల నీ చిరునవ్వును అర్థం చేసికోగలిగానయ్యా! ఇన్ని జీవరాసులనూ నీరూపాలుగా ఇంతకాలం చూస్తూ వస్తున్నానయ్యా! ఒక్కొక్కచోట ఒక్కొక్కలా నీవు కనబడినా ఇక్కడ ఇలా ఉన్నాడేమిటి? అని అనుకోకుండా ఇక్కడ ఇలా ఉన్నాడేమిటో అని ఆలోచించేవాడినయ్యా! ఆ ఆలోచనతో నాలో ఒక లోచనం విచ్చుకునేది. అక్కడ అలా ఎందుకున్నావో నా కగపడేది. కనుకనే ప్రభూ! ఇన్ని రూపాలలో ఏ రూపాన్ని నీ కన్నవేరుగా నేను చూడలేదు. నీ కన్నవేరుగా నేను చూడలేను.

ఇన్ని రూపాలలో ఏ ఒక్కరూపాన్ని నీ కన్నావేరుగా చూచినా, ఏమిటీ ఇక్కడ ఇలా ఉన్నాడు, అని ఆలోచించడానికి బదులు ఏమిటీ ఇతడు ఇలా ఉన్నాడు అని నేననుకున్నా – ఆ మేరకు నేను నిన్ను గుర్తించనివాడినే అవుతాను. అక్కడి వరకు నేను నాస్తికుడినే అవుతాను. నాస్తికుడిని అంటే ఏమిటి! నీ అస్తిత్వాన్ని గుర్తించని వాడిని. నీ ఉనికిని పట్టించుకోని వాడిని. అప్పుడేమవుతుంది? ఆ రూపాన్ని నేను వేరుగా చూస్తాను. అక్కడున్న గుణ గణాలకే విలువనిస్తాను. గుణ గణాలను బట్టి ఇతడు నీచుడు. ఇతడు భ్రష్టుడూ, ఇతడు దుష్టుడు అనుకుంటూ, అంటూ ఆ రూపాలను తక్కువచేసి చూస్తాను. చిన్న చూపు చూస్తాను. దానితో క్రమంగా నాచూపు చిన్నదైపోతుంది. చివరకు చూడలేని స్థితిలో పడతాను. క్రమంగా నీ యెడల అంధుడనై పోతాను. అందుకనే ప్రభూ! నేనెన్నడూ, ఏ రూపాన్నీ చిన్నగా చూడలేదు. నీకన్నా భిన్నంగా చూడలేదు. ధర్మాధర్మాలను బట్టి ఆయా రూపాలతో కథకు అనుగుణంగా తగినట్లుగా ప్రవర్తించాను తప్ప, నేనెవరినీ తగనివారుగా చూడలేదు. అలా చూడకుండా ఉండగలగడమే ఒక మహా వ్రతంగా పెట్టుకున్నాను నేను. ఆ మహావ్రతాన్ని అనుష్ఠించాను. కనుకనే, సృష్టిరూపంలో వ్యక్తమవుతున్న ఈ నీ మహాలీలను ఇలా నీతో కలిసి చూడగలుగుతున్నాను. ఎంతగా చేరదీశావు ప్రభూనన్ను! ఎంతగా దగ్గరయ్యావు ప్రభూ నాకు నీవు! ఈ మహావ్రతాన్ని జీవితాంతం అనుష్ఠించగలిగాను అంటే అది కేవలం నీ కరుణా విశేషమే కదా ప్రభూ! ఈ నీ మహాలీలను కనులారా

తనివితీరా దర్శించి, ఆనందించడానికిగాను ఈ రూపాన్ని నాకు ప్రసాదించావా! రక్షణ శిక్షణలను అందిస్తూనే అందరినీ ఒక్కరీతిగా నీలో నిలుపుకున్నట్లుగా కర్తవ్యాన్ని తగినరీతిలో నిర్వహిస్తూనే అన్నిటా అందరిలో నిన్ను ఒక్కడినే అను భవించ గలిగిన అదృష్టాన్ని అనుగ్రహించావా! ప్రభూ నీ అనుగ్రహానికి తగినట్లుగా నేను ప్రవర్తించానా! ప్రవర్తించానో లేదోగాని నీకు తగినట్లుగా ప్రవర్తించాలని నిరంతరం ప్రయత్నం మాత్రం చేశాను. నన్ను నేను సమర్థించుకోకుండా నీ కోసం నీ వందించే సమన్వయంకోసం ఆరాటపడ్డాను. ఆ ఆరాటంలోనుండి ఒక· ఆరాధన. ఆ ఆరాధనలోనే నేనొక రాధను అయ్యాను. ఎడతెగని అను భూతిని అనుభవించాను. అనుభవిస్తున్నాను. నేను నీకు శరణాగతి చెందాను. నీవు నాకు నీ తోడి తాదాత్మ్యస్థితిని అనుగ్రహించావు.

ప్రభూ! ఇలారా, ఇంకా దగ్గరగారా, ఏదీ నన్ను అక్కునచేర్చుకో. ఇంకా గాఢంగా నన్ను నీలో నిలుపుకో నన్ను నీవుగా నిలుపుకో.

వేణువుగల చేతితో భీష్ముని వెన్నును నిమురుతున్నాడు కృష్ణుడు. కృష్ణదే వుని విశాల వక్షస్థలముపై తృప్తిగా సేదతీరుతున్నాడు భీష్ముడు.

సేదతీరుతూనే దేహాన్ని విడిచాడాయన. దేహాన్ని విడుస్తూనే కృష్ణునిలో కృష్ణునిగా నిలచాడాయన.

ఋషులు, పాండవులు అలా చూస్తూ ఉండిపోయారు. అస్తమిస్తున్న సూర్యుడివైపు పక్షులన్నీ చూస్తున్నట్లుగా!

అస్తమయాన్ని చూడగలంగాని ఆపగలమా!

అసలది అస్తమయమా లేక అలా అనిపిస్తున్నదా!

అస్తమయమయితే మళ్ళీ ఉదయం ఎలా అవుతున్నది!

ఈ ఉదయాస్తమయాలు ఇలా కనిపించడమనేది ఆ మహాలీలలోని భాగమా! ఇవి కనిపిస్తున్నాయా! అనిపిస్తున్నాయా! అసలున్నాయా? ఉన్నట్లుగా అనిపిస్తు న్నాయా?

దేవతలు పూలవర్షం కురిపిస్తున్నారు. దానిని గమనించుకొని, పాండవులను ముందిడుకొని ఋషిలోకం కూడా పుష్పాలతో కృష్ణుడై వెలుగుతున్న భీష్ముడిని ముంచెత్తింది.

కనులలో నీరు తిరుగుతూ ఉండగా కర్తవ్యమేమిటి అన్నట్లు కృష్ణునివైపు

చూశాడు ధర్మజుడు.

'దేవుడు వెలిగిన దేవాలయమిది! ఈ దేహాన్ని భీష్ముని వ్రతదీక్షకు సహాక రించిన ఈ దేహాన్ని అగ్ని జ్వాలలకు అర్పించి నమస్కరించు పాండునందనా -- అన్నట్లు చూశారు ఋషిలోకం,

ధర్మజుడు కదులుతున్నాడు భీష్మునివైపుకు.

పరీక్షిత్తు కరుగుతున్నాడు కథనువింటూ.

శుకయోగీంద్రుడు వెలుగుతున్నాడు ఆ కథనువినిపిస్తూ.

## అదృష్టవంతులు!

హస్తిన మళ్లీ కళ కళలాడుతోంది. ధర్మరాజు తన పరిపాలనా సౌలభ్యంతో పరిస్థితులన్నింటినీ సరిచేసుకొంటూ, సరిజూచుకొంటూ వస్తున్నాడు. అతడు ఒక పనిలోనికి దిగడమే కష్టం. దిగాడూ అంటే ఇక అతడు ఆ పనిని నిండుగా, తృప్తిగా నిర్వహిస్తాడు. దిగేముందు అనేక విధాల ఆలోచిస్తాడతను. ఆ ఆలోచన సాగుతున్నప్పుడే పెద్దల సహకారం దేవుని సాహచర్యం కావాలతనికి. ఒకసారి దిగిన తరువాత అటు పెద్దలూ, ఇటు దైవమూ కూడా మురుసుకొనేటట్లుగా ముచ్చటపడేటట్లుగా కార్యక్రమాన్ని సక్రమంగా నడిపించగలిగిన నిర్వహించగలిగిన దిట్ట, నేర్పరి అతను.

ఒకనాటి రాత్రివేళ అందరూ ఆదమరచి నిద్రిస్తూఉండగా ధర్మజునితో ఇలా అన్నాడు శ్రీకృష్ణుడు : "ధర్మరాజా ! నాకిప్పుడు తృప్తిగాఉంది. నిన్నిలా చూస్తున్నందుకు నీ ఏలుబడిలో ఈ ప్రజలను ఇలా చూస్తున్నందుకు. దుష్టులయిన వారి చేతులనుండి ఈ భూమిని తీసికొని, శిష్టులయినవారి చేతులకు అప్పగించడమనే నా కార్యక్రమమున్నదే అది దాదాపుగా పూర్తి అయింది అనుకుంటున్నాను. మా మేనమామ కంసుని వధించి మధురను ఉగ్రసేన మహారాజుకు అప్పగించడంతో ప్రారంభమయిన ఈ నా కార్యక్రమం నీ పెదతండ్రి బిడ్డల తనువులను తొలగించి ఈ హస్తినను నీకు అప్పగించడంతో ఇక ఒక కొలిక్కి వచ్చిందనుకుంటున్నాను.

ధర్మరాజా! నీవు అదృష్టవంతుడివి! భీష్మాచార్యుడంతటివాడు నిన్ను దగ్గరకు తీసికొని తన గుండెలకు హత్తుకున్నాడు. ఆ గుండెల్లో వెలుగుతున్న జ్ఞాన

జ్యోతిని నీకు అందించాడు. అతడి జీవితం కౌరవులతోనే గడిచిపోయి ఉండ వచ్చు. కానీ ఆ గడిచిపోయిన జీవితంయొక్క సారాన్నీ, సందేశాన్నీ సారాంశాన్ని అతడు నీసొంతం చేసి వెళ్ళిపోయాడు. పెద్దలనుంచి సంక్రమించే ఆస్తిపాస్తు లకన్నా, పెద్దలనుండి అందివచ్చే అనుభవ జ్ఞానాలు ఎంతయినా ముఖ్యమైనవి. అలాంటివి నీకు నిండుగా లభించాయి.

నీవు మహనీయుడయిన భీష్ముని వాత్సల్యాన్ని నిండుగా పొందావు. బిడ్డలం దరినీ కోల్పోయిన ధృతరాష్ట్రుణ్ణి తండ్రిగా చేరదీసి, బిడ్డవై ఆరాధిస్తున్నావు. పినతండ్రి అయిన విదురుని ఆదరాభిమానాలను పిన్ననాటినుండి పొందుతూనే వచ్చావు. తండ్రి అయిన పాండురాజును తొలి నవ్వుతోనే తన్మయుణ్ణి చేసావు. ఇందరి పెద్దలను ఆ కట్టుకోగల్గిన నీ ప్రవర్తనమున్నదే అది సకల మానవులకు ఆద ర్శప్రాయమైనది. నిన్ను ఇప్పుడు ఈ ఎత్తయిన సింహాసనంమీద కూర్చుండబెట్టినది ఈ దివ్యమయిన నీ ప్రవర్తన సమస్తజనులకూ కొట్టవచ్చినట్లుగా గోచరించ డానికే! ప్రవర్తన ఉన్నవాడు అధికారంలోనికి వస్తే ప్రజలందరూ ప్రవర్తనను నేర్చుకుంటారు. ప్రవర్తన లేనివాడు అధికారంలోనికి జొరబడితే ప్రజలందరు ప్రవర్తనను కోల్పోతారు. కనుకనే ఒక కంసుణ్ణి తప్పించి, ఒక ఉగ్రసేనుణ్ణి ఆహ్వానించడం, ఒక దుర్యోధనుణ్ణి తప్పించి ఒక ధర్మజుణ్ణి ఆహ్వానించడం! ఆ తప్పించడంకోసం, తప్పనిసరైనప్పుడల్లా ఈ 'నేను' దిగిరావడం.

ధర్మరాజు శిరస్సువంచి చేతులను జోడించాడు. శ్రీకృష్ణుడు ధర్మజుని చేతులను తన చేతులలోనికి తీసుకుంటూ, అనునయంగా ఆ చేతులను అలా అలా నిమురుతూ ఇలా అన్నాడు. "చూడు ధర్మజా! సద్గుణ సంపన్నుడూ, సర్వ సమర్థుడూ అయినా మహారాజు సింహాసనంపై ఉన్నప్పుడు కాలచక్రం కూడా అతనితో శ్రుతి కలుపుతుంది. వర్షాలు ఎప్పుడు పడాలో అప్పుడు పడతాయి. ఎంతవరకు పడాలో అంతవరకు పడతాయి. అలాగే మిగతా కాలాలు కూడా! భూమి ప్రజలకు అన్నివిధాలా కలసివస్తాయి. భూమి సుభిక్షమవుతుంది. పాడి సమృద్ధిగా ఉంటుంది. ఆధి వ్యాధులు, ఈతి బాధలు ఉండవు. ఏ విషయం లోనూ భయపడవలసిన అవసరం ఉండదు ప్రజలకు. ఒక విధమయిన నిర్భీతి. ఒక విధమయిన నిశ్చింత.

ప్రజలు గుండె మీద చేయివేసికొని హాయిగా నిద్రపోతారు. అలాంటి హాయిని ప్రజల కందించిన రాజు, రాజు. అప్పుడు ప్రజలు పన్నులు పన్నులుగా కట్టరు! కానుకలుగా అందిస్తారు. దేవునికి నైవేద్య మర్పించినట్లు అర్పిస్తారు. పన్నులను

వసూలు చేయవలసిన అవసరముండదు. అందుకుగాను ప్రజలను పీడించవలసిన అవసరమూ ఉండదు. నదులను ఉపనదులు చేరినట్లుగా, ఎక్కడెక్కడి రాబడులు వాటికవిగా వచ్చి 'ఖజానా'కు జమకట్టబడుతూ ఉంటాయి. ప్రజోపయోగకర మయిన కార్యక్రమాలను తలపెట్టడంకోసం రాజుకు తడుముకోవలసిన అవసరం ఉండదు. అనుకున్నదే తడవుగా అతడన్ని పనులూ చేయగలుగుతాడు. ప్రజలు ఒకరు మరొకరిని మోసగించరు. ఇంకొకరి సొమ్మును దొంగిలించరు! దోచు కోరు. వారి కలాంటి అవసరం కనిపించదు! అలాంటి బుద్ధులు వారిలో పుట్టవు! రాజుకు ప్రజలను దండించవలసిన అవసరం ఏర్పడదు! ధర్మపరిపాలనమంటే అదే! ధర్మంగా పరిపాలించడం! ధర్మాన్ని పరిపాలించడం! ప్రజల హృదయా లలో ధర్మ సంస్థాపన చేయడం! మేము నిన్ను నిలబెట్టాం. ప్రజలను నీవు నిలబెడుతున్నావు. నీలాంటి రాజు లభించినందుకు ఈ ప్రజలు అదృష్టవంతులు!

"ధర్మరాజా నీకు వయస్సు వచ్చినప్పటినుండి నిన్నే రాజుగా భావించుకొం టున్నారు ఈ భూమి ప్రజలు! ఒకప్పుడు నీవు సింహాసనం మీద ఉండవచ్చు. కాలప్రభావం వల్ల ఇంకొక్కప్పుడు లేక పోవచ్చు. కాని ప్రజలు నిన్ను తమ రాజుగా చూస్తూనే ఉన్నారు! నీవు వారి హృదయాలను పరిపాలిస్తూనే ఉన్నావు! ఒకరకంగా మేము చేసింది ప్రజాభీష్టాన్ని నెరవేర్చడమే!"

పులకిత గాత్రుడవుతూ ఇలా అన్నాడు ధర్మజుడు : "గోపాలా ! నా అనుభవంలో నీవే ఈ ప్రజలు. ఈ ప్రజలే నీవు! నీవు సర్వాంతర్యామివి! సకల జనుల హృదయ నివాసివి! నీవే కాలము. నీవే ఈ సర్వమూ! అట్టి నిన్ను ఒక వ్యక్తిగా ఒక బందుగునిగా, ఒక చెలికాడుగా, ఒక మంత్రిగా, ఒక శ్రేయోభిలాషిగా, ఒక గురుమూర్తిగా పొందిన, పొందగలిగిన మేము ఎంతటి అదృష్టవంతులం. ఎంతటి ధన్యజీవులం!"

ఈ మా జీవితాల్లో ఎన్ని ఘట్టాలు! ఎన్నెన్ని ఘట్టాలు! ఎటువంటి ఘట్టాలు! ఎంతటి ఘట్టాలు నడిచాయి నడుస్తున్నాయి! అయినా వాటన్నింటి మీదుగా మేము నడిచి రాగలిగాము అంటే, అది మా ప్రయోజకత్వంకాదు. మా సాధనాబలం కూడాకాదు. కేవలం, కేవలం నీ సాహచర్యమే మమ్మల్ని నడిపించింది. నీ సాహచర్యంలోని ఆ తీపిని అనుభవించడానికే! ప్రజల రూపం లోనున్న నిన్ను ఆరాధించి తరించడానికే. ఈ విశ్వరూపంలో నిన్ను నిండుగా దర్శించి, తృప్తిగా సేవించి హాయిగా నీలోని ఆ 'హాయి'గా నిలచిపోవడానికే!

'అధికారం, నీ వప్పగించిన ఈ అధికారం కేవలం పవిత్రమైన ఒకానొక

బాధ్యత. నీవుగా నాకు నిర్దేశించిన ఒకానొక విశేషమయిన కర్తవ్యం. నీ అడుగు జాడల్లో నడుస్తూ, నీకు తగినట్లుగా ఈ కర్తవ్యాన్ని నిర్వహిస్తూ, నీ సంకల్పం మేరకు ముందుకు సాగుతాను. పరీక్షిత్తుకు ఈ అధికారాన్నీ, పవిత్రమయిన ఈ అవకాశాన్నీ అందించేటంతవరకు సాగుతాను. నీ కరుణా విశేషాన ఒక సత్యాన్ని పూర్తిగా గ్రహించాను. పదవులూ, అధికారాలూ అంటే వ్యామో హపడటం ఎంతతప్పో, వాటిని వద్దు పొమ్మనడం కూడా అంతే తప్పు. అది పదవో, బాధ్యతో పెద్దదో చిన్నదో ఏదయితేనేం నీ వప్పగించినది! నీ ప్రసాదం! నీ అనుగ్రహం! నీ ఆదేశం! దానిని నీకు తగినట్లుగా నీకు ముచ్చట కలి గేటట్లుగా నిర్వహించడమే చేయవలసినది అని నేను తెలుసుకున్నాను. నేను తేరుకున్నాను. నేను నిన్ను చేరుకున్నాను. నేను నిన్ను చేరుతున్నాను".

శ్రీకృష్ణుని కౌగిలిలో ఇమిడిపోయాడు ధర్మజుడు. పాపలా, పసిపాపలా ఆ దేవదేవుని వక్షస్థలంపై సేదతీరుతున్నాడు. తేలిపోతున్నాడు. తన్మయుడవుతు న్నాడు తరిస్తున్నాడు.

ఆదమరచి పోతున్నాడు పరీక్షిత్తు కథనువింటూ, ఆయా లోకాలలో విహ రిస్తున్నట్లున్నాడు.

కథను వినిపిస్తున్న శుకయోగీంద్రుడు పరీక్షిత్తు వైపునకు చూస్తున్నాడు. 'ఇది కదా పొందవలసిన స్థితి' అన్నట్లుగా.

## తిరుగాడిన ముచ్చట

శ్రీ కృష్ణుని ద్వారకా ప్రయాణానికి రథం సిద్ధమై అల్లంత దూరాన ఉంది. ఆ ప్రాంతమంతా కోలాహలంగా ఉంది. అంతఃపురం నుండి కుంతీ, ద్రౌపదీ, సుభద్ర మొదలయిన స్త్రీమూర్తులందరూ కదిలి వచ్చి ఒక వైపుగా నిలబడ్డారు. ధృతరాష్ట్రునితో సహా కురువంశ ప్రముఖులందరూ ఒక వైపు నిలబడ్డారు. చేరవచ్చిన వారందరినీ చిరునవ్వుతో పరామర్శిస్తూ శ్రీకృష్ణుడు ధర్మజుని సమీపించాడు. 'ఇక వెళ్లిరానా?' అన్నట్లు కనుబొమ్మలు అల్లల్లా డిస్తూ వినమ్రుడై అతనికి నమస్కరించాడు. నమస్కరిస్తున్న కృష్ణుణ్ణి కౌగిలిం చాడు ధర్మజుడు. హృదయంలోనే, హృదయంతోనే అతనికి మరింత గాఢంగా నమస్కరించుకున్నాడు.

ధర్మజుని చేయిపట్టుకుని నడుస్తున్నాడు శ్రీకృష్ణుడు.

'వెళ్లిపోవలసిందేనా! మేము నీకు వీడ్కోలు చెప్పితీర వలసిందేనా! ' అన్నట్లు చూస్తున్నారు ఇటూ, అటూ అందరూ! 'సత్సాంగత్యంలోని మధురిమను మాకు మరువలేనంతగా, విడువలేనంతగా రుచి చూపించావు. మరి ఇప్పుడు ఒక్కసారిగా మమ్మల్ని విడిచిపోతే ఎలా చెప్పు! మేం ఏమయిపోతామో మాకే తెలియటం లేదు సుమా! ఇన్నినాళ్లు నీతో తిరిగాము. నీతో తిన్నాం. నీకు కావలసినవి సమకూర్చి పెట్టడంలో ఎనలేని ఆనందాన్ని అనుభవించాం. ఇన్ని నాళ్లుగా మా దినచర్య అంతా నీ చుట్టూ తిరుగుతూ వస్తోంది. మరి ఇప్పుడు నీవు ఒక్కసారిగా మమ్మల్ని విడిచిపెట్టి బయలు దేరు తున్నావు. ఈ క్షణం నుండీ మేం ఎవరి చుట్టూ తిరగాలి? ఎవరి కోసం తిరగాలి? నీవనవచ్చు. 'నేనే సర్వాంతర్యామినికానా? కేవలం ఈ శరీరానికే పరిమితుడనా' 'అని. కాదు! కావు! అది మాకు తెలుసు. అయినా ఇదొక ముచ్చట! తనివి తీరని ముచ్చట! తనువుతో నీవు తిరుగాడిన ముచ్చట! దీనిని మరచిపోలేము. దీనిని వదులుకోలేము. నిన్ను కాదన లేము. మేనుగా అవుననలేము. మా స్థితి ఏమిటే - అన్నది. అది నీవు గ్రహించవలసిందే! మాగతి ఏమిటీ అన్నది. అది ఎప్పటిలా నీవు చూసుకోవలసిందే!' అన్నట్లు చూస్తున్నారువాళ్లు. ఆచూపులతో అలానే అంటున్నారు. మాటలు పెగిలిరాని సమయమది! మనస్సు మాటలకు రూపుదిద్దలేని సమయమది. అదోరకమయిన అనుభూతిలో మనస్సులు మూగబోతున్న సమయమది!

'ఎవరయినా ఇతనిని ఆపితే బాగుండును. ఆగమని కోరితే బాగుండును. ఆ కోరిక విని కరుణించి అతడు మరికొంత కాలం నిలిచిపోతే బాగుండును. లేదా అతనివెంట మనని రానిస్తే బాగుండును. అతని వెంట మనని కొనిపోతే బాగుండును. ఇందులో ఏది జరిగినా బాగుండును!

- అని అనుకుంటూ నిలబడ్డారు వాళ్లు. అని అనిపిస్తూ ఉండగా నిలబడిపోయారు వాళ్లు. ఎవరూ అనలేరు! ఎవరూ ఆపలేరు! అతడు సాగిపోతున్నాడు. అక్కడికీ నిదానంగానే సాగిపోతున్నాడు. ఇందరి చూపులనూ అందుకుంటూ సాగిపోతున్నాడు. ఇందరి భావనలకు స్పందిస్తూ సాగిపోతున్నాడు. సాగిపోవలసి ఉంది కాబట్టి సాగిపోతున్నాడు. అక్కడి వారందరూ అతనిని సాగనంపలేక, సాగనంపలేక సాగనంపుతున్నారు. దారి పొడుగునా తమ నిండు ప్రాదయాలను ఒత్తుగా పరిచి, అహ్రుదయాల మీదుగా అతడిని సాగనంపుతున్నారు. పాదస్పర్శ

అమోఘంగా తగులు తున్నది అహృదయాలకు. వారు బాధ పడుతున్నారు. పరవశిస్తున్నారు. బాధపడుతూనే పరవశిస్తున్నారు. పరవశిస్తూనే బాధపడుతు న్నారు. అది ఒక తీయని బాధ! ఆ బాధ ఎంత తీయనిది! ఆ స్థితి వర్ణించుటకు అలవికానిది. అనుభవించే వారికే తెలిసేటటు వంటిది.

కృష్ణుడు రథమెక్కుతున్నాడు. అందరి తరఫునా ధర్మరాజు వీడ్కోలు చెబుతున్నాడు. అందరి వైపు చూస్తున్నాడు ధర్మజుడు. అందరివైపూ చూస్తు న్నాడు శ్రీకృష్ణుడు. ఇందరిగా, మీ అందరిగా ఉన్నది 'నేనే' కదా! నేను కాదా? - అన్నట్లు విలాసంగా, విమర్శగా చూస్తున్నాడతను. అందరూ, అచ్చట ఉన్న అందరూ అతనివారే, అతనిలోని వారే అయి, ఒకానొక దివ్యానుభూతితో సొక్కుతున్నారు. సోలుతున్నారు. వారలా సొక్కుతూ, సోలుతూ ఉండగానే కృష్ణుని రథం కదిలింది. వారి నుండి ముందుకు సాగింది. వారలా చూస్తూనే ఉన్నారు. కొందరి కన్నులనుండి బాష్పబిందువులు రాలుతున్నాయి. కొందరి కన్నులు అర్ధనిమీలిత స్థితిని పొందుతున్నాయి! కొందరి కన్నులు అటువైపే, ఆ రథం వెళుతున్న వైపే చూస్తున్నాయి! ఏమాత్రం కనురెప్పక్రిందికి వాలినా, ఆ అవకాశాన్ని ఆమేరకు కోల్పోతాముకదా! అన్నట్లుగా చూస్తున్నాయి. కొందరి కన్నులు ఎప్పుడో మూతపడ్డాయి! అదో అనుభూతిలో, అదే అనుభూతిలో అవి అలాగే కొనసాగుతున్నాయి. కనుచూపుమేర నుండి కృష్ణుని రథం దాటిపోయే వరకు వారందరూ అక్కడే ఉన్నారు. రథం కనపడకుండా వెళ్లిపోయిన తర్వా తకూడా వారందరూ అక్కడే ఉన్నారు. ఆ రథం వెళ్లిన మార్గాన్ని అలా చూస్తూ నిలబడి ఉన్నారు.ఆయన కనబడక పోవచ్చు. ఆయన సాగినమార్గం అలా కనబడుతూనే ఉంటుంది. అసలు ఆ 'మార్గాన్ని' చూపించడానికే ఆయన అలా కనబడి, సాగిపోతూ ఉంటాడు. కనబడినట్లే కనబడి సాగిపోతూ ఉంటాడు.

రథం సాగుతూ ఉన్నది. రథంలో సాగుతున్న శ్రీకృష్ణుడికి తెల్లని గొడు గుపట్టి నిలిచాడు అర్జునుడు. అన్నివైపుల నుండీ ముత్యాలదండలు వ్రేలాడుతున్న గొడుగది! ఉద్ధవుడూ, సాత్యకీ కృష్ణునికి ఇరువైపులా నిలబడి చామరాలతో వీస్తు న్నారు. మణులు పొదగబడిన, పిడులు గలిగిన చామరాలవి! రథానికి ముందు వివిధ వాద్యాల శబ్దాలు మారుమ్రోగుతున్నాయి. బ్రాహ్మణోత్తములు ఆ దేవదే వుని సగుణ, నిర్గుణ తత్త్వాలను గూర్చి వేదరూపంలో గానం చేస్తూసాగుతు న్నారు. కృష్ణుడు పూలవర్షంలో మునిగితేలుతూ సాగుతున్నాడు. కులకాంతలు

మనసారా కురిపిస్తున్న పూలవర్షమది! వారి పులకింతలు అన్నీ పూవులై అతనిని అలా సోకుతున్నాయి. తాకుతున్నాయి.

సౌధాగ్రాలపై చేరిన కాంతామణులెందరో, ఎందరెందరో ఒకరిని త్రోసుకుంటూ ఒకరు, ఒకరిని కలుపుకొంటూ ఒకరు పూలవానను కురిపిస్తూనే ఆదమరచినవారై అప్రయత్నంగా ఏవేవో మాట్లాడేస్తున్నారు. అంటున్న మాటలు కావవి! వస్తున్న మాటలు! లోనుండి వస్తున్న మాటలు!

చిరునవ్వులతో వారినందరినీ సమ్మోహితులను చేస్తూనే అర్జునుని వైపు చూస్తున్నాడు శ్రీకృష్ణుడు' - 'నీవు వింటున్నావు కదా ఆ మాటలను! - అన్నట్లు.

అర్జునుడు మరింతగా చెవులు ఒగ్గాడు ఆ మాటలకు, ఇన్నిధ్వనుల మధ్య నుండీ ఆ హృదయభాషలు స్పష్టంగా ఇలా వినబడసాగాయి.

'చెలీ చూచావా! కృష్ణుని రథం దూరమైపోతున్నది! కన్నులకిక కనిపించదేమో! ఇతడిని చూడకుండా నేనెలా ఉండగలను! ఇతడిని చూడని దినాలు నాకు కల్పాలే కావా! దినం ఒక కల్పంగా గడుపుతూ, ఈ ఇంటిలో ఇలా ఉండటంకన్నా అతడితో అలా ద్వారకకు పోయి అతడి పరిచర్యలో అలా ఉండిపోవాలనిపిస్తోందినాకు'

'సఖీ! ఇతడు కేవలం యాదవరాజు కాడు. వేదములందు వర్ణింపబడినవాడు. సృష్టి, స్థితి, లయాలను నడిపే కాలపురుషుడు.'

'ఓసీ! తామసగుణం బలిసిన రాజులు భూమిపై ఎక్కువయిపోయి ప్రజలను అనేక విధాల బాధింపసాగారు. అలాంటి దుష్టులందరినీ వెదికి వధించడానికే ఈయన అవతరించాడు. ఏమంటావు! '

'ఇతడు పుట్టబట్టే యాదవకులానికి అంత ఘనత వచ్చింది'.

'ఇతడు కొంతకాలం వసించేటప్పటికే మధురానగరికి అంతటి మహిమ కలిగింది.

'ఈ మహాబలశాలి దుష్టశిక్షణ చేయబట్టే జీవులందరకు ఇంతటి సుఖం కలిగింది'.

'గోపకాంతలెందరో ఇతనిని చూచి సమ్మోహితులయి వెంటపడ్డారు. అప్పుడితడేం చేసాడూ - వేణుగానాన్ని తన అధరామృతంగా వారికందరికీ కొల్లగా

పంచిపెట్టాడు.'

'కరుణకు సముద్రం లాంటి వాడితను. ఇతడెక్కడుంటే అక్కడ సౌభాగ్య ముంటుంది. ఇతనిని భర్తగా పొంది, ఇతనితో కాపురం చేస్తున్న రుక్మిణీదేవి మొదలయినవారు నిజంగా అదృష్టవంతులు. ఎందువల్లనంటే మిగిలిన కాంతలు భర్తను దేవుడిగాచూస్తూఉంటే, వారు దేవుణ్ణే భర్తగా ఆరాధించగలుగుతున్నారు. ఏమి నోములు నోచారో ఆ అదృష్టాన్ని పొందడానికి!'

అర్జునుడు కృష్ణుని వైపుకు చూస్తున్నాడు! చిన్నగా నవ్వుతున్నాడు.

కృష్ణుడు వేణువును తాకుతున్నాడు. యమునాతీరాన్ని అనుభవానికి తెస్తున్నాడు.

పరీక్షిత్తు ఒడలు మరుస్తున్నాడు. మరుస్తూ, మురుస్తున్నాడు.

శుకయోగీంద్రుడు గాథను వినిపిస్తూ పులకిస్తున్నాడు.

అతని గొంతునుండి 'ఆవేణువు' పలుకు తున్నదని గమనిస్తున్నాడు.

## బాలు షది!

పరీక్షిన్మహారాజా! మీ పెద్దలలోని భాగవత మూర్తులందరూ భగవానుడయిన వ్యాసమహర్షి చేత భాగవత మహాపురాణంలో మునుముందుగా ఎలాకీర్తింప బడ్డారో, ఎంతగా కీర్తింప బడ్డారో విన్నావు కదా! ఆ భాగవత మూర్తులందరూ ఒక్కొక్కరుగా మన అంతరంగంలో సాక్షాత్కరించి, భాగవత మార్గాన నడవదలచిన వారికి అలవడవలసిన మహోలక్షణాలను గూర్చి దివ్యమైన పద్ధతిలో ఎలా ఉపదేశిస్తూవచ్చారో చూశావుకదా!

అందరూ భాగవత మూర్తులే! అందరూ ఆదేవదేవునికి సర్వసమర్పణ చెందినవారే! ఆ సర్వసమర్పణ స్థితిలో వారుండగా వారి జీవితాలలో, జీవిత సన్నివేశాలలో ఎలాంటెలాంటి దివ్య గుణాలు వ్యక్తమవుతూ వచ్చాయో మనం స్మరించుకున్నాం. మనం దర్శించగలిగాం. మహాసాధ్వి అయినటువంటి ద్రౌపది నుండి అనితర సాధ్యమైన క్షమా గుణం వ్యక్తమైంది. తన వంశాన్నే నిర్వంశం చేయడానికి నడుంకట్టిన దుర్భర శత్రువుని క్షమించ గలిగిందామె. నావంటిస్థితి ఇంకెవరికీ కలుగకూడదు. చివరకు మీ తల్లికయినా! అని అశ్వత్థామతో అనగలిగిందామె. పగవారికయినా ఈ బాధ కలగవద్దు అని అనుకొంటూ వుంటాంమనం చాలాసార్లు. అంటే ఏమిటో అలా అనుకోవడంలోని పరమా

ర్థమేమిటో నరజాతికి ఉపదేశించింది ఆమె! భాగవత మార్గాన నడువదలచిన ఓ సాధకులారా! సహృదయులారా! ముందుగా ఈక్షమా గుణాన్ని, ఇలాంటి క్షమా గుణాన్ని మనం అలవరచుకోవాలి సుమా! ఇతరులు మనకు ఏమి చేయ కూడదను కుంటున్నామో, మనం దానిని ఇతరులకు చేయకూడదు. చివరకు మనపట్ల అలా చేసిన వారికి కూడా మనం అలా చేయకూడదు - అన్న దివ్య సందేశాన్ని, మహోన్నతమయిన స్థితిలోనుండి మానవజాతికి అందిస్తున్నదామె.

ఇక మీ తల్లి, ఉత్తర, అమృతమూర్తి! ఆమె ప్రవర్తన మనకేమి తెలి యచెబుతున్నది? భాగవత మార్గాన నడువ దలచినవారు తమను తాము మరచిపోవాలని! తమ చుట్టూ ఉన్నవారి కోసం, తమను ఆశ్రయించుకొని ఉన్నవారి కోసం తమని తాము అర్పించుకోవాలని! ఎంతటి ఉపదేశమది! ఆమె ఏమన్నది దేవదేవునితో! నా కడుపులోని బిడ్డ అస్త్రాగ్నికి అహూతైపోతున్నాడు రక్షించుప్రభూ! అతడిని రక్షించు'- అన్నది. మరి ఆ అస్త్రాగ్ని ఆమెను దహిం చివేయడంలేదా! ఆప్రసక్తి అక్కడ లేనే లేదు! ఉండదు! ఎందుకని! ఆమెకు ఆమె గుర్తులేదు కనుక! తనకు తాను గుర్తుండి, తన కొరకు తాను వెంపర లాడే సాధారణ స్థితినుండి ఆమె ఎప్పుడో ఈవలకు వచ్చింది కనుక! ఆమె అలా అనలేదు. ఆమె అలా 'అన' లేదు!

క్షమ అంటే ఇదీ అని ద్రౌపది తెలియచెబుతున్నది. ప్రేమ అంటే ఇలా ఉంటుందని ఉత్తర తెలియచెబుతున్నది. మరి కుంతి ఏమి తెలియచెబుతున్నది? కడదాకా కర్తవ్యం వెంట కదలి సాగడ మెలాగో తెలియచెబుతున్నది. కష్టనష్టాలు ఆమె ప్రయాణాన్ని ఆపలేవు. సుఖభోగాలు ఆమె ప్రయాణాన్ని అడ్డుకోలేవు. ఆశ్చర్యం కదూ! లోకంలో ఈరెండింటి పేరనే మనిషి కర్తవ్యనిర్వహణనుండి చెదిరిపోతాడు. ఇంకా చెప్పాలీ అంటే కర్మ భ్రష్టుడయి పోతాడు. 'కష్టనష్టాలు వస్తున్నాయి. కష్టనష్టాలు కమ్ముకు వస్తున్నాయి! ఇంక నేనేం చేయగలను! మీరే చెప్పండి! ' - అంటాడు. సఖభోగాలు చేరవస్తున్నాయి. సుఖభోగాలు ఇన్నాళ్లకు నాజీవితంలో అందివస్తున్నాయి. వీటిని తగుమాత్రంగానయినా అను భవించ కుండా నేనెలా ముందుకు సాగగలను! 'మీరే చెప్పండి! ' - అని అంటున్నాడు. అంటే దానర్థం ఏమిటి? కష్టసుఖాలు వస్తే అతడిక కదలలేడు. సుఖభోగాలు వస్తే ఇక సాగలేడు. మరి ఇంకెప్పుడు కదులుతాడు: కష్టనష్టాలు వచ్చినా, సుఖభోగాలు హెచ్చినా, మనం మాత్రం ఉండవలసింది కర్తవ్యనిర్వహణ లోనే! కష్టనష్టాల మధ్యనుండి మనం కర్తవ్యం వైపుకే చూడాలి! సుఖభోగాల మధ్యనుండి మనం కర్తవ్యం వైపుకే చూడాలి! అని.

తన బావగారు, సాక్షాత్తు ఆ దేశానికి చక్రవర్తి, తనను బిడ్డలతో

సహో తరిమి తరిమి కొట్టాడు. అయినా ఆమె బెదిరి పోలేదు. కర్తవ్యమేమిటో గమనించుకొంటూ ఆమె కదిలిపోయింది. కథను ముందుకు నడిపింది. దేవదేవునే ఆకథలోనికి ఒక పాత్రధారిగా ఆహ్వానించింది. కష్టాల మధ్యనుండి కన్నీళ్ల మధ్యనుండి, కర్తవ్యం వెంట సాగిపోయిందామె. ఎంతగా సాగిపోయింది దేవదేవుడే ఆమెను చూసి ముచ్చట పడేటట్లుగా సాగిపోయింది! ఆయన ఎంతగా ముచ్చట పడ్డాడు అంటే - 'అత్తా! ఇకపైన జరుగవలసినది ఏమిటి 'అని ఆమెను అడిగే వాడయ్యాడు. 'అది నీకు తెలియనిదా? ' - అన్నట్లు చూసేదామె! అలాంటి ఆమె చివరకు తనను తరిమికొట్టినవాళ్లే తన చెంత దీనులై నిలిచిన వేళ, తన ఆశ్రయంలో శేష జీవితాన్ని వెళ్లబుచ్చుకొనే స్థితిలో పడినవేళ, సుఖభోగాలు తనను చుట్టుముట్టినవేళ, రాజమాత పదవి తనను కోరి వరించినవేళ, అంతటి విజయాల మధ్యనుండి ఆమె ఏమంటున్నది? 'కన్నయ్యా! ఇక నా కర్తవ్యమేమిటి? '- అంటున్నది. 'ఇన్నిటి మధ్యలో ఉన్ననన్ను, నీ సంకల్పానికి అనుగుణంగా నడిపించు ప్రభూ! ' - అని కోరుతున్నది. సుఖభోగాలను అనుభవించడంలో కన్నా, నీ సంకల్పానికి అనుగుణంగా ప్రవర్తించడంలోనే నాకు నిజమయిన సుఖమున్నది అంటున్నది. అంతేకదా! కర్తవ్యనిర్వహణలోనే కదా సుఖమున్నది! ఆ కర్తవ్యనిర్వహణ ఆ దేవదేవుని సంకల్పానికి అనుగుణంగా సాగినప్పుడే కదా సుఖమున్నది! కష్టనష్టాలయినా, కర్తవ్యనిర్వహణకు దోహదాలే! సుఖభోగాలయినా కర్తవ్యనిర్వహణకు సోపానాలే! ఎంత చక్కగా చెప్పిందామె! వాటిని చూచి ఆగవద్దు అంటున్నది. వాటి మధ్యగా సాగిపోమంటున్నది! కర్తవ్యనిర్వహణకు వాటినిదోహదాలుగా, సోపానాలుగా స్వీకరిస్తూ కదలిపోమంటున్నది. ఏమి సందేశం! శ్రీకృష్ణుని గీతాబోధ ఇలా ఒక కుంతిగా - ఆకుంతి జీవితంగా రూపుకట్టు కొన్నట్లు గోచరించడం లేదూ! గీత అర్థం కావాలీ అంటే కుంతి అర్థం కావాలి. ఆమె నడిచిన 'గీత' జీవితరూపంలో నడిచిన భగవద్గీత! ఎలాంటి దివ్య గుణాలను అలవరచుకోవాలో ఒక ద్రౌపదీ, ఒక ఉత్తర చెబుతూ ఉంటే, ఆ దివ్యగుణాలను అలవరచుకొంటూ కర్తవ్యం వెంట ఎలా సాగిపోవాలో కుంతీదేవి ఉపదేశిస్తున్నది. భాగవత మార్గాన నడువదలచినవారు కర్తవ్యపథాన కడదాక ఎలా సాగిపోవాలో సూచిస్తున్నది ఆమె. చూపిస్తున్నది ఆమె.

కర్తవ్య నిర్వహణలో ముందుకు సాగేటప్పుడు అడుగడుగునా ఆదేవదేవుని గమనించుకొంటూ, అతని అడుగులో అడుగువేసే ప్రయత్నం నిరంతరం ఎలా జరుగుతూ ఉండాలో చూపించే వాడు భీష్మాచార్యుడు. ఆ అడుగులోనుండి ఈ అడుగు తప్పితే ఎంతటి ఇబ్బంది రావడానికి అవకాశమున్నదో మనకు ఉదాహరణ పూర్వకంగా దర్శింప చేస్తాడాయన. మళ్లీ ఆ అడుగులో అడుగు

పడేటట్లుగా చూసుకొనే విషయంలో ఆయన ఎంతగా తపించి పోయాడో మనం చూశాంకదా! ఆయన మొహమాట పడలేదు! సరిపెట్టుకోలేదు! సమర్థిం చుకోలేదు! కావలసిన సమన్వయం కోసం పరితపించిపోయాడు! దేవదేవుని నుండి ఆ సమన్వయం అందీ అందగానే తన జీవితంలో వెంటనే అమలు పరుచుకొన్నాడు. భాగవత మార్గంలో నడవదలచిన వారు తమను తాము సరి దిద్దుకోవడానికి ఎంతగా పరితపించాలో, కావలసిన సమన్వయం లభించినప్పుడు, అందుకొని దానినమలు పరచుకోవడానికి ఎంతగా సంసిద్ధులయి ఉండాలో మనకు చక్కగా చూపిస్తున్నాడాయన. భాగవత మార్గంలో నడవదలచిన వారు తామెం తటి వారము అనిగాక, తాము ఎక్కడున్నాము - అన్న అంశాన్ని గూర్చి చిత్తశుద్ధితో పరిశీలించుకొంటూ ఉండాలని ప్రబోధి స్తున్నాడాయన.

జీవితంలో ఎదురయ్యే సన్నివేశాలను కష్టాలుగా గాక, సమస్యలుగా గాక, సాధనలోని భాగాలుగా, పాత్రపోషణకు ఆవశ్యకమయిన అంశాలుగా స్వీకరించా లంటున్నాడు ధర్మజుడు. పెద్దల నుండి నిరంతరం శిక్షణ పొందుతూ, వారికి కూడ ముచ్చట కలిగే లాగున 'జీవించడ మేలాగున ' అన్న అంశాన్ని తన జీవన విధానం ద్వారా నరజాతికి ఉపదేశిస్తున్నాడు ధర్మజుడు. వారి నుండి తెలిసినదానినే మళ్లీ తెలుసుకుంటూ ఉంటాడు. విన్న దానినే మళ్లీ వింటూ ఉంటాడు. వారి జీవితాలను శ్రద్ధగా గమనిస్తూ, తన జీవన విధానానికి నిత్యమూ మెరుగులు దిద్దుకుంటూ ఉంటాడు. పెద్దల రూపంలో వెలుగుతున్న దేవదేవునికి చేతులతో, చేతలతో నమస్కరిస్తూ ఉంటాడు. వారి సేవను ఒక అర్చనగా నిర్వహిస్తూ ఉంటాడు. భాగవత మార్గాన నడవదలచిన వారికి అన్ని విధాలా ఆదర్శంగా నిలబడ గలిగిన వాడితడు. మిగిలిన వారందరూ భాగవత మార్గాన నడవదలచేవారు అలవర్చుకోవలసిన దివ్యగుణాలను, గ్రహించుకోవల సిన సూక్ష్మాంశాలను తెలియచెబుతూ ఉండగా, ఆ అలవరచు కోవడం కోసం, ఆ గ్రహించుకోవడం కోసం నిత్య జీవితాన్ని ఎలా తీర్చిదిద్దుకోవాలో మనకు తెలియ చెబుతున్నవాడు ధర్మజుడు.

శుక యోగి గొంతు ఆర్ద్రమవుతున్నది. పరీక్షిత్తు కన్నులు చెమ్మగిల్లు తున్నవి.

# సారథి రచనల సంక్షిప్త పరిచయం

## స్వామిగేయాలు :

తీయగా, హాయిగా సాగుతూ మనలను ప్రేమగా, వెలుగుగా రూపొందిస్తాయి ఈ గేయాలు. మాస్టర్ ఇ.కె. మాస్టరు సి.వి.వి వంటి పరమ గురువుల దివ్యరూపాలను మనకు అనుభవానికి తెస్తాయి. అలసటను పోగొట్టి, ఉత్తేజితులను చేస్తూ ఆచరణ పథం వెంట, ఆనంద ధామం వైపునకు మనలను ఇట్టే నడిపిస్తాయి.

## దర్శనాలు - నిదర్శనాలు : (1,2 భాగాలు)

తెలిసిన దృశ్యాలను చూపిస్తూ, తెలియవలసిన సత్యాలను మన ముందుకొనే లాగున చేస్తారు ఇ. కె. మాస్టరుగారు ఇందులో. పతంజలి, భగవద్గీత మనకు అందిస్తున్న రాజయోగ మార్గాన్ని వెన్నతో పెడతారాయన ఈ భాగాలలో. యోగమంటే ఏమిటి! సాధనంటే ఏమిటి! సమాజమంటే ఏమిటి? జీవితమంటే ఏమిటి? అన్నది ఈ గ్రంథాలలో ఆయన చక్కగా తెలియజెబుతారు.

## అన్వేషణ - అనుభూతి :

శ్రీ కృష్ణస్వామి సంక్షిప్త జీవిత చరిత్ర ఇది. చిన్ననాటితో ప్రారంభమయి ఇ.కె. మాస్టరుగారి సన్నిధికి చేరుకొనేవరకూ జరిగిన దివ్యగాథను సూటిగా మన హృదయాలలో నాటుకొనేటట్లుగా చెబుతారు శ్రీ కృష్ణస్వామి. మనస్సున్న ప్రతి మనిషి చదువవలసిన ప్రత్యేకమైన గ్రంథమిది.

## అక్షరాల్లో అనుభూతులు : (1,2,3,4 భాగాలు)

ఇ.కె. మాస్టరుగారు పరిచయమైన తరువాత నుండి దివ్యమైన వారి సాహచర్యంలో శ్రీ కృష్ణస్వామి పొందుతూ వచ్చిన సార్థకమైన అనుభూతులకు సరసమైన అక్షర రూపాలివి. వారినుండి పొందిన చేయూతను మొదటి భాగంగాను, శిక్షణను రెండవ భాగంగాను, ప్రోత్సాహాన్ని మూడవ భాగంగానూ, విశ్వరూప సందర్శనాన్ని నాలుగవ భాగంగానూ శ్రీ కృష్ణస్వామి మనకు అందించారు. ఈ గ్రంథాలను మనసుపెట్టి చదివినపుడు నరునికి కావలసిన ఆ నాలుగు అంశాలను మనం కూడా నిండుగా పొందగలుగుతాం.

## మానవ సేవలో మాస్టరు ఇ.కె. :

మాస్టరు ఇ.కె. హోమియో వైద్యునిగా రూపొంది సమాజసేవకు నడుముకట్టిన దివ్యచరితను నిండుగా వర్ణిస్తుంది ఈ గ్రంథం. గ్రంథం చదువుతున్నంతసేపూ వారి సాక్షాత్కార, సాహచర్యాలు మనకు అలవోకగా లభిస్తాయి. వ్యాధి బాధలు తొలగిపోవటానికి ఈ దివ్య చరితను మనసుపెట్టి చదువుకుంటే చాలునని మనకు తెలుస్తుంది. మనలో అంతటి మార్పు వస్తుంది.

## సరసాల్లో నవరసాలు : (1,2,3, భాగాలు)

ఒక ప్రవక్త మనతో సరసమాడితే ఎలా ఉంటుంది. అది ఎంత సరసంగా, సార్థకంగా నడుస్తుంది అన్నది ఈ గ్రంథాలలో మనకు అనుభవానికి వస్తుంది. ఇ.కె. మాస్టరుగారు మానవజాతి మనసునకు పెట్టిన గిలిగింతలను ఈ గ్రంథాల నుండి మనంకూడా అందుకోవచ్చును. మధురమైన ఆ సరసంలో ఆ వెనుకనుండి అలా అలా ఒక గంభీరమైన సందేశం - ఎలా ఎలా కొంటెగా దోబూచులాడుతూ ఉంటుందో ఈ మూడు భాగాలలో మనం గమనించవచ్చు.

## మాటలు - మంత్రాలు : (1,2 భాగాలు)

మాటలలోని మంత్రాలు. మంత్రాల వంటి మాటలు మనకీ గ్రంథాలనిండా కనబడతాయి. కృష్ణస్వామిగారి మాటలే మంత్రాలు. అవి ఎంత అర్థవంతంగా ఉంటాయో అంత నాజూకుగానూ ఉంటాయి. మనకు తెలియకుండానే మనచేత మననం చేయబడతాయి. మనలో నిలబడతాయి. మనను నిలబెడతాయి.

## స్వామి పలుకులు - స్వాతి చినుకులు : (1,2, భాగాలు)

శ్రీ కృష్ణస్వామి ఆడిన మాటల ఆటలు. మాటలతోటి ఆటలు. సరసమైన ఆటలు. సరదా సరదా ఆటలు. మనను కూడా ఆడిస్తాయి. బాగా ఆటపట్టిస్తాయి. ఆటపట్టిస్తూనే కథను రక్తి కట్టిస్తాయి. అన్నిటినీ మించి మనను కడుపుబ్బ నవ్విస్తాయి.

## మాటల మధ్యలో రాలిన ముత్యాలు : (1,2 భాగాలు)

పేరు చెబుతోంది. మనం కూడా ఆ ముత్యాలను ఏరుకోవచ్చుని. ఈ భాగాలలో వాటిని ఏర్చి కూర్చి పెట్టామని. మన జీవిత సన్నివేశాల మధ్యలో ఈ ముత్యాలు అక్కరకు వస్తాయని!

## స్వామిలేఖలు - శాంతి రేఖలు :

మనకందరికీ కావలసిన లేఖలన్నీ ఈ భాగాల్లలో వ్రాసిపెట్టబడి ఉన్నాయి. ప్రతి లేఖా జీవితంలో ఏదో ఒక సన్నివేశంలో మనకో, మనతోటి వారికో పనికివచ్చేదే! ఏ లేఖకు ఆ లేఖ ఎంత అర్థవంతంగా ఉంటుందో, అంత ఆత్మీయంగానూ సాగుతుంది. మన గుండెల్ని తాకుతుంది.

## పునర్నిర్మాణానికి శంఖారావం :

జాతి పునర్నిర్మాణ సూత్రాల నందించే స్వామి ప్రవచనాల సంకలనం ఇది. మనం ఇప్పుడు ఎక్కడున్నామో, ఇప్పుడు మనం ఏం చేయాలో సూటిగా, సున్నితంగా వివరిస్తుంది ఈ గ్రంథం.

## ఇదీ మన సంస్కృతి - ఇదీ మన సంప్రదాయం :

వివిధ పర్వదినాలను గూర్చి ఉత్సవ సమయాలను గూర్చి తెలుసుకోవాలని మనకు అనిపిస్తూ ఉంటుంది. ఆయా పవిత్ర దినాలయొక్క సందర్భమేమిటి? ఔచిత్యమేమిటి? పరమార్థమేమిటి - అన్నది తెలుసుకుంటే బాగుండును అనిపిస్తుంది. అందుకు తగిన గ్రంథమిది. వాటన్నిటిని ఇముడ్చుకొన్న గ్రంథమిది. ఆయా విశిష్ట సమయాలలో శ్రీ కృష్ణస్వామి చేసిన విలువైన ప్రవచనాల సంకలనమిది.

## కామధేనువు కనికరించిన వేళ :

కాళిదాసు మహాకవి రచించిన రఘువంశ మహాకావ్యంలోని మొదటి రెండు సర్గలకు అనగా దిలీప ఖండమునకు దివ్యమయిన భావానువాదాన్ని అందించే గ్రంథమిది. దీనిని అనువాదం అనడంకన్నా కమ్మని తెలుగు వచనంలో జరిగిన అవతరణం అనడం ఎంతయినా సముచితం.

## నిత్య సత్యాలు - ఆణిముత్యాలు : (1,2 భాగాలు)

బాల బాలికలను తీర్చిదిద్దడం కోసం ప్రత్యేకంగా రూపుదిద్దుకుంటున్న ప్రయోజనకరమైన సంకలన గ్రంథాలివి. మనకు ప్రసిద్ధిచెందిన శతకాలెన్నో ఉన్నాయి. వీటన్నిటినుండి బాల బాలికలకు ఎల్లకాలము పనికివచ్చే లాగున తగిన పద్యాలను ఎంచి తగినట్లుగా వాటికి భావాలను జతగూర్చి ప్రత్యేకమైన శ్రద్ధతో భావి భారతంపై దృష్టి నిడుకొని ఈ సంకలనాలకు రూపు దిద్దుతున్నారు శ్రీ కృష్ణస్వామి.

## రామాయణం - మానవ ధర్మం :

దేవుడు మానవుడై, రామునిగా నిలచి, తన జీవిత విధానం ద్వారా ఈ భూమి జనులకు స్పష్టం చేసిన మానవ ధర్మ వైఖరులను వివిధ కోణాలనుండి ఒడుపుగా పట్టి చూపిస్తారు శ్రీ కృష్ణస్వామి ఈ గ్రంథంలో. గురు శిష్యులుగా, తల్లిదండ్రులు-బిడ్డలుగా, అన్నదమ్ములుగా, ఆలుమగలుగా, స్నేహితులుగా, శత్రువులుగా ఒకరికొకరు దగ్గరయిన వేళలలో మానవులైనవారు ఎలా మసలుకోవాలీ అన్నచోట - రామాయణం ఏమని చెబుతున్నది, దారిని ఎలా చూపుతున్నది - అన్నది ఈ గ్రంథం మనకు తృప్తిగా అందిస్తున్నది.

## భారతం - ధర్మాద్వైతం :

మానవులై జన్మించిన వారు భూమిపైన సాధించవలసినదీ, అనుభవించవలసినదీ నాలుగే నాలుగంశాలు. అవే ధర్మార్థ కామ మోక్షాలు. ఆ ధర్మార్థ కామ మోక్షాల యొక్క స్వరూప స్వభావాలను మనకు తేటతెల్లం చేస్తూ మహా భారత గాథలో అవి ఎలా సమగ్రంగా సమన్వయించబడ్డాయో ప్రబోధాత్మకంగా వివరిస్తుంది ఈ గ్రంథం. నిత్య జీవిత నిర్వహణలో పురుషార్థాల విషయంలో మనం సాధించుకోవలసిన సమన్వయమేమిటీ అన్నది మనకు కరతలామలకం అవుతుంది ఈ గ్రంథం చదువుతున్నప్పుడు. ప్రతిష్ఠాత్మకమైన ఈ గ్రంథాన్ని సమర్పించే పి.హెచ్.డి. పట్టాన్ని స్వీకరించారు శ్రీ కృష్ణస్వామి ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి.

## సంభాషణలు-సమన్వయాలు :

సగటు మనిషికి సాధారణంగా మనస్సులో మెదులుతూ ఉండే రకరకాలయిన సంశయాలన్నింటికి ఈ గ్రంథంలో మాస్టరు ఇ.కె. సమన్వయాత్మకమైన సమాధానాల నందిస్తారు. స్త్రీ, పురుష విభాగాన్ని గూర్చి, మృత్యువు యొక్క పూర్వాపరాలను గూర్చి, స్వర్గ నరకాల యొక్క స్వరూప స్వభావాలను గూర్చి, పితృ కర్మల పరమార్థాన్ని గూర్చి, చేతబడులు, చిల్లంగులను గూర్చి, నిత్యపూజలో సంశయాలను గూర్చి, మహానుభావుల మర్మాలను గూర్చి, సామాజిక సమస్యలకు పరిష్కారాలను గూర్చి - ఒకటేమిటి మనలో మెదిలో ప్రతి సంశయానికీ ఇదిగిదిగోనని వెంటనే బదులు పలికే ఈ దివ్య గ్రంథం నిజంగా ఒక కల్పవృక్షం లాంటిది.

## నిత్య జీవితానికి నియమావళి :

నిత్య జీవిత నిర్వహణానికి కావలసిన నియమావళి నందిస్తుందీ గ్రంథం. మేలుకొలుపుతో ప్రారంభించి, ఆహార స్వీకరణం, విధి నిర్వహణం, విశ్రాంతి విహారాలు, దాంపత్యానుబంధం, నిద్ర - తీరుతెన్నులు, గృహ వాతావరణం మొదలైన అంశాలను ఆచరణకు అనువైన రీతిలో, అనుభూతిప్రదంగా వివరిస్తుందీ గ్రంథం. చదువరి ఈ గ్రంథాన్ని ఒక ఆదర్శంగా, ఒక పెద్ద దిక్కుగా స్వీకరిస్తాడు అన్నది అనుభవంలోని అంశం.

## ప్రథమ చికిత్స - తరుణ వ్యాధులు :

ఈ గ్రంథం పరిమాణంలో చిన్నది అయినా, ప్రయోజనంలో చాలా దొడ్డది. అడుగడుగునా అక్కరకు వస్తుంది. ఆప్తమిత్రునిలా రక్షణను అందిస్తుంది. ప్రతి చిన్న విషయానికీ వైద్యాలయాల పాలు కాకుండా మనను రక్షిస్తుంది. అనారోగ్య స్థితులను గోటితోనే తీసివేసి, గొడ్డలికి పని చెప్పవలసిన అవసరం రాకుండా చూస్తుంది. హోమియో విధానాన్ననుసరించి ఈ గ్రంథం రూపొందింపబడింది. 'ద్వాదశ లవణ చికిత్స' కూడా ఇందులో చేర్చబడింది.

## ప్రేయరు - పద్ధతి :

ఇది ఒక దివ్య గ్రంథం. మాస్టర్ సి.వి.వి. మానవ జాతి కనుగ్రహించిన ప్రేయరును గూర్చి, దానిని నిర్వహించుకొనవలసిన పద్ధతిని గూర్చి ఈ గ్రంథం చక్కగా వివరిస్తుంది. ప్రేయరులోని వివిధాంశాలను గూర్చిన వివరణను అనుభూతి ప్రదంగా అందిస్తుంది. గాయత్రి, శాంతి పాఠం, మైత్రేయ స్తోత్రం మొదలైన ప్రేయరులోని అంశాలన్నీ పూర్వాపరాలతో సహా ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. మాస్టర్ సి.వి.వి. గారి ప్రణాళికను గూర్చి, ఆ ప్రణాళికలో మాస్టర్ ఇ.కె. గారి పాత్రను గూర్చి ఈ గ్రంథం కావలసినంతగా తెలియజెబుతుంది.